శ్రీ రామకృష్ణ శారదా పఠనమందిరము.

శ్రీ సీతారామచంద్ర పుస్తకభాండాగారము, పల్లూరు.

పుస్తకము పేరు ______________________

పుస్తకము నెంబరు __________ పుస్తకము వెల రు. __________

1. పుస్తకములు ఒక వారముకన్న ఎక్కువగా నిలుపుకొనకూడదు.
2. పుస్తకములు యితరులకు మార్చకూడదు లేక బదులుగా యివ్వకూడదు.
3. పుస్తకములు జాగ్రత్తగా ఒప్పగించవలయును, అట్లు కానియెడల పుస్తకముల ఖరీదు వసూలు చేయబడును.

పోలేపల్లె వెంగన్న శ్రేష్ఠి,
అధ్యక్షుడు.

తేది.

N. B:

Book Name..............................................................

Book No.............. Book Price Rs..............

1. Books should not be kept for more than a week.
2. Books should not be transferred or lent to others.
3. Books should be delicately handled, otherwise cost will be recovered.

**Polepalle Venganna Chetty,**
President.

*Date*..................

జానకీప్రెస్, ప్రొద్దుటూరు.

శ్రీ

# రామకృష్ణసూక్తిముక్తావళి.

శ్రీరామకృష్ణ పరమహంసలవారి ఉపదేశ
రత్నములన్నియు నిందు సమకూర్పబడినవి.

మొదటికూర్పు 1000.

ప్రకాశకులు:

శ్రీరామకృష్ణ మఠం,

మైలాపూరు, మద్రాసు.

1931

# పీఠిక.

ఇయ్యది "సేయింగ్సు ఆఫ్ శ్రీరామకృష్ణ" యను ఆంగ్ల గ్రంథమున కాంధ్రీకరణము. ఇందు శ్రీరామకృష్ణపరమహంసలవారి దివ్యోపదేశరత్నములన్నియు బొందుపరుపబడినవి. చక్కని నీతికథలతోడను, ఉపమానములతోడను, ప్రజా సామాన్యమునకు గూడ అర్థమగునటుల నుద్దేశించి అత్యంత సులభశైలిని వ్రాయబడిన గ్రంథరాజము.

ఈగ్రంథమును ప్రచురింపగలందులకు మాకత్యంత సహాయోపకారులుగానున్న తత్వానంద స్వాములవారికిన్ని, యం. వి. వారికిన్ని మాకృతజ్ఞతాపూర్వకమైనఅభివందనములు.

ప్రకాశకులు.

# విషయసూచిక.

శ్రీ రస్తు.

# శ్రీ రామకృష్ణ సూక్తిముక్తావళి.

## 1వ అధ్యాయము.

## ఆత్మజ్ఞానము.

1 జ్ఞానము ఏకత్వమునకు దారిజూపును; అజ్ఞానము భిన్నత్వమునకు త్రోవజూపును.

2 కుబుసమును, పామును వేఱైనట్లు శరీరమును, ఆత్మయును వేఱు.

3 పాదరసము (కళాయి) వేసిన అద్దమునందు మనముఖము ప్రతిబింబించి స్పష్టముగ గోచరించుతీరున, బ్రహ్మచర్యమువలన తనబలమును, పవిత్రతను సంరక్షించుకొనిన, నరుని హృదయమునందు సర్వేశ్వరుని ప్రతిబింబము దివ్యముగ గోచరించును.

4 గురువనియు, శిష్యుడనియు, ఇట్టి సంబంధమును పాటింపజాలని పవిత్రావస్థ విచిత్రమైనది. దేనిని సిద్ధింపజేసికొనిన పిమ్మట గురుశిష్యభేదము నిలువజాలదో అట్టిబ్రహ్మజ్ఞానము విచిత్రమైనది సుమీ!

5 దొంగవాడు చీకటిగదిలో ప్రవేశించి అచ్చటి వస్తువులను తడవి చూచును. బహుశః ఒకబల్లపై చేతినిడును. 'ఇది కాదు' అని ముందుకుపోవును పిమ్మట ఇంకొకవస్తువుమీద చేయివేయును, అది కుర్చీకావచ్చును. అంతట 'ఇదికాదు' అనిదాటిపోవును. ఇట్లొకదానితరువాత

కొంకిగా ఇదంవస్తువులను విడిచివేయుచు పోయి, తుదకు కేవలవస్తువైనను తాకినను. వెంటనే ఇదిగో! ఇదే! అనుకొనును. అంతట వాని తడవులాట ముగియును. బ్రహ్మము కొఱకగు అన్వేషణము సరిగ యిటులనే జరుగును.

6 నిన్ను నీవు తెలిసికొంటివా, అంతట అహంకారమునకు భిన్నముగనుండు సర్వేశ్వరుని నీవెఱుంగ జాలుదువు. నా ఆత్మ యేది? నాఆత్మ అనగా నాచేయియా, నాపాదమా, మాంసకండరమా, రక్తమా, స్నాయువులా, గాఢముగ విచారణ సలుపుము. 'అహం' అనబడిన వస్తువేలేదని నీకు తెలియవచ్చును. ఉల్లిపాయపొరలను వలిచిన కొలదిని పొరలు వచ్చుచునేయుండును. తుదకు లోపల గుజ్జేమియు కాన్పింపదు. అదేతీరున 'అహం' అను దానిని పృథక్కరణము చేయుచు పోగాపోగా 'నేను' అని చెప్పదగిన స్థిరపదార్థము ఏదియు కాన్పింపదు. ఇట్లు 'అహం' అనగనేమో పరిశోధన చేయుచుపోగా అట్టిది యేదియులేక సర్వాధార వస్తువు భగవంతుడు మాత్రమే కలడని తెలియవచ్చును. జీవత్వము తొలగునప్పుడు శివత్వము ప్రాప్తించును.

7 కేవల జ్ఞానము అన్నను కేవలభక్తి యన్నను ఒక్కటియే; భేదము లేదు.

8 మనలోనున్న మూలాహంకారమును జయించుటెట్లు? పువ్వులోని పిందె పెద్దదగునప్పుడు పూరెక్కలు వాటి

యంతట అవియే రాలిపోవును. అటువలెనే నీలోని శివత్వము వికశించినప్పుడు, నరజీవసామాన్యములగు క్షుద్రభావములు వానియంతట అవియె తొలగిపోవును.

9 శ్రీపరమహంసులవారు తమ హృదయమువంక జూపుచు యిట్లు అనెడివారు; "ఇక్కడ దేవుడున్నాడనువానికి అక్కడను (అనగా బాహ్యప్రపంచమునను) దేవుడున్నాడు. తనలోపల దేవుని కాంచలేనివానికి వాని వెలుపలను దేవుడు కాన్పించడు. తన జీవాత్మయనెడు దేవాలయమునందు దేవుని చూడగలవానికి విశ్వమను దేవాలయమునందును దేవుడు కాన్పించును."

10 నరశరీరము కుండవంటిది; మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, అనునవి దానిలో నిండిననీరు, బియ్యము, ఆలుగడ్డల వంటివి. నీరు, బియ్యము, ఆలుగడ్డలు గల కుండను పొయ్యిమీద పెట్టినప్పుడు, ఈపదార్థము లన్నియు వేడెక్కును. ఆ ఉష్ణము యనునది ఆకుండ, నీరు, బియ్యము, ఆలుగడ్డ అనువానిలో దేనికిని చెందినది కాకపోయినను వానిని తాకినంతనే చేయి కాలును గదా. అదేవిధముగా మనస్సు, బుద్ధి, ఇంద్రియములు అనునవి తమ తమ పనులు చేయుటకు ఆధారమగునది బ్రహ్మముయొక్క శక్తియే. ఆశక్తి తొలగునా ఇవన్నియు పనిచేయుట మానును.

11 పరమాద్వైత జ్ఞానమును జేబులో పెట్టుకొని నీయిష్టము వచ్చినట్లు వర్తింపుము. అప్పుడు నీలోనుండి కీడేమియు వెలువడనే వెలువడదు.

12 ఈ కలియుగములో జ్ఞానయోగము అత్యంత దుర్లభము. ఏలయన? మొట్టమొదట ఈయుగములో మనము అన్నముపై నాధారపడి యున్నాము. (అన్నగత ప్రాణులమై యున్నాము.)

రెండవది: ఈయుగములో నరుని జీవితకాలము జ్ఞానసాధనకు ఎంతమాత్రము చాలదు.

మూడవది; ఈయుగములో మనలనంటుకొనియున్న దేహాత్మబుద్ధిని* వదలించుకొనుట దుస్సాధ్యము.
జ్ఞాని ప్రాపింపవలసిన పర్యవసాన మిట్లుండును: “ నేను శరీరమును కాను. అవ్యయమై నిరామయమై పరమగువిశ్వాత్మను నేను. నేను శరీరమును కాను, కావున శరీరబాధలగు ఆకలి, దప్పి, పుట్టువు, చావు, రోగము మున్నగునవి నన్ను బాధింపజాలవు ” అను నిశ్చయ జ్ఞానమే పరమ ప్రాప్యము.

దేహబాధలకు లోనైయుండియు నేను జ్ఞానినని చెప్పుకొనునతడు యెట్టివాడనగా, ముండ్లు గ్రుచ్చుకొని చేయి చీరుకొనిపోయి నెత్తురుకారుచుండగా మితిమీరిన బాధననుభవింపుచును “ చూడుడు! నాచేయి చీరుకొనిపోలేదు శుభ్రముగానున్నది ” అని పలుకునాతని వంటివాడు. ఇట్టి కబురులు పనికిరావు. ఆముండ్లన్నియు మొట్టమొదట జ్ఞానాగ్నిచేత భస్మమైపోవలయును సుడీ!

---

* నేను దేహమునే అనుభావమును.

13 స్వభావముచేతను అంతరభేదముచేతను జ్ఞానము భిన్నభిన్నముగ నుండును. సామాన్యప్రజలగు సంసారుల జ్ఞానము ఒకటి. ఇది అంతగా తీక్ష్ణమైనదిగాదు. దీనిని గదిలోపల నుంచబడిన దీపమునకు పోల్చవచ్చును. దీనిప్రకాశము గదిలోపల మాత్రమేయుండును. ఇంతకంటె ప్రకాశవంతమగు భక్తుని జ్ఞానమును వెన్నెలకు పోల్చవచ్చును. దీని వలన గదిలోని వస్తువులును వెలుపలివస్తువులును ప్రకాశింప గలవు. అవతారపురుషుని జ్ఞానమో ఇంకను తీక్ష్ణతరమై, సూర్యరశ్మికి పోల్చదగియుండును. అట్టివాడు యుగ యుగములనుండి పేరుకొనియున్న అజ్ఞానాంధకారమును క్షణములో రూపుమాపుదివ్యజ్ఞానమనెడు కాంతిని ప్రసరింపజేయునట్టి సూర్యభగవానుడే అనవలయును.

14 ఎవనికేని ముల్లు గ్రుచ్చుకొనినప్పుడు, అతడింకొక ముల్లుతెచ్చి, దానితో మొదటిముల్లును పైకితీసి, రెంటిని పాఱవేయును. అటులనే జీవుని నేత్రమును కప్పివేయు లౌకికాజ్ఞానము తోడనే తొలగించవలయును. అట్టి అజ్ఞానమును, జ్ఞానముగూడఅవిద్యామయములే సుడీ! కావున బ్రహ్మజ్ఞాని తాను ద్వైతభావ రహితుడగుటచేత, ఆఅజ్ఞానమును, జ్ఞానమును సయితము త్యజించివేయును.

15 జ్ఞానమునుగూర్చిన అత్యుత్తమ భావనయేమి? — జ్ఞాని యిట్లనును; "భగవంతుడా! ఈజగత్తున నీవొక్కడవే కర్తవు. నేను నీచేతిలోని స్వల్పఉపకరణమాత్రమను. మఱియు నాదేదియు లేదు. సర్వమును నీయదియే. నేను

జీవాత్మ, పరమాత్మాకాశమున కెగిరిపోయి సమాధియం దు లయమునొందును.

26 అహంకారము నశించినప్పుడు జీవుడు నమసిపోవును. అంతట సమాధియందు బ్రహ్మసాక్షాత్కారము కలుగును. అప్పుడు బ్రహ్మానుభూతినిపొందునది బ్రహ్మమే గాని జీవుడుకాదు.

27 ఒక్కటిని తెలిసికొంటివా నీకు అన్నియు తెలిసిపోవును. ఒక్కటికితరువాత సున్నలనుజేర్చినప్పుడు వందలు, వేలుఅనువిలువయేర్పడుచున్నది. కానిఆఒక్కటిని కొట్టివేసితివా ఏమియుమిగులదు. ఆఒక్కటియుండుటచేతనే అనేకమునకు విలువయేర్పడుచున్నది. ఒకటి మొదలు అనంతరము అనేకము. దేవుడుమొదలు, జీవుడు జగత్తు తదనంతరము!

28 నాకేమి కనబడునో తెలియునా? భగవంతుడే సర్వమునైనట్లు కాన్పించును. నరుడుగాని, యితరజంతువులుగాని తలలఊచుచు కాలుచేతులనుఆడించుచునుండు తోలుగప్పినబొమ్మలలాగు కాన్పించును. భగవంతుడే వానిలోపల నుండునది.

29 ఒక్కసారి నాకొక దృశ్యము కానవచ్చినది. ఒకేదివ్యము విశ్వరూపమునుధరించి సర్వజీవరాసులతోనిండి కాన్పించినది. మనుష్యులు, పశువులు, తోటలు, రోడ్డులు మున్నగునవి అన్నిటితో కూడియున్న మైనపు భవనమును

బోలిచూపట్టినది. అన్నియు మైనముతో నిర్మాణమై నవే. సర్వమును మైనమే!

30 సత్తును గ్రహించవలయుననిన చిత్తును ఆశ్రయింపుము.

31 "లీల" ద్వారమున "నిత్యపదార్థమును" తెలియ బ్రయత్నింపుము.

32 "ప్రపంచము వట్టిబూటకము" అనుట తేలికయే; కాని దాని అర్థమేమో తెలియునా? కర్పూరమును వెలిగించినప్పుడు యేమియు మిగులకుండుటవంటిది. కట్టెను గాల్చగా బూడిద మిగులుట వంటిదికూడ కాదు. సదసద్విచారము ముగిసిన పిమ్మటనే సమాధిస్థితిలభించును. అప్పుడు నేను నీవు జగత్తు అనువాని గుర్తించుటయెంతమాత్రమును పొసగదు.

33 భగవంతుడు బాహ్యమున ఎక్కడనో దూరముగ కాన్పించునంతవరకును అజ్ఞానమున్నట్లే. ఆభగవంతుడు లోపల సాక్షాత్కరించినప్పుడు అది సత్యజ్ఞానమగును.

34 ఒక్కడు అర్ధరాత్రమునునిద్రలేచి చుట్ట్రతాగకోరెను. వానికి దీపముకావలసివచ్చినది. కావున పొరుగుననున్న యింటికిపోయి తలుపుతట్టినాడు. ఒకరు తలుపుతీసి వానికేమికావలెనని అడిగిరి. "నేను పొగత్రాగవలెను. కొంచెము దీపము నిచ్చెదవా?" అని అతడన్నాడు. అందుకా పొరుగువాడు "అబ్బా! నీకేమి మతిపోయెనా? నీవింత శ్రమపడివచ్చి యిట్టివేళమమ్ము నిద్రలేపితివే! అటుల వెలుగుచు నీచేతిలోనే లాంతరున్నదికదా?" అనెను.

అటులనే నవనవలాడవలసినది వానిలో నుండనేయున్నది. అయినను వానిలో జ్ఞానికి నెలవులాడుచు అతడు ఇందందు తిరుగులాడుచున్నాడు.

27 మలినమనస్సు బ్రహ్మమునుదర్శింపజాలదనుట యము. కాని శుద్ధమనస్సు అనగా నిర్మలబుద్ధి. అనగా బంధరహితాత్మ బ్రహ్మసాక్షాత్కారమును పడయగలదు వాసనాత్మకబుద్ధి, అనగా పరిమేయమై బంధముగల్గి వికాసరహితమగు మనస్సు ఇంద్రియలోలత గలదిగాన, అనగా కామినీకాంచనవాంఛలచేత యీడ్వబడునది గుటవలన బ్రహ్మమును ఎఱుగజాలదు. ఈమనస్సు సుసాధనచేత పవిత్రమంతమై ఇంద్రియలాలనను బాపుకొనగలదు; ప్రాపంచికవాసనలను, ఈప్సితములను, బంధములను, తొలగించుకొని అఖండాత్మతోడ నైక్యమును పొందవచ్చును. పూర్వపు మహాఋషులు భగవత్సాక్షాత్కారమును పొందినది ఈవిధముననేకదా! అఖండాత్మ స్వరూపియగు భగవంతుని నిష్కలంకమగు మనస్సుతో వారు చూడగల్గిరి. ఆ నిష్కళంకమగు మనస్సునే అఖండాత్మ స్వరూపముగా తెలిసికొనగల్గిరి!

28 ప్రశ్న:— అఖండాత్మ తాను భిన్నభావమునుపొంది, ప్రత్యగాత్మగా భావించుకొను భ్రాంతియెటులజనించినది ?

సమాధానము:— కేవలము తర్కముపైని ఆధారపడు అద్వైతవాది "నేనెఱుగను" అని సమాధానముచె

ప్పును. అపరోక్షానుభూతివలన లభించుసమాధానమొక్క-
టే తుదిపర్యవసానము కాగలదు.

"నేనెఱుగుదును" నేనెఱుగను" అనుచున్నంతవఱకును
నీవొక పురుషుడవై యున్నటుల భావనచేయుచుందువు.
అట్టిదశయందున్నంతవఱకును, ఈభిన్నత్వమును యదార్థ
మనియే నీవు అంగీకరింపవలయునేకాని ఇది భ్రాంతియన
తగదు. వ్యక్తిత్వము తొలగిపోయినప్పుడు, సమాధిదశ
యందు అఖండబ్రహ్మమును గూర్చినజ్ఞానము నీకు అల
వడును.

అప్పుడుమాత్రమే భ్రాంతియా? భ్రాంతికాదా?
యథార్థమా? యథార్థముకాదా? అను నిట్టి సమస్యల
న్నియు సమసిపోజాలును.

37 ఆత్మ దేనిచేతను అంటబడునదికాదు. కష్టము, సుఖము,
పుణ్యము, పాపము అనునవి ఆత్మను అంటజాలవు. కాని
దేహమే తాననుకొనువానికి మాత్రము ఇవిఅంటుకొనును.
పొగ గోడనేమలినముగావించగలదుగాని అందుండు ఆకా
శమును మలినముచేయజాలదు.

38 జ్ఞానముగూర్చియు నిత్యానందముగూర్చియు ధ్యానము
సల్పుడు; మీకును ఆనందములభించును; ఆనందము నిజ
ముగా నిత్యమైనది. దానిని అజ్ఞానము మూతవేసి కప్పిపు
చ్చుచున్నది. ఇంద్రియములబంధము నీకుతగ్గిన కొలదిని,
భగవద్భక్తి నీయందు ప్రవర్ధనము గాంచుచుండును.

39 గోపిక శ్రీకృష్ణుని సమీపించినకొలదిని, వాని దివ్యదేహమునుండి వెలువడు సౌరభముచే హెచ్చుగ ఆకర్షింపబడెనది. ఒకడు భగవంతుని సమీపించినకొలదిని వాని భగవద్భక్తియు హెచ్చుచుండును. నది సముద్రమును సమీపించినకొలదిని దానియందలి ఆటుపోటు హెచ్చుచుండునుగదా!

40 జ్ఞానిహృదయమున ప్రవహించుచుండు "ప్రజ్ఞానగంగ" ఒకేదిశగా ప్రవహించుచుండును. వానికి సర్వజగత్తును స్వప్నమైతోచును. ఆతడు సదా తనఆత్మయందే వసించును. కాని భక్తుని హృదయమందలి "భక్తిగంగ"యో సదా ఒకేదిశగా ప్రవహించునదిగాదు. దీనియందు ఆటుపోటులును కలవు: భక్తుడు ఒకప్పుడు నవ్వును, ఒకప్పుడు ఏడ్చును, ఒకప్పుడు నాట్యమునలుపును. మఱొకప్పుడు సంగీతములు పాడును. భక్తుడు భగవత్సాన్నిధ్యసుఖమును అనుభవింపకోరును. తనప్రియునియందు లగ్నమైపోవ నభిలషింపడు. నీటిలోనిమంచుగడ్డతీరున అతడు భగవంతునిలోబడి యీదులాడుననవచ్చును. ఒక్కొక్కప్పుడు మునుగును మఱొకప్పుడు పైకితేలియాడును.

41 ఆనందము, అనగా ఆంతరంగిక పరిపూర్ణశాంతియే. భగవత్సాక్షాత్కారము కలిగినందుకు తార్కాణమగును. సముద్రమున పైభాగమునమాత్రమే అలలు సంచలనముగావించుచుండును. కాని అడుగుభాగమునందు నీరంతయు నిశ్చలముగ నుండును.

42 ప్రశ్న:—జ్ఞానాజ్ఞానరూపములు రెండును త్యజించినపిమ్మట శేషించునదేమిటి ?

సమాధానము:—అప్పుడు శేషించునది వేదములందు నిత్యశుద్ధబోధరూపముగా అభివర్ణింపబడిన అఖండబ్రహ్మము! (అధినిర్వికారము, నిష్కళంకము, శుద్ధచిత్స్వరూపమునై వెలుగును)

43 ప్రశ్న:—నేనెప్పుడు ముక్తుడనగుదును ?

జవాబు:—ఆ "నేను" అనునదిగతమైనప్పుడు.

"నేను" "నాది" అనుట అజ్ఞానము.

"నీవు" "నీది" అనుట సుజ్ఞానము.

44 మనస్సును, బుద్ధియు, మలినములై యున్నంతకాలమును బ్రహ్మము వానికి చిక్కదు; అవివిమలములైనప్పుడు బ్రహ్మము వానికిసాక్షాత్కరించును. కామలోభములు చేరి మనస్సును మలినముగచేయును. హృద్గతమై అవిద్యరాజ్యము చేయుచుండునంతవఱకును మనస్సును బుద్ధియు శుద్ధమైనవి కాజాలవు. సాధారణముగా మనస్సు బుద్ధియు అనునవి పరస్పరము భిన్నములని చెప్పుటకలదు. కాని వినిర్మల దశయందు ఆరెండును ఒక్కటై చైతన్యమున కలసిపోవుచున్నవి. అప్పుడు చైతన్యరూపబ్రహ్మము చైతన్యమునకు ప్రత్యక్షమై కాన్పించును.

45 బ్రహ్మసాక్షాత్కారములు రెండువిధములు:—

జీవాత్మపరమాత్మలు ఏకమైపోవుట ఒకటి. బ్రహ్మమును వాని సగుణరూపముల ద్వారమునచూచుట రెండవది.

మొదటిది జ్ఞానమనియు, రెండవది భక్తియనియు పేర్కొనబడును.

48 వేలకొలది సంవత్సరములనుండి గాఢాంధకారమయమైయున్న గదిలోనికి తేబడిన దీపము తత్క్షణమే దానిని వెలుగుతో నింపువిధమున, జ్ఞానజ్యోతి జీవాత్మకు ప్రకాశము నొసగి యుగాంతరములనుండి దానినావరించియున్న అజ్ఞానమును బాపును.

# భగవంతుడు.

## 2వ అధ్యాయము.

47 భగవంతుడు నరులందఱియందున్నాడు. కాని నరులంద
ఱును భగవంతునిలో లేరు. అందువలననే వారుదుఃఖముల
పాలగుచున్నారు.

48 రాత్రికాలమున ఆకాశమునందు నక్షత్రములు అనేకములు
నాకు కాన్పించుచున్నవి. సూర్యోదయమైనపిమ్మటఅవికాన
వచ్చుటలేదు. ఆకారణము చేతనీవు పగటివేళ ఆకాశమున
చుక్కలులేవనవచ్చునా! ఓనరుడా! నీవుఅజ్ఞానవశమున
నున్నకాలమున నీకుభగవంతుడు కానరానికారణముచేత
భగవంతుడు లేడనబోకుము.

49 చంద్రుడు ప్రతిబాలకునకును "మామ" అయినవిధమున,
భగవంతుడు సర్వమానవకోటికిని "గురువు" అగు
చున్నాడు.

50 గంటవాయించుసమయమునవినవచ్చు గణగణధ్వనులు,
ప్రత్యేక ప్రత్యేకరూపములుగలవానివలె వేర్వేరైతోచ
వచ్చును; కాని వాయించుటనాపినప్పుడు అభిన్నధ్వని
మాత్రమే కొంతసేపు వినవచ్చి క్రమక్రమముగా సమసి
పోవును. ఈధ్వని నిరాకారమైయొప్పును. గంటయొక్క
యాధ్వనులవలనే భగవంతుడు సాకారుడును, నిరాకారు
డునై వెలయగలడు.

౬౧ బ్రహ్మమునకుండు స్వభావము ఎట్టిది ?—బ్రహ్మముగుణ రహితుఁడు, చలనరహితుఁడు, తానుకదలడు, కదల్పబడడు మేరుపర్వతమునుబోలి స్థిరముగనుండును.

౬౨ సూర్యబింబము భూమికన్న అనేకరెట్లుపెద్దది. కాని అతి దూరమున వుండుటచేత చిన్నసిబ్బియంతగా గోచరిం చును. అటులనే భగవంతుడు గణనాతీతుడై పరగును. కానివానినుండి బహుదూరముననున్నమనము వానినిజమ హిమను గ్రహింపజాలకున్నాము.

౬౩ రెల్లుతోడను, నాచుతోడను, కప్పబడియున్నగుంటలో ఆటలాడు చేపలు మనకుకానరానట్లు, మాయచేతకప్పబడి యున్నమానవహృదయమునవర్తించుభగవంతుడు మనకు గోచరింపకున్నాడు.

౬౪ భగవంతుడు నిరాకారుడు; కాని వానికిఆకారమునుకలదు. మఱియుభగవంతుఁడుసాకారనిరాకారరూపములరెండింటి కినిఅతీతుడునుఅగును. వానిపూర్ణరూపము వానికేయెఱుక.

౬౫ భగవంతుడు నిరామయుడు. అఖండబ్రహ్మమును జగజ్జ నకుడునుకూడ అతడే. నిర్మలసచ్చిదానందమూర్తియగు అఖండబ్రహ్మము, పారమును, తీరమునులేని మహాసము ద్రములీల మర్గాహ్యమైయొప్పును. మనముఅందులోపడి కొట్టుకొని మునిగిపోవలసినదే, గాని మనముభగవంతుని సాకారలీలారూపభావమున జొచ్చునెడల, సముద్రమున మునుగుతరిని తీరమునకుకొట్టుకొనివచ్చు మనుజునివడు వున, సులభముగా శాంతినిపడయగలుదుము.

56 మంచుగడ్డఘనీభూతమైననీరే. అటులభగవంతుని సాకార దృశ్యరూపము భౌతికాకృతినిదాల్చిన అనంతనిరాకార బ్రహ్మమే, అదిఘనీభవించిన సచ్చిదానందరసమే అనవచ్చును. మంచుగడ్డనీటిలోని అంతర్భాగమై, నీటిలోనే నిలిచి, తుదకానీటిలోనే కరిగిపోవును. అటులనే సాకారదైవమునిర్గుణబ్రహ్మమునందొక అంశమే. ఆనిర్గుణ బ్రహ్మమునందే పుట్టును. అందేవర్తించును; తుదకందేలయమై అంతర్ధానమగును.

57 బ్రహ్మసాగరమునుండి వీచువాయువు ఏహృదయముపై వీచునో అదెల్ల పరివర్తనమును పొందును. సనక సనాతన ప్రముఖమునివరులు ఆవాయువుసోకి ముగ్ధులైరి; భగవద్భక్తి పరవశుడగుటకు నారదుడాదివ్యసముద్రపు జాడనుదూరమునుండి చూచియుండవలెను. అటుల పరవశుడగుటచేత తననుదామఱచి, నిరంతరము శ్రీహరి గీతముల పాడుచు ఉన్మాదుడై జగమెల్లత్రిమ్మరుచున్నాడు. పుట్టువుతోడనే మునిప్రకాండుడైపెఱిగిన శుకదేవుడు ఆజలధిని తనహస్తముతో ముమ్మారుమాత్రమేతాకినాడు. అంతటినుండియే పసిపాపవలె ఆనందమగ్నుడై దొరలాడుచున్నాడు. జగద్గురు ప్రకాండుడగు మహాదేవుడు మూడు చేరలు జలముంద్రావినంతనే పరమానందమున ప్రొక్కి స్థాణువై కదలమెదలలేకున్నాడు. ఇక ఈమహాసాగరము యొక్కలోతు కొలుచుటకుగాని, దానిమహిమను గణితము వేయుటకుగాని ఎవరికి సాధ్యపడగలదు ?

58 దూరమునుండి చూచునపుడు సముద్రజలము నీలముగా కాన్పించును; కాని ఒకదోసిటనీటిని చేతిలోనికితీసుకొని చూచితిమా, ఏరంగునులేక స్వచ్ఛముగనుండును. అటులనే దూరమునుండి చూచువానికి శ్రీకృష్ణభగవానుడు నల్లనివాడై చూపట్టును; కాని అతడట్టివాడుకాడు. అతడు నిష్కలుడు, ఏవర్ణములేనివాడు, నిరామయుడు సుడీ!

59 భగవానుడిట్లనును:— „ కాటువేయుపామును నేనే; విషమును తొలగించు మాంత్రికుడను నేనే; శిక్షలవిధించు దండనాధికారిని నేనే; ఆదండనలనెఱపి బాధించుకింకరుడను నేనే; ”

60 బ్రహ్మస్వరూపభావన యెట్లుండును? అది మాటలచే వివరింపశక్యముకానిది. ఎన్నడు సముద్రమునుచూచియుండనివానికి దానిని అభివర్ణించిచెప్పుమని ఎవనినైన అడిగినచో “ అదా! విశాలమగునీటిప్రదేశము; నీటిమయమగు పెద్దతావు! అదెటుచూచినను నీరే! అనుచుమాత్రమే వచింపజాలును ”

61 మానవులు నోటితో పల్మరుపఠించుటచేతను, వారినోటినుండి వెలువడుచుండుటచేతను, వేదములను, తంత్రశాస్త్రములును, పురాణములును, ఇంక ప్రపంచములోని మతగ్రంధములన్నియు ఉచ్ఛిష్టములైపోయినవి. కాని బ్రహ్మముమాత్రము అటుల యెంగిలిపడలేదు. ఏలన ఇంతవరకేనరుడును తనవాక్కుచేత వానినివర్ణింపజాలడయ్యె.

32 నాటకశాలయందు ఒకడే వేర్వేరు వేషములను తాల్చుచుండుతీరున, ఈవిశ్వములో భగవంతుడు భిన్నభిన్న స్వరూపములను తాల్చును. మఱియు ఒకేవేషమును అనేకులు వేయువడువున అనేకజంతువులు నరాకృతిని గూడధరింపవచ్చును. అవన్నియు నరులరూపమున కాన్పించుచున్నను, కొన్ని చీల్చిచెండాడు తోడేళ్లు; కొన్ని భయంకరములగు భల్లూకములు; మఱికొన్ని జిత్తులమారి నక్కలు; ఇంకను కొన్నివిషసర్పములు అయివుంటున్నవి.

33 అలజగజ్జననిని మనమందఱము చూడలేకుండుటేల? ఆమె తెఱచాటునుండి వ్యవహారమునంతనునడుపు గొప్పయింటి యిల్లాలువంటిది. అంతటిని తానుచూచుచుండును, గాని ఎవరును ఆమెనుచూడవీలులేదు. భక్తులగు ఆమె కొమరులుమాత్రము "మాయ" యను ఆ తెఱనుదాటిపోయి ఆమెదర్శనముచేయవచ్చును.

34 పోలీసువాడు తనదొంగలాంతరు వెలుతురు ఎవరిమీద పడనిచ్చిన వారినెల్లచూడగలడు; కాని అతడావెలుగును తన పైకిత్రిప్పుకొనునంతవఱకును వానినిఎవరునుచూడజాలరు. అటులనే భగవంతుడందఱిని చూచుచునేయుండును, కాని తనంతట తాను ప్రత్యక్షమగునంతవరకును ఎవరును భగవంతుని చూడజాలరు.

35 ప్రతివస్తువును నారాయణుడేయని భగవానుడు సెలవిచ్చెడివాడు, నరుడు నారాయణుడే, పశువునారాయణుడే, ఋషి నారాయణుడే, పాతకియునారాయణుడే, ఇంతేల

కలదెల్ల నారాయణస్వరూపమే, ఒక్క నారాయణుడే అనేకవేషములతో లీలలు సలుపుచుండును. సమస్తపదార్థములును వానిభిన్నభిన్నస్వరూపములే, వాని దివ్యమహిమను ప్రకటించునవియే.

66 భగవంతుడు ఈస్థూలశరీరమున ఎట్లువసించును? చిమ్మనగొట్టములోని (Syringe) పుడకవలె అతడీ శరీరమున నుండును కాని అతడీశరీరమునకు అంటుకొనియుండడు.

67 ఒక్కెడ భగవానుడిట్లు వచించినాడు:—దండలోని పూవులు నాకక్కఱలేదు; ఆపూవులుగ్రుచ్చినదారము నాకు కావలెను. ఈజగత్తులో వస్తుజాలమేదియు నాకక్కఱలేదు; ఈవిశ్వమునంతను బంతిగకూర్చి పట్టినదారమననగు ఆసూత్రాత్మ నాకుచిక్కినచాలును.

68 వానిపేరు చిన్మయుడు, వానినివాసముచిత్తు, ఆతడుప్రభువు విశ్వజ్ఞమూర్తి.

69 గురూపదేశములచేత ప్రబోధముగాంచినవాడై శ్రీరామచంద్రుడు ప్రపంచమును త్యజింపనెంచెను. తండ్రియగు దశరథమహారాజు వశిష్ఠునిబంపి వానికి సద్బోధకావింపుడనెను. శ్రీరాముని వైరాగ్యము ఆవేశించియున్నదని వశిష్ఠుడు గ్రహించి "ఓరామా! ముందు నాతోడవాదింపుము; ఆపిమ్మట ప్రపంచమును త్యాగముచేయుము. ప్రపంచము బ్రహ్మమునకు భిన్నముగ వేఱైయున్నదా? చెప్పుము, అట్లైనచో నీవు దానిని నిశ్శంకముగా విడిచివేయవచ్చును" అనిపలికెను. శ్రీరామచంద్రుడంతట

ఆ వాక్యముల అర్థమును నూర్చి తలపోసినవాడై, ఒక్క బ్రహ్మమే జీవుడుగాను జగత్తుగాను ప్రత్యక్షమగుచుండెనని గ్రహించినాడు. ఆ బ్రహ్మమునందే గదా సర్వమునకును ఉనికి! కాపున శ్రీరాముడు మిన్నకుండవలసివచ్చెను.

70 సరియైన వివేకము రెండు తెరగులనుండును:— మొదటిది పృథక్కరణరూపము. రెండవది సమీకరణరూపము. మొదటిది మనను దృశ్యజగమునుండి బ్రహ్మముకడకు నడపును. రెండవదానిని అనుసరించితిమా, అఖండ పరబ్రహ్మమే విశ్వముగా గోచరించుటను తెలియుదుము.

71 దేవుడే దొంగవానినిపోయి దొంగతనము చేయుమని ప్రేరేపించును, మఱియు ఆ దొంగను పట్టుకొనుమని గృహస్థుని హెచ్చరించునదియు అతడే. అతడే సర్వమునకును కర్త! (ఏరూపముదాల్చు శక్తికైనను మూలము ఈశ్వర చైతన్యమే)

72 సాధకుడు తనభక్తిసాధనయందొకదశలో భగవంతుని సాకారునిగ భావనచేసి సంతసించును! మఱియు వేఱొక దశయందు వానిని నిరాకారునిగజూచి తృప్తుడగును.

73 కొన్నిసమయములందు నేనువస్త్రముల ధరించియుండి, మఱికొన్నివేళలందు దిగంబరుడనుగానుండుతీరున బ్రహ్మము ఒక్కొక్కప్పుడు సగుణుడుగను, ఒక్కొక్కప్పుడు నిర్గుణుడుగనుకాన్పించును. సగుణబ్రహ్మమనగా శక్తితో కూడియున్నబ్రహ్మము. వానినప్పుడు "ఈశ్వరుడు" అందురు.

74 సాకారుడగు బ్రహ్మము మనకంతట గోచరముకాగలడు. మనమేల వానినితాకగలము; మనప్రియమిత్రునితోడ ఎట్లో అట్లేమనముభావముఖివానితో ముచ్చటించవచ్చును.

75 పండుయొక్క గుజ్జు, పీచు, టెంక, అన్నియుఒకేవృక్షబీజమునుండికలుగునటుల, చేతనమును, జడమును, ఆధ్యాత్మికమును, భౌతికమును అగుసృష్టిసర్వమును ఒకేబ్రహ్మము నుండి ఉద్భవమగుచున్నది.

76 గురువుశిష్యునికి బోధలుచేయుసందర్భమున రెండువ్రేళ్లను ఎత్తిచూపెను. బ్రహ్మము మాయ అను ద్వంద్వభావమును అతఁడు అట్లుసూచించెను. తరువాత ఒకవ్రేలినిముడిచివేసి, మాయ తొలగిపోయినప్పుడు ఈవిశ్వమేమియు మిగులక ఒక్క అఖండబ్రహ్మమేయుండునని భోదసలిపెను.

77 ఒకడు కల్పవృక్షముక్రిందకూర్చుండి, నేనురాజనుగాక ! అనికోరుకొనెను.—తక్షణమే అతడురాజైనాడు. ఉత్తరక్షణమున నాకొకమనోహారిణియగు సుందరాంగి భార్య అగుగాక అని సంకల్పించెను. ఆహా ! అట్టియువతివాని చెంత ప్రత్యక్షమైనది ! ఇంకను అతడాచెట్టుయొక్క మహిమను శోధించబూని ఒకపులివచ్చినన్ను మ్రింగుగాకయని అనుకొనెను. అయ్యో ! ఆఘడిసమయందే అతడొక పెద్ద పులికోరలఁజిక్కియుండెను. భగవంతుడే ఆకల్పవృక్షము. ఆయనసమ్ముఖమునఎవరేని "ఓదేవా ! నాకేమియులేదు కదా!" అనుకొనినయెడల నిజముగావానికి అన్నియుకొఱ

వదు; కాని "స్వామీ! నీవునాకు సర్వమును అనుగ్రహించియున్నావు" అని ఎవడనునో వానికిపిక్కొంతయునుండదు.

78 భగవంతునిలో తన్మయతను పొందుపట్ల మిడిమిడారునేమో యని అనుభయముండదు. మాణిక్యముయొక్క కాంతులు వెలుగునొసగి పోయినిక హాయ్పనేగాని దహించవునుక్షీ!

79 భగవానుడు ఒకానొకనితో యిట్లనెను! "సరే! నీవిజీవితమున శ్రేష్ఠమైనభాగమునంతను సంసారమునందువ్యయముచేసి, తుదకుభగవంతుని వెదకికొనుచువచ్చినావు! భగవంతునే ముందుగ సాక్షాత్కారముచేసికొని, సంసారమున నీవు ప్రవేశించియుండినయెడల, ఆహా! ఎట్టిశాంతి ఎట్టిఆనందము నీకులభించియుండునోగదా !

80 పూరీజగన్నాథాలయములోనికి ఒకబైరాగివెళ్లినాడు. భగవంతుడు సాకారుడా, నిరాకారుడా అనివానికి సందేహముతోచినది.

అచ్చటి దేవతావిగ్రహమును చూచుపట్ల ఆవిషయమును పరీక్షింపనెంచెను. విగ్రహముకొఅక్కై తడవిచూచుచు తనచేతికర్రను ఎడమవైపునుండి కుడివైపునకు నడపెను. కొంతసేపు వానికేమియు కాన్పించలేదు. వాని కర్రకును ఏమియు తాకలేదు. కావున భగవంతునికి ఆకారములేదని వాడునిర్ణయించెను. ఆతడాచేతికర్రను కుడివైపునుండి యెడమవైపునకు త్రిప్పబోగా అది విగ్రహమునకుతాకినది! కాబట్టి ఆబైరాగి భగవంతుడుసాకారుడును నిరాకారుడునుకూడనైయున్నాడని నిశ్చయింపగలిగెను.

మనకు భగవత్సాక్షాత్కారము అయినగాని మనము యీ అంశమునంతయు అనుభవమునకు దెచ్చుకొనజాలము. తన యందు భక్తినుంచువానికొఱకై భగవంతుడు పలురీతులుగను, భిన్నభిన్నములగు, ఆకారములను దాల్చి ప్రత్యక్షమగుచుండును.

బట్టలకుఅద్దకము వేయుటలో ఒకవిచిత్రపద్ధతిని అవలంబించిన రంగులపనివాడుండెను. అద్దకముకొఱకై వాని దాపునకుఎవరైనవచ్చినతోడనే, "నీబట్టకేమిరంగు వేయుట నీకిష్టము?" అనిఅడిగెడివాడు. ఆ వచ్చినవాడు "ఎరుపు" అనునెడల, అతడాగుడ్డను తనతొట్టెలోముంచియెత్తి "ఇదిగోనీబట్టకు ఎఱ్ఱరంగు వేసితిని" అనెడివాడు. ఇంకొకడు, తనగుడ్డకు పసుపురంగునుకోరును. ఆపనివాడు దానినిగూడ అదేతొట్టిలోముంచును. దానినివెలుపలికి తీయగా అది పసుపురంగుతోనుండెడిది. అదేతీరున ఇంకొకడు వేఱురంగునుకోరుకొనునెడలను, నీలము, ఊదా, పచ్చన, మున్నగురంగులకును అదేతొట్టెను ఉపయోగించెడివాడు.

ఇదంతయుకనిపెట్టి చూచుచున్నవాడొకడు "మిత్రమా నాకేరంగునందును అభిమానములేదు. నీకు దేనియందాదరమో విచారింపకోరెదను. నీయిష్టము ననుసరించి నా బట్టకు రంగువేయించుకొందును. నీకై యేరంగువేసికొందువో ఆరంగే నాకుకావలయును." అనెను. ఇటులనే భగవంతుడు సాకారుడైగాని, నిరాకారుడైగాని భక్తుని

అవసరమునుబట్టి దర్శనము నిచ్చుచుండును; అటులప్రత్యక్షమైనదర్శనము సాపేక్షిక ధర్మమునననుసరించి సత్యమగును; అనగా వేర్వేఱు దశలలోను, వేర్వేఱు క్షేత్రములలోను ఉండుజనుల అనుకూలతనుబట్టి పఱగును. తానేరంగు వేసికొనునో ఆదివ్యచిత్రకారునకే తెలియవలెను. ప్రకటితమగు స్వరూపములుగాని, నిరాకారతగాని వానిని బాధింపజాలవుసుడీ!

82 ఈవిశ్వలీల యెవనిదో అతడునిత్యుడు. మఱియు నిత్యుడై వెలయునతడెవ్వడో వానిదే యీలీలయును! ఈలీలననువర్తించియే ఆనిత్యుని నీవు కనుగొనవలయును. మఱియు ఆనిత్యుని ఆధారముతోడనే నీవు ఈలీలను దరిచేరగలవు. కాన ఈలీల మిథ్యకాదు. దృశ్యక్షేత్రమున గోచరించు నిత్యుని ప్రదర్శనమేయిది:—

83 (ఇంద్రియములతోగూడిగాని, వానినిదాటిన జ్ఞప్తితోగూడిగాని భావక్షేత్రమందు) నీవొకపురుషుడవై యున్నంతకాలము, నీవునిరామయుమని వచించునది సాపేక్షికరూపమేయగును, నీవు నిత్యమనునది, లీలను సూచించుచునేయుండును, నీవు కేవల ద్రివ్యమనునది గుణముల స్ఫురింపజేయుచునేయుండును, నీవునిర్గుణమనునది సగుణమును అపేక్షించుచునేయుండును, నీవు ఏకమనునది అనేకత్వమును స్మరణకు తెచ్చుచునేయుండును, తప్పదు.

84 నీవు ద్వైతభావముతోనున్నంతకాలమును, వెన్నను, మజ్జిగను అంగీకరింపవలసినవాడవేఅగుదువు. సాకారబ్రహ్మ

మును విశ్వమునుకూడ అంగీకరింపవలసినదే. ఉపమానముగ వివరించిచెప్పు నెడల మొదటపాలవంటిది సమాధియందు అపరోక్షానుభూతిచే తెలియబడు బ్రహ్మము; వెన్నవంటిది సగుణనిర్గుణబ్రహ్మము; మజ్జిగవంటిది ఇరువది నాలుగు తత్త్వములతో గూడిన జగత్తుఅగును.

35 యథార్థము విచారించుచో బ్రహ్మమునకును శక్తికినిగల వ్యత్యాసము భేదములేనివ్యత్యాసము! బ్రహ్మమును శక్తియు ఒక్కటే; అభేదము! అగ్నియు దహనశక్తియు ఏకమైనట్లేఉండును. పాలును పాలతెల్లదనమును ఒక్కటే అయినవిధమున బ్రహ్మమును శక్తియు అభేదమే. మణియు మణియొక్క కాంతియు ఏకమైనవడువున బ్రహ్మమును శక్తియు అభిన్నము- వానిలో ఒకటినివిడిచి రెండవదానిని ఊహచేయుటయే పొసగదు. వానిని భిన్నముగ భావన చేయనేలేము.

36 భిన్నభిన్నములగు వృత్తికేంద్రములందు ఐక్యతగాక భిన్నతయే ధర్మముగాన శక్తి భిన్నరూపములదాల్చి ప్రకటితమగుచుండును. బ్రహ్మము సకలభూతములందును అంతర్యామియైయున్నాడు. చిన్నచీమయందును కలదు. భిన్నత్వమంతయు ప్రకాశమునందుమాత్రమేకలదు.

37 అనేకమై గోచరించు ఏకైకవ్యక్తినాజగజ్జననియే. ఆమె అనంతశక్తిమంతురాలు కావున, కాయికములు, మానసికములు, నైతికములు, పారమార్థికములు అగు నానావిధ శక్తులుగల జీవజగత్తులుగా ఆమెగోచరింపగలదు. వేదాం

తులు బ్రహ్మమని వ్యవహరించునది ఆ నాదివ్యజననియే, వేఱుగాదు. నిర్గుణబ్రహ్మము యొక్క సగుణభావమూర్తియే ఆమె.

౮౮ నాదివ్యమాత ఏకమును అనేకమును అనియు, ఏకానేకమునకు అతీతమును అనియు ఏఱుఁగుదుముగాక!

౮౯ వృత్తిరహితబ్రహ్మమును, వృత్తిసహితశక్తియు యథార్థము నకొక్కటే. సచ్చిదానందరూపుడగు బ్రహ్మమే సర్వధారిణియు, సర్వజ్ఞయు, సర్వమంగళరూపిణియు అగుజగజ్జనని! స్వయంప్రకాశియగుమణియు దానిప్రకాశమును ఒక్కటియేగదా! ఏలనన! ప్రకాశమునువిడిచి మణిగాని, మణిని విడచిదాని ప్రకాశమునుగాని నీవుభావనచేయనేరవు.

౯౦ ఎచ్చటసృష్టిస్థితిలయములను కర్మయుండునో అచ్చటశక్తి అనగాచిచ్ఛక్తియుండును. చంచలించుచున్నను, నిశ్చలముగనున్నను, నీరునీరేగదా! ఆపరైకసచ్చిదానందబ్రహ్మమే, విశ్వసృష్టిస్థితిలయములగావించు నిత్యచిచ్ఛక్తి. ఎట్లనగా ఈప్రధాని* ఒకప్పుడు కదలకకూర్చుండును. ఒకప్పుడు అర్చనలుచేయుచుండును. ఇంకొకప్పుడు పనిమీదరాజప్రతినిధిని చూడబోవును. ఇన్నిసందర్భములందును యుండునది ఆఒక్కప్రధానియే; ఆసందర్భములన్నియు అతడు ధరించు వేర్వేఱుఉపాధులనవచ్చును.

* (కలకత్తాలో నేపాలప్రభుత్వమువారి ప్రతినిధిగానుండిన విశ్వనాథోపాధ్యాయులవారిని పరమహంసులవారు ప్రధానిఅనెడివారు.)

91 బ్రహ్మము శుభాశుభములచే లిప్తుడుగాడు. అతడు లాంతరునందలి దీపమువంటివాడు: ఆలాంతరుదీపముతో నీవుభగవద్గీతను చదువుకొనవచ్చును. దానివెలుగుసాయముననే దుష్టబుద్ధిని నీవొకకపటపుపత్రమును సృష్టిచేయవచ్చును.

మఱియు బ్రహ్మము పామువంటివాడు. పామునకు కోఱలందువిషమున్ననేమి ? ఆపామునకు దానివలన హానిలేదు. ఆవిషముదానినిచంపదు. దానికాటునుపడసెనేని యితరజంతువులకు మాత్రమే అదిప్రాణాంతకమగును. అదేతీరున జగత్తున మనకుగోచరించు దుఃఖము, పాపము, ఇట్టికీడేదైనను మననుమాత్రమే బాధించును. బ్రహ్మము వీనియన్నిటికిని అతీతముగానుండును.

జగమునందలి యీమేలు, కీడు, బ్రహ్మమునకు అట్టివిగ నుండజాలవు. మానవులు శుభాశుభములను తమభావములను బ్రహ్మమునకనువర్తింపజేసి వానియోగ్యతను గణనచేయడగదు.

92 పరమాత్మను సృష్టిస్థితిలయకర్మములులేని నిష్క్రియునిగా భావనచేసినప్పుడు బ్రహ్మము లేక పురుషుడు అని పేర్కొందును. వానినే సృష్టిస్థితిలయకర్మల జేయుచు కర్మతంత్రుడై యున్నటుల భావనచేయునప్పుడు శక్తి, మాయా, ప్రకృతి అని పేర్కొందును.

93 నాలో "అహం" అనునది ఉన్నంతవరకును, జీవజగత్తుల వంటి తనపరిభావరూపజాలము ద్వారమున ప్రత్యక్షమగుచు సగుణబ్రహ్మముకూడ నాయెదుటనుండును సుడీ !

94 సమాధియందు పరిపూర్ణమును సాక్షాత్కారముచేసికొనినవారికినయితేను, ఇంద్రియ జ్ఞానక్షేత్రమునకు దిగివచ్చునప్పుడు సగుణబ్రహ్మమును గుర్తింపగలంత "అహం" కారము మిగిలియుండును. సప్తస్వరములలో "ని" అను స్వరమునందే సదా కంఠధ్వనిని నిలుపుట దుస్సాధ్యము కాదా? కావున సగుణాద్వైతమును అవసరమే.

95 "నావాదమే సరియైనది, విమర్శనకు నిలుచునది. సుస్థిరమైనది. సగుణాద్వైతమును విశ్వసించువారు పొఱబడువారు" అని అద్వైతి అనతగదు. బ్రహ్మముయొక్క సగుణరూపముల సత్యత ఎంతమాత్రమును తీసిపోవునది కాదు. ఈ దేహముకన్నను మనస్సుకన్నను ఈ దృశ్యప్రపంచముకన్నను ఆ సగుణరూపములు ఎన్నియోరెట్లు సత్యములే సుమీ!

96 బ్రహ్మము నిరాకారుడని భావనచేయుటమంచిదే. కాని ఆభావనమాత్రమే సమంజసమనియు, తదితరమంతయు దోషభూయిష్ఠమనియుమాత్రము తలంపబోకుము. బ్రహ్మమును ఆకారములతోగూడినవానిగ భావించి ధ్యానముచేయుటయు, తుల్యముగ సమంజసమే. అయినను నీవు భగవంతుని చూచి అపరోక్షానుభూతి పడయువఱకును నీవిశిష్టభావననే నిలుపుకొనియుండుము. ఆపిమ్మట సర్వమును తెలిసిపోవును.

97 అవ్యయనిర్గుణబ్రహ్మము సమాధియందుమాత్రమే గోచరించును. అప్పుడు అంతయు మౌనముదాల్చియుండును. జీవజగ

భ్రాంతులగూర్చియు, భ్రాంతిరాహిత్యముంగూర్చియు, జ్ఞానాజ్ఞానములగూర్చియు ప్రసంగములన్నియు, శూన్యములగును. కేవలసత్తామాత్రము నిలుచును. మఱేమియు నుండదు. ఉప్పుబొమ్మ సముద్రమున ఐక్యతనుపొందిన పిమ్మట ఇంకేమి తెలుపును? బ్రహ్మజ్ఞానమనగా యిట్టిది!

95 సమాధిస్థితినుండి ఇంద్రియక్షేత్రమునకు దిగివచ్చినవానికి తనదివ్యచక్షువునుమాత్రము, నిలుపుకొనగలంత అహంకారము, వెడల్పులేని సన్ననిరేఖామాత్రముగ మిగులును. ఈదివ్యచక్షువు వానిని జీవజగత్తులను, ఈసమస్తరూపములుగ వ్యక్తమౌ ఏకైకసదార్థమగు తనను చూచుకొన శక్తునిజేయును. జడసమాధియందు అనగా నిర్వికల్పసమాధియందు నిరాకారనిర్గుణబ్రహ్మమును, మఱియు చేతనసమాధియందు అనగా సవికల్పసమాధియందు సాకార సగుణబ్రహ్మమును సాక్షాత్కారము చేసికొనినవానికి ఈభవ్యదర్శనము లభ్యముకాగలదు. నీవ్యక్తిత్వముతో కూడిన అహంకారముగలిగి నీవొకపురుషుడవై యున్నంత కాలమును, భగవంతుని ఒకపురుషునిగాతప్ప వేఱుగ నీవు భావన చేయజాలవు; ఊహింపజాలవు; సాక్షాత్కారము పడయజాలవు. అంతవరకును నిర్గుణబ్రహ్మము నీకు- బాహ్యాంతరంగములందు- మూర్తివంతుడై సగుణరూపమున ప్రత్యక్షముకాకతీరదు. ఈసగుణరూపములు సత్యతయందు కొఱవడినవికావు. ఈశరీరముకంటెను, మనస్సు

కంటెను, బాహ్యజగముకంటెను అనంతాంశములుగా యథార్థములు.

99 సాకారబ్రహ్మదర్శనము తెలుచుగా పారమార్థికరూపమున నుండును. వినిర్మలనరహృదయమునకు మాత్రమే గోచరించును. అనగా ఈరూపములు ఈశ్వరుడు ప్రసాదించు భగవతీతనువునకు సంబంధించిన జ్ఞానేంద్రియములకు మాత్రమే గోచరించును. కావున సిద్ధపురుషుడు మాత్రమే వీనిని చూడగలుగును.

100 నీవు అద్వైతమునుగూర్చిమాట్లాడిన తోడ్తోడనే, ద్వైతమును ప్రతిపాదించినవాడవగుచున్నావు. అఖండమును గూర్చి ప్రస్తావించునప్పుడు ఖండమును అంగీకరించినవాడవే అగుచున్నావు. సమాధియందు నీవు పరిపూర్ణమును దర్శించువఱకునునీవు "పరిపూర్ణము" అనునదివ్యర్థవాక్యకాకపోయినను సాపేక్షికరూపమైనను అగును. దానిని ఉన్నదున్నట్లు నీవువర్ణింపలేవు. అటుల వర్ణనచేయు ప్రయత్నమునందే నీవ్యక్తిసంబంధమగు రంగునొకదానిని, దానియందు లేనిదానిని, దానికంటించినవాడవగుచున్నావు.

101 బ్రహ్మము జ్ఞానాజ్ఞానములకును, శుభాశుభములకును, ధర్మాధర్మములకును, ఇంకేల ద్వంద్వములన్నింటికిని అతీతముగనుండును.

102 ముందు భగవత్సాక్షాత్కారము, పిమ్మట వానిసృష్టిజ్ఞానము! వాల్మీకికి రామమంత్రము నేర్పునప్పుడు దానిని తలక్రిందుచేసి "మరామరా" అని నేర్పవలసివచ్చెను.

“మ” అనగా ఈశ్వరుడు; “ర” అనగా జగత్తు అని అర్థము. ముందు భగవంతుడు; పిమ్మట జగత్తు!

103 నిర్గుణబ్రహ్మమును సగుణబ్రహ్మమును ఒక్కటే, భేదము లేదు. ఒకదానియందలి విశ్వాసము కుదిరిన, రెండవదాని యందలి విశ్వాసము కుదిరినట్లే. కాల్చుశక్తిని కాదని నిప్పునుగూర్చి ఊహింపజాలము. నిప్పును స్మరింపకుండ కాల్చుశక్తిని భావనచేయజాలము. ఇట్లే సూర్యునివిడిచి వానికిరణములను, వానికిరణములనువిడిచి సూర్యునిభావన చేయజాలము. పాలను విడచి పాలతెల్లదనమును, పాల తెల్లదనమునువిడచిపాలను ఊహచేయజాలము. అదేవిధముగా సగుణుడగుభగవంతుని భావనలేకుండ నిర్గుణబ్రహ్మమునుగాని. నిర్గుణముయొక్క సంపర్కములేకుండ సగుణబ్రహ్మమునుగాని భావనచేయుట అసంభవము.

104 ఇది సంవృత వివృతధర్మము. పరబ్రహ్మము దిశకు మరలి పోదువా వానిలో నీవ్యక్తిత్వము లయమగును. ఇది సమాధి! ఆపిమ్మట ఈభావమునుండిమరలి, నీవెచ్చట నుండి బయలుదేరితివో, అచ్చటికి వచ్చితివా, నీవును ఈ జగత్తుగూడ ఆ పరబ్రహ్మమునుండియే వివృతమైవచ్చినట్లును, ఈశ్వరుడు, జీవుడు, జగత్తుఅభేదమేఅనియు, అందు వలన వీనిలో దేనినిసాక్షాత్కారముచేసికొనినను తక్కిన రెంటిని దర్శించినట్లేఅనియు తెలియవచ్చును.

105 అనంతజలరాశి యున్నట్లూహచేయుము. పైననీరు, క్రింద నీరు, అన్నిదిశలందును నీరే వున్నదనుకొనుము. కొన్ని

స్థలములందు శీతలముచేత నీరుగడ్డకట్టి మరల వేడికి కరిగి నీరగును. బ్రహ్మమే యీ అనంతజలరాశి. మంచు గడ్డగా గట్టిపడినభాగములు ఆ బ్రహ్మముయొక్క పారమార్థికసాకారరూపములు. భక్తునిఅనురక్తి శ్రద్ధ ఆత్మార్పణము అనునవియే శీతలము. మఱియు "నేను. నేను" అనుచుండెడు అహంకారము రూపుమాసిపోవు నిర్వికల్పసమాధిని చేకూర్చుజ్ఞానవిచారమే ఉష్ణము.

106 భక్తునకు భగవంతుడు అనేకరూపములతో ప్రత్యక్షమగును కాని, సమాధియందు బ్రహ్మజ్ఞానాగ్నిముంజేరువానికి నిరాకారమై, నిరంజనమై, ఆతడు తిరిగినిర్గుణబ్రహ్మముగ సిద్ధమగును. భక్తిజ్ఞానముల కిటుల సామరస్యము అమరుచున్నది.

107 నిప్పునకు ప్రత్యేకరూపములేదు.; జ్వలించుచున్న బొగ్గులందు అది వివిధరూపములతాల్చుచున్నది. అప్పుడునిరాకారమగుఅగ్ని సాకారిఅగుచున్నది. అటులనే నిరాకారబ్రహ్మము ప్రత్యేక రూపములను వహించుచుండును.

—:0:—

3వ అధ్యాయము.

# మాయ.

108. ప్రాకుచున్న పామునకును కదలకపరుండియున్న పామునకునుగల పోలిక "మాయ"కును "బ్రహ్మము"నకును, కలదు. క్రియాపరమైయున్న శక్తివంటిదిమాయ; అవ్యక్తమైయున్నశక్తి బ్రహ్మము.

109. మహాసాగరజలము ఒకప్పుడు నిశ్చలముగనుండి మరొకప్పుడు తరంగకల్లోలమైయుండుతీరున "బ్రహ్మమును" "మాయ"యు బరగుదురు. శాంతియుతసముద్రమే "బ్రహ్మము" సంచలనయుతసముద్రము "మాయ".

110. అగ్నికిని దహనగుణమునకును ఎట్టిపోలికగలదో అట్టిపోలికయే బ్రహ్మమునకును శక్తికిని కలదు.

111. మేఘములులేని నిర్మలమగు ఆకాశమున ఆకస్మికముగా మబ్బొకటి కాన్పించి దిఙ్మండలమున చీకట్లుక్రమ్మవచ్చును. హఠాత్తుగా వాయువువీచి దానిని తఱిమివేయవచ్చును. ఇట్లే "మాయ" అది ఆకస్మికముగ తలజూపి, ప్రశాంతచిత్తము నాక్రమించి దృశ్యప్రపంచమును కల్పనచేయును, ఈశ్వరుని ఉశ్వాసముచేత మరల హఠాత్తుగా చెదరిపోవును.

112. బ్రహ్మసాక్షాత్కారమును చేకూర్చునది మాయయే. మాయలేనిది ఎవరు బ్రహ్మసాక్షాత్కారమును పడయ

గలదు? శక్తినిదర్శింపకుండ, అనగా వ్యక్తమగు భగవత్సాక్ష్యమును గమనింపకుండ భగవంతుని గుర్తింపజాలము.

113. ఎవరేని కనుపెట్టినంతనే దొంగపారిపోవురీతిన, విశ్వభ్రాంతి రూపమాయను నీవు కనిపెట్టిన తోడనే అది పారిపోవును.

114. ఒక పుణ్యపురుషుడు త్రికోణాకృతిగల అద్దపుముక్కను గాంచి రేయింబవళ్ళు చిరునవ్వు నవ్వుచుండెడివాడు. కారణమేమనగా, దానిద్వారమున ఎరుపు, పసుపు, నీలము మొదలగు వేర్వేరురంగులు వానికి కాన్పించెడివి. ఈరంగులు వట్టిబూటకములని గ్రహించుటచేత అతడీ దృశ్యప్రపంచము సయితము అటులనే బూటకమని గ్రహించి నవ్వుకొనెడివాడు.

115. హరియనుబాలుడు సింగపుతలనుపెట్టుకొనినప్పుడు భయంకరముగ కాన్పించుటనిజము. అతడు తనచెల్లెలు ఆటలాడుకొనుచున్నతావునకుపోయి, దద్దఱిలిపోవునటుల బొబ్బపెట్టును. వానిచెల్లెలుఅదఱిపడి భీతిల్లి ఆభీభత్సాకారుని బారినుండి తప్పించుకొని బయటపడుటకై కెవ్వునకేకవేయును. కాని హరి తనముసుగును తొలగించివేయగానే, భయకంపితయై యున్నవానిచెల్లెలు తనప్రియసోదరునితక్షణముగుర్తుపట్టి, వాని చెంతకుపరుగిడిపోయి "ఓహో! నాఅనుంగుసోదరుడే!" అనును. ఇట్లేబ్రహ్మము అజ్ఞానరూపమాయయొక్క ముసుగును వేసికొనగా భ్రాంతిచెంది భీతిలిపోయి నానాచేష్టలకు గడంగు లౌకికజనముగతియు ఉన్నది. కాని ఆబ్రహ్మము యొక్క ముఖమును కప్పిపుచ్చు మాయారూపముఖము

ఉల్లంఘింపబడినప్పుడు, నరులకు అతడు భీకరుడై కరుణాశూన్యుడై బాధించు అధికారిగా కాన్పించడు; అత్యంతప్రియుడగు అంతరాత్మస్వరూపుడగును సుమీ !!

116. ఒకసారి వినిర్మలనీలాకాశమున హఠాత్తుగా మబ్బులావరింప, ఉత్తరక్షణముననే పెనుగాలివచ్చి వానిని చెదఱగొట్టుటగాంచి ఒకపరమహంస ఆనందపరవశుడై నాట్యము చేయుచు, ఇటులపలుకసాగెను. "మాయయిట్టిదే! మాయ మొదటలేనిదే! అది వినిర్మలబ్రహ్మవాతావరణమున ఆకస్మికముగ గోచరించి, యీజగత్తునంతను సృష్టిచేయుచున్నది! అంతలో ఆబ్రహ్మముయొక్క నిశ్వాసముచేతనేచెదఱగొట్టివేయబడుచున్నది!!"

117. భగవంతుడు సర్వవ్యాపి అగునెడల మనకేలకాన్పించడు? పాచినాచుదట్టముగా కప్పియున్నకోనేటిగట్టున నిలిచి చూచితివేని దానిలో నీవు నీరులేదందువు. నీవానీరునుచూడగోరుదువేని నీటిపైనుండి నాచును తొలగించవలయును. అటులనే మాయపొఱలుగప్పినకండ్లతో నీవు భగవంతుని చూడలేక విలపించుచున్నావు. నీవాభగవంతుని దర్శింపకోరునెడల నీకండ్లపైనుండి ఆమాయయొక్కపొఱలను తొలగించుకొనుము.

118. మేఘము సూర్యుని కప్పివేయునటుల మాయ బ్రహ్మమును కప్పివేయును. ఆమబ్బువిచ్చిపోయినప్పుడు సూర్యుడు కాననగును; మాయ విడిపోయినప్పుడు భగవంతుడు ప్రత్యక్షమగును:

119. రాజహంసము నీటితోఁ గలిసియున్న పాలనుండి, నీటి ని విడదీసి, ఆపాలనుమాత్రమే గ్రహించును; ఇతరపక్షులు అటులచేయజాలవు. ఈశ్వరుఁడు మాయతోఁ గూడియున్నాఁడు. సామాన్యనరులు మాయనుండి వేఱుపఱచి ఈశ్వరునిఁ గుర్తింపజాలరు. పరమహంసమాత్రము మాయను విసర్జించి శుద్ధబ్రహ్మమును గ్రహింపఁజాలును.

120. శ్రీరాముఁడు, సీత, లక్ష్మణుఁడు వనములబడిపోవుచుండిరి. శ్రీరాముఁడుముందు నడచుచుండెను. సీతమధ్యను లక్ష్మణుఁడు చివఱనుఉండిరి. సదా శ్రీరామునితనకండ్లయెదుట నుంచుకొని చూచుచుండవలయునని లక్ష్మణునికిఅభిలాష. సీతనడుమనుండుటచేత లక్ష్మణుఁడు రామునిచక్కఁగ చూడలేకుండెను. అప్పుడతఁడుకొంచెము ప్రక్కకుతొలగుమని సీతను ప్రార్థించినాఁడు. ఆమె అటులతొలగగానే లక్ష్మణునికోర్కె ఫలించి శ్రీరాముని కన్నులార చూడగలిగెను. ఈవిశ్వములో బ్రహ్మము మాయ జీవుఁడు అటులవర్తింపుచున్నారు. మాయాభ్రాంతి తొలగనంతవఱకును జీవుఁడు ఈశ్వరుని చూడజాలఁడు; నరునకు నారాయణునిదర్శనముకాదు.

121. పాముకోఱలందలి విషము పామునకు హానికరము కాదు; అది వేఱొకని కఱచునెడల ఆవిషము వానినిచంపును. అటులనే ఈశ్వరునియందలి మాయ వానికి అపాయకరము కాదు; మఱియు ఆమాయ విశ్వమునంతను భ్రాంతిపాలుచేయుచున్నది !

122. పిల్లి తనకూనలను పండ్లతోఁ బట్టుకొనినప్పుడు ఆకూనలకు అపాయముండదు. ఆపిల్లిచుంచునుపట్టుకొనినప్పుడు చుంచు

చెప్పెనుగదా! ఆ దేవిధముగా మాయభక్తునిచంపదు; కాని [illegible]లను ధ్వంసముచేయును సుడీ!

123. శివుడును, శక్తియు, అనగా విజ్ఞానమును ప్రవృత్తి యు సృష్టిజరుగుటకు అవసరములు. పొడిమట్టితో కుమ్మరి కుండలు చేయజాలడు; నీరును అవసరము. అటులనే శక్తియొక్క తోడ్పాటులేనిది శివుడు సృష్టిని జరుపజాలడు.

124 పరావిద్యయు, పరమానందప్రాప్తియు, ఈమొదలగు విషయములు మనకు సాధ్యములగుట మాయవలననే; అటుల కానిచో ఈవిషయములను సయితము ఎవరుఅనుభవింపగోరు కొనగలుదురు? మాయనుండిమాత్రమే ద్వైతభావమును అన్యాపేక్షతయు ఉత్పన్నము కాగల్గును. మాయనుదాటి నచో భోగము భోగి అనుభావములకే అవకాశము లేక పోవును.

125 మాయనుచూడ నపేక్షించి, ఒకదినమున నేనొక దృశ్యమును గాంచితిని. ఒక చిన్నబిందువు వికసించి యొకబాలి కగా నేర్పడినది. ఆబాలిక పెరిగి స్త్రీయై ఒక బిడ్డను గన్నది. మఱియు ఆబిడ్డను కనినతోడనే ఆమె దానిని పట్టుకొని మ్రింగివేశినది. ఈతీరున ఆమె చాలమంది బిడ్డలను కని వారిని మ్రింగివేసినది. అంతట ఆమె మాయయే యని నేను గ్రహించితిని.

126 మాయఅనగానేమి? తఱుచుగా పారమార్థికసాధనకు అడ్డమువచ్చుచుండు కామమే మాయ!

—(o)—

## 4వ అధ్యాయము.

# భగవదవతారములు.

---

127. మహాసముద్రమునందు అలలెటువంటివో, బ్రహ్మమునందు (శ్రీరామకృష్ణాది) అవతారములు అటువంటివి.

128. సచ్చిదానందమహావృక్షమున, రాములు, కృష్ణులు, బుద్ధులు, క్రీస్తులు, మున్నగువార లనేకులు గుత్తులుగుత్తులుగా వ్రేలాడుచుందురు. వీనిలోనుండి అప్పుడప్పుడు ఒకరో ఇద్దరో ఈలోకమునకు దిగివచ్చి మహాపరివర్తనములను విప్లవములను నడుపుచుందురు.

129. భగవాన్ రామచంద్రుడు ఈలోకమున అవతరించినప్పుడు ఏడుగురుఋషులుమాత్రమే వానిని భగవదవతారమని తెలియగలిగిరి. అటులనే భగవంతుడీలోకమున అవతరించునప్పుడు ఏకొలదిమందిమాత్రమో వానిదివ్యత్వమును గ్రహింపగల్గుదురు.

130. దీపముతనచుట్టునుండువస్తువులను ప్రకాశింపజేయుచుండగా ఎల్లప్పుడును ఆదీపముక్రిందమాత్రము నీడయుండనే యుండును. అట్లే ప్రవక్తలకు అత్యంతసమీపవాసులై మెలగువారు వారినిపాటింపరు. దూరముననున్నవారే ఆమహాత్ముల ప్రకాశమును అద్భుతమహిమను ఆకర్షించి ఆశ్చర్యపడుచుందురు.

131. వెలుపలికికాన్పించుకోఱలు, లోపలనుండుదంతములు అని ఏనుగుపండ్లు రెండురకములుగానుండును. ఆతీరుననే శ్రీకృ

ష్టాదిఅవతారపురుషులస్వరూపములుద్వివిధములుగానుండును. అందఱికిని తెలియవచ్చు సామాన్యమానవులనుబోలు బాహ్యప్రకాశరూపము ఒకటి. సర్వకర్మాతీతమై, ఆంతరంగిక పరమశాంతితోడనొప్పు ఆత్మరూపము మఱొకటియుండును.

132. అవతారమనునది ఎల్లెడలను ఒక్కటియే; భేదము లేదు. జీవసాగరమునందు ఏకోనారాయణుడు ఒకతావున కృష్ణరూపమున పైకితేలి కాన్పించును. మఱలమునిగి వేఱొక తావున క్రీస్తురూపమున తేలిప్రత్యక్షమగును.

133. సాధారణఋతువులయందు నూతులలోనినీరు చాల లోతుననుండి కష్టముమీదగాని చిక్కదు. వానకాలమునందు దేశమంతయు వఱదలుపాఱునప్పుడు ఎక్కడపట్టిన అక్కడ నీరులభించును. అటులనే సాధారణముగ భగవంతుడు, జపతపవ్రతములను ఎన్నిటినోచేసినగాని, ప్రత్యక్షము కాడు. కాని, అవతారమనెడివఱద భూలోకమునునిండినప్పుడు భగవంతుడు ఎల్లెడలదర్శనీయుడగును.

134. “ఈశరీరమును తాల్చుటలో నేనుగావించిన త్యాగమును, నేనుభరించు లోకభారమునుఎవరు తెలియజాలుదురు?” అని భగవాన్‌శ్రీరామకృష్ణపరమహంసులవారు పలికిరి. భగవంతుడు భౌతికశరీరమును తాల్చునప్పుడు ఎంతటిత్యాగము చేసియుండునో ఎవనికిని గ్రాహ్యముకాదు.

135. ఒకస్థలముచుట్టును చాలఎత్తగుగోడయున్నది. వెలుపలివారికి అదెటువంటితావో తెలియదు. ఒకతడవ నలుగురు మనుష్యులు నిచ్చనవేసికొని గోడనెక్కిలోపలనేమియుండునో

తెలుసుకొనకోరిరి. మొదటివాడు గోడపైకిచేరగానే "ఆహా! ఆహాహా!!" అనుచునవ్వి, లోనికిదుమికినాడు. రెండవవాడును పైకెక్కగానే పకపకనవ్వి లోపలికిదుమికినాడు. మూడవవాడుసయితము అటులనేచేసినాడు. చివరవాడగు నాల్గవమనుష్యుడు గోడపైకియెక్కినప్పుడు వానికంటు రకరకములగు మధురఫలములతోనిండిన మనోహరములగు పండ్లచెట్ల తోపులు కానవచ్చినవి.

తక్షణమే లోనికిదుమికి వానిని ఆరగించి ఆనందానుభవమునుపొందుటకు గాఢమగుకోర్కెపుట్టినది. కాని అతడా కౌతుకమును చిక్కబట్టి నిచ్చెనమీదుగాక్రిందికి దిగివచ్చి, తాగాంచినవనసౌభాగ్యమును అందలివృత్తాంతములను అభివర్ణించి యితరులకు భోధింపసాగెను. ఈ గోడచే మూయగట్టబడిన తోటవంటివాడు బ్రహ్మము. వానిని పొడగాంచినవారెల్ల పరవశముపొంది, వానిలో లీనమగుతమకముతో తటాలున ఆబ్రహ్మమునందు దుముకుదురు. మహాసిద్ధులును, మౌనివర్యులును, అటువంటివారు. కొందఱు బ్రహ్మమును ప్రత్యక్షముచేసుకొనియు తమ అపరోక్షానుభూతిని ఇతరులకుపంచియిచ్చు కుతూహలముకలవారగుదురు. నిర్వాణసుఖమునుపొందు తమఅవకాశమును త్యాగముచేతురు. సంసారసాగరమునబడి కొట్టుకొనుచుగతికానకయున్న మానవజాతికి పరమపదవింగూర్చిన బోధలుచేసి దారిజూపుకొరకై యీప్రపంచమున అవతారములు దాల్చుదురు.

అట్టిమహాభారమును వహించువారే జగదుద్ధారకులగు మహానుభావులు.

136. అవతారమనగా నరరూపముదాల్చివచ్చిన భగవంతునిసందేశహారుడు! మహాచక్రవర్తియొక్క రాజప్రతినిధి వంటివాడు. దూరమున ఏరాష్ట్రమునందైనను అల్లరులు జరుగు నెడల చక్రవర్తి తనప్రతినిధిని పంపును. అట్టేవిధమున, ప్రపంచమున ఏభాగమునందైనను ధర్మహానిజరుగు నెడల అధర్మమును ఉద్ధరించి పెంపొందజేయుటకై తనఅవతారమును భగవంతుడుపంపును.

137. కుప్పలుగపడియున్న మన్నును, చెత్తను, తొలగించి, యుగములకొలదిగవాడుకలేక పూడికపడియున్న ప్రాతనూతినిబయలుపఱుచు పురాణవస్తుశోధకునితో సిద్ధపురుషుని పోల్పదగును. అవతారమో పూర్వమెన్నడును నీరుదొఱకియుండనితావున క్రొత్తగా బావినిత్రవ్వుమహాశిల్పివంటివాడు! సిద్ధపురుషుడు మోక్షజలమునకు దాపుననున్న వారికి మాత్రమే మోక్షమునొసగజాలును; అవతారమో ఎవని హృదయము బొత్తుగ భక్తిజలమన్నమాటలేక యెడారివలె ఎండబారియున్నదో అటువంటివానికిని మోక్షజలమును ప్రసాదింపగలడు.

138. పెద్దపొగయోడ నీటిపైని కడువేగముతోపోవుచు చిన్నచిన్న నావలను, పడవలను, అనేకమును తనతోడతీసుకొని పోగలదు. ఆతీరుననే అవతారపురుషుడు వచ్చునప్పుడు

అతఁడు వేలకొలఁది ప్రజలను మాయాసముద్రమును తాను దాటించి మోక్షాశ్రయమున సులభముగ జేర్చగల్గును.

139. సముద్రముపొంగినప్పుడు ఆనీరు నదులను ప్రవాహములను పూరించి దాపునగలప్రదేశములనెల్ల జలమయము చేసివైచును; వాననీరో మామూలుకాలువలంబడి మాత్రము ప్రవహించును. అవతారముపచ్చునప్పుడు వానికృపకు పాత్రులైనవారెల్లరును ముక్తినిపొందుదురు. సిద్ధులు ఎంతయోకష్టపడి తపములు, జపములుజేయువారికి మాత్రమే తోవజూపి రక్షింపగల్గుదురు.

140. పెద్దమ్రానొకటి ప్రవాహమున బోవునప్పుడు అది ఎన్నివందలపక్షులనో తనపైమోసికొనిపోగల్గును. అది మునగదు. రెల్లుపుల్లయో ఒక్కకాకియెక్కినచాలును, మునిగిపోవును. అటులనే అవతారపురుషుడువచ్చినప్పుడు వానిని ఆశ్రయించి అనేకులు ముక్తికాంచగలరు. సిద్ధపురుషుని ఆశ్రయించి కొలదిమందిమాత్రమే ఎంతెంతయోకష్టపడినమీదట తరింతురు.

141. రైలుయింజనుతాను వేగముగబోయిగమ్యస్థానమును చేరుటేగాక సరకుబండ్లనెన్నింటినో తనతోడలాగికొనిపోగల్గుచున్నది. అటువంటి ఇంజనునుబోలువారు అవతారపురుషులు. పాపభారముచే క్రుంగియున్న అనేకులను తోడ్కొనిపోయి భగవత్సాన్నిధ్యమునచేర్చగల్గుదురు;

142. మహాత్ములు తమవారిచేత మన్ననలను పడయజాలకుండుటకు కారణమేమిటి? గారడీవానిబందుగులు వాని

చిత్రములజూచుటకై చుట్టునుమూగరు; ఇతరులన్ననో నోరులు తెరచుకొని వానిచిత్రములను విడ్డూర్యముతో చూచుచుందురు కాదా !!

143. బూరుగప్రత్తిచెట్టు విత్తనాలు దానిక్రిందపడవు. అవి చాలాదూరము గాలిలో కొట్టుకొనిపోయి యెక్కడనో నాటుకొనును. అటులనే మహాత్మునిబోధలు వానిస్వస్థానమునగాక చాలాదూరమున ప్రకాశించును. దూరపువారు వానిని గౌరవింతురు.

144. అవతారపురుషునకు చిక్కుదోచు సమస్యలేదు. మహాదుర్జ్ఞేయమును క్లిష్టమునగు జీవితసమస్యలు సయితము ప్రపంచములోని సర్వసామాన్యవిషయములంత సులభముగ వానికి తోచును. తేటతెల్లముగనుండు అతనిబోధలు పసిపిల్లలకును సులభగ్రాహ్యములుగనుండును. యుగయుగాంతములనుండి పేరుకొనియున్న అజ్ఞానాంధకారమునైనను త్రుటిలో పాఱద్రోలు దివ్యతేజముతో ప్రపూర్ణుడైన సూర్యుడే అతడు.

145. చంద్రార్కజ్యోతియనదగు విచిత్రమిశ్రకాంతి ఒక్కొకప్పుడు ప్రత్యక్షమగును. భక్తిచిహ్నములు, జ్ఞానచిహ్నములు, ఉభయములును ప్రస్ఫుటముగగల చైతన్యదేవునివంటి అవతారములు అట్టివి. ఒకేసారిగా సూర్యుడు, చంద్రుడును ఏకమై ఆకసమున చూపట్టినట్టులుండును. ప్రకృతిలోయిట్టి సంఘటము అత్యంతము అపూర్వమగునటులభక్తిజ్ఞానములు

కేంశమునుగూడి ఒక్క పురుషునందు మూర్తీభవించుటమిగుల నరుదు.

146. సీతారాములు, రాధాకృష్ణులు అనువారి కథలు కేవలము నీతిని బోధించుటకై కల్పనచేసిన కథలనియు, వారుచారిత్రకపురుషులు కారనియు, అంతరార్థగూఢార్థములను నేర్పుటకే పురాణేతిహాసములు యేర్పడినవనియు తలంపకుము. మీరును నేనును యెట్లో అట్లేవారును నరశరీరధారులే. వారుదివ్యాంశసంభూతులుగాన చారిత్రకముగను, నైతికము గనుగూడ వారిచరిత్రలు ఉపకరింపగలవు. మహాసాగరమున అలలెటువంటివో, బ్రహ్మమునఅవతారములటువంటివేసుడీ!

147. ఉత్సవాదులలో కాల్చుచిచ్చుబుడ్లలో పూలచిచ్చుబుడ్డియనునది యుండును. దానికినిప్పంటించినప్పుడు కొంతవఱకు ఒకవిధమైన పువ్వులను, మఱికొంతవఱకు యింకొకతీరుపువ్వులను, ఆపిమ్మట వేరొకరకపుపువ్వులను యెగుర చిమ్మును. దానిగర్భమున అనంతభేదములుగల పూలరాసులున్నవాయనునట్లు తోచును. అట్లేఅవతారములుండును. మఱియు యింకనొకరీతి చిచ్చుబుడ్డికలదు. అదికాల్చినప్పుడు కొంచెముకాలి తుస్సుననెగిరిపోవును. ఈతీరునసామాన్య జీవులుచిరకాలము జపతప ధ్యానసాధనలసలిపి సమాధిని ప్రవేశించిమరలిరారు.

148. అవతారములతోగూడి జననముగాంచువారు నిత్యముక్త జీవులైగాని, లేకతుదిజన్మను పొందినవారుగగాని యుందురు.

149. భగవంతుఁడు పరిపూర్ణుడనుట నిజము. మఱియు ఆయన సర్వశక్తివంతుడునై యున్నాడు. ఆయన తనదివ్య సహిమను కరుణరూపమున స్థూలశరీరముదాల్చి ఈశ్వరావతారముగ మనకడకు దిగివచ్చునటుల శాసింపగలడు. అంతట నా ఈశ్వరావతారమునుండి కరుణ వెల్లువలై ప్రవహించిమనల నావరించును. ఈవిషయమును మాటలతో సంపూర్ణముగ వివరించి స్పష్టపఱచుట సాధ్యముకానిపని. ఆధ్యాత్మదృష్టితో చూచి అనుభవింపదగిన యథార్థమిది! దీనినిగూర్చి సంశయ నివారణ కావలయుననువారు భగవంతుని చూడవలసినదే. సాదృశ్యములచేత ఈఅంశమును లీలగామాత్రమే సూచన చేయగలము. ఒకడు ఆవుయొక్క కొమ్మునో, పాదములనో తోకనోలేకపొదుగునోతాకునుఅనిఅనుకొనుడు.అటులచేయుట యాఆవునే తాకుటయందుముగదా? మనుష్యులమగు మనకు పాలుస్రవించు పొదుగు ఆవునందు ప్రధానముగతోచవచ్చును. కావున ఈశ్వరకృపయనుక్షీరము భగవదవతారమునుండి మనకు లభించును అనెదము.

150. భగవంతునిగూర్చి పూర్ణముగ ఎవడు యెఱుంగజాలును? వానిని సంపూర్ణముగ తెలిసికొనుట మనకుశక్యము కాదు. అటుల తెలిసికొను నిర్బంధమునులేదు. వానినిచూచిన చాలును. ఆతడుమాత్రమే సత్యముఅను అనుభవజ్ఞానమును పొందినజాలును.

151. ఒకడు శ్రీగంగానదికివచ్చి దాని నీటిని తాకనను కొనుడు. అతడు"నేను గోముఖినుండిగంగాసాగరమువఱకును

గల (ఉత్కృష్టస్థానమునుండి సముద్రమున గలియు తావు వఱకును అని అర్థము.) పావన గంగానదిని దర్శించి స్పర్శించితిని" అని చెప్పవుగదా?

152. నీవు భగవంతునికొఱకై వెదుకచూచెదవా? అటులైనచో వానిని నరునియందు వెదకుము! భగవంతుని దివ్యస్వరూపము తక్కినవస్తువులందుకన్న నరునియందు హెచ్చుగ మనకు ప్రకటనమగుచుండును. ఏనరుని హృదయమున భగవత్ప్రేమ నిండి వెల్లువయై ప్రవహించుచుండునో, ఎవడు భగవంతునందు వసించుచు, చరించుచు, ఉనికిగాంచుచుండునో, ఎవడు భగవద్భక్తితో స్రొక్కిపోవుచుండునో అటువంటివానికొఱకై ఎల్లెడల వెదకుము. అట్టిమనుజునందు భగవంతుడు నీకు ప్రత్యక్షముకాగలడు.

153. ఆతడు అవ్యయుడు, మఱియు యతడే లీలారూపుడును. ఈలీల నాల్గురకములుగనుండును:—ఈశ్వరలీల, దేవలీల, జగల్లీల, నరలీల.*

నరలీలయందు భగవదవతారము సంఘటిలగలదు. ఈనరలీల స్వభావము నీకు తెలియునా? పెద్దమేడమీదినుండి యొకతూముగుండ కడువేగమున నీరు ప్రవహించుటను దానికి పోల్చవచ్చును. ఆకాలువగుండా అల సచ్చిదానందబ్రహ్మము

* భగవద్భావన నాలుగురకములు:—ఒకటి ఈశ్వరభావన; అనగా ఈ జగమునకు అధినాథుడు. రెండవది దేవతలరూపము; వీరు జగదీశ్వరుని ప్రతినిధులుగనుండి జగద్వ్యాపారముల నడుపుదురు. మూడవ రూపము జగత్తే. నాలుగవది నరరూపము.

యొక్క మహాశక్తియే ప్రవహించుచు ప్రకటన మగుచు న్నదనవచ్చును. ఎల్లరును అవతారముల గుర్తింపజాలరు. భరద్వాజప్రముఖులు ఏడ్గురుమహాఋషులుమాత్రమే శ్రీరాముని అవతారముగా గ్రహింపగల్గిరి. నారాయణుడు నరునికి స్వచ్ఛమగు జ్ఞానమును భక్తిని నేర్పుటకొఱకై మానవ రూపమును ధరించి అవతరించును.

—:o:—

5వ అధ్యాయము.

# భగవంతుడు - జీవుడు

154. బ్రహ్మముమాత్రము సత్యము; వానివ్యక్తరూపములగు జీవజగత్తులు అసత్యములు - అనిత్యములు.

155. మాయాబంధయుతజీవుడు నరుడు; బంధరహితుడు ఈశ్వరుడు.

156. ప్రకృతిలోని పంచభూతముల సంగమున జిక్కిన బ్రహ్మము బాధితుడగును.

157. జీవాత్మ పరమాత్మలకుగల సంబంధమెటువంటిది ? ప్రవాహమునకడ్డముగా బల్లనొకదానిని నిలిపినయెడల,అందలి జలము రెండుగాచీల్చబడినట్లు అగపడును. అటులనే మాయోపాధివలన అద్వైతబ్రహ్మము ద్వైతమైగోచరించును. యథార్థమునకు రెండులేవు, ఒక్కటియే.

158. జలమును బుద్బుదమును ఒక్కటియే: బుద్బుదము (బుడగ) నీటిలోనెపుట్టుచున్నది, నీటిలోనె తేలుచున్నది. తుదకానీటిలోనె అడగుచున్నది. అదేతీరున జీవాత్మయు పరమాత్మయు ఒక్కటియే. అంశభేదముమాత్రము కలదు. ఒకటి ఖండము, రెండవది అఖండము, ఒకటి పరతంత్రము, రెండవది స్వతంత్రము.

159. చమురులేక దీపమువెలుగనేరీతిని, నారాయణుడు లేక నరుడు జీవింపజాలడు.

160. ఇనుమునకును సూదంటురాతికినిగల సంబంధమే నరునకును, నారాయణునకును గలదు. అటులయ్యును నరుడు నారాయణునిచేత ఆకర్షింపబడడేమి? దుమ్ములోఁ బూడి పడియున్న ఇనుము సూదంటురాతిచేత ఆకర్షింపబడనివిధమున మాయచేత దట్టముగఁ గప్పఁబడియున్న నరుఁడు నారాయణునిచేత ఆకర్షింపబడుటలేదు. నీటిలోఁ గడిగి దుమ్మునుదొలఁగించిన యెడల ఇనుమునకు ఆటంకముతీరి సూదంటురాతిచేతఆకర్షింపబడును. అటులనే నరుని ఇహలోకమున నంటిపట్టియుంచు మాయామలమును పశ్చాత్తాపముతోఁగూడిన ప్రార్థనలచే పొరలివచ్చు కన్నీటితోఁ గడిగివేసినయెడల అతడు నారాయణునిచేత ఆకర్షింపబడును.

161. బ్రహ్మము అనంతుఁడు; జీవుఁడోపరిమేయుఁడు. ఈపరిమేయుఁడు అనంతుని యెఱుంగజాలుటెట్లు? అట్టిప్రయత్నము ఉప్పుబొమ్మ సముద్రపులోఁతును కనుగొనఁజూచుటను పోలియుండును. ఆప్రయత్నమున ఉప్పుబొమ్మ సముద్రపునీటిలోఁ గఱఁగి నాశముచెందును గదా? అటులనే జీవుఁడుగూడ బ్రహ్మమును పరిశీలించి తెలిసికొనవలయునను ప్రయత్నమున తానుభిన్నమను జ్ఞానముచే కోల్పోయి బ్రహ్మము నందు లయముచెందును.

162. జీవాత్మపరమాత్మల ఐక్యత గడియారమునందలి చిన్నముల్లును, పెద్దముల్లును, గంటకొకతడవ కలియుటవంటిది. ఆరెండును పరస్పరము సంబంధముగలవై, ఒకదానిపై నొకటి ఆధారపడి నడచును. సాధారణముగా వేర్వేరై

యున్నను అనుకూలావకాశములు పొసగినప్పుడెల్ల కలియు చుండును.

163. ఒకటికి సున్నలుచేర్చుచుపోగా, దానివిలువ నెంత గానైనను పెంచవచ్చును. ఆఒకటితొలగెనా, ఎన్నిసున్నలు న్నను విలువయుండదు. అదేవిధమున అద్వితీయుఁడై పఱగు బ్రహ్మము నంటియుండనంతవఱకును జీవునకు విలువయుం డదు. సమస్తమునకును బ్రహ్మముతోడి సంబంధముచేతనే విలువ ఘటిల్లుచున్నది.

164. అట్లే ఒకటినిబోలుబ్రహ్మమును అంటియుండి తన కర్మలన్నింటిని బ్రహ్మముకొఱకుగానె నిర్వహించుచుండు నంతవఱకును జీవుఁడు క్రమాభివృద్ధి గాంచుచుండును. అందుకు మాఱుగా యతఁడు బ్రహ్మమును నిర్లక్ష్యభావముతోఁజూచి, తానుగావించు కృత్యములనేకమును ఘనకార్యములుగ గణన చేయుచు, సర్వమును తనగణ్యతకొఱకే పఱగునట్లెంచు కొనెనా, అందువలన అతనికి ప్రయోజనముండజాలదు.

165. నారాయణుఁడే నరరూపమున లీలలుసలుపుచుండును. అతఁడు యింద్రజాలికుఁడు; జీవజగత్తులనెడు ఈవిచిత్రజాలమెల్ల వానిఇంద్రజాలమే. జాలకుఁడొక్కఁడే సత్యము. జాలము మిథ్య అగు గదా!

6వ అధ్యాయము.

# భగవంతుడు—భక్తులు.

—(o)—

166. జమీాందారుడు గొప్పధనికుడుగ నుండవచ్చును; కాని బీదరయితు అల్పపుకానుకలను తెచ్చి ప్రీతిపూర్వకముగ అర్పించినప్పుడు, వానిని ఆజమీాందారుడు మిగుల ఆనందముతో స్వీకరించును. అటులనే సర్వేశ్వరుడగు భగవంతుడు తాను మహిమాఢ్యుడును మహాశక్తిసమన్వితుడును అయిననుగూడ భక్తిపూర్వకముగ అర్పణచేయబడు అల్పపు కానుకలను సయితము మహానందముతోడను పూర్ణసంతృప్తితోడను స్వీకరించును.

167. దుమ్ములోపొర్లాడి ఒడలెల్ల బురదచేసికొనుట పసిబిడ్డకు సహజము. అయినను తల్లిఆబిడ్డను సదా అట్లే మలినముగ నుండనీయదు. పదేపదేకడుగుచుండును. అటులనే పాపకార్యములు చేయుచుండుట నరునికి సహజము. కాని ఆతడు పాపముచేయుట ఎంతనిశ్చయమో, అతనికి భగవంతుడు తరుణోపాయముల గూర్చుచుండుట ద్విగుణముగా నిశ్చయము.

168. చేపలతోచేయబడు పులుసు, కూర, మొదలగు వానిలో ప్రీతివాడును తనకు హితవగుదానిని కోరుకొనునట్లు తనభక్తుల కోరికలదీర్చునిమిత్తము ఒకేభగవంతుడు వేర్వేఱు రూపములు తాల్చుచుండగా, ఒకొ్కక భక్తుడును

తనకు హితవగురూపమును పూజించుచుండును. కొందఱికి దేవుడు స్వామి, కొందఱికి తండ్రి, కొందఱికి ప్రియమాత, కొందఱికి సఖుడు, కొందఱికి ప్రేమాంపుభర్త, మఱికొందఱికి అత్యంతవిధేయుడగు సుతుడుఅయి ప్రత్యక్షమగుచుండును.

169. దేవఋషులు భగవంతునకు సన్నిహితబంధుకోటి లోనివారనవచ్చును. వారు మిత్రులవంటివారు. భగవంతునికి చుట్టాలును, సహవాసగాండ్రునై యుందురు. తక్కిన సామాన్యప్రజలు దూరపుబంధువులవంటివారు. వీరు భగవంతుని పరిపాలనమునమాత్ర ముందురు.

170. నరునికి వానిసంకల్పముల ననుసరించియు, వాని యుద్దేశ్యముల ననుసరించియు ఫలము లభించుచుండును. భగవంతుడు కల్పవృక్షమువంటివాడు. భక్తులుకోరుకొనుదాని నెల్ల ప్రసాదించుచుండును. ఒక పేదవానికొడుకు చాలప్రయత్నించి ఉన్నతన్యాయస్థానమున ధర్మాధికారిపదవిని పొంది "అమ్మయ్యా! విచ్చిన మెట్లలో కొనదాని కెగబ్రాకితిని, మహానందము! ఇప్పుడు బాగున్నది" అని తలపోయును. అటువంటివానికి భగవంతుడు "ఎల్లప్పుడు ఆస్థితియందేయుండు" మని చెప్పును.

అయినను ఈ ఉన్నతన్యాయస్థానాధికారి ఉపకారవేతనముపొంది పని విడచినప్పుడు, గతజీవితమును విమర్శించుకొని, తనజీవనము వ్యర్థముగ గడచిపోయినటుల గ్రహించి యిట్లనును:— "అయ్యో! ఏమిచేసియుంటిని ?" వానితో భగవంతుడిట్లనును:—"అయ్యో! నీవేమిచేసితివి?"

171. సూర్యరశ్మి ఎచ్చోటపడినను ఒకేతీరుననుండును. అయినను నిర్మలముగనున్ననీరో, లేక అద్దమో, లేక మెఱుగు పెట్టిన లోహపురేకో, సూర్యబింబమును పూర్తిగ ప్రతిఫలింపజేయును. భగవంతుని దివ్యతేజము నిట్లేయగును. పక్షపాతము లేక అది సమానముగా అందఱి హృదయములమీఁదను ప్రసరించును. కాని సజ్జనుల యొక్కయు, సాధుపుంగవుల యొక్కయు నిర్మలనిష్కళంకహృదయములు మాత్రమే దానిని స్వీకరించి చక్కగా ప్రతిబింబింపజేయును.

172. భగవంతుఁడును, వానివాక్కులును, వానిభక్తులును, అంశలును ఒక్కటియే, అభిన్నము.

173. నిజముగ భక్తుఁడు భగవంతుని యెట్లుభావించును? బృందావన గోపికలు శ్రీకృష్ణుని జగన్నాథునిగా భావించక తమప్రియుఁడగు గోపికానాథునిగా చూచినవిధమున భక్తుఁడు భగవంతుని తనకొక దగ్గఱచుట్టముగా చూచుకొనును.

174. నరునిఆత్మ భగవంతునితోఁడ సంపూర్ణముగ ఐక్యసంధానమును పడయుటసాధ్యమే. అటుల పొందినప్పుడే "ఆతఁడును నేను నొక్కటియే" (శివోఽహం) అని భావచేసి వచింపగల్గును. ఒకగృహమందలి వృద్ధసేవకుఁడు కాలక్రమమున ఆయింటివారిలో నొకఁడైపోవ, ఒకానొక దినమున యజమానియే, వానిపనిని మిగుల మెచ్చుకొనినవాఁడై తాను కూర్చుండు గౌరవస్థానమున కూర్చుండబెట్టి, చుట్టునున్నవారితో ఆదినమునుండి తనకును ఆసేవకునికిని భేదము లేదని చెప్పవచ్చును. యజమానుఁడు "ఇతఁడును నేనును ఒక్క-

టియే. నాయెడల మీరు విధేయులై వర్తించుచుంటిరేని నేను యెడల వర్తింపుదు. అటులచేయనివారికి శిక్షపడుదురు” అనవచ్చును. ఇట్టి నూతనగౌరవమునుగూర్చి తలపోయుచు, ఆ సేవకుఁడు నమ్రుడై వెనుకాడినను కూడ, యజమానుఁడే బలవంతముగ వానిని ఉత్తమాసనమున కూర్చుండబెట్టును. చిరకాలము భగవత్సేవచేసి, వానితోడి ఐక్యసంధానమును పడసిన ఆత్మలదశ యిట్లుండును. భగవంతుడు తనమహిమను, విభూతులను వారియందుంచి, విశ్వాధిపత్యమును సూచించు తనసింహాసనమున వారిని కూర్చుండబెట్టును.

175. భగవద్భక్తుఁడు భగవంతుని తల్లీ! అని పిలుచుచు ఆనందపరవశుఁడగుటకు కారణమేమి? చంటిబిడ్డ ఇతరుల దగ్గఱకంటె యెక్కువచనువుతో తల్లికడ మెలగును. అందువలన ఆబిడ్డకు అంతటిలో తల్లిమీద మక్కువహెచ్చు.

## 7వ అధ్యాయము.

# గురువు.

176. ఎవరికియెవరుగురువు? భగవంతుడొక్కడుమాత్రమే దారిచూపగలవాడు. అతడే జగద్గురువు.

177. తనగురువును మనుష్యమాత్రునిగ ఎంచునతడు ధ్యాననిష్ఠలవలన ఏమిఫలమును పొందగలడు? మన గురువులను మనుష్యమాత్రులనుగ ఎన్నతగదు. శిష్యునకు భగవత్సాక్షాత్కారమగుటకు పూర్వము, బ్రహ్మజ్ఞానోదయకాలమున గురువుమొదట దర్శనమిచ్చును. పిమ్మట విచిత్రముగా తానే భగవత్స్వరూపము దాల్చి, శిష్యునకు భగవత్సాక్షాత్కారమును ప్రసాదించును. అప్పుడు గురువును, దైవమును, అభేదమని శిష్యుడుగ్రహించును. శిష్యుడుకోరు వరములనెల్ల ఈశ్వరరూపమునుదాల్చిన గురువే వానికొసగును. ఇంతేల, గురువే పరమానందపదవియగు నిర్వాణమునకు సయితము వానినిచేర్చును. లేదా భగవంతుడు ధ్యేయమూర్తిగాను తాను ధ్యాతగను భావస్ఫురణను నిలుపుకొనగోరు నరుడు అట్టిద్వైతభావముతోడను ఉండచ్చును. అతడు దేనినికోరుకొనినను గురువుదానిని వానికి ప్రసాదింపగలడు.

178. శిష్యుడు గురువును యెన్నడును ఆక్షేపణచేయతగదు. గురువు ఎట్టినియమముచేసినను శిష్యుడు సంసిద్ధముగ విధేయుడై నిర్వహించవలయును. వంగబాషలో ప్రతీకముగ

నిట్లుచెప్పుదురు:— “నాగురుడు కల్లుకాటములకు పోవుగాక. అయినను అతడు నాకు నిత్యానందప్రభువే.”

“నాగురువు త్రాగుబోతులయొక్కయు, పాపులయొక్క మూకల చేరుచుండుగాక, అయిననుగూడ ఆతడు నాకు వినిర్మల నిష్కళంక గురుమూర్తియే సుడీ?”

179. “గురువులు వందనలుగను వేలుగను దొరకగలరు; కాని శిష్యుడు ఒక్కడుదొరకుట దుర్లభము” అను సామెత కలదు. అనగా మంచినీతులు చెప్పువారు చాలమందికలరు; కాని వానిని ఆచరించువారు అరుదు అని దీనిభావము.

180. గురువు అను సంధానకర్త ప్రేయసీప్రియులను కూర్చు దూతవలె, గురువు నరుని భగవంతునితో చేర్చును.

181. ఒకడు తనగురువుయొక్క వర్తననుగురించి వివాదపడుచుండుటచూచి శ్రీపరమహంసులవారు యిట్లు మందలించిరి:— ఇట్టి వ్యర్థపువాదనలతో నీవేల కాలము వృథాచేయుచున్నావు? ముత్యమును తీసుకొని ముత్యపుచిప్పను పారవేయుము. నీకు గురువు ఉపదేశించిన మంత్రమును పునశ్చరణముచేయుము; ఆగురునిదోషములయొక్క విచారణను వదలివేయుము. పొమ్ము!

182. మనకు ఏదేని బోధించినవారినెల్ల గురువు లనుకొనకుండ, ప్రత్యేకము ఒకరిని గురువు అనిచెప్పుకొనుటకు అవసరమేమి? నీవు పరదేశమునకు పోవునప్పుడు దారితెలిసిన ఒకమార్గదర్శిని నమ్ముకొనవలయును. అటులగాక అనేకుల సలహాలను అనుసరించితివా గందరగోళమున చిక్కిపోవు

రువు. అట్టులనే బ్రహ్మమును చేరగోరుదువేని, బ్రహ్మవేది అగు ఒక్కగురుని బోధనే నమ్ముకొని పూర్ణముగ విధేయుడవై నడువవలయును.

183. గాఢమగు ధ్యానము, నిశ్చలవిశ్వాసము తీవ్రవేదనముకలిగి బ్రహ్మమును చేరబోవునతనికి గురువు అవసరము లేదు. కాని అటువంటి తీవ్రహృదయావేదన కల్గుట చాల అరిది. కావున గురువుయుండుట అవసరము. గురువు ఒక్కడుగనే యుండవలెను; ఉపగురువులు పెక్కండ్రు ఉండిన యుండవచ్చును. మనము ఎవనియొద్ద యేమినేర్చినను ఆతడు యుపగురువు అనబడును. అవధూతస్వాములవారికి యిరువది నల్గురు గురువులుండిరట.

184. అవధూతస్వాములవారొకసారి డోళ్ళు, సన్నాయి, బాకాలు మొదలగు వాద్యవిశేషములతో పెండ్లివారు ఒక డొంకత్రోవనుపోవుట గాంచిరి. ఆఉత్సవము పోవుచున్న డొంకకు చేరువనే పొంచియుండి యొకపక్షిపై గురిపెట్టుచు, ఆవాద్యఘోషను లక్ష్యపెట్టక, ఒక్కసారియైనను వారివైపు కన్నుత్రిప్పక తదేకదృష్టి నిలిపియున్న బోయవానిని చూచినారు. అవధూతలవారు వానిని సమీపించి చేతులు జోడించిమ్రొక్కి "అయ్యా, మీరు నాకు గురువులు, నేను ధ్యానములో కూర్చుండుసమయమున, మీమనస్సు ఆపిట్టపైన ఏకాగ్రమైనవడువున, నామనస్సు ధ్యేయమూర్తిపైని ఏకాగ్రమైనిలుచునట్లు చేయుడు" అనిరి.

185. ఒకడు చెఱువులో గాలమువేసి చేపలుపట్టుచుం డెను. అవధూతలవారు వానిదగ్గఱకుపోయి "అన్నా! కాశికి త్రోవయేది?" అని యడిగిరి. నీటిపైని కెంపు అప్పుడే చేప యొకటి ఎఱను పట్టబోవునట్లు సూచన తెలుపుచుండెను. కాబట్టి ఆమనుష్యుడు మారుపలుకక తదేకదృష్టిలో నుండి పోయెను. చేప గాలమునకు తగుల్కొనినపిమ్మట యతడు వెనుకకుతిరిగి "అయ్యా, మీరడుగుచుండినదియేమి?" అని విచారించినాడు. అవధూతలవారు వానికి నమస్కారముచేసి "అయ్యా మీరు నాకు గురువులు. నేను పరమాత్మధ్యానము చేయుచు కూర్చుండుసమయమున, నేనుమీపోల్కిని అనుస రించి నాధ్యానము ముగియువఱకును, యితరమును లక్షించ కుండునటుల చేయుడు." అని వేడిరి.

186. కొంగఒకటి నెమ్మదిగా నీటికడకునడచుచు చేపను పట్టబోవుచుండెను. దానివెనుకనే బోయవాడు కొంగపైని గుఱిపెట్టి బాణమువేయజూచుచున్నాడు. కొంగకు ఆస్పృహ యే లేదు. అవధూతులవారా కొంగకు మొక్కి "నేను ధ్యానమున కూర్చుండుసమయమున నీవలెవర్తించి నావెనుక యెవరుండిరో యేమిజరుగుచుండెనో అని తిరిగి చూడకుందును గాక." అని పలికిరి.

187. గ్రద్ద ఒకటి ముక్కున చేపనుకఱచుకొని యెగిరి పోవుచుండెను. అనేకములగు కాకులును, ఇంక గ్రద్దలును, గీపెట్టుచు దానివెంటబడి, ముక్కులతో పొడుచుచు, ఆచేపను లాగికొన ప్రయత్నించుచున్నవి. అది యేదిశకుపోయినను కాకు

లును, గ్రద్దలును, వెంటాడుచునేయున్నవి. విసిగెత్తిపోవ, ఆ గ్రద్ద తనముక్కునయున్నచేపను విడచివేసినది. వెంటనే యింకొకగ్రద్ద దానిని ముక్కునకఱచుకొనినది. తక్షణమే కాకులును, గ్రద్దలును అప్పుడు చేపనుకఱచుకొనిన గ్రద్దవైపుతిరిగి దానిని వెంటాడసాగినవి. మొదటిగ్రద్ద ఏబాధయు లేకుండ ఒక చెట్టుకొమ్మమీదచేరి శాంతముగ కూర్చున్నది. అదినిశ్చలముగను శాంతముగను కూర్చుండుటను కాంచి అవధూతలవారు దానికి నమస్కరించి "నీవు నాకు గురువు. 'ఓగృధ్రరాజమా! మానవుడు తానుపూనుకొను సంసారకాంక్షలభారమును ఎంతకాలమువిడువడో అంతకాలమును ఆతడు సంసారబాధలనుండి తప్పించుకొని నెమ్మదిని పొందజాలడని నాకు బోధించితివి సుమీ! అనిరి.

188. ఈశ్వరరహస్యములను తెలిసికొను తీవ్రవేదన నీకు కలిగినయెడల, ఆయనయే నీకడకు సద్గురువును పంపగలడు. ఓభక్తవరా! గురువును వెదకికొనుటకై నీవుశ్రమపడుట అవసరముండదు.

189. శ్రీగంగానదిలో మురికినీళ్లను, పెంటలను,అన్నింటిని పడవేయుచున్నారు. కాని దాని పవిత్రత తగ్గిపోవుటలేదు. గురువు గంగాభవానివంటివాడు. దూషణములు తిరస్కారములు వానిని అంటజాలవు.

190. గురునిందవాక్యములను నీవు వినబోకుము. అతడు నీజనకునికంటెను, జననికంటెను, ఉత్తముడు. నీయెదురుగా నీతల్లిని, నీతండ్రిని తిట్టినచో నీవు ఊరకుందువా? అవసర

మగు నెడల దెబ్బలాడి యైనను నీగురువుయొక్క గౌరవమును సంరక్షించుము.

191. మానవరూపగురుడు చెవిలో మంత్రమును ఉచ్ఛరించును. శివరూపగురుడు నీహృదయమున ఆత్మప్రభోదమును కావించును.

ద్వి॥ మంత్రంబు చెవినూదు మానవగురుడు
ఆత్మలో ముద్రించు నలశివగురుడు.

192. సముద్రమున అడుగుననుండు ముత్తెపుచేప స్వాతి నక్షత్రము మింటనుండగాపడు వానచినుకును నోటపట్టుకొనుటకై పైకివచ్చునని కథచెప్పుదురు. అని చిప్పను తెఱచుకొని స్వాతిబిందువుకొఱకై నీటిమీద తేలుచుండునట. ఒకచుక్క నోటపడగానే నీటమునిగి అడుగునకుపోయి ఆవానచినుకును ముత్యముగా మార్చువఱకును అటనుండి కదలదండురు. అదేతీరున కొందఱు ముముక్షువులు* తమకొఱకై ముక్తి ద్వారముల తెఱచిపెట్టగల మంత్రవాక్యను ఉపదేశించగల సద్గురువుకొఱకై ఎల్లెడల సంచారములు చేయుచుందురు. అట్టి సద్గురువు లభించి మోక్షద్వారముల తెఱచు మహామంత్రమును ఉపదేశించునంతటి అదృష్టము పట్టినతోడనే, సంగమును వీడి హృదయ గుహాయందుచేరి,, నిత్యానంద ప్రాప్తి కలుగువఱకును అందే నిలిచియుందురు.

* మోక్షమునుగూర్చి వాంఛించువారు.

193. అటువంటి సద్గురువు పండితుడుగా కాన్పించకున్నను శాస్త్రగ్రంథములను పఠించినవాడు కాకున్నను, అలజడి చెందడు. ఆతనికి పుస్తకజ్ఞానమే లేకున్నను భీతినందడు. ఎన్నడును భయసంశయముల పొందడు. జీవనప్రజ్ఞానమున వానికి కొదువలేదు. పుస్తకములవలన లభించుజ్ఞానమును మించు సాక్షాత్కారమువలన లభించిన దివ్యజ్ఞానసంపద వానికడ అనంతముగా ఉండును సుమీ!

194. చదరంగపు ఆటను ఆడువారికికంటె చూచువారికి సరియైనఎత్తులు గోచరించుచుండును. సంసారులు తామెంతయు తెలివితేటలు కలవారమని తలంచుచుందురు. కాని ధనము, గౌరవము, యింద్రియసుఖములు మొదలగు లౌకికవిషయములందు చిక్కుకొనిపోదురు. ఆటలోప్రవేశించియున్నవారివలెను సరియైన ఎత్తునుగ్రహించనేలేరు. సంసారముల త్యజించినస్వాములు చిక్కులులేనివారు. చదరంగపుఆటను పైగా నుండి చూచువారిని పోలియుందురు. సంసారులకంటె విషయములను వీరు చక్కగా విచక్షణచేయగలరు. కావున నిజమౌ పుణ్యజీవనమును నడపజూచువారు, భగవధ్యానశీలురగునట్టియు బ్రహ్మవేదులగునట్టియు మహనీయులమాటలనే నమ్మికొనవలయును. నీకు వ్యాజ్యసంబంధమైనసలహా కావలసినప్పుడు ఆవృత్తి చేయు న్యాయవాదికడకేగదా పోవలయును! దారినిపోవు ఎవనిసలహానైనను సరియేయని నీవు గ్రహించతగదు గదా!

195. ప్రకృతిశాస్త్రము ఖండజ్ఞానమును మాత్రమే ఒసగగలదని ప్రజలు గ్రహించలేకున్నారు. అఖండరాజ్యమునుండి దానిద్వారమున సందేశము లభింపజాలదు. అటువంటిసందేశమును పురాణఋషిసత్తములవంటి బ్రహ్మద్రష్టలు మాత్రమే తేగల్గినారు. "భగవల్లక్షణములు యిటువంటివి" అని పలుకుటకు వారికి మాత్రమే అధికారము కలదు.

—:o:—

# ৪వ అ ధ్యా య ము.

## మ త బో ధ కు లు.

—(o)—

196. ఓమతభోధకుడా ! నీకడ అధికారచిహ్నముకలదా? రాజుచేత అధికారమునుపొందిన అల్పసేవకునిమాట సయితము ప్రజలు భయభక్తులతో మన్నింతురు. తన డవాలు బిళ్ళనుచూపి యెట్టిఅల్లరినైనను యతడు మాన్పగలడు. అటులనే ప్రసంగీకుడవైన నీవును మొట్టమొదట భగవదుద్బోధమను అధికారమును సంపాదించుకొనుము. ఈశ్వరాదేశచిహ్నము నీకడ లేనంతవఱకును. ఉపన్యాసములందు నీప్రాణమునంతను వ్యయముకావింతువుగాక, సర్వమును వ్యర్థమేఅగును సుమీ !

197. పుష్పము వికసించి దాని సువాసన గాలిలో ప్రసరించునప్పుడు తేనెటీగ తనంతటతానె వచ్చును. బెల్లమున్నచోటికి చీమలు తమంతటతామెవచ్చిచేరును. ఆతేనెటీగను చీమను యెవరును పిలువనక్కఱలేదు. అటులనే ఒకపురుషుడు పవిత్రవంతుడును పరిపూర్ణుడును అయినప్పుడు వాని జీవితమహిమ యెల్లదిశలకు వ్యాపించును. బ్రహ్మదర్శనము నకై వెదకులాడువారెల్ల సహజముగనే వానిచేంత ఆకర్షించబడుదురు. తనమాటనెవరు విందురాయని దేవులాడుచు యట్టివాడు అక్కడయిక్కడ తిరుగులాడ నక్కఱయుండదు.

198. అనేకులు మంచుగడ్డనుగుఱించి వినియుందురు; కాని చూచియుండరు. అటులనే చాలామంది మతబోధకులు

భగవంతుని విభూతులనుగురించి పుస్తకములందు చదివియుం
దురుగాని, తమ జీవితములలో ప్రత్యక్షానుభవమును పొంది
యుండరు. మఱియు మంచుగడ్డనుచూచినవారిలో అనేకులు
దానిని రుచిచూచియుండనితీరున భగవన్మహిమలను లీలగా
తెలిసికొనిన వారనేకులు, వానితత్త్వమును సరిగా గ్రహించి
యుండరు. మంచును రుచిచూచినవాడే అదెట్టిదైనది చెప్ప
గలడు. అటులనే ఒకప్పుడు సేవకుడుగను, మఱొకప్పుడు
సఖుడుగను, వేఱొకప్పుడు ప్రియుడుగను వివిధములుగా
భగవద్విభూతులను వానితోడి సంసర్గముచేత గ్రహించిన
వాడుమాత్రమే వానినన్నింటిని వర్ణించగలడు.

199. మేడకప్పులపైనపడు వాననీరు, అందు పులితలల
ఆకారమున అమర్చబడియున్నగొట్టముల ద్వారమునవచ్చు
నప్పుడు, పులులచేత క్రక్కబడునటుల కాన్పించినను, సత్యము
నకు అవి ఆకాశమునుండివచ్చు జలమే. అదేతీరున సాధు
జనుల నోటిగుండ వెలువడు సద్బోధలు వారిచే పలుకబడు
పలుకులుగ కాన్పించినను సత్యమునకు అవి భగవత్సాన్నిధ్యము
నుండి వెలువడివచ్చుసూక్తులే సుడీ!

200. ఈనాటిమతబోధకులు అవలంబించు పద్ధతిని గురించి
మీఅభిప్రాయమేమి? ఒక్కనికి సరిపోవువంటచేసి నూరు
మందిని భోజనమునకు పిలుచుతెరవునుండును. కొలదిపాటి
ఆత్మానుభవముతో మహాధర్మోపదేష్టలుగ నటించుచున్నారు.

201. సత్యమగు ఉపదేశము ఎటులుండును?
ఇతరులకు బోధలుచేయుటకంటే, నిరంతరము భగవ

త్సేవచేసిన చాలును; అదే బోధయై యిమిడించును. తనముక్తికై యెవడు సప్రయత్నుడగునో ఆతడు నిజముగా ఉపదేశికుడే. పలుదిక్కులనుంచి వందలకొలది జనము వచ్చి జీవన్ముక్తునికడ చేరుదురు; వానిఉపదేశమును వినుటకై ఆతురపడుచుందురు. రోజాపువ్వు విప్పుకొనగానే ఆహ్వానములు పిలుపులు ఏమియు లేకుండనే తేనెటీగలు అన్నివైపులనుండియు వచ్చి మూగ గలవు.

202. స్మశానవాటియందు మృతకళేబరము నిశ్శబ్దముగను నిశ్చలముగను పడియుండును. రాబందులును, గ్రిద్దలును అనేకము తమంతటతామే వచ్చిచేరును. వానిని పిలుచుకొని వచ్చుటకు యెవరును పోనక్కరలేదు.

203. మంటమండుచున్నను పురుగులు ఎగురుచువచ్చి దానిలోపడిపోవును. అవెక్కడినుండివచ్చునో ఎవరికిని తెలియదు. పురుగులను పిలుచుటకై నిప్పు తిరుగులాడదు. మహాత్ములబోధయు యిట్లుజరుగును. వారుపోయి వారిని వీరిని పిలుచుకొనిరారు. వందలకొలదిగ ప్రజలు వారికడకువత్తురు. ఎక్కడినుండియో తెలియదు. వారు తమంత తామేవచ్చి ప్రబోధమును కోరుచుందురు.

204. మిఠాయిరాలిన చోటునకు చీమలు తమంతతామె గుమిగూడును. పరమార్థతత్వమను మిఠాయిగా మీరు మారుడు; భక్తులను చీమలు తమంతట తామె వత్తురు. భగవంతుని ఆదేశములేకుండ నీవు బోధలు సాగించితివా అవి నిస్సారముగనుండును; ఎవరును వినరారు. భక్తిద్వారమునగాని, మహే

మార్గమునగాని బ్రహ్మసాక్షాత్కారమును పొంది, ఈశ్వ రాజ్ఞను సంపాదించుకొనిన పిమ్మట ఎవరైనను ఎక్కడనైనను బోధలు కావింపవచ్చును. ఉపదేశములు చేయవచ్చును. భగవంతుని మహిమను ప్రాపును పొందుటకు అదొక్కటే మార్గము. అటుపిమ్మట మాత్రమే ఎవనికైనను ఉపదేశకుని ధర్మమును చక్కగ నిర్వహించుటకు తగినసమర్థత చేకూ రును.

205. సత్యజ్ఞాన ప్రకాశముచేత విలసితుడగు నతడు మాత్రమే సద్గురువు కాగలడు.

206. ఈప్రపంచము న రెండు తెరగుల మనుజులుందురు:- సిద్ధపురుషులు. వీరు సత్యమును సాధించినవారు. అన్యచింత లను అన్నింటినివిడిచి ఆత్మారాములైమౌనముతో నుందురు. మఱికొందఱు సత్యసిద్ధినిసాధించి ఆసత్యమును తమతో దాచి పెట్టుకొనిన ఆనందములేనివారై "రండు, రండు" మాతోడ చేరి బ్రహ్మానందమును అనుభవింప రండు! అని గొంతెత్తి కోలాహలము చేయుచుందురు.

207. నీటితోనిండినకడవ చప్పుడుచేయదు; అటులనే బ్రహ్మసాక్షాత్కారమునుపడసిన నరుడు అధికముగ మాట లాడడు. అట్లయిన నారదుడు మొదలగువారి విషయమేమి? నారదుడు శుకుడు మున్నగువారు సమాధిదశను పొందినయనం తరము, చాలమెట్లు దిగివచ్చి, దయార్ద్రహృదయులై, ప్రేమ మీఱ మానవకోటికి బోధసలిపిరి.

208. మున్ముందు భగవంతుని నీహృదయమనుకోవెల
యందు ప్రతిష్ఠించుము; మొదటవానిని ప్రత్యక్షము చేసికొ
నుము. బ్రహ్మసాక్షాత్కారమైన అనంతరము ప్రవచనములు,
ఉపన్యాసములు మొదలగువానికి కడంగవచ్చును. అంతవఱ
కును వలదు. ప్రాపంచికవిషయములకు బద్ధులైయుండియు
కొందఱు దేవుడని బ్రహ్మమని ఏమేమో గొడవగ పలుకు
చుందురు. అందువలన ఫలమేముండును? కోవెలలో పూజ
చేయుటకు దేవుడులేనిదే పూజలకురమ్మని ఊరక శంఖము
లూదినట్లుండును.

209. ఒకగ్రామమున పద్మలోచనుడను బాలుండెడి
వాడు. ఆయూరివారందఱును వానిని పదయ్యా అని పిలిచెడు
వారు. ఆపల్లెలో పాడుపడినప్రాతగుడిఒకటి యున్నది. దాని
లోపల దేవతావిగ్రహముకూడ లేదు. గుడినిండచెట్లు చేమలు
మొలచినవి. అదిగుడ్లగూబలకును, గబ్బిలములకును కాపురమై
పోయినది. ఒకనాటిసాయంతనము హఠాత్తుగా ఆపాడు
పడినగుడిలోనుండి జేగంటమ్రోతలు, శంఖధ్వనులు వినవచ్చి
నవి. పురుషులు స్త్రీలు బిడ్డలు పరుగుపరుగున అచ్చోటికి
పోయిరి. ఎవరోభక్తుడుదానిలో దేవతావిగ్రహమునుప్రతిష్ఠించి
నాడు. హారతియివ్వబోవుచున్నాడు అనితలంచి ఉత్సాహ
ముతోనుండిరి. వారందఱును చేతులుజోడించుకొని ఆపవిత్ర
ధ్వానములవినుచు దేవతనుచూచుటకై ఆతురతతో గుడి
యెదుటనిలుచుండిరి. వారిలోఒకడుసాహసించిలోనఏమిజరుగు
చున్నదో తెలిసికొననెంచితలుపుసందుగాచూచినాడు, ఆగుడి

లోపల పద్దయ్య జేగంటవాయించుచు శంఖమునూదుచుండుట చూచి ఆశ్చర్యపడిపోయినాడు. గుడిలోనేలంతయు పెంట లతో అసహ్యముగనున్నది. పూజకు దేవతావిగ్రహమూ లేదు. అంతట "ఓపద్దయ్యా! గుడిలో మహాదేవునివిగ్రహమూ లేదు. గుడినిశుభ్రముచేసి పెంటతొలగించుపాటి శ్రమనైననుతీసికొ నకపోతివి. ఏకాదశదివాంధములు యందుచేరిదివారాత్రిములు కీచులుపెట్టుచుండును. అక్కట, వ్యర్థముగాశంఖమునూది యింతఅలజడికావించితివేమిలకు?" అనిఅతడు కేకలుపెట్టినాడు

కావున నీహృదయాంతరాళమున దేవతామూర్తిని ప్రతిష్ఠించకోరితివేని, భగవత్సాక్షాత్కారము కావలయునను కోరిక నీకుకలదేని, ఊరకశంఖారావములుచేసిన ఫలమేమి? మొదట నీహృదయమును శుద్ధముచేయుము. హృదయము నిర్మలమైనతోడనే ఈశ్వరుడు తనంతనేవచ్చి అందునిలుచును. దేవతా విగ్రహమును ఆశుద్ధస్థలమున నిలుపవీలుండదు. అయిదు జ్ఞానేంద్రియములును, అయిదుకర్మేంద్రియములును మనస్సునే పైనిపేర్కొనిన ఏకాదశదివాంధములు.

మొట్టమొదలుగా నీఆత్మలో లోతుగమునిగి, అందు గల రత్నములనైకైకొనుము. తక్కినవి పిమ్మటచూచుకొనవ గును. మహాదేవుని ముందు నీహృదయమున నెలకొల్పుము. ఆపిమ్మట ఉపన్యాసములను. ఉపదేశములనుచేయుటకు నీకు కావలసినంత అవకాశముదొరకగలదు.

210. భక్తిసాగరమున లోతుగమునుగుటకు ఎవనికినిశాం తముగాని అభిలాషగాని యుండదు. వైరాగ్యమును, వివేక

మును సంపాదించుకొనుటకుగాని భక్తిసాధనలచేయుటకుగాని ఎవరును శ్రద్ధవహించరు. జేబులోనిపుస్తకమును ఒకింతచదివి నంతటనే ఉపన్యాసములనిచ్చుటకును, ఉపదేశములచేయుటకును ఎల్లరుపరుగులిడుచుందురు. ఎంతవిడ్డూర్యము! యితరులకు బోధచేయుటనగా పనులలోనెల్ల అత్యంతకష్టసాధ్యమగు పని. భగవత్సాక్షాత్కారమునుపొంది వాని ఆదేశమును పడసిన యతడు మాత్రమే బోధలుచేయగలడు.

211. ఆవిరిదీపాలకాంతులు ఆయాస్థలములందు వేర్వేఱుగా ప్రకాశించుచుండును. అయినను ఆదీపాల ప్రాణము అనగా ఆవిరి ఒకేగొట్టమునుండివచ్చును. అటులనే ఒక్కసర్వేశ్వరుని వలననే నిరంతరముగా ఆత్మజీవనప్రసారణము యేకసరణిని సాగుచున్నను వేర్వేఱుదీపములవలె, ఆయాదేశకాలములందలి బోధకులు ప్రకాశించుట పొసగును.

212. గొప్పసంపన్నుని ధాన్యాగారమునుండి కొనుగోలు వారికి ధాన్యమునుకొలుచువాని వెనుకనుండి తెంపులేకుండ ధాన్యమువచ్చిపడుచునేయుండును. చిల్లరబేరగానిరాశి వేగిరముగ శూన్యమైచనును. అదేతీరున భగవద్భక్తునిహృదయమునందు సత్సంకల్పములును, సద్బోధలును, భగవంతునిచేతనే సమకూర్చబడుచుండును. అందువలన నూతనములును, జ్ఞానప్రదములును అగుభావములకు కొదువయుండదు. పుస్తకజ్ఞానమునునమ్ముకొనువారుచిన్నబేరగానిబోలువారు. సంకల్పములు భావములు ఎప్పటికప్పుడు వారికి కొఱతపడుచునేయుండును.

213. ఒకదినమున పంచవటిదాపుగా పోవుచుండ కప్ప యొకటి భీకరముగా అఱచుచుండుట వినవచ్చినది. దానిని పాము పట్టుకొనియుండునని యూహించితిని. చాలసేపటికి నేను తిరిగివచ్చునప్పుడును ఆకూతవినబడుచునేయుండెను. పొదలలో గుండ చూచితిని. ఒకబురదపాము కప్పను నోటితో పట్టుకొని యున్నది. దానిని అది మ్రింగనూలేదు; విడచివేయనూలేదు. పాపము ఆకప్పకు బాధనివృత్తి కాదు. ఆకప్పవిషముగల నాగుబాము నోట పడినయడల ఒకటిరెండు కూతలతో దాని పని ముగించియుండునుగదా యని తలంచితిని. కాని యిప్పుడు పాముయొక్క బాధయు కప్పయొక్క బాధయు సమానమే.

అటులనే జ్ఞానశూన్యుడు అహంకరించి యింకొకని తరింపజేయుటకు బాధ్యతపూనినయెడల యిద్దఱిదుఃఖముల కును అంతముండదు. శిష్యుని అహంకారముగాని వానిసంసార బాధలుగాని తుదముట్టవు. అసమర్థుని దఱిచేరిన శిష్యుడు ఎన్నడును తరింపజాలడు. కాని సమర్థుడగు గురువు నాశ్రయించినజీవుని అహంకారము మూడునాళ్లు బెకబెకలు పెట్టగానె తుదముట్టును.

214. వైద్యులలో మూడురకాలవారున్నటుల, గురువులలో కూడ మూడురకాలవారు కలరు. ఒకరకపువైద్యులు పిలువగానెవచ్చి రోగినిచూతురు; నాడి పరీక్షింతురు; మందు నిర్ణయించి పుచ్చుకొమ్మందురు. రోగి నిరాకరించెనా వాని గొడవ విడిచివెడలిపోవుదురు. ఇంక ఏలాటిజోక్యమును పెట్టు

పోదురు. వట్టి వైద్యులు అధములు. ఇటులనే కొందరు మత గురువులు తమబోధలు మన్ననపొంది ఆచరింపబడుచున్నది లేనిది విచారించరు. రెండవరకపు వైద్యులు రోగినిమందు వేసికొనుమనిచెప్పుటతో విడువరు. రోగినిరాకరించినప్పుడువానితో వాదించి బుజ్జగింతురు. అదేవిధమున ప్రజలను సన్మార్గమున భగవద్భక్తిగలిగి సత్యాన్వేషణపరాయణతో వర్తింపజేయుటకు కొందరుగురువులు సకలకష్టములనుపడుదురు. వీరుకొంచెము పైతరగతిబోధకులు. మూడవతరగతి వైద్యులు, మహాత్ములుందురు. రోగి బుజ్జగింపులకు లొంగనియెడల బలవంతపెట్టుదురు. రోగిరొమ్మున మోకాలుపెట్టి అదిమిపట్టి గొంతులోమందు వేసిమ్రింగింతురు కూడను. ఇట్లేకొందరుగురువులు, అవసరముకలిగెనేని, శిష్యులను నిర్బంధించి ధర్మపథమున నడిపింతురు. వీరు పరమోత్తములు.

215. సుప్రసిద్ధోపన్యాసకుడు ఒకడు హరిసభయందొకనాడు ఉపన్యసింపదొడగెను. ఉపన్యాసమధ్యమున "భగవంతుడు బొత్తుగ రసహీనుడు. మనస్వాభావమునుండి కొంత మాధుర్యమును వానికి అప్పగాయిచ్చెదముగాక." అనిచెప్పినాడు. రసము అనగా ప్రేమమొదలగు దివ్యలక్షణములని వానిభావము. వానిపలుకులు ఆలకించినప్పుడు నాకొకబాలుని విషయము జ్ఞప్తికివచ్చినది. అతడుతన మేనమామగారిగోశాల నిండ గుఱ్ఱములున్నవని చెప్పినాడు. గోశాలలు గుఱ్ఱాల కొఱకై కట్టునవికావని కొంచెము తెలివిగలవారికి తెలిసిన విషయమే. ఆపిల్లవానిమాటలు అబద్ధములనియు, వానికి

గుర్రాలవిషయము ఏమియు తెలియదని వారు గ్రహించిరి.

భగవంతుడు రసస్వరూపుడు అనుట నిజమగుమాట. ఆ ఉపన్యాసకునికి తాను చెప్పెడివాక్కులయర్థము బొత్తిగ తెలియదు. అనంతమగు ప్రేమ, జ్ఞానము, ఆనందములకు, అఖండనిధియగు పరమేశ్వరునిగూర్చి అతడు యించుకంతయు తెలిసికొనియున్న వాడుకాడు.

216. ఇంకొకడు మతబోధను వృత్తిగా పెట్టుకొనిన నాయకుడు. ఆతడు బోధలు చేయునప్పుడు, శ్రోతలందు గాఢమగు భక్తిభావములను రేకెత్తునటుల చేయగలిగినవాడు. కాని యతడుమాత్రము నీచప్రవర్తనగలవాడు. వాని నడవడికను చూచి నొచ్చుకొని, అంతమందిహృదయములలో భక్తిబీజములనాటుచును, తానుకలుషజీవనమును గడుపుటయేలనని నేనతనిని ప్రశ్నించితిని. అతడుతలవంచుకొని "అయ్యా, చీపురు తానెంత మురికిలోనున్నను, నేలమీదను, వీధులందును, కల్మషము లేకుండశుభ్రపఱచగలదు." అనెను. ఇంక నేనేమియు ప్రతివచనము పలుకలేనైతిని.

9వ అ ధ్యా య ము.

# మ త ము - పు స్త క జ్ఞా న ము

—:o:—

217. భగవద్భక్తి, పుస్తకములను చదువుటవలన లభించునా? పంచాంగములో ఒకానొకదినమున యిరువదిదుక్కుల వాన కురియునని వ్రాయబడియున్నది. ఆపంచాంగమును మెలివేశి పిండుటవలన ఒక్కచుక్క అయినను రాదు గదా! అటులనే సద్వాక్యములు అనేకములు శాస్త్రగ్రంథములందు కలవు. వానినిచదువుటవలన ఎవరునుసద్ధర్ములుగాకాజాలరు. ఆపుస్తకమున వర్ణింపబడిన ధర్మములను అనుచరించినగాని ఎవరికిని భగవద్భక్తి అలవడదు.

218. గీత - గీత - గీత - గీత గీత - అని వేవేగముగ గీత అను శబ్దమును ఉచ్చరింపుము. అట్లుఉచ్చరింపబడిన శబ్దము కొంతసేపటికి త్యాగి - త్యాగి అని మారును. అనగా విడిచివేసినవాడు, విరాగి అని అర్థమగును; గీతయొక్కబోధ యంతయు ఒక్కమాటలోయున్నది. "త్యాగముచేయుడు! ఓజనులారా! సకలమును త్యాగముచేసి, మీహృదయము లను భగవంతునిపైని హత్తించుడు." ఇదియే గీతాసారము;

219. ఒకడు ఓదేవా! ఓదేవా! అల్లాహో! అల్లాహో అని అఱచుచుండునంతకాలమును, వానికి భగవంతుని దర్శనము కాలేదనుట నిశ్చయము; ఈశ్వరుని దర్శించినవాడు మౌనమువహించి శాంతముగ నుండును.

220. ఇరువురుమిత్రులు ఒకతోటలోనికి పోయిరి. లౌకిక జ్ఞానవంతుడగు మిత్రుడు తక్షణమే అందున్న మామిడిచెట్లను లెక్కవేయుటకు మొదలుపెట్టెను. చెట్టునకు ఎన్నెన్నికాయ లుండునో, తోటమొత్తముమీద ఆదాయము ఎంతరాగలదో గణితమువేయసాగెను. వానిమిత్రుడు తోటకాపరికడకు పోయి వానితో స్నేహముచేసికొని నెమ్మదిగ ఒక్కచెట్టును సమీపించివాడు. ఆకాపరి అనుజ్ఞతో పండ్లనుకోసి తినగలిగి నన్ని తిన్నాడు. ఈయిరువురిలో బుద్ధిశాలి ఎవడు? మామిడి పండ్లుతినుము! నీఆకలితీరును. చెట్లను ఆకులను లెక్కించి గణిత ములు వేయుటవలన లాభము ఏముండును? వ్యర్థాడంబరము చేయు పండితుడు ఈ సృష్టియొక్క కారణమును మూల మును తెలిసికొను ప్రయత్నములో వృథాగా మునిగియుం డును. జ్ఞానముచే నమ్రుడగునతడు సృష్టికర్తతోడి నెయ్య మునుసాధించి, వానిప్రసాదమున లభించు బ్రహ్మానందమును అనుభవించగలుగును.

221. శాస్త్రములుచదివినంతమాత్రమున భగవల్లీలలను వివరించబూనుట, కాశీనగరపు పటమును, మాత్రము చూచి కాశీనగర విశేషములను అభివర్ణించి చెప్పబూనుటవంటిదే.

222. "స రి గ మ ప ధ ని" అని ఊరక నోటితోఅనుట తేలికయే. ఆస్వరములనుపీణెమీద పలికించుటకడుదుస్తరము. అటులనే ధర్మమునుగురించి మాటలాడుట తేలికయే; వానిని జీవితమున ఆచరించుట దుర్లభము.

223. తేనెటీగ పూరెబ్బలలోనికిపోజక అందలి తేనెను రుచిచూడనంతవఱకును, అదిపూవునుచుట్టిచుట్టి మెగుఱుచు

ఝంకారము చేయుచుండును. అది పుష్పములోపల దూఱి తేనెను త్రాగుచున్నప్పుడు చప్పుడుచేయదు. ఎంతవఱకు నరుడు శాస్త్రవిధులను, నియమములను గురించి వివాదములుసాగించుచుండునో అంతవఱకును వానికి సత్యమగుభక్తి అలవడదు. వానికి వానిరుచి తెలిసినతోడనే అతడు వాచాలతలేక శాంతిని వహించును.

224. సంతకు దూరముగానున్నప్పుడు పెద్దగోలగా శబ్దము వినవచ్చును. సంతలో ప్రవేశించగానే ఆశబ్దము వినరాదు. అచ్చటజరుగుచుండు బేరసారములు తెలియవచ్చును. అటులనే భగవంతునికి దూరముగానున్నవానిని వ్యర్థపు వాగ్వాదములు ముంచివేయును. ఆతడు భగవంతునిదగ్గఱకు చేరినంతనే యుక్తులు, ప్రయుక్తులు, వాగ్వాదములు అన్నియు పోయి విస్పష్టముగా కండ్లకుగట్టినటుల భగవల్లీలలు తెలిసిపోవును

225. కాగుచున్న నేతిలో పచ్చిగారెను పడవేయగానే పెద్దధ్వనిపుట్టును. అది పచనమైనకొలదిని ధ్వనితగ్గును. బాగుగపచనమైనప్పుడు పొంగులు సమయును. మనుజుడు అల్పజ్ఞానిగనున్నంతకాలము ప్రసంగములు చేయుచు ఉపన్యాసములిచ్చుచుండును. బ్రహ్మజ్ఞానసిద్ధి అలవడగానె వ్యర్థపు ఆడంబరములను పూర్తిగవిడచివేయును.

226. ఎవడు ఆత్మబోధములేక మంచి మాటకారియై బాగుగ బోధలుచేయగలడో వానింగూర్చి మీ అభిప్రాయమేమి? ఆతడు తనదాపునదాచిన యితరుల ఆస్తిని దుర్వ్య

యముచేయువానివోలెను. అతడు పలుకు పలుకులు వానివి గాక యెవరిచ్చుకొనినవిగాక తనకు నష్టములేదని యెంతగానైనను యితరులకు సలహాలను విడివిగా చెప్పగలవాడై యుండును.

227. చిలుక చాలకాలము "రాధాకృష్ణ! రాధాకృష్ణా!" అనుచుండును. కాని దానిని పిల్లిపట్టునప్పుడు కెక కెకలాడును. అప్పుడు దానికి నైజమగు వాక్కు బయలుపడును. లోకవ్యవహారదక్షులు లౌకికఫలములను పడయుటకై కొంత హరినామస్మరణ చేయుట, క్రతువులు దానధర్మములు సాగించుట కలదు, కాని ఏయిక్కట్టులో, బాధలో, దుఃఖమో, దారిద్ర్యమో, మరణమో, వాటిల్లగానె హరినామస్మరణ మఱతురు; నిష్ఠలన్నియు మూలబడిపోవును.

229, గంజాయి, గంజాయి అని వేయిమారులు అఱచినను నిషా యెక్కదు. గంజాయిని తెచ్చి, నీళ్ళలో నూరి, రసము తీసి, తేర్చి త్రాగుము. వెంటనే నిషాకలిగి పడిపోదువు. అటులనే "హరా! హరా!" యని అఱచుటవలన లాభము లేదు. శ్రద్ధతో భక్తిసాధనలను కావించినగాని ఈశ్వరదర్శనము కాజాలదు.

229. పామరజనులు ధర్మవాక్యములతో సంచులు నింపివేతురు. కాని అందు ఒక్కగింజంతయైనను ఆచరణయుండదు. సుజ్ఞానియో వానియావజ్జీవము ధర్మాచరణమే అయినను వానికడ వాచాలతయుండదు.

230. పరిజ్ఞానమయి అగు నాజననికడనుండి ఒక్కకిరణ ప్రసారణము చాలును, మహాపండితాగ్రేసరునిఅయినను పడగొట్టివానపాములీల శుష్కీభూతుని చేసివేయగలదు.

231. దేనిసహాయమున మనము బ్రహ్మమును తెలియుదుమో, అదియే పరావిద్య. తక్కినదంతయు – కేవలశాస్త్రములు, తత్వసిద్ధాంతములు, తర్కము, వ్యాకరణము మున్నగువానిరాశియంతయు – మనస్సునభారమై పేరుకొని కలవరమునకు కారణమగును. గ్రంథములన్నియు గ్రంథులవంటివి. (చిక్కులముడులు). పరావిద్యకు దారిచూపినప్పుడే వానివలన ఫలముండగలదు.

232. మనపండితమ్మన్యులు ప్రగల్భములు పలుకుదురు. బ్రహ్మమని, బ్రహ్మయని, అవ్యక్తమని, జ్ఞానయోగమని, వేదాంతమని, విశ్వోత్పత్తియని ఏమేమో వచింతురు. తాము ఉచ్చరించువాని అపరోక్షజ్ఞానమును పడసినవారు పూజ్యము. వారుఎండబాఱి, గట్టిపడి నిష్ప్రయోజకులై యుందురు.

233. చైతన్యదేవుడు దక్షిణదేశమున తీర్థములు సేవించుచుండ, భగవద్గీతనుచదువు ఒకపండితునికి ఎదురుగానిలుచుండి కన్నీరుకార్చుచున్న భక్తుని ఒకనిని కనిపెట్టెను. ఈభక్తునికి ఓనమాలైననురావు. గీతలోనివాక్యములు వానికి అర్థమగుటలేదు. అతడు కండ్లనీరుకార్చుటచూచి ఎందుచేత అని ప్రశ్నింపగా ఆతడు యిట్లుచెప్పినాడు.

"నేనుఆగీతలోనిఒక్కమాటనైన తెలియజాలను. నిజము. కాని కురుక్షేత్రయుద్ధరంగమున, రథముపైని, అర్జునునికి

ముందు కూర్చుండి, యోగీశ అనబడు ఉత్తమభావములకు బోధించుచుండిన యాశ్రీకృష్ణభగవానుని సుందరరూపము నాకండ్లకు అగపడుచున్నది. అందువలన భక్తి ఆనందములెల్లి విరియ నాకన్నులు బాష్పపూరితములగుచున్నవి.”

ఈభక్తుడు ఓనమాలనైనను నేర్వనివాడైనప్పటికిని మహాజ్ఞానియే. ఎమ్దుకనగా, వానికి నిర్మల దైవభక్తికలదు; భగవత్సాక్షాత్కారమును పొందగలిగినాడు!

234 దివ్యజ్ఞానము, తన పాండిత్యమును గురించిగాని తన ఐశ్వర్యమును గురించిగాని గర్వపడువారునకు సాధ్యముకాదు. అటువంటివానితో “ఒకచోట సాధువొక డున్నాడు. చూచి వచ్చెదము వత్తువా?” అని, అనిచూడుము. ఆతడుసాకులుపన్ని రాజాల నను. సాధువును చూడబోవుట తనవంటిఘనునకు తగదని ఆతడు భావించును. “అజ్ఞానమువలన గర్వము పుట్టును సుమీ,”!

235. పుస్తకములు చదివినగాని జ్ఞానము లభింపదని అనేకులు తలంతురు. శాస్త్రములను చదువుటకన్న వినుటమేలు; బ్రహ్మదర్శనమో ఉత్తమోత్తమము. గ్రంధములను ఊరక చదువుటకంటె గురునోట బ్రహ్మజ్ఞానముంగూర్చివినుటవలన అది మనస్సున గట్టిగా నాటుకొనును; మఱియు దర్శనము వలన అరూఢభావము కుదరగలదు. కాశీనగరమును గురించి పుస్తకములలో చదువుటకంటె ఆనగరమును స్వయముగ చూచినవానినోట దానింగూర్చి వినుటలెస్స. ఆకాశీనితన కండ్లతోనే చూచుట పరమోత్తమము.

236. బ్రహ్మమును ప్రత్యక్షసత్యముగా నాకండ్లార నేను చూచుచున్నాను. నేనింక వాదించుట ఎందులకు? ఆ అవ్యయ బ్రహ్మమే మనచుట్టును గోచరించు వస్తుజాలముగ మారుట నేను స్వయముగ చూచుచున్నాను. ఆయనయే ప్రత్యగాత్మ గను, వికారప్రపంచముగనుకూడ గోచరించుచున్నాడు. ఈసత్యమును చూచుటకు తనలో ఆత్మప్రబోధము కలుగవలసి యున్నది. ఆబ్రహ్మమును ఏకైకసత్పదార్థముగ చూడగల్గు వఱకును, మనము తర్కించుచుండవలయును. ఇదికాదు, ఇదికాదు, "నేతి, నేతి" అనుచు వివేకించుచుండవలయును. "బ్రహ్మమే యీసర్వమును అయ్యెనని నిస్సందేహముగా నేను గ్రహించితిని" అని పలుకుటమాత్రము చాలదు; నిజమే. కేవలము వచించుటచాలదు. దైవానుగ్రహమువలన ఆత్మప్రబోధము కావలయును. ఆత్మప్రబోధము వెనువెంట సమాధిదశ ప్రాప్తించగలదు. ఈదశలో మనకు శరీరమను నది యున్నదనుటే మఱతుము. కామినీకాంచనములతో గూడిన ప్రాపంచికవిషయములందు అనురాగమేరూపుమా యును. లోకవ్యవహారములనుగూర్చి వినవలసివచ్చినచో మిగుల వెగటుతోచును. భగవంతునిగూర్చిన విషయము లను మాత్రమేవినుటకు ఆసక్తియుండును. అంతరాత్మ ప్రబోధము కలిగినపిమ్మట విశ్వాత్మను దర్శించుటే పైమెట్టు. ఆత్మయే ఆత్మదర్శనముచేయ జాలును సుమీ?

237. సమారాధనకై అతిథులు, అభ్యాగతులు అనేకులు చేరినప్పుడు వారుచేయుకోలాహలము పెద్దగవినవచ్చును.

కాని ఆగందఱగోళము వారుభోజనము ప్రారంభించువరకే. వడ్డన అయి, ఆపోశన పట్టునప్పటికే ముప్పాతికశబ్దము అణగి పోవును. ఇంకక్షీరాన్నమువచ్చును—వడ్డనసాగినకొలదినిధ్వని తగ్గిపోవుచుండును. మజ్జిగ దగ్గఱకువచ్చుసరికి త్రేణుపులుతప్ప ఏమియు వినరాదు. భోజనములు ముగియగానే యికవారు చేయునది నిద్రపోవుటే!

నీవు భగవంతుని దాపునకుచేరినకొలదిని ప్రశ్నించుట, తర్కించుట, హితవు తప్పును. వానిని సమీపించి, ప్రత్యక్షముగ చూచునప్పుడు ఏగోలయు ఉండదు. వివాదములన్నియు తుదముట్టును. అది నిద్రకుసమయము; అనగా సమాధియందు ప్రాప్తించు ఆనందమును యనుభవించుటకు సమయమువచ్చినట్లు. ఆదశయందు భగవంతుని దివ్యదర్శనానందమున మునిగిపోవుదుము.

౨౩౮ పుస్తకములు— అనగా ధర్మశాస్త్రములు— అన్నియు భగవంతునిచేరు మార్గమును చూపును. ఒక్కసారి దాటితెలిసికొనినపిమ్మట ఆపుస్తకములతో పనియేముండును? ఆపిమ్మట ఏకాంతముగా భగవధ్ధ్యానముచేయుచు ఆధ్యాత్మ సాధనముచేయు తరుణము ఏర్పడును.

239. తనబందువునకు యేవోకొన్ని వస్తువులు పంపుమని ఒకనికి తన యింటికడనుండి ఉత్తరము వచ్చినది. ఆతడు వస్తువులు తెప్పించబోవుచుండగా, ఉత్తరములో ఏయేవస్తువులు కావలెనని వ్రాయబడెనో తెలిసికొనగోరెను. ఉత్తరముకొఱకు చూడగా అది కనుబడలేదు. దానికై చాల

వెదకినాడు. తుదకు అదికాన్పింప వానికి ఆనందముకలిగినది. ఆతడు దానిని ఆతురముతో చదువ అందిట్లున్నది:—

"అయిదు శేర్ల మిఠాయి, వందనారింజపండ్లు, ఎనిమిది ఉత్తరీయములు పంపుడు." ఉత్తరములోని విషయములు తెలియగానే, అతడుదానిని ఆవలపడవేసినాడు. కావలసిన వస్తువులనుకొన నారంభించినాడు.

ఎంతవరకు అటువంటి ఉత్తరముయొక్క అవసరముం డును? దానిలోనివిషయములను తెలిసికొనువఱకే గదా! విషయములు తెలిసినతోడనే, దానిలోకోరబడిన వస్తువులను సంపాదించుటే అప్పుడుచేయవలసినపని.

ఇటులనే శాస్త్రములు మనము భగవంతునిచేరుమార్గ మును తెలుపును. అనగా బ్రహ్మసాక్షాత్కారమును సాధించు ఉపాయమును బోధించును. మార్గము తెలిసినపిమ్మట చేయ వలసినపని, గమ్యమును చేరుటకగుసాధనమే. ఆదర్శమును ప్రాపించుటే.

240. ఊరక పుస్తకములను చదువుటవలని ఫలమేమున్నది? పండితులకు చాలశాస్త్రవాక్యములు శ్లోకములును తెలియ వచ్చును. అయినను వానిని పదేపదే పారాయణచేయుట వలన లాభమేమి? ఆశాస్త్రములలో చెప్పబడినదానిని ఆత్మానుభవమునకు తెచ్చుకొనవలయును. ప్రపంచవ్యవ హారలంపటమున చిక్కియున్నంతకాలమును, కామినీకాంచన ములను మోహాలోభములతో చూచుచుండునంతకాలమును, ఈపారాయణములు మోక్షము నీయజాలవు.

241. పగ్రిజలు దోషములనియు, మూఢాచారములనియు పలుకుచు తమపాండిత్యమునుగురించి గర్వపడుచుందురు. కాని సత్యమగుభక్తుడు తనకుసదాభగవంతుడే చేయూతను యిచ్చుచుంటను తెలిసికొనును. తాను చాలకాలముత్రోవతప్పి నడచుచుంటినే అను చింతవానిని బాధించదు. వానికేమేమి అవసరమో భగవంతునికే తెలియును. భగవంతుడే భక్తుని వాంఛితార్థమునుతీర్చును.

242. అబ్బీ! మామిడిపండ్లుతినరా, అందుకు. తోటలో యెన్నివందలమామిడిచెట్లున్నవో, వానికి యెన్ని వేలకొమ్మలుండునో, అందెన్నిలక్షలఆకులున్నవో యనుచు గణితములు వేసిన యేమిలాభము? నీవిక్కడికి మామిడిపండ్లుతినవచ్చితివి; పండ్లుతిను, వెడలిపో! సాధనలుచేసి బ్రహ్మమును సాధించుకొఱకై నీవీలోకమున మనుష్యుడవై పుట్టితివి. భక్తిని ఆర్జించుట నీయుత్తమాదర్శము. అనవసరములగు వాగ్వాదములతో నీకుపనియేమి? వేదాంతచర్చలు, నీజీవితమును మార్చివేయగల్గునా? నాలుగుగుక్కలసారాయితోనీకుకైపువక్కచుండగా, సారాఅంగడివాని దాపున ఎన్నిపీపాలసారా ఉన్నదో విచారించుట నీకేమిలాభము? ఈమాత్రము తెలియదా?

243. ఒకనాడు, కేశవచంద్రసేనుడు దక్షిణేశ్వరాలయమునయున్న శ్రీరామకృష్ణ పరమహంసులవారికడకువచ్చి "పండితులు పెద్దపెద్దశాస్త్రగ్రంథములనుచదివియు, పరమపామరులుగ యుండుటకు కారణమేమి?" అనిప్రశ్న వేసిరి.

శ్రీరామకృష్ణులవా రిట్లనిరి:— "గ్రద్దలు గరుడపక్షులు ఆకాశమున ఎంతయెత్తునకో యెగురునుగదా. కాని వానికండ్లు ముఱికిగుంటలలో కుళ్లుచుపడియుండు మృతకళేబరములను వెదకుటయందే పూనికవహించియుండును. అదే తీరున ఎంతగా శాస్త్రపఠనము చేసినవారైనను, పండితమ్మన్యుల మనస్సులు కామినీకాంచనములను లౌకికవిషయములందు తగులువడియుండుటచేత వారికి బ్రహ్మజ్ఞానము లభించదు."

244. వట్టికడవలో నీరునింపునప్పుడు బుడుబుడమనుచుధ్వని చేయును. కాని అది నిండినప్పుడు చప్పుడేవినరాదు. అటులనే బ్రహ్మసాక్షాత్కారమును పొందనిమనుజుడు బ్రహ్మమును గురించిన వాగ్వాదములతో అట్టహాసములు చేయుచుండును. కాని బ్రహ్మావలోకనము చేసినవాడో, నిశ్శబ్దముగ బ్రహ్మానందము ననుభవించును.

## 10వ అధ్యాయము.

# సాధకులలో వేర్వేఱు తరగతులు

245. పేలాలు వేయించునప్పుడు వేపుడుమూకుడునుండి యెగిరివిచ్చుకొని బయటపడుగింజలు శ్రేష్ఠమైనవి. వాటికి ఏలాటిమచ్చయుండదు. బాగుగవేగి మూకుడులో నిలుచు పేలాలలో ప్రతిదానికిని కాలినమచ్చ కొంచెమైనను ఉండును. ఆలాగుననే సిద్ధభక్తులలో సంసారమును పూర్తిగవదలి వెలుపలబడినవారు శ్రేష్ఠులు, నిష్కళంకులుగనుందురు. సంసారములలోనె నిలిచియుండు భక్తులలో పూర్ణసిద్ధులుసయితము వర్తనలో ఏదోలోపముగలిగి మచ్చపడియేయుందురు.

246. పారమార్థికసాధకులలో రెండుతెఱగులవారు కాన్పించుచున్నారు; ఒకరకమువారు మర్కటకిశోరమును బోలువారు (కోతిపిల్లలవంటివారు). రెండవరకమువారు మార్జాలకిశోరమువంటివారు(పిల్లిపిల్లలబోలువారు). కోతిపిల్లచిత్రముగా తానె తల్లినిగట్టిగపట్టుకొనును; పిల్లికూన తనను తల్లిఎక్కడనుంచిన అక్కడనేయుండి నిస్సహాయమై దీనత్వముతో కూయుచుండును. క్రోతిపిల్ల తల్లిపట్టును తానువిడిచెనా క్రిందపడిహానిచెందును. అది తనబలమునే నమ్ముకొనియుండవలసినది. పిల్లిపిల్లను దానితల్లియే ఒకచోటునుండి మఱొకచోటునకు తీసికొనిపోవును. గాన దానికేఅపాయమునురాదు. అటులనే జ్ఞానయోగమునో, నిష్కామకర్మమునో నమ్ముకొను

సాధకుడు తరించుటకు, తనప్రయత్నము మీదనే ఆధారపడి యుండవలయును. కాని భక్తిమార్గావలంబుడో భగవంతుడే సర్వమును నిర్వహించునని యెఱుంగును; కావున పూర్ణవిశ్వాసముతో స్వామికృపపై ఆధారపడియుండును; మొదటివాడు క్రోతిపిల్లవంటివాడు; రెండవయతడు పిల్లికూనబోలువాడు.

247. ప్రొద్దుపొడుపువేళ చిలికినవెన్న శ్రేష్ఠము. సూర్యుడు ఉదయించినపిమ్మట చిలికినది అంతమంచిదికాదు. శ్రీరామకృష్ణపరమహంసులవారు తనభక్తులలోనిచిన్నవారితో యిట్లనుచుండెడివారు; "మీరు ప్రాతఃకాలమున చిలికిన వెన్నవంటివారు." సంసారులగు శిష్యవరులో, ప్రొద్దెక్కినపిమ్మట చిలికినవెన్నను బోలుదురు."

248. 'హోమా' అను పక్షులను గురించిన కథకలదు. అవి ఆకాశమున అత్యున్నతప్రదేశమున నివాసముచేయునట. ఆప్రదేశములందు వానికి అత్యంతప్రీతిగావున, అవెన్నడును క్రిందికిదిగి భూమిపైకిరావు. తమగ్రుడ్లనుసహా అవి ఆకశముననే పెట్టును. భూమి ఆకర్షణచేత అవిక్రిందపడునప్పుడు, గాలియొక్క రాపిడికి పొదుగబడి మార్గమధ్యముననే అవిపిల్లలగును. ఆపక్షికూనలు త్వరలో తాముపడిపోవుచుండినటుల గ్రహించి, వెంటనే నైజస్వభావముచే ప్రేరేపింపబడి, పైకి తమనివాసములకై ఎగిరిపోవునట. శుకదేవుడు, నారదుడు, ఏసుక్రీస్తు, శంకరాచార్యులు యింకనిటువంటి పురుషవరులు యీపక్షులవంటివారు. పసితనమునందుసయితము అట్టివారు లోకవిషయములయెడ రాగములేనివారై, బ్రహ్మజ్ఞానదివ్యతేజములచే ఆకర్షింపబడి యున్నతపథముల నంటిపోవుదురు.

11వ అధ్యాయము.

# భగవంతునిగూర్చిన పరితాపము.

249. మాయయొక్క బంధనమునుండి తప్పించుకొనుటకు మనము ఏయుపాయములను అవలంబించవలసియుండును? దానిచిక్కులనుండి తప్పించుకొనపరితపించువారికి భగవంతుడే మార్గము చూపును; కాని అందుకు నిరంతర పరితాపము అవసరము.

250. కొడుకులు పుట్టలేదని ఎందఱో కన్నీరు వరదలై పాఱ రోదనముచేయుదురు. తమకుధనము లంభించలేదని యెందరో దిగులుపడి శుష్కింతురు. కాని, ఆహా! భగవంతుడు కానరాలేదని ఏడ్చి దుఃఖించువారు ఎందరుయుందురో లెక్కించి చూడుడు. మిక్కిలి అరుదుగదా! వెదకువానికి యతడు దొఱకును. భగవంతునికొఱకు ఏడ్చువారు వానిని గనుగొందురు.

251. వానికొఱకై తపించువారు వానిని కనుగొనగలరు; నామాటనిశ్చయము. నీజీవితమున పరీక్షించుము, పొమ్ము. మూడుదినములు ప్రయత్నించుము. సత్యమగు ఆతురపాటు చూపి యత్నించుము. తప్పక నీకు జయముకల్గును.

252. నరుడు ఈశ్వరానుగ్రహమును సంపాదించుకొనవలయునని ఈకలియుగములో మూడుదినముల తీవ్రపరితాపముచాలును.

253. కనకమునకై పరితపించులోభివానివలె నీహృదయము భగవంతునికొఱకు తహతహ పడవలయును.

254. ఎవనిపరితాపము తీవ్రముగనుండునో, ఎవని చిత్తము ఏకాగ్రతపొందునో, ఆతడు మిగులత్వరితముగా భగవంతుని చూడగల్గును.

255. ఓహృదయమా! నీజగజ్జననినిగూర్చి నిజముగా పిలువుము. ఆమెఎంతవేగిరముగా నీకడకు పర్విడివచ్చునో, నీకు తెలియగలదు. పూర్ణహృదయముతో భగవంతుని ఎవడేని పిలుచునెడల ఆయన ఉపేక్షించి యూరకుండజాలడు.

256. "ప్రియమాతా! నాకు ఆకలి అగునప్పుడు నన్ను నిద్ర లేపుము." అనిబిడ్డఅడుగగా, "బిడ్డా! నీయాకలియేనిన్ను నిద్రలేపును సుమీ!" అనితల్లిచెప్పినది.

257. ఎన్నడును కొఱవడిపోని భక్తిని, ఎన్నడును చలింపని శ్రద్ధను దయచేయుమని జగజ్జననిని వేడుకొనుము.

258. ఒకతల్లికి చాలమంది పిల్లలుండిరి. ఒకబిడ్డకు మిఠాయిని, ఒకబిడ్డకుబొమ్మను, వేఱొకనికి ఒక పవడమును యిచ్చెను. వారంతఱును తల్లినిమఱచి తమ ఆటవస్తువులమీందనే దృష్టిగలవారైయుందురు. తల్లి ఆసమయమున తనగృహ కృత్యములను చూచుకొనుచుండును. ఇంతలో ఒకపిల్లవాడు తన బొమ్మను అవలపాఱవైచి "అమ్మా! అమ్మా! అని ఏడ్వసాగును. తత్క్షణమే తల్లి పర్విడివచ్చి వానిని లాలన సేయును. అటులనే, ఓనరుడా! ఈప్రాపంచిక ఆడంబరములలోపడి నీవు జగజ్జననిని మఱచిపోయినాడవు. వానిని ఆవల

త్రోసివేసి ఆమెకొఱకై పరివేదనము చేయును. వెంటనే ఆతల్లివచ్చి నిన్ను చంకనెత్తుకొనగలదు.

259. "ఈజన్మలోనె నేను భగవంతుని పొందవలయును. ఇంతేల ? మూడుదినములలో నేను ఆయనను ప్రత్యక్షము చేసికొనవలయును. ఇంతేకాదు ! ఒకసారి వానినామస్మరణ చేసి తప్పక వానిని నాకడకు ఆకర్షించుకొందును." అనునట్టి తీవ్రభక్తి చేత భగవంతుడులాగబడి త్వరలో ప్రత్యక్షము కాగలడు. కాని మందభక్తిగలవారికి భగవంతుడుకనబడుటేని ఎన్నియుగములకోగాని అట్టిది సంఘటిల్లదు.

260. నీటమునిగినవాడు "ఊపిరాడక పరితపించునంతగా, భగవత్సాక్షాత్కారమగుటకు పూర్వము వానికొఱకై, నీహృదయము తీవ్రపరితాపమును పొందవలయును.

261. సాధకుని బలమెందున్నది ? అతడు దేవునిబిడ్డడు. కన్నీరే వానిబలము. వెంటబడిఏడ్చుబిడ్డని కోర్కెలు తల్లులు తీర్చువిధమున, తనకొఱకై ఏడ్చు బిడ్డలకోర్కెలు ఎట్టివైనను భగవంతుడు తీర్చును.

262. భగవంతునికొఱకై పరివేదనముచేయునతడు, ఏమి తిందును. ఏమి త్రాగుదును అను స్వల్ప విషయములను గురించి ఎంతమాత్రమును యోచనయే చేయజాలడు.

263. దప్పిగొనినవాడు, బురదగానుండెనని, నదీజలమును విడిచివేయజాలడు; నిర్మలోదకముకొఱకని నూతిని త్రవ్వుటకును, పూనుకొనడు, అటులనే ఎవనికి సత్యమగుధర్మపిపాస

కలుగునో యతడు హిందూమతమునుగాని మఱేమతమును గాని సులభముగాచేజిక్క యేమతము నైనను నిరసింప జాలడు; తనకై ఒక క్రొత్తమతమును నిర్మించుకొనజూడడు. సత్యమగు పిపాస (దాహము) కలవానికి అటువంటి విచారణలు పెట్టుకొనుటకు వ్యవధి లేదు.

264. "ఓభగవతీ! నరులు నన్ను గౌరవించవలయునని నేను కోరను; నాకు యింద్రియభోగములు అక్కఱలేదు. గంగా యమునలు ఎడతెగక కలిసిపోయి ప్రవహించు తీరున నాఆత్మను నీలోనికి ప్రవహింపనిమ్ము. తల్లీ! నాకడభక్తిలేదు, ఏయోగమును ఎఱుగను. నేను దీనుడను; సావాసగాండ్రులేని వాడను. నాకు ఎవరిమెప్పులును అగత్యము లేదు. నామనస్సును మాత్రము నిరంతరము నీపాదపద్మములందు నిలువనిమ్ము."

265. ఒకడు యిట్లుపలికెను. "పదునాలుగుసంవత్సరముల నుండి నేను దేవునికొఱకై దేవులాడుచున్నాను. ప్రతివానిసలహాను యనుసరించిపోవుచున్నాను; అన్నిపుణ్యక్షేత్రములకును యాత్రలుచేసినాను. అనేకులుసాధువులను, మహాత్ములను దర్శించినాను. ఏబదిఅయిదేండ్లువచ్చినవి. నాకేమియు చిక్కలేదు."

ఈపలుకులువిని శ్రీరామకృష్ణపరమహంసులు "నేను గట్టిగా చెప్పుచున్నాను; వినుము. భగవంతునికొఱకై పరితపించువాడు వానిని కనుగొనితీరును. నన్నుచూచి ధైర్యము పూనుము" అనిచెప్పిరి.

266. బొమ్మలకొఱకు, డబ్బుకొఱకు పోరుపెట్టిఏడ్చుచు తల్లినిపీడించు బిడ్డతీరున, భగవంతుడు తనకు అత్యంతప్రియకరుడును ఆప్తుడును అనుగ్రహించినవాడు, వానినిచూచుటకై కపటమెఱుగని బిడ్డవలె లోలోనవెక్కి వెక్కి ఏడ్చునెడల, భగవంతుఁడు తనదర్శనమును ప్రసాదించగలడు. తననుగురించి అంతతీవ్రముగా పరివేదనముచేయుచు వెదకులాడువారికి కాన్పించకుండ దాగియుండజాలడు.

267. మననాటకశాలలలో, శ్రీకృష్ణలీలలు, ఆటాడునప్పుడు "శ్రీకృష్ణరారా; ప్రియకృష్ణరారా!" అను పాడుచు తాళమృదంగముల తట్టుచు ప్రారంభముచేతురు. కాని శ్రీకృష్ణవేషము వేసినవాడు ఈగోడవనే వినిపించుకొనకుండ, వేషాలువేయుగదిలో కూర్చుండి పొగదాగ్రుచు కబుర్లుచెప్పుచుండును. కాని ఈసద్దు అణగినపిమ్మట, నారదుడు రంగమున ప్రవేశించి, మృదుమధుర గానముచేయుచు, హృదయమున ప్రేమవెల్లివిరియ, వెడలిరమ్మని కృష్ణునిపిలుచుతోడనే, తానింక అశ్రద్ధతోడనుండరాదని కృష్ణుఁడువేగమే తెఱవెలుపలికివచ్చును. సాధకుడు పెదవులతో మాత్రమే "రా రా నాస్వామిరారా!" అనిప్రార్థనలు చేయుచుండునంతకాలమును భగవంతుడురాడు. ఆస్వామి వచ్చుతరుణమున భక్తునిఉద్వేగముకలిగి నోటధ్వనిరాక అడగిపోవును. అంతరాళమునుండి తీవ్రభక్తిపొంగి పొఱలుహృదయముతో భక్తుడుపిలుచునప్పుడు, ఇంక భగవంతుఁడు జాగుచేయజాలడు.

268. జగజ్జననికొఱకు తానుపడిన పరితాపమునుగూర్చి చెప్పుచు శ్రీరామకృష్ణ పరమహంసులవారిట్లు శెలవిచ్చిరి. "దక్షిణేశ్వరాలయమునందు సాయంతనపూజా సమయమున; తాళాలు, జేగంటలు, గంటలు మ్రోగుట వినగానె, నేను గంగాతీరమునకు పర్విడిపోయి "ఓ జననీ! యింకొకదినము గడచిపోయినది. అయ్యో! ఇంకను నీవు నాకు ప్రత్యక్షము కాకపోతివి!" అని ఘోరముగా ఏడ్చెడివాడను.

269. భగవంతునియెడ మనప్రేమ ఎంతగాఢముగా యుండవలయునో, మీకు తెలియునా? పతివ్రతకు ప్రియభర్తపైనుండు ప్రేమ, లోభివానికి తాను కూడబెట్టుకొనిన ధనముపైనుండు అనురాగము, లోకులకు కామ్యవస్తుజాలముపైనుండుమక్కువ- ఈమూడునుకూడినంత తీవ్రతతో నీహృదయమున భగవద్భక్తి నిండినప్పుడు, భగవత్సాక్షాత్కారము కాగలదు.

270. ఏసుక్రీస్తు సముద్రతీరమున సంచరించుచుండగా యొకనాడు భక్తుడొకడువచ్చి "ప్రభూ! భగవంతుని పొందుటఎట్లు?" అని ప్రశ్నించినాడు. ఏసుక్రీస్తు ఆభక్తుని తోడ్కొని తిన్నగ సముద్రములోనికిదిగిపోయి వానినినీళ్లలో అణచిపట్టెను. కొంతసేపటికి వానినివిడిచి పైకిలేవదీసి "నీకుఎట్లున్నది?" అనిఅడిగెను. "నేను నాఅంత్యకాలము ఆసన్నమైనదనుకొన్నాను. ఏమియుతోచినదికాదు" అనిభక్తుడు ప్రత్యుత్తరముచెప్పినాడు. అంతట ఏసుక్రీస్తు, "నీవిప్పుడు ఊపిరికొఱకై ఎట్లుపరితపించినాడవో, అంతగా ఆతండ్రిని గురించి పరితపించితివా నీకు ఆయనకానవచ్చును." అని బోధించినాడు.

## 12వ అధ్యాయము.

# ఆధ్యాత్మిక జీవనగతులు.

271. పండ్లతోనిండినచెట్టు క్రిందికివంగియుండును గదా; నీవు ఘనుడవు కాగోరుదువేని నమ్రతతో అణిగియుండుము.

272. త్రాసునందు బరువుగలసిబ్బె క్రిందికివంగును. తేలికగానున్నసిబ్బె పైకిపోవును .అటులనే యోగ్యత సమర్థత కలవాడు ఎల్లెడల వినయవిధేయతలు చూపుచుండును. బుద్ధిహీనుడో గర్వముతో ఉబ్బిపోవుచుండును.

273. పసిపాపనుబోలి నిరాడంబరము పూననంతవఱకును దివ్యతేజము లభింపబోదు. నీవుగడించిన ప్రాపంచిక విజ్ఞానమంతయు మఱచిపోయి పసివానివలె ప్రజ్ఞవిడిచియున్నచో, నీకు బ్రహ్మజ్ఞానము అలవడును.

274. ఏమారుమూలనో, విజనవనముననో, నిశ్శబ్దమగు నీహృదయగుహాయందో భగవధ్యానము సలుపుము.

275. పెనుగాలివీచునప్పుడు ఎండాకువలె స్వాతిశయము విడిచియుండుము.

276. మురికితోగూడిన అద్దము సూర్యకిరణములను ప్రతిఫలింపజేయదు. మాయతోగూడిన హృదయముతో అపవిత్రులైయున్న పాపుల భగవన్మహిమను ఎన్నడును కాంచజాలరు. కాని పవిత్రహృదయులు, నిర్మలమగు అద్దము

సూర్యుని ప్రతిఫలింపజేయువిధమున భగవంతుని చూడజాలు దురు. కావున పవిత్రుడవై యుండుము.

277. నేనుజీవుడను యనుకొనునరుడు జీవుడుగనే యుం డును; నేనుశివుడను అనుకొనునతడు శివుడేయగును. ఎవ డెటుల భావనచేసికొనునో అతడు యట్టివాడగును.

278. ఏమాత్రమైన కోరిక అను డాగు యున్నంతవర కును భగవంతుడు కానరాడు. కాబట్టి నీస్వల్పపుకోరిక లను తీర్చుకొనుము. పెద్దకోరికలను వివేకముతో తర్కించి విడిచివేయుము.

279. ఎవడేని నిరంతరమును సత్యము పలుకువాడు కాని యెడల, సత్యస్వరూపుడగు భగవంతుని కనలేడు.

280. ఈజన్మయందే యెవడు మరణించియుండునో అనగా శవమునందువలె యెవనికామములును గుణములును మటు మాసియుండునో, యతడే నిజమైనపురుషవరుడు.

281. వేదములు, పురాణములు, చదువదగినవి, వినద గినవి. కాని తంత్రములు సాధనచేయవలసినవి. హరినామము నోటితో పలుకవలయును; చెవులతో వినవలయును. కొన్ని రోగముల నివారణకై పైకిని మందురాయవలయును. లోప లికిని మందుతినవలసియుండును.

282. నీభావములను, నీభక్తిని రహస్యముగ నుంచుము. బాహటముగ వచింపకుము. కాదేని నీకు గొప్పనష్టము వాటిల్లును.

283. నీభావములయెడ ద్రోహివికాకుము. నిష్కపట ముగనుండుము, నీభావములకు అనుసరణముగ వర్తించుము. నీకు తప్పక జయము చేకూరును. నిష్కపట వినిర్మల హృదయముతో ప్రార్థనల చేయుము; అప్పుడు నీప్రార్థనలు ఫలించును.

284. అద్వైతజ్ఞానము పరమోన్నతమైనదే; కానిస్వామిని సేవకుడు సేవించునటులను, పూజ్యుని పూజకుడు పూజించునటులను, భగవంతునికి మొదట ఆరాధనలు చేయవలయును. ఇది మిగులసులభమార్గము. ఇందువలన పరమమగు అద్వైతజ్ఞానమునకు దారిదొఱకును.

285. మహాచక్రవర్తిని దర్శించగోరువాడు, ద్వారము కడ కావలికాచునట్టియు, గద్దెడాపున కనిపట్టియుండునట్టియు వారిని ముందుగ తృప్తిపఱచవలసియుండును. సర్వేశ్వరుని కృపాపీఠమును చేరదలచువాడు గాఢభక్తిని సాధనచేయవలయును; భక్తులసేవించవలయును. చాలకాలము సాధుస్నేహము చేయవలయును.

286. గంజాయాకుతినుట, తోటకూరతినుటవంటిది కాదు; చక్కెఱమెక్కుట, అప్పాలు తినుటవంటిదికాదు; మొదటివి ఆరోగ్యమునకు హానికరములు; రెండవవాటిని రోగులును తినవచ్చును. పరమమంత్రమౌ ప్రణవము, శబ్దమాత్రము కాదు; పరబ్రహ్మమును ప్రకటించు స్వరచిహ్నమగును. అటులనే భక్తిప్రపత్తులగుకోరిక, లౌకిక, కామవాంఛతో పోల్చతగినదికాదు.

287. లోతగు నూతియొడ్డున యుండువాడు దానిలో పడిపోదునేమోయని కడుజాగరూకుడై యుండితీరున సంసారమున నుండువాడు దాని మోసములకు చిక్కిపోకుండ మెలకువతో నుండవలయును. మోసములపోవగు సంసారకూపమున ఒక్కసారి పడిపోయినవాడు, నిరపాయముగను నిష్కళంకముగను వెలువడుట యరుదు.

288. చేపలుపట్టు మక్కువతో ఒకానొకగుంటలో మంచి చేపలు చాలగా యున్నవేమొ తెలియగోరువాడు, అందు యిదివఱకు చేపలుపట్టినవారికడకు చచ్చుఅపోయి "ఈ గుంటలో పెద్దపెద్ద చేపలుదొఱుకుట నిజమేనా? వానిని పట్టుటకు యేలాటి యెఱవేయవలయును?" అని యాతురముతో విచారించును. వారివలన అవసరమగు విషయములను తెలిసికొని, గాలపుకోలను చేపట్టి గుంటకడకుపోయి, గాలమును లోనవేసి నెమ్మదిగ కూర్చుండి, ఓపికతోను నేర్పుతోను చేపలను రాబట్టచూచుచుండును. తుదకు లోతున నుండు పెద్దసాగసగు చేపనొకదానినిపట్టుకొనగల్గును. అటులనే మహాత్ములయొక్కయు, ఋషివరులయొక్కయువాక్కులందు పూర్ణవిశ్వాసముంచి మనస్సను గాలపుకోలతోడను భక్తియనుఎఱతోడను నేర్పుతో భగవంతునిపట్టుకొనిహృదయమున దాచిపెట్టుకోవలయును. అదనుకొఱకై తెంపులేని ఓర్పుతో కనుపెట్టుకొనియుండవలయును. అటుల చేసినచో ఆదివ్య మీనము చిక్కగలదు.

289. ఈతనువు తుచ్ఛమును అశాశ్వతము నైన పక్షమున పుణ్యపురుషులును భక్తులును దీనిని జాగ్రత్తగా సంరక్షింతురేల ? వట్టిపెట్టెను ఎవడును కాపలా కాచబోడు. విలువగలనగలు, బంగారము, అమూల్యవస్తువులు నిండియున్న పెట్టెను ఎల్లరును రక్షణచేతురు. ఏతనువున దివ్యాత్మ వాసముచేయుచుండునో, దానిని పుణ్యాత్ములు సంరక్షించకవీలులేదు. మన శరీరములన్నియు భగవంతుని ధనకోశములే.

290. లోతులేనిమడుగులోని తేటనీరు త్రాగదలచువాడు దానిని ఎంతమాత్రము కదల్చకుండ, పైపై నీటిని నెమ్మదిగా తీసికొని త్రాగవలయును. దానిని కదిలించేయడల అడుగు బురదపైకివచ్చి నీటినంతను చెఱచును. నీవు పవిత్రుడవుగా నుండకోరితివేని నిశ్చలవిశ్వాసముగలిగి నెమ్మదిగా నీభక్తిసాధనను సాగించుకొమ్ము. శాస్త్రచర్చలలోనికిని తర్కవాదములలోనికిని దిగి నీసామర్థ్యమును వృధాచేసికొనకుము అటులకాదేని అల్పమగు నీమెదడు కలవరమున చిక్కిపోవును.

291. మనము భగవంతునిగూర్చి బిగ్గఱగా ప్రార్థనలు చేయవలయునా? నీయిష్టమువచ్చినతీరునవానిని ప్రార్థించుము. ఆయన నిశ్చయముగా నిన్నాలకించును. ఆయన చిన్నచీమకాలు చప్పుడును సయితము వినగలడు.

292. చిన్నమొక్కయుండినచో మేకలు, పశువులు, మేయకుండనుపిల్లవాండ్రు పాడుచేయకుండను కాపాడుటకుచుట్టుకంచె వేయవలయును.ఆ మొక్క పెద్దచెట్టైనపిమ్మట మేకలమందగాని,ఆవుల

గుంపుగానినిరపాయముగ దానికొమ్మలనీడవిశ్రమించవచ్చును. దాని ఆకులు పండ్లుతిని పొట్టలునింపుకొనవచ్చును. అట్లే నీయందుకొద్దిదగుభక్తిమాత్రమే యున్నప్పుడు దుష్టసాంగత్యమును, సంసారవ్యావృత్తియుదానినిచెడగొట్టకుండ సంరక్షించవలయును. కాని, నీభక్తిదృఢపడినపిమ్మట, సంసారవ్యావృత్తిగాని దుష్టవాంఛలుగాని, నీపవిత్రసమక్షమునుదాపరించ సాహసించవు. దివ్యమౌనీసాంగత్యమహిమచేత పలువురు దుర్మార్గులు దైవభక్తులుగ మారగలరు.

293. "నేను మీకొసగుఉత్తరువులకు పూర్ణముగా విధేయులై వర్తింపగలరా? నేనుమీకు తెలుపుదానిలో ఒకవీసమైనను నిర్వహించితిరేని మీరుతప్పక తరించెదరని నేనుదృఢముగా చెప్పుచున్నాను." అనిభగవాన్ శ్రీరామకృష్ణపరమహంసులవారు చెప్పుచుండెడివారు.

294. కంబళిపురుగు స్వయముగా తాను అల్లుకొనినగూటిలోనే బంధనమున చిక్కుకొనును. అటులనే లౌకికాత్ముడు తనకోర్కెలవలలోనే తగులువడును. కాని ఆకంబళిపురుగే మెఱుగులుగ్రక్కు చక్కని సీతాకోకపురుగుగా పరిణమించినప్పుడు, తనగూటినిభేదించుకొని యెగిరివచ్చి సూర్యరశ్మిని, వాయువును, ఆనందముగా ననుభవించును. అటులనే లౌకికజీవియు వివేకము వైరాగ్యము అను రెక్కలతో మాయాబంధముల తెంచుకొని విడివడగలడు.

295. మనస్సును ఏకాగ్రముచేయుటకు, దీపముపైని నిలుపుట అతిసులభమైనమార్గము. దానిమధ్యనుండు సువినీలభా

గముకారణశరీరమును బోలును. మనస్సును దానిపైనినిలుపుట వలన ఏకాగ్రిశక్తి త్వరితగతిని అలవడును. ఈనీలాంశమును ఆవరించు ప్రకాశవంతమగు భాగము సూక్ష్మశరీరమును అనగా మానసికశరీరమును పోలును. దానివెలుపల స్థూలశరీరమునకు పోల్చదగిన కోశముండును.

296. ఏయింటిలోనివారు మెలకువతోనుందురో ఆయింటిలో దొంగలు చోఱజాలనివిధమున నీవుజాగ్రత్తపూనియుండిన యెడల నీమనస్సున చెడుతలంపులు ప్రవేశించి నీశీలమును హరించజాలవు.

297. చెఱువునీటిపైని పాచిని యొక్కింత తొలగించినను తిరిగి క్రమ్ముకొని నీటిని కప్పివేయును. వెదురుతడికలుకట్టి దానిని రాకుండచేసినయెడల యిక అది క్రమ్ముకొనదు. ఎన్నడో ఒక్కసారి మాయను నెట్టివేసినను యదిమరలివచ్చి బాధించుచునే యుండును. భక్తిజ్ఞానములతో హృదయమును సంరక్షించినయెడల యది స్థిరముగా వెడలిపోవును. ఆయొక్క విధానమాత్రమే నరునికి భగవద్దర్శనము కాగలదు.

298. ఒక కుటుంబములోని చిన్నకోడలు, అత్తకును మామకును సేవలుచేయుచు గౌరవించి, వారియెడల అవిధేయురాలుగాక నిరసనజూపక వర్తించును; అయినను తన పెనిమిటిని అందఱికంటెను హెచ్చుగాప్రేమించును. అటులనే నీ యిష్టదైవమునెడల ప్రత్యేకముగ స్థిరభక్తివహించియు, యితరదైవముల నిరసింపక, ఎల్లరను గౌరవించుము. వారంద

అను యొకే అధికారమునకు ప్రతినిధులై, భక్తికిపాత్రు లగుదురు సుమా !

299. చల్లనుండి వెన్నను చిలికితీసినప్పుడు, దానిని ఆ చల్లతోపాటు ఒకేకుండలో నుంచతగదు. అటులయినచో దాని మాధుర్యమును చిక్కదనమును కొంతతగ్గిపోవును. దానిని వేఱుగ నిర్మలమయిన నీటిలో మఱొకకుండలో నుంచవలయును. అటులనే సంసారములోనుండి కొంత పరిపక్వ దశను సాధించిన పిమ్మట లోకులతోకలసి సంసారిక దుష్ప్రేరణలమధ్య నిలిచియుండెనేని కళంకముపొందుట తటస్థించును. అటువంటివాడు సంసారమునకు దూరముగనుండిననే నిర్మలుడుగ నుండగలడు.

300. ఏనుగును విచ్చలవిడిగ విడిచివేసినప్పుడు అది చెట్లను మొక్కలను పెఱికివేయును. కాని మావటివాడు అంకుశముతో తలమీద ఒకదెబ్బవేయగానే ఊరకుండును. అటులనే మనస్సు నియమములేక విడిచినయెడల పనికిమాలిన తలంపులతో చెలగాటలాడుచుండును. వివేకము అను అంకుశముతో ఒకదెబ్బ తగులనిచ్చినయెడల తక్షణము నిశ్చలత వహించగలదు.

301. ప్రార్థనలవలన నిజముగా ప్రయోజనముకలదా? ఉన్నది:— మనోవాక్కులుఏకమై శ్రద్ధతో దేనికొఱకైన ప్రార్థించినయెడల, ఆప్రార్థనఫలించును: నోటితోమాత్రము "స్వామీ, ఈసకలమునునీయవియే"అనుచు, హృదయములో

అవన్నియు తనవనిభావించు నరునిప్రార్థనలునిష్ప్రయోజనము.

302. కామక్రోధాది శత్రువులు ఎప్పుడులోబడుదురు? అని యడుగగా శ్రీరామకృష్ణులవారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి:- "ఈతీవ్రవాంఛలు ప్రపంచము వైపునకును యందలివిషయ భోగములవైపునకును నడుపబడునంతకాలమును అవి శత్రువులుగనేవుండును. వానిని భగవంతునివైపునకు నడుపునెడల అవియే నరునికి ఆప్తమిత్రవర్గమగును. అవివానిని భగవంతుని దఱిచేర్చును. సంసారమునెడలగలుగు కామమును భగవంతునివైపునకు త్రిప్పవలయును. తోడిమానవునిపైనిరేగు కోపమును, సత్వరము పరిత్యక్తముకాలేదని భగవంతునిమీద చూపవలెను.

ఈరీతిగా తక్కినభావోద్రేకములను యన్నింటిని విని యోగించుకొనవచ్చును. ఈభావోద్రేకములను మొదలంట నాశముచేయుటకు వీలులేదు. వానిని తిన్ననిమార్గమునకు త్రిప్పవచ్చును.

303. సన్యాసులు కాషాయవస్త్రమును ధరించుటవలన లాభమేమున్నది? వస్త్రధారణలోనేమున్నది?— కాషాయ వస్త్రముదానితోడి అనుసంధానమైయున్న నిర్మలభావములను స్ఫురింపచేయును. అరిగిపోయిన చెప్పులను, చిరిగిపోయిన గుడ్డలను వేసికొనుటవలన మనస్సున అవి నమ్రభావములు తోపచేయును.పీటగుదొరలాగులనుకోటులను,లాగూలునువేసి సొగసగు బూటులను తొడిగినప్పుడు సహజముగా గర్వమును యాడంబరమును పుటికొలుపును.

నల్లని అంచులుగలిగి సొబగుమీరు మజిలును ధోవతికట్టిన యెడల డంబముతోచును; శృంగారకీర్తనలనుకూడ పాడవచ్చును. సన్యాసుల కాషాయవస్త్రము వేసికొనుట, మనస్సునందు సహజముగా పవిత్రసంకల్పములను స్ఫురింపచేయును. కేవలము వస్త్రధారణమువలననే ప్రత్యేకఫలము లభింపకున్నను, ఆయారకముల వస్త్రముతో అనుసంధించియుండు భావములు కలవు.

304. సూదిలోదారము గ్రుచ్చకోరుదువేని, విప్పారు పోగులను తొలగించి, దారమును కొనతేలునటుల పేనవలయును. అప్పుడుదారము సులభముగా సూదిబెజ్జములో దూరగలుగును. అటులనే నీవు నీమనస్సును, నీహృదయమును దైవమువిూద ఏకాగ్రముగ నిలుపగోరుదువేని, యిటునటు వ్యాపించు కోరికలను తొలగించి,వి నయమువూని నమ్రుడవై దీనభావము వహించవలయును.

305. అష్టకాష్టముయను ఆటలో (పులిజూదపు ఆటవంటిది) పావులు అన్నిగదులను గడచిపోయిపోయి, తిరిగి రాకుండమధ్యగదిచేరి పండవలయును. ఆనడిమిగది చేరువలకును, ఏపావైనను మరలమరల వెనుకకుపోయి, మొదటినుండి ప్రారంభించి పారిపులాడవలసినగతి తటస్థింపవచ్చును. కాని రెండుపావులుకూడి ప్రయాణము సాగించి, ఒక్కొక్క గదిని తోడుతోడుగ గడచుచు పోవునెడల, యింకొకరి పంటపావు చంపి వీనిని మొదటికి నెట్టివేయునను భయముండదు. అటులనే ఈప్రపంచములో ఆధ్యాత్మికసాధనను

పాఠించువారు గురువును, యిష్టదైవమును తోడుచేసికొని నడచువారు, మార్గమున అవరోధములను బాధలను గురించి, భయపడనవసరముండదు. వారి పురోగమనము సరళముగ సాగును. ఆతంకములు కలుగవు. వెనుకతిరుగుడులు తటస్థించవు.

306. సంసారపు యోచనలు, దిగుళ్లు నీమనస్సునకు తొందఱ కలుగజేయనీయకుము. ఏదియెప్పుడు అవసరమో యది అప్పుడు చేయుచుండుము. నీమనస్సునుమాత్రము భగవంతుని పైన స్థిరముగనుంచుము.

307. నీమనస్సున సంకల్పించినదానినే నీవు పలుకవలెను. నీభావములకును, నీమాటలకును సమరసత యుండవలెను. అటులగాక, దైవమేనీకు సర్వమును అని నోరుయూరక పలుకుచుండ, మనస్సుమాత్రము సంసారమేసర్వమునుయని భావించునెడల, నీకు అందువలన యిసుమంతయు లాభము కలుగబోదు.

308. భక్తునకు ప్రత్యేకవేషముండవలయునా? ప్రత్యేకవేషముమంచిదే. సన్యాసివలె కాషాయధారణచేసినప్పుడుగాని, హరిదాసువలె తాంబురను, తాళములనుచేబూనినప్పుడుగాని, సరసాలాపములు, బూతుమాటలు, జావళీలు, సాధారణముగా నోటరావు. కాని విటునివలెసోకుగ వేసము వేసినవాడు సామాన్యముగ నీచపుతలపులకులోనై బూతుపాటలను పాడవచ్చును.

309. భగవద్భక్తుడు తాను ప్రేమించిన సర్వమును దైవము కొఱకై విడిచివేయు టెందులకు ?

శలభమునకు దీపము గోచరించినపిమ్మట చీకటిలోనికి మరలుటకు యిష్టముపుట్టదు. చీమ చక్కెరరాశిలోపడి చచ్చునుగాని, వెనుకకుతిరిగిపోదు. అటులనే భగవద్భక్తుడు, బ్రహ్మానందప్రాప్తికొఱకై తనప్రాణమునే అర్పించును; దేనిని లెక్కచేయడు.

310. నీవు ఆర్జించకోరు ఫలమునకై తగిన సాధనలను పూనుము. "పాలలో వెన్నయున్నది" అని గొంతుక బొంగురుపోవునటుల అఱచినను నీకు వెన్నచిక్కదు. నీకు వెన్న కావలయుచో, పాలను తోడుపెట్టి పెరుగుచేయుము; దానిని చిలుకుము; అప్పుడు నీకు వెన్నలభించును. అటులనే నీకు దైవము ప్రత్యక్షముకావలయునని కోరుదువేని భక్తిసాధనలను చేయుము "దేవా, దేవా ! ఓదేవా !" అనియూరక అఱచిన ఫలమేమున్నది ?

311. ఆత్మపారిశుద్ధ్యమునకు తోడ్పడు సాధనాంగములు ఏవన:—

(1) సాధుసంగము:- అనగా పుణ్యాత్ముల సహవాసము.

(2) శ్రద్ధ:- ఆత్మకు సంబంధించిన విషయములందు విశ్వాసము, భక్తి.

(3) నిష్ఠ:- తన ఆదర్శమునుగురించి అనన్యమైన భక్తి.

(4) భావము:- భగవంతుని చింతనమందు మునిగియుండుట.

(5) మహాభావము:- భావముసాంద్రమైన యెడల మహాభావములనబడును. భక్తుడుఒకసారి పిచ్చివానివలె నవ్వును. ఇంకొకసారి ఏడ్చును. ఆతడు ఇంద్రియములను పూర్ణముగ జయించియుండును. శరీరస్ఫురణయే అతనికియుండదు. జీవునికి ఈదశ తరుచుగా అలవడునదికాదు. మహాపురుషులకు, ఈశ్వరావతారములకు మాత్రము ప్రాప్యమగుచుండును.

(6) ప్రేమ:—భగవంతునిపైని అత్యంతగాఢానురాగము. ఇయ్యది మహాభావముతోకూడి లభించుచుండును. ఈదశను సూచించు రెండు చిహ్నము లేవన:—

(1) ప్రపంచస్పృహ లేకపోవుట.

(2) తనశరీరమును, జీవాత్మనుకూడ మఱచుట. దీనివలన భక్తుడు దైవముతో ముఖాముఖిని (ఎదురెదురుగా) నిల్చును అప్పుడు వానిజన్మ ధన్యమైనట్లే.

13వ అధ్యాయము.

# సాధుసంగము.

—:o:—

312. సాధువులయొక్కయు, జ్ఞానులయొక్కయు సహవాసము పారమార్థికసాధనమున ప్రధానాంశములలో నొకటియైనది.

313. ధనికుడగు నొకజమీందారుని ప్రతినిధి పల్లెలకు పోయినప్పుడు అచ్చటిప్రజలను అనేకవిధములుగా పీడించును. అతడే తిరిగివచ్చి తన యజమానుని సమక్షమునయున్నప్పుడు, పరమయోగ్యుడయి జామీంప్రజలను చాలా దయతో చూచుచు, వారికష్టములను జాగ్రత్తగా విచారించి, పక్షపాతము లేక న్యాయముకూర్చును. ఈప్రజాపీడాకరుడగు ప్రతినిధి యజమానుని భయమువలనను, వానిసమక్షమందుండుటవలనను యోగ్యుడై మెలగును. అటులనే యుత్తముల సహవాసము దుర్మార్గులందుసహా భయభక్తులను పుట్టించి, వారిని ధర్మానువర్తులనుగ మార్చును.

314. తడసినకట్టెలుకూడ నిప్పుమీద నుంచినయెడల త్వరలోనేయెండి, బాగుగమండును. అటులనే సాధుసంగము పామరుల హృదయములందలి లోభమోహములను తేమను హరించును. అంతట వివేకాగ్ని వారియందు రగులొని ప్రజ్వరిలగలదు.

315. జీవితమును ఎటుల నడుపవలయును?—

నిప్పును అప్పుడప్పుడు యినుపకడ్డీతో కదల్చుచు చల్లారిపోకుండ బాగుగమండునటుల చేయుచుందురు. అటులనే సాధువుల సాహవాసముతో మనస్సునకు అప్పుడప్పుడు కదలిక చేకూర్చుచుండవలయును.

316. కమ్మరివాడు తన కొలిమిలోని నిప్పును తిత్తులతో ఊది ప్రజ్వరిల్లచేయుచుండును. సాధుసంగమువలన మనస్సును నిర్మలముగను ప్రకాశవంతముగను యుంచవలయును.

317. ఏనుగుశరీరమును శుభ్రముగ తోమి కడిగి, దాని యిష్టమువచ్చినటుల పోనిచ్చునెడల, త్వరలోనె అదితిరిగి మురికిచేసికొనును. కాని దానిని చావడిలోనికి దీసికొనిపోయి అక్కడ కట్టిపెట్టిన యెడల, శుభ్రముగ నుండును. అటులనే పుణ్యాత్ముల సత్ప్రేరణ వలన నీవు ఒకసారి సన్మార్గమునకు తిరిగినను, తదుపరి పామరజనముతోడ చేరినయెడల నీధార్మికత త్వరలోనె నష్టముకాగలదు. అటులగాక నీమనస్సును భగవంతునిపై స్థిరముగ నిలిపితివా, నీభావములు ఎన్నడును భ్రిష్టములు కాజాలవు.

318. సాధుసంగము బియ్యపుకడుగు నీరువంటిది. కల్లు త్రాగినమైకమును హరించుశక్తి బియ్యపుకడుగునకు కలదు. అదేతీరున తుచ్ఛవాంచలనెడు కల్లును త్రాగి కైపునపడియున్న పామరులను స్వస్థతపరచుశక్తి సాధుసంగమునకు కలదు.

319. జగజ్జననియగు ఉమాదేవి హిమవంతుని పుత్రికగా జననముకాంచినప్పుడు, ఆశక్తిమయిమాత తన అవతారరూపములను అనేకముచూపి వానిని ధన్యునిచేసినదని పురాణములు

తెలుపుచున్నవి. కాని ఆపర్వతరాజు వేదవాచ్యుడగు పరబ్రహ్మమును చూపుమని అడుగగా, "ఓజనకా! నీవుపరబ్రహ్మమును చూడదలచితివేని నీవు సాధుసంగముచేయవలయును. సాధువులు సంసారపంకిలమును పూర్తిగవిసర్జించియుందురు.

## 14వ అధ్యాయము.

# ఈశ్వరార్పణము.

320. వఱపిడిరాతిమీాద గీయుటచేత బంగారమును యిత్తడిని కనుగొనుటకు వీలగురీతిని దూషణతిరస్కారములను వఱపిడిరాతితో పరీక్షించుటచేత సత్యమగుసాధువులెవరో మోసపుసాధువులెవరో తెలియవచ్చును.

321. ఈప్రపంచములోనికి వచ్చినందులకు నీవేమిచేయవలయునో తెలియునా? సర్వమును ఈశ్వరార్పణముచేయుము. ఈశ్వరునిగూర్చి స్వార్పణము చేసికొనుము. ఇక నీకేలాటి బాధయునుండదు. సమస్తమును వానియిచ్ఛననుసరించి జరుగుచుండునని నీకు అప్పుడు తెలిసిపోవును.

322. పొలములో ఆరుబయటనున్న చిన్నగుంటయందలి నీరు, యెవరు వాడుకొని హరించకున్నను త్వరలోనె యెండిపోవును. అటులనే ఈశ్వరునిగూర్చి సర్వార్పణముకావించుకొని వానికరుణను కృపను అనన్యగతికముగా నమ్ముకొనుటచేతనే పాపములు హరించును.

323. పూర్ణార్పణమును మించినసులభమును, సురక్షితమును అగుమార్గములేదు. పూర్ణార్పణము అనగా ఈశ్వరేచ్ఛకు తానుపూర్ణముగ లోబడిపోయి, ఏదిగాని నాదిఅను భావములేకుండ మెలగుటే.

324 సర్వార్పణమునకు లక్షణమేమి?

దినమంతయు కష్టపడిపనిచేసి అలసియున్నవాడు దిండు వేసుకొని పరుండి, తీరుబాటుగా చుట్ట త్రాగునప్పుడు అనుభవించు విశ్రాంతిసౌఖ్యము దాని లక్షణము. సమస్తములగు విచారములు ఆందోళనములు విడిచిపోవును.

325. గాలిలో యిటుఅటు ఎగురు యెండుటాకులు తమ నిర్ణయము అనునదిలేక, ఏవిధమగు స్వకీయ ప్రయత్నములేక మెలగుచందమున, భగవంతునిపైన ఆధారపడువారు వాని యిచ్ఛానుసారము వర్తింతురు. తమ యిచ్ఛ అనునది యుండదు. తమ ప్రయత్నము అనునది యుండదు.

326. ఈప్రపంచములో వుండుటో, దీనిని విడిచి పోవుటో ఈశ్వరసంకల్పము ననుసరించి జరుగును. కావున సర్వమును ఆయనకు విడిచివేసి, నీవు పనిని మాత్రము చేయుచుండుము. నీవింతకన్న చేయగలదేమి ?

327. క్రోతితిరుగులాడుచుండ, దానికూన దానిని గట్టిగ పట్టుకొనిన్రవేలాడుచుండును. పిల్లికూన అటుల తల్లినిపట్టుకొనక జాలిపుట్టునటుల కూయును. తల్లియే దానినిమెడపట్టుకొని తీసికొనిపోవును. కోతిపిల్ల తల్లిఆధారమునువిడచెనా క్రిందపడిపోయి హానినందును. ఎందుచేతననగా అదితనబలమునే నమ్ముకొనుచున్నది. పిల్లిపిల్లకు అటువంటిభయములేదు. ఒకచోటనుండి మఱొకచోటునకు తల్లియేదానిని తీసుకొనిపోవును. స్వావలంబనమునకును, ఈశ్వరేచ్ఛకును అర్పణముచేసికొనుటకును గల భేదము యిటువంటిదిగ నుండును.

328. వేయిచిల్లులుగల కడవతో నీళ్లు తెచ్చి, తననిష్కళంక వర్తనమును, ఋజువుచేసికొనవలసినప్పుడు, శ్రీమతిరాధాదేవి ఒక్కనీటిబొట్టైనను క్రిందబడకుండ తెచ్చినది. అందఱును చేతులుచఱచి ఆమెనుపొగడిరి. అట్టినిర్మలచరితయెన్నడునుండి యుండలేదనిరి. ఎన్నడును యుండబోదనిరి; అప్పుడు రాధ "నన్నేలస్తుతించెదరు? ఆమహిమయంతయు, శ్రీకృష్ణునిదే; వానినేస్తోత్రముచేయుడు. నేను కేవలము ఆయనసేవకురాలిని!" అని బోధచేసెను.

## 15వ అ ధ్యా య ము.

# సంసార విరక్తి.

—(o)—

329. లోకములో నివసించుము, కాని లోకమునకు అంటుకొనకుము. "కప్పను పాముముందు, గంతులు వేయించుము. కాని పాము దానిని మ్రింగకుండ చూడుము." అనుసామెత కలదు.

330. పడవనీళ్ళలో యుండవచ్చును; కాని నీళ్లుపడవలో వుండతగదు. సాధకుడు సంసారములో నుండవచ్చును; కాని సంసారము వానిలో యుండరాదు.

331. నీసంసారపుజోలి నీదికాదని సదా భావనచేయుము. అది భగవంతునిది. నీవు వానిసేవకుడవు; వాని ఉత్తర్వులను పాలించుటకే నీవు యిక్కడికి వచ్చియున్నావు. ఈ భావము సుస్థిరమయ్యెనా, నరుడు తనదియని చెప్పుకొనుటకు యేమియు మిగిలియుండదు.

332. యజమానుని యింటినిగూర్చి "ఇదిమాయిల్లు" యని దాసీది పలుకుచుండును. కాని తనయిల్లు అదికాదనియు, తన యిల్లుదూరముగ ఎక్కడనో ఒక పల్లెటూరిలో యున్నదనియు దానికి సదా తెలిసియే యుండును: దాని యాశలు అన్నియు తన గ్రామము పైననే యుండును. తనచేతిలోనున్న యజమానుని బిడ్డనుగూర్చి "మాహరి.! కొంటెవాడైపోవుచున్నాడు" అనియో లేక "మాహరికి,

యిదియిష్టము, అదియిష్టము.” అనియో పలుకుచుండును. కాని ఆహారి తన బిడ్డకాదని దానికి తెలిసియే యున్నది. ఈదాసివలె మమకారము లేనివారై మెలగుడని నాకడకు వచ్చినవారితో నెల్ల చెప్పుచుండును. లోకములో నిష్కాములై జీవింపుమందును. సంసారములో నుండవచ్చును, కాని సంసారమునందు అనురాగము పూనరాదు. సతతము తమ హృదయమును భగవంతునివైపు త్రిప్పుడనియు, తాము విడిచివచ్చిన స్వర్గధామమును సంస్మరింపుచు భక్తితో అక్కై భగవంతుని వేడుకొండనియు చెప్పుచుందును.

333. నీరుకాకినీళ్లలో బొరుగమునుగును; కానిదాని రెక్కలు నీటిచేత తడిసిపోవు. అటులనే ముక్తపురుషులు ప్రపంచములో వసింతురు; ప్రపంచము వారిని అంటదు.

334. సంసారమునందుండియు దానియందు రాగములేక ముక్తుడై యుండువాని లక్షణములెట్టివి? అతడు నీటిలోని తామరాకువలెను, లేక బురదలోని మట్టిగుడిశెయను చేపవలెను యుండును. ఆవరణలువీనిని అంటవు. నీరుతామరాకును తడుపజాలదు; బురద మట్టిగుడిశెయొక్క నిగనిగలాడు శరీరమును మలినపఱచజాలదు.

335. అన్నముతినిపాఱవేసిన ఆకువలె యిందువసింపుము. అదిగాడ్పులకరుణకు లోనైయుండును. ఒక్కొక్కప్పుడది గదిలోను మఱొకప్పుడు పెంటకుప్పలలోను యెగురునటుల చేయబడును. అట్లేయిప్పుడీస్థితిలోనుంచబడితివి; మంచిదియట్లే

యుండుము. యిందుండితీసివేసి ఉన్నతదశయందుంచుమననుకొనుము. "తథాస్తు" అప్పుడు పూర్ణవిరాగముతోఁ డనుండుము, ఏదెటులనడచిన అటుల నడచుగాక.

# 16వ అ ధ్యా య ము.

# వి గ్ర హా రా ధ న ము.

---

336. లక్కపండును, లక్కఏనుగును, నిజపుపండును, ఏనుగును జ్ఞప్తికి తెచ్చువిధమున, పూజింపబడు విగ్రహములు నిరాకారుడై నిత్యుడై వెలుంగు బ్రహ్మమును జ్ఞప్తికి తెచ్చును.

337. ఆకాలమున విగ్రహారాధనను ఖండించుచుండెడి కేశవచంద్రసేనునితో భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసుల వారిట్లు పలికిరి:— "ఈ విగ్రహములు ఎందువలన నీమనస్సులో మన్ను, రేగడ, రాయి, గడ్డి అనుభావనలను కల్పింపవలె? ఈస్వరూపములందు సయితము అలనిత్యానంద విజ్ఞానమయి యగు జగజ్జననియే నీకేలప్రత్యక్షముకారాదు?"

338. తాను అర్చించు దేవులయొక్కయు, దేవియొక్కయు, విగ్రహములు నిజముగా దివ్యరూపములే అని విశ్వసించు నతడు బ్రహ్మమునే చేరును. కాని వానిని అతడు మన్ను, గడ్డి, రాయి, మాత్రమే అనితలచెనా, వానికి విగ్రహములను ఆరాధించిన ఫలములేదు.

339. ఒక చిన్నఅక్షరములను వ్రాయుటకు పూర్వము పెద్దపెద్ద సున్నలను వ్రాయుట నేర్చువిధమున, విగ్రహముల మీద మనస్సునుస్థిరముగ నిలుపుటమూలమునచిత్తైకాగ్రతను

సాధనచేసి, తదనంతరము నిరాకారబ్రహ్మముపైని సులభముగ చిత్తమును నిలుపజాలుము.

340. పెద్దపెద్ద వస్తువులపై అమ్ములవేయుటచేత విలుకాడు బాణప్రయోగమును నేర్చును. బాణప్రయోగమున వానికి నేర్పరితనము కుదిరినకొలది సూక్ష్మతర లక్ష్యములపై గురిని నిలుపసాగును. అటులనే సాకారములగు విగ్రహములపైని మనస్సును లగ్నముచేయుటసాధనచేసినపిమ్మట, నిరాకారవస్తువుపైని మనస్సునులగ్నముచేయుట సులభముగ చేకూరును.

341. ఆవుపాలు నిజముగా రక్తరూపమున ఆవుశరీరమునందంతటను వ్యాపించియుండును. అయినను ఆఆవు చెవులను కొమ్ములను పిండుటచేపాలురావు. పొదుగునుండియే పాలు పితుకవలెను. అటులనే భగవంతుడు జగమునంతటను నిండియున్నాడు. కానిఎల్లెడలను వానిని ప్రత్యక్షముచేసికొనజాలవు. ప్రాచీనభక్తవరులు పూర్ణభక్తితో సాధనములుచేసియుండిన పుణ్యదేవళములందు భగవంతుడు సులభముగా ప్రత్యక్షముకాగలడు.

342. పరమహంసులవారు తనశిష్యులలో ఒకనికి యిట్లు చెప్పిరి:—నీవురేగడమట్టితోచేసినవిగ్రహములగూర్చి వాకొనుచుంటివి. అవియు కావలసియే యున్నవి. ఆత్మపరివర్తనమున ఆయాదశలలోనున్నవారికి అనుకూలించుకొలకు వేర్వేరుఅర్చనారూపములు ఏర్పాటుచేయబడియున్నవి.

343. తల్లితనబిడ్డలలో ఎవరికితగిన ఆహారము వారికి లభించుకొఱకు వంటకములను వేర్వేఱురీతులుగా చేయును. ఆమెకు ఆయిదుగురు బిడ్డలుండి ఒకపెద్దచేపదొఱికినయెడల దానిని వేర్వేఱురీతులుగ పచనముచేసి యెవరికి యేదిసరిపడునో వారికదిపెట్టును. ఒకనికిపల్యాచేసి పెట్టును; జీర్ణశక్తి కొఱవడిన మఱొకనికి చారుగాచిపెట్టును. తక్కినవారికి కూడ వానివానికడుపునకు సరిపడుతీరున వండిపెట్టును.

344. ఒకశిష్యుడు:—బ్రహ్మము సాకారుడు అని నమ్మనేవచ్చును. కానిఅతడు, మనముపూజించు మట్టిబొమ్మమాత్రము కాజాలడు.

గురువు:—దానిని మట్టిబొమ్మఅనెదవు ఏల? ఆదేవతావిగ్రహము ఆత్మమయముగా చేయబడినది.

345. విగ్రహారాధనమున ఏమేని కొఱతయున్నను, అర్చనలు సర్వమును తనకొఱకే ఉద్దేశింపబడినవని భగవంతునికి తెలియదా? అర్చనలు తనకైయే ఉద్దేశింపబడినవని గ్రహించి వానిని భగవంతుడు స్వీకరించును. భగవంతుడు ప్రేమమయుడు. అత్యంత సమీపముగనున్న నీధర్మమును నీవునిర్వహింపుచుండుము.

346. ఒకనికి బ్రహ్మసాక్షాత్కారమైనప్పుడు ప్రతివస్తువును, విగ్రహములు సయితమన్నియు, ఆత్మస్వరూపములే యని తెలిసికొనును. అటువంటివాని దృష్టిలోవిగ్రహము ఆత్మమయరూపమేగాని కేవలము మృణ్మయముకాదు.

## 17వ అధ్యాయము.

# శ్రద్ధ.

347. ఒకనిని చంపవలయుననిన కత్తులు, కఠారులు కావలసియుండును. తనను తాను చంపుకొనుటకు సూదియే చాలును. అట్లేతీరున యితరులకు బోధించవలయుననిన చాల గ్రంథములు శాస్త్రములు చదువుటవసరమగును; స్వస్వరూప సాక్షాత్కారమును పడయుటకు ఒక్కమంత్రమునందు శ్రద్ధయున్న చాలును.

348. చక్కెఱను కణకణలాడు నిప్పుపైన కాచుము. దానిలో మకిలియున్నంతవఱకును ఆపాకమునుండి పొగయు, కళపెళధ్వనులును వచ్చును. కాని మకిలిమాలిన్యము తొలగించిన పిమ్మట పొగయుండదు. చప్పుడుయుండదు: స్వచ్ఛమగు పానకము పొంగులుపెట్టుచుండును. అది గడ్డగట్టినను లేక పానకముగా నున్ననుగూడ దేవతలకుగాని, మానవులకుగాని పరమానందదాయినిగ నుండును. శ్రద్ధగలవానినడతయు అటులనేయుండును.

349. హిందువులలో అనేకతెగలున్నవిగదా ! ఏతెగను యేధర్మమును మనము అనుసరించుట?— పార్వతిరొకసారి "నాథా! నిత్యమై, సత్యమై, సర్వవ్యాప్తమై పఱగుఆనందమునకు మూలమెందున్నది?" అని మహాదేవుని ప్రశ్నించినది. "దానిమూలము శ్రద్ధ (చలింపనివిశ్వాసము) లోయున్నది"

అని ఆదేవదేవుడు ప్రత్యుత్తరమిడినాడు. కావున తెగలు సాంప్రదాయములు భిన్నములుగనున్నను బాధలేదు. ప్రతివాడును తనభక్తిసాధనలను తన సాంప్రదాయకధర్మములను శ్రద్ధతో నిర్వహించిన చాలును.

350. ఎవడు నిర్మలవిశ్వాసముతోడను, నిష్కపటభక్తితోడను సర్వేశ్వరుని యిచ్ఛకుస్వార్పణము కావించుకొనునో అతడువేగమే బ్రహ్మసాక్షాత్కారమును పొందును.

351. ఒకశిష్యుడు తనగురువుయొక్క అనంతమహిమయందు నిశ్చలవిశ్వాసముగలవాడై, కేవలము గురునామస్మరణ మాత్రాన ఏటిపైనడచిపోవుచుండెను. దీనిని కనిపెట్టిన గురువు "ఆహా! నానామమాత్రమునందేఎంతమహిమగలదో! కావున నేనుఎంతఘనుడను; ఎంతమహిమాఢ్యుడనయియుండవలయును!" అని తలంచెను. మరునాడాగురువు "నేను, నేను నేను" అనుచు ఆనదిపైని నడచిపోవయత్నించెను. అతడు నీళ్లలో కాలుపెట్టెనో లేదో, తక్షణము మునిగి లోతునపడిపోయెను. ఫాపము అతనికిఈతరాదయ్యె. విశ్వాసము అద్భుతకార్యములచేయ సామర్థ్యముకలది. అహంకారము నరునికి ప్రాణహానిగూర్చును.

352. ఒకడు నదినిదాటి పోవలసివచ్చెను. ఒకసిద్ధుడు వానికొకతాయెత్తునిచ్చి "ఇదినిన్నునదినిదాటించును." అనిచెప్పెను. ఆమనుష్యుడాతాయెత్తును చేతికికట్టుకొని నదిమీదుగానడచిపోవుచుండెను. ఆతడు ఏటినడుమకుపోవునప్పటికి, తనకింత విచిత్రశక్తినొసగిన తాయెత్తులోపల యేమున్నదో చూడవలయు

నను కోరికపుట్టినది. వెంటనే ధానిని తెఱచి చూచినాడు. దానిలో "రామ" అని పరమేశ్వరునిపవిత్రనామము ఒక్కటి మాత్రమే వ్రాయబడియుండుట వానికి తెలియవచ్చినది. "ఓసి! దీనిలోని రహస్యము యిదేనా ?" అనితృణీకారముతో పలికినాడు. ఇట్లతడు అనుకొనువెను వెంటనే నదీజలములో మునిగిపోయినాడు. భగన్నామము నందలి విశ్వాసము యద్భుతకార్యముల చేయగలదు. అట్టివిశ్వాసము ప్రాణము నసచ్చును. సంశయము మరణమే.

353. బ్రహ్మహత్యా పాపమునకు పాల్పడిన ఒకరాజు ఎట్టి ప్రాయశ్చిత్తముచేసికొని తాను పునీతుడుకాగల్గునో విచారించుటకై యొక ఋష్యాశ్రమమునకు వెళ్లెను. అందుఋషి లేడు. వాని కుమారుడుమాత్రముండెను. ఆఋషిపుత్రుడు రాజు వచ్చిన విషయమును తెలిసికొని "ముమ్మారు రామనామ స్మరణచేయుము; నీపాపపరిహారమగును". అనిచెప్పినాడు. ఋషి తిరిగి వచ్చినప్పుడు తనకుమారుడు విధించిన ప్రాయశ్చిత్తకర్మనుగూర్చివిని, కోపించి, "ఆపరమేశ్వరుని పావననామమును ఒక్కసారి ఉచ్చరించినంతమాత్రాన కోటిజన్మలలో చేసిన పాపపుంజములన్నియు హరించునే! ఓరి మూఢుడా! నీవెంతటి విశ్వాస సూన్యుడవు! అట్టిపవిత్రనామమును మూడుసార్లు ఉచ్చరించుమని విధించితివా! నీవిశ్వాసహీనతకు శిక్షగా ఛండాలుడవై పుట్టుము." అని శపించినాడు. ఆతడే రామాయణమున పేర్కొనబడిన గుహుడు.

354. నీవు ఈశ్వరదర్శనము చేయగోరితివా వాని నామ

మును సుస్థిరవిశ్వాసముతో స్మరించుము. నిత్యానిత్యవిచారము చేయుము.

355. ఎవనికి విశ్వాసము కలదో వానికి అన్నియు ఉన్నట్లే; ఎవనికి విశ్వాసములేదో వానికి అన్నియుకొఱతయే.

356. శ్రీరామచంద్రుడు లంకలో ప్రవేశించుటకుపూర్వము సముద్రముమీద వంతెనను కట్టవలసివచ్చెను. కాని విశ్వాససంపన్నుడగు హనుమంతుడు తనకు రామునిపై విశ్వాసమును సాధనముగా గొని ఒక గంతులో సముద్రమును దాటిపోగలిగెను. కేవలము విశ్వాసమహిమచేత స్వామికన్న సేవకుడు ఘనకార్యమును చేయగల్గినాడు.

357. భరతదేశమునగల వైద్యులలో కేవలము విశ్వాసమును గొలిపిమాత్రమే రోగముల కుదుర్చువారు కలరు. "రోగమనునదియే లేదు." అని పూర్ణవిశ్వాసముతో మరల మరల స్మరించుడని విధింతురు. రోగగ్రస్తులు అటులస్మరణచేసి, ఆభావనామహిమచేతనే ఆరోగ్యమును బడయుదురు. కాబట్టి నీవు పాపినని స్మరించితివా త్వరలోనె నీవు పాపివే అయిపోదువు. నీవు మహామహిమాన్వుడవని యెఱిగి విశ్వాసమును పూనుము. నీవెంతయో మహిమగలవాడవగుదువు.

358. ఒకశిల అనేకవత్సరములు నీటిలోపడియుండవచ్చును. అయినను ఒకచుక్కనీరైనను దానిలోప్రవేశించజాలదు. కానిమృత్తిక నీటిస్పర్శతగులగానె మెత్తబడుచున్నది. అటులనే విశ్వాసముదృఢపడిన హృదయముగలవారు, బాధ

లెన్నివచ్చినను దుఃఖములెన్నిపైబడినను కృంగిపోరు. దుర్బల విశ్వాసముగలవాడో యిసుమంతకష్టముప్రాప్తించిననే చంచలించిపోవును.

359. చకుముకిరాయి నీటియడుగున కోటిసంవత్సరములు పడియుండుగాక, అది తనయందలి అగ్నినికోల్పోవదు. నీవు దానిని యినుముతో యెప్పుడుకొట్టిననుసరే నిప్పురవ్వలు గ్రక్కును. సత్యమగు స్థిరవిశ్వాసి అటులుండును. ఈలోకములో అతడు ఎటువంటిపాతకజనుల నడుమనున్ననుగూడ తన భక్తివిశ్వాసముల నష్టపడడు. పరమేశ్వరునామముచె వినిపడినంతనే తన్మయతను పొందును.

# 18వ అధ్యాయము.

## వైరాగ్యము - లేక నిష్కామ్యత.

360. నిత్యానిత్య విచారముచేసి, నిష్కామియైననేతప్ప, వేదములన్నియు పఠించినను, అపారముగ శాస్త్రములు చదివినను, నిష్ఫలమే. వివేకము, వైరాగ్యములేనిది ఆధ్యాత్మిక యాత్ర సాగదు.

361. బెదురుగుఱ్ఱమునకు కండ్లగంతలుకట్టిననేతప్ప తిన్నగ నడవజాలదు. అటులనే గృహస్థుని మనస్సునకు వివేకవైరాగ్యము లనెడు గంతలులేని యడల చిందులుత్రొక్కి పెడదారుల పోవును. తిన్ననిత్రోవను నడవదు.

362. ప్రశ్న:—పరమాత్ముని చేరుటెట్లు ?

జవాబు:—వానిని దర్శించగోరితివేని, నీతనువును, మనస్సును, సంపదను త్యజించవలసియుండును.

363. భగవంతుని పాదారవిందములకడ శరణుజొచ్చుట సులభమగునా ?

జవాబు:—మహామాయ నిన్నటుల చేయనీయదు. తన ప్రాపుకోరువారు లేకున్నను నరుడు ఒక పిల్లినైన పెంచి సంసారమును కల్పించుకొని బంధనమేర్పఱచుకొనుచున్నాడు. ఆపిల్లికొఱకు పాలు కావలెనని, చేపలుకావలెనని దేవులాడుచు తిప్పలుపడుచుండును. " నేనేమిచేసేది ? ఈపిల్లి

పాలు చేపలుతప్ప మఱేమియు తినకున్నది." అని మొఱలిడు చుండును.

364. ప్రశ్న:- వైరాగ్యము ఎన్నివిధములుండును?

జవాబు— సామాన్యముగ అది రెండురీతులనుండును—

తీవ్రవైరాగ్యము, మందవైరాగ్యము. ఒక్కరాత్రిలో చెఱువుత్రవ్వి నిండుగానీరునింపవలయునని పట్టుపూనుటవంటిది తీవ్రవైరాగ్యము, నెమ్మదిగా, అడుగడుగునకు ఆగుచునడచునది మందవైరాగ్యము. ఇదిఎన్నడు పక్వదశకువచ్చునో చెప్పవీలులేదు.

365. ఒకడు స్నానమునకై ఏటికిపోవుచు మార్గములో యెవరో ఒకపెద్ద మనిషిచాలదినములుగా సన్యాసియగుటకు ఆలోచనలు చేయుచున్నటుల వినెను. ఎట్లో ఈమాటవలన సన్యాసము పరమోత్తమము యనుబుద్ధి వానికితట్టినది. వెంట నేయతడు సన్యాసముపూని కేవలము కట్టుకొనియున్న అంగవస్త్రముతోడనే వెడలిపోయినాడు; తిరిగియింటిచక్కరాలేదు. తీవ్రవైరాగ్యమనగా యిట్లుండును.

366. భగవదనుగ్రహమువలన ఒకనికి తీవ్రవైరాగ్యము లభించెనేని, అతడు కామినీకాంచనముల బంధనమునుండి తప్పించుకొనగలడు. అప్పుడుమాత్రమే వానికి సంసారబంధములు బాయగలవు.

367. గదితలుపు తాళముతీయవలయునంటే తాళపు చెవి వెనుకకు తిరుగవలసియుండును. భగవంతుని ప్రార్థించ దలచువాడు సంసారమును సర్వమును విడువవలసియుండును.

368. కామములనెడు పెనుగాడ్పులువీచగా హృదయాంత రాళమున గందఱగోళముసాగుపట్ల మనము పరమేశ్వరుని నిర్మల కాంతులను చూడజాలము. నిశ్చలముగనుండి భగవత్సాన్నిధ్య సుఖమును హృదయమున పొందజాలునప్పుడే ఆదివ్య దర్శనము లభించగల్గును.

369. తైలముతో తడసియున్న కాగితము పైన ఏమియు వ్రాయలేము. అటులనే పాపచింతనములోలతయును నూనెతో పాడైపోయిన హృదయము భక్తి సాధనకు పనికిరాదు. కాని నూనెకాగితముమీద సున్నము పూసినయెడల వ్రాతకు అనుకూలించును. అటేరీతిగా ఈహృదమునకు వైరాగ్యమనెడు సున్నమును పూసినయెడల అదితిరిగి ఆధ్యాత్మసాధనకు పనికివచ్చును.

370. విషపు సాలెపురుగొకటికలదు. అదికొఱికినయెడల, వుండును పసుపువేళ్లుతెచ్చి వానితోముంగుగానిబురి మంత్రములుపెట్టిననేతప్ప ఏఔషధముచేతను దాని విషము విరుగదు. అలావుండును సంస్కరించిన వెనుక యితరములగు మందులు పనిచేయును; ఆవిధముగానే లోభ మోహాము లనెడు సాలెపురుగులు నరునికొరికినయెడల, ఆతడుపారమార్థిక సాధనల సాగించగల్గుటకు పూర్వము, వైరాగ్యమంత్రముచే సంస్కారమును పొందక తీరదు.

371. తామరలేచినచోట గోకుకొనునప్పుడు హాయిగ నున్నట్లే కనుపించును; కాని తదనంతరము కలుగు మంటలు బాధలు వికృటముగ నుండును. అట్లే యింద్రియభోగ

ములు మునుముందు ప్రీతికరములుగనుండి, తుదిని తెచ్చిపెట్టు దుఃఖములు భరింపరాకుండును; ఊహింపజాలము ఆ బాధ.

372. ముండ్లతోడను పొదలతోడను నిండియున్న యడవిలో చెప్పులు లేకుండ నడచుట దుస్సాధ్యము. ఎవడేని యందులోనికి పోవలయుననిన అడవినంతను తోళ్ళతో కప్పి వేయవలయును, లేదా తనకాళ్ళకు చెప్పులు తొడగవలసి యుండును. అడవియంతటను తోళ్లుపఱచుట అసంభవము గదా. కావున తనకాళ్ళకే చెప్పులు తొడుగుకొనుట లెస్స. అదేతీరున ఈ ప్రపంచములో లోభము దారిద్ర్యము యను నవి అంతులేని బాధల గల్పించుచున్నని. వానినుండి తప్పించుకొనుటకు రెండు తెఱగులే కలవు: సర్వసంపదలను పూర్ణముగ త్యజించుట యొకటి; వానిని పూర్ణముగ చేకూర్చుకొనుట మఱియొకటి; అన్ని వాంఛలను తీర్చుకొని తృప్తినిబడయుట అసంభవము. ఏలయున ఒకకోరిక సఫలమైన వెనువెంటనే మఱొకటి తలజూపుచునే యుండును. కాబట్టి సంతుష్టిని, సత్యజ్ఞానమును, సంపాదించికోర్కెలనడంచివేయుట దొడ్డబుద్ధిసుమీ!

19వ అధ్యాయము.

# పారమార్థిక సాధనయందుదీక్ష

373. గాలము వేసి పెద్దచేపను పట్టుకొనయత్నించువాడు ఎఱనుగ్రుచ్చిన గాలమును నీటిలోవేసి, మౌనముపూని చాలాకాలము శ్రద్ధతో వేచియుండునెడల చేపవచ్చి పట్టుపడును. అటులనేధ్యానాదులసాగించుచు శ్రద్ధతో వేచియుండు భక్తుడు తుదిని భగవంతుని పట్టుకొనగలడు.

374. క్రొత్తగాపుట్టినదూడ తడబడుచు అనేక పర్యాయములు నిలువబోయి పడుచుండును; తుదిని స్థిరత చిక్కినిలువగల్గును. అటులనే క్రొత్తగాధ్యానాదిసాధనలు పూనువాడు చాలసారులు తొట్రుపడును. కానితుదను వానికి జయము సమకూడుదు.

375. భయావహమగు శివసాధనను పూని యిరువురు కాళీదేవిని ప్రత్యక్షము చేసికొనయత్నించిరట. ఒకడు అర్ధరాత్రమునకుచాలపూర్వమె ఆస్మశానమున కాన్పించసాగిన దృశ్యములగాంచి భీతిలిపోయినాడు. రెండవవాడు అర్ధరాత్రము దాటువఱకును ధైర్యముచిక్కబట్టి నిలచి దేవినిప్రసన్నముచేసికొనగలిగినాడు. అప్పుడతడు "జగజ్జననీ! ఈరెండవవాడు "చ్చివాడైపోయినాడు; ఎందుచేతనమ్మా?" అని అడుగగా "పుత్రా! నీవును నీపూర్వజన్మలందు పెక్కుతడవలు యిటు

లనే పిచ్చివాడవగుచు వచ్చితివి. యిప్పుడు తుదకునన్నుగాంచ గల్గితివి" అని జగజ్జనని పలికెను.

376. పాలగిన్నెక్రింద నిప్పున్నంతకాలమును పాలు పొంగుచునేయుండును; కాని నిప్పును తీసినవెంటనే పాలు పొంగుట మానును. అటులనే క్రొత్తగ భక్తిసాధనలు పూనునతడు ఆసాధనలు సాగునంతవఱకే ఆవేశముతో పొంగిపడుచుండును.

377. కమ్మరివాని దాగలిమీద ఎటువంటి సమ్మెట దెబ్బలుతగులునో చూడుడు; అయినను ఆదాగలి చంచలింపదు. మానవులకును అట్టి ఓర్పు, స్థిరత అలవడవలయును.

379. ఓడలోని దిక్సూచీయంత్రమున ముల్లు ఉత్తర దిశను చూపుచుండునంతకాలమును, ఓడ దారితప్పి అపాయముల జిక్కుపడునను భయముండదు. జీవననౌకకు దిక్సూచి యనదగు నరుని మనస్సు పరబ్రహ్మమువంకకు తిరిగియుండి చలింపకుండునంతవరకును వాని శ్రేయస్సునకు అనర్థము వాటిల్లదు.

379. కాళీఘట్టమునకు త్రోవలనేకములుకలవు. సంశయశర్మయనువాడు అచ్చటికి పోవలయునని తనయూరినుండి బయలుదేఱెను. త్రోవలో యతడు "నేను కాళీఘట్టము చేరుటకు మార్గమెద్ది?" అని ఒకమనుష్యుని అడిగినాడు. "ఇదిగో ఈత్రోవనుపొమ్ము" అని అతడుచెప్పినాడు. మరి కొంత దూరముపోయి సంశయశర్మ వేఱొకని చూచి

"కాళీఘట్టమునకు దగ్గఱతోవ యిదేనా? అని ప్రశ్నించినాడు. ఆమనుష్యుడు "అబ్బే యిదికాదు. కొంచెము నేను కనుపోయి, ఆఎడమచేతివైపుతోవను పొమ్ము" అనెను. అప్పుడు సంశయశర్మ ఆరెండవ తోవను కొంతవడిపోయి యింకొకనినికలుసుకొని వానిని త్రోవయడిగినాడు. అతడు మరియొక త్రోవను చూపినాడు. ఇటుల మరలమరల త్రోవలను మార్చుకొనుచుసంశయశర్మ పొద్దుక్రుంకువఱకును నడిచినాడు కాని పయనమైనతావునుండి ఎంతయోదూరము పోలేకపోయెను. నిశ్చయముగా కాళీఘట్టము చేరనెంచువాడు ఎవడోఒకడు తెలిసినవాడుచెప్పుత్రోవనే అనుసరించవలయును. అటులనే భగవత్సాక్షాత్కారమును, పడయజూచువాడు ఒక్కగురువునే ఆశ్రయించి యుండవలెను.

380 ఈతనేర్వ తలపెట్టునతడు కొన్నిదినములు ప్రయత్నమును సాగించవలయును. ఒక్కదినము సాధన చేసినంతటనే సముద్రమున ఈదులాడు సాహసము నెవడును పూనరాదు. అటులనే నీవు బ్రహ్మసాగరమున ఈదులాడనెంచితివేని, నీవు కృతకృత్యుడవగుటకు పూర్వము, ఫలముచే జిక్కకున్నను చాలప్రయత్నముల చేయవలసియుండును.

381. సంచిచిరిగికారిపోయి నలుదిశలునేలబడిన ఆవగింజలను పోగుచేయుట చాలాకష్టము. అటులనే నరునిమనస్సు పలుతెరగుల లోకవిషయములంబడిపోయినయెడల దానిని కూడదీసికొని ధ్యానమునందు ఏకాగ్రముచేయుట దుర్లభము.

382. పంద్రెండువత్సరములు అనావృష్టివచ్చి యేమియు పండకపోయినను వంశపరంపరగా వ్యవసాయముచేయుచుండిన రైతు సేద్యమునుమానడు. కాని క్రొత్తగావ్యవసాయమునకు దిగినకోమటి ఒక్కఋతువులో వానలులేక బెట్టగానుండుట తటస్థించినయెడల దిగులుపడి ఆవ్యవసాయమును కట్టిపెట్టును. అదెతీరున సహజమగుభక్తిగలవాడు ఒకజన్మకాలమంతయు తనభక్తిఫలించి దేవతప్రత్యక్షము కాకపోయినను నిరుత్సాహమును చెందడు. (క్రొత్తగాభక్తిచేయ మొదలిడు నతడు సద్యోఫలములేదని మానివేయును.)

383. ప్రతివ్రతయగు స్త్రీ తాను ప్రేమించిన భర్త మరణించిన యనంతరమును తన పాతివ్రత్యమును వీడక తన భర్తను భావమున పూజించుచునేయుండును. అటులనే అనన్య భక్తిగలనరుడు తన యిష్టదైవతమును నిశ్చలముగ అంటిపట్టుకొనియుండి వానితో నైక్యతను సాధించును.

384. ఇత్తడిచెంబు అనుదినము తోమనియెడల చిలుము పట్టి కగ్గిపోవును. అటులనే ప్రతిదినమును ధ్యానాదులుచేయక విడిచినయెడల నరుని హృదయము మలినమగును" అని శ్రీ పరమహంసులవారిగురువుశ్రీతోతాపురిసెలవిచ్చెను. ఆచెంబు స్వర్ణమయమైనదైనయెడల దానిని ప్రతిదినము తోముట అనవసరము. అటులనే బ్రహ్మసాన్నిధ్యమును పడసిన నరుడు పూజలు పునశ్చరణలు చేయకున్నను లోటుకలుగదు అని శ్రీపరమహంసులవారనిరి.

385. నీవు సజీవుడవై యున్నంతకాలమును, భక్తిధ్యానముల రహస్యములను గూర్చి యనుదినమును విచారణచేయుచునే యుండుము. అందువలన నీకు లాభముకలదు.

386. ప్రశ్న:—ఎప్పుడో అరుదుగా గాని హృదయమున శాంతి పొడమదు. అట్టిశాంతి దీర్ఘకాలము నిలువకుంటకు హేతువేమి ?

జవాబు:—వెదురుకట్టెలు కాల్చిచేసిననిప్పు చల్లారకుండ నిలుపుటకు తఱచుగా కదల్చుచు ఊదుచునుండవలెను. అటులనే ఆధ్యాత్మికాగ్నిని నిరంతరము జ్వలింపజేయు ప్రయయత్నము సాగించుచునే యుండవలయును.

387. ముంగురులు చుట్టుకొనిపోవు సిద్దీ (Negro) జుట్టును పోలియుండుమనస్సు నీవెంతగా సవరించి దాని కుటిలతను (వంకరగతిని) మాన్పజూచినను అది పెడత్రోవల బోవుచునే యుండును. మనస్సును తిన్నగ లాగిపట్టి గట్టిగ నిలిపియుంచునంత కాలము యది సరిగనే నడచును. ప్రయోజనకారిగనే యుండును; కాని జాగ్రత్తకొఱవడెనా యది వక్రగతికి తిరుగును.

388. కొత్తకుండను నిండుగానింపి ఉట్టిమీద బెట్టియుంచుము. నాల్గుదినాలలో నీరంతయుపోయి తడియు ఆరిపోయి పొడిగనుండును, కాని దానినే నీటిలోనుంచితివేని అదటుల నున్నంతకాలమును నిండుగనే యుండును. భగవద్భక్తి విషయమున నీగతియు యిటులనేయుండును. అదేతీరున నీ హృదయమును భగవద్భక్తితోడనింపి, కొంతవడికి దైవమునుండి

దానిని వేఱుచేసి, లోకవ్యవహారములందు నిలిపితిరా, కొలది కాలములోనె భక్తియంతయు పోయి పేదవడును. పావన భక్తివిశ్వాసములు నిరంతరము నీహృదయమును ఆవరించి యుండునటుల జేసితివా సదా యది పవిత్రభక్తిపూరితమైయుండి ప్రసన్నముగ నుండును.

389. సముద్రమున ముత్యములున్నవి; కాని వానిని తీయగోరు నరుడు ప్రాణాపాయమునకు వెఱువక నీటమునుగవలయును. ఒక్కసారి మునిగినంతనే ముత్యములు చేజిక్కని యెడల సముద్రమున ముత్యములు లేవని నిర్ణయించతగదు. మరలమరల మునిగి వెదకులాడినచో తుదకు కష్టము ఫలించును. ఈజగమున భగవంతుడుగలడు. ఆదేవుని కనుగొనుటలో నీతొలిప్రయత్నముఫలమొసగనియెడలనిరుత్సాహివి కాదగదు. పట్టువీడక పెక్కుసారులు పాటుపడుము. తుదిని నీకు వాని సాక్షాత్కారము లభించును.

390. జ్ఞానదానమును పూర్ణముగా నొక్కసారి చేయుటకు వలనుపడదు.

# 20వ అధ్యాయము.

# పారమార్థిక సాధనయందలి అవాంతరములు.

391. పిఱికితనము, ద్వేషము, భయము, లజ్యముచే యుపట్ల భగవంతుడు గోచరించడు.

392. ప్రశ్న:—మనస్సు ఎట్టిదశయందున్నప్పుడు భగవత్సాక్షాత్కారము లభించును?

జవాబు:—మనస్సు ప్రశాంతముగ నున్నప్పుడు భగవంతుడు సాక్షాత్కరించును. మనోజలధిని వాంఛలనెడు గాడ్పులు కల్లోలపఱచు చో అందు దేవునిప్రతిబింబము గోచరించదు; భగవత్సాక్షాత్కారము అట్టిదశయందు అసంభవము.

393. పాపవిషయములందుచరించు మనస్సును మాలపల్లెయందు వసించు బ్రాహ్మణునికి పోల్చనగును; లేదా పెద్దనగరములలోని వేశ్యవాటియందు కాపురముండు సజ్జనునితో పోల్పదగును.

394. అనేకమంది మానవులు వినయము చూపనెంచి "నేను మురికిగుంటలలో నుండు వానపాముపంటివాడనండి! అనుచుందురు, అట్టుల సదామననము చేయుచు నుండువారు కొంతకాలమునకు కీటకములమాదిరి మారి పారమార్థికతయందు క్షుద్రులగుదురు. హృదయమున నిరాశయుండ

తగదు. నిరాశయనునది పురోగమనమునకు ప్రబలశత్రువు. "మనుజుడు తాను మననము చేయురూపమునే పొందును."

395. దారపుకొనను రేగినపోగులున్నంతకాలమును యది సూదిలో దూరజాలని చందమున, నరునందు కోరికలు యేమాత్రమేని రేగుచుండు నంతకాలమును ఆతడు బ్రహ్మ లోకమున ప్రవేశింప జాలడు.

396. కడుపునిండియున్నను అజీర్ణవాతముతో బాధపడుచు న్ననుగూడ నరునికి మిఠాయిగాని, కమ్మని కూరగాని కంట బడగానే నోరూరును. ఒకనికి లోభగుణము యిసుమంతయు లేకపోవచ్చును. అతడు పవిత్రభావములు కలవాడై యుండ వచ్చును. కాని ధనము కన్నులకగపడినప్పుడును, కామ్యార్థ ములు చేరువలో నున్నప్పుడును, వానిమనస్సు పెరపెరలాడును సుమీ!

397. ఇతరులమంచిచెడ్డల విమర్శించుచు కాలముగడుపు వాని జీవనము వ్యర్థముగావ్యయమైపోవును. యిట్లితరులజోలి పెట్టుకొని వ్యర్థకాలయాపనచేయువానికి తనఆత్మను గురించి గాని, పరమాత్మను గురించిగాని చింతనచేయుటకు సమయము చిక్కదు.

398. పెద్దపెద్దధాన్యపుకొట్ల ద్వారములకడ పేలాలు మూటలుగల యెలుకబోనులు పెట్టుదురు. ఆపేలాలవాసన చేతలాగబడి యెలుకలు ధాన్యపుగింజల రుచిచూడవిడిచి బోనులలోనికిపోవును. అందవి చిక్కుకొనిచచ్చును. జీవునిగతి

అల్లగుచున్నది. కామాదులను తృప్తిపఱచుకొనుటచేత కలుగు అల్పసుఖములకంటె యెన్నియోకోట్లరెట్లు సుఖప్రదమగు బ్రహ్మానందమునకు చేరువనే జీవుఁడున్నాఁడు. కాని ఆ బ్రహ్మానందమును ననుభవించుటకు మారుగా ప్రాపంచిక విషయ సుఖముల వాసనచేత లాగఁబడి మహామాయపన్నిన వలలో జిక్కుకొని, భ్రాంతుఁడై యందే మరణించుచున్నాఁడు.

# 21వ అధ్యాయము.

## కామినీకాంచనములు.

—(o)—

(శ్రీరామకృష్ణపరమహంసులవారి బోధల భావమును చక్కగ గ్రహించువారికి శ్రీవారు స్త్రీయెడ నిరసనభావము కలవారు కారనియు, ప్రతివనితయందును శ్రీవారు సాక్షాత్తు భగవతి స్వరూపమునే గుర్తించువారనియు సులభముగ తెలియవచ్చును. శ్రీవారి యాక్షేపణయంతయు కామనిరసనమును సూచించునదే అయియున్నది. పురుషునిగూర్చి వచించునప్పుడు వానిని కామాగ్నిపాలు చేయుటలో స్త్రీ కారకురాలగునని మాత్రమే శ్రీవారి వాక్యములందు మనము గ్రహించవలసియున్నది. అటులనె శ్రీవారు స్త్రీరత్నములతో మాటలాడునప్పుడు పురుషునివలని అపాయములను గూర్చి నిర్దాక్షిణ్యముగ వచించెడివారు. శ్రీవారి స్వవిషయములోనో వారు స్త్రీపురుష భేదభావమునకు అతీతులై యుండెడివారు.)

399. భక్తిసాధనలను సాగించి భగవంతుని ప్రాపించగోరువారు ముఖ్యముగా కామలోభములయొక్క (అనగా విషయలోలతయొక్కయు, ధనకాంక్షయొక్కయు) వలలందు చిక్కుబడకుండ జాగరూకులై మెలగవలయును. లేసియెడల వారు పరిపూర్ణము నెన్నడు చేరజాలరు.

400. పాడుపడి పాములకు నిలయమైన యింటిలో కాపురముచేయువారు, ఏఅపాయము ఎప్పుడు మూడునోయని

నిరంతరము మెలకువతో నుందువుగదా. అటులనే గృహస్థులై వర్తించువారు, కామము లోభము తమను భంగపఱచకుండ మెలకువగలిగి మెలగవలెను.

401. అడుగున సూదిబెజ్జమంత చిల్లియున్నను కడవెడు నీరును క్రమముగా కారిపోవును. అటులనే సాధకునియందు ఏమాత్రపు లోలతయున్నను వాని సాధనలన్నియు సున్నయగును.

402. సన్నిపాతజ్వరముచే బాధపడుచు సంధించియున్న వానిచెంత మంచునీరును, మిఠాయీలను పెట్టియుంచినయెడల వానిని ఆరగించవలయునను ఉద్రేకమును ఆరోగి ఆపుకొనగలడా ?అటులనే కామజ్వరముతో కొట్టుకొనుచు ఇంద్రియ సుఖములకై ఆరాటపడు నరునికి ఒకవైపున సుందరవనితల టక్కులును మరొకవైపున ధనాకర్షణలును సిద్ధమైనచో వానిని అతడు నిగ్రహించ జాలడు. అతడుభక్తిని పోనాడి పెడత్రోవల త్రొక్కుట నిక్కువము.

403. కామినియు, కాంచనమును, లోకమునంతటిని పాపమున ముంచెను సుమీ! స్త్రీజగజ్జనని ప్రతిరూపముగా చూడబడినయెడల ఆమెవలని ప్రమాదముండదు.

కామినీకాంచనములందనురాగము నరుని పీడించుచున్నంతకాలము భగవత్సాక్షాత్కారము కాజాలదు.

404. "నేనుచేయుహరిభక్తి బోధలన్నియు నరులమానసములందు పరివర్తనమును గల్పింపజాలకుండుటకు కారణమేమి? " అని చైతన్యులవారిని నిత్యానందుడు అడిగినాడు.

ఇందుకు సమాధానముగా "స్త్రీల సాంగత్యముననున్నారు గాన వారుఉత్తమబోధలను మనసున నిలుపుకొనజాలకున్నారు. కావున నిత్యానందసోదరా! ఈలౌకికజనులకు పాపము! ముక్తి యలవడుట దుర్లభము" అని శ్రీచైతన్యులవారు పలికిరి.

405. ఈసర్వమును దిగ్రమింగుదానిని "మాయ" యనవలయునా 'మాయి' అనవలయునా?

406. కామినీకాంచనములందు తగులువడిన నరులు వాని మూలమున వేనవేలుగ అవమానములు పొందుచున్నను, వాని బంధములనుండి విడివడి, మనస్సును మాధవునిపైకి త్రిప్పజాలకున్నారు.

407. తీవ్రవైరాగ్యముపూని యొక్కసారి బ్రహ్మసాక్షాత్కారమును పడసినయెడల, అతిబలతరములగు మోహబంధములు తెగిపోయి, భార్యదాపున నున్నను వానికి అపాయము వాటిల్లదు. ఒక యినుపముక్కకు సమదూరమున రెండువైపులను సూదంటురాళ్ళున్నయెడల, వానిలో యేది దానిని లాగివేయును? ఆసూదంటురాళ్ళలో పెద్దదనుటకు సందియములేదు. శ్రీహరి పెద్దసూదంటురాయి అనుటకు సంశయములేదు. అప్పుడు చిన్నసూదంటురాయివంటి స్త్రీ నరునేమిచేయగలదు?

408. నీవెంత జాగరూకతతో మెలగువాడవైనను, నిండుగ పొగచూరి మసిపట్టియున్నగదిలో వాసము చేసితివా, యింతయో అంతయో మసిడాగుపడక తప్పించుకోలేవు. ఎం

తబుద్ధిమంతుడైనను, ఎంత మెలుకువతో మెలగువాడైనను, నరుడు స్త్రీజనము నడుమ వసించునెడల, ఏకొలదిగనైనను కామచింతలు వానిమనస్సున పొడసూపుట నిశ్చయము.

409. యౌవనవంతుడగు ఒకశిష్యుని సందర్భములో శ్రీ పరమహంసులవారిట్లనిరి. వానిముఖమున పతితచిహ్నములు చూపట్టుచున్నవి. నల్లనిపొఅయొకటి వానిమోమున ఆవరించినది. ఇదంతయు వానియుద్యోగబాధల వలన సంభవించుచున్నది. జమాఖర్చులెక్కలు, మరియిట్టివెన్నియో విషయములు వానిని ఆవరించివేసినవి."

410. ధనము నీకు తిండినిమాత్రమే ప్రసాదించ గలదు. అదియొక్కటియే నీజీవనగమ్యమును పరమలక్ష్యమునని తలపోయకుము.

411. ఒకతడవ శ్రీపరమహంసులవారు తరుణవయస్కుడగు శిష్యునొకని చూచి "పామర జనునివలె నీవు డబ్బు పుచ్చుకొనిఉద్యోగముచేయప్రారంభించినాడవు.నీతల్లికొఱకై నీవు పాటుపడుచుచుంటివి. అటులకానియెడల ఛీఛీ! ఛీఛీ! అనియుందును." అని నూరుసార్లు పదే పదే పలికినారు. తుదకు "నీవు భగవత్సేవ యొకటియే చేయుముసుమీ!" అని పలికిరి.

412. కామినియు కాంచనమును నరులను నారాయణుని నుండి వేఱుచేసి, సంసారమున ముంచివేయునని జ్ఞప్తినుంచుకొనుడు. మంచిదిగాని, చెడ్డదిగాని నరుడు తన భార్యను పొగడుచునేయుండుట కడుచిత్రము.

413. కామినీ కాంచన ప్రేమయందు మునిగిన మనస్సు చేత పోకకాయవలె నుండును. అది పచ్చిగానుండునంతకాల మును పై బెరడునకు అంటుకొనియే యుండును. అది పండి యెండినప్పుడు వక్కయు, డొల్లయు వేఱుపడి, కదలించు నప్పుడు లోపలికురిడి లొటలొటలాడును. అటులనే లోనున్న కామినీ కాంచన మోహము ఎండబారినప్పుడు, జీవునకును శరీరమునకును ఎంతమాత్రమును సంబంధము లేదనుట తెలియ వచ్చును.

414. త్రాసుయొక్క ముల్లు నిటారుగ నిలువకుండ ఎప్పుడు ఒరగిపోవును? ఒకవైపుశిబ్బె రెండవదానికన్న బరువైనప్పుడే గదా? అటులనే మనస్సున కామినీకాంచనములంగూర్చిన ప్రేమభారముపడినప్పుడు, అదిభగవంతుని చూచుటతప్పి ఒరగి పోవును.

415. సంసారులారా! స్త్రీలపై మిక్కుటముగ ఆధారపడి యుండబోకుడు. కానరాకుండ వారు మీపైని తమఅధికార మును స్థాపించుకొందురు సుడీ!

416. క్రోంతి వేటగాని కాళ్లకడపడి చచ్చుచందమున పురు షుడు సుందరాంగి చరణములకడ బలియగుచున్నాడు.

417. శ్రీరామకృష్ణ పరమహంసులవారికి ఏలాటికర్చులు అవసరమైనను డబ్బుసిద్ధముగ చేతనుండునటుల కొన్ని వేలరూ పాయలను అర్పణ చేయుటకు అనుజ్ఞనీయు డని యొకమార్వాడీ వర్తకుడు వేడుకొనెను. కాని శ్రీపర

మహాంసులవారు నిష్ఠురముగ వలదని చెప్పుటతప్ప ఆ కానుకను సంతసమున స్వీకరింపరైరి. "నాకుడబ్బుతో నేలాటి పనియు నుండరాదు. దానిని స్వీకరించితినా నామనసు యికదానిపై ననే నిలిచియుండును" అనిరి.

అంతట ఆ పెద్దమనుష్యుడు సొమ్మును శ్రీరామకృష్ణపర మహాంసులవారి బంధుగులలో నెవరి పేరటనో బ్యాంకులో వేసి శ్రీ వారికి వినియోగపడునటుల చేసెదననెను. "అటు లను వలదు. ఆపని కపటకార్యము. యింతేగాక ఒకరి దగ్గఱ నాధనమున్నది అను భావము నామనస్సును ట్టుకొన గలదు." అని శ్రీ వారు చెప్పిరి.

అప్పుడును ఊరకొనక ఆమార్వాడీ "మనస్సు తైలము తీరున నున్న యెడల, అది కామినీ కాంచనములతోగూడిన సంసార సాగరముపైని తేలికగ పఱచుకొని పైపైని తేలు చుండగలదని" ఒకప్పుడు శ్రీపరమహాంసులవారు చెప్పిన వాక్యమును జ్ఞప్తికి తెచ్చి, తనదానమును అంగీకరించుడని మరి మరి ఒత్తిడిచేయసాగెను.

"ఆమాటనిజము. కాని ఆచముఱే నీటిపైని చాల కాలము అటుల తేలుచుండిన యెడల మురుగెత్తును సుమీ! అటులనే కామినీకాంచనయుత సాగరముపైని తేలియాడు చున్నను కూడ, మనస్సునకు వానితోడి సహవాసము చాలకా లము కలిగినయెడల, అది భ్రష్టమై కంపుకొట్టగలదు." అని శ్రీవారు సమాధానము చెప్పిరి.

418. ఇంకొక మార్వాడీ శ్రీపరమహంసులవారిని దర్శించినప్పుడు "స్వామీ! నేను సర్వమును త్యాగముచేసి యున్నాను; ఇంకను నాకు భగవత్సాక్షాత్కారము లభించకుండుటకు హేతువేమి?" అని ప్రశ్నించెను.

శ్రీవారు "నూనెపోసి నిలువయుంచు తోలుతిత్తులను చూచియుందురు. ఆతిత్తుల నొకదానినుండి నూనెనంతటిని కార్చివేసిచూడుడు. దాని అడుగునను ప్రక్కలను కొంత నూనె అంటియేయుండి విడిచిపోదు. నూనెవాసనయో తుదివరకు నుండును. అటులనే కొంతసంసారవాసన మీయందు మిగిలియున్నది." అని వివరించిరి,

419. పాము కంటబడినప్పుడు "తల్లీ! మనసా! నీతోకను మాత్రము చూపుచు, తలను చూపకుండ తొలగిపొమ్ము" అను ఆచారము కలదు; అటులనే కామోద్రేకము పురికొలుపు విషయములనుండి దూరముగానుండుట తెలివిగలపని; వానిపొత్తువలన పతితులై తెలివి తెచ్చుకొనుటకన్న వాని పొత్తునకే పోకుండుట శ్రేష్టము.

420. మనస్సు భోగములపైని ఆశవీడి నిర్మలమైనప్పుడు అది మాధవునిపైని లగ్నముకాగలదు. ఈతీరున బద్ధజీవుడు ముక్తుడుకాగలుగును; హరినివీడి పెడత్రోవనుబోవు జీవుడు బద్ధుడే.

421. ఒకశిష్యుడు భగవద్ధ్యానముచేయుచు కాలము గడుపుచున్నను,అప్పుడప్పుడుదుస్సంకల్పములు తనమనస్సులో లజూపుచునేయుండి, తానుకామమును జయింపలేకుండుటకు

కారణమేమని శ్రీపరమహంసులవారినిఅడిగెను. శ్రీ వారిటుల బోధించిరి.

"ఒకనికడ పెంపుడుకుక్కయుండెడిది. ఆతడు దానిని మక్కువతో చూచి, చేతులలో ఎత్తుకొని, ముద్దాడుచు దానితో చలగాటలాడెడివాడు. ఒకజ్ఞాని యిదిచూచి కుక్కపైని యింతటి యనురాగము చూపతగదని మందలించినాడు. ఏమిచేసినను కుక్కమూఢజంతువుగదా;ఎన్నడైనకఱవచ్చును. దానియజమాని యీబోధనాలకించి యొడిలోనున్నకుక్కను ఆవలికిత్రోసివేసి యికనెన్నడును దానిని చేరదీయుటగాని, ముద్దాడుటగాని, కూడదని నిశ్చయించుకొనెను. కాని, ఆకుక్క యజమానుడు బుద్ధిమార్చుకొనినాడని తెలియజాలక మొన్నటివలె యెత్తుకొని ముద్దాడునను పేరాశతో తఱచుగావాని చెంతకు పరుగెత్తుచుండెడిది. ఎన్నిసారులో యజమానుడు దానినికొట్టి తఱిమివేసినగాని కుక్కవానిని బాధించుటమాని నదికాదు. నీగతియు, ఆయజమానుని గతిని బోలియున్నది. నీవు నీహృదయమునందు చిరకాలము ప్రేమచూపి పెంచిన కుక్కను నీవు వదలించుకొనకోరినను నిన్నుసులభముగ వదల కున్నది. అయినను భయములేదు. ఆకుక్కనిక చేరదీయకుము. అదినిన్నుచేరవచ్చునప్పుడెల్ల ఛీకొట్టి దూరముగతఱిమి వేయుచుండుము. కొంతకాలమునకు ముద్దాడుమని నిన్ను తిప్పలు పెట్టుచున్న ఆకుక్క (కామము)నిన్నువిడిచిపేయును."

422. నీకామసంకల్పమును పూర్తిగ వశముచేసికొనుము. అటులచేయుటయందు కృతకృత్యుడవైనచో నీస్థూలశరీరము

నందొక మార్గేర్పడి "మేధ" అనునాడి యొకటి ప్రబల మగును. ఈనాడికి శరీరమందలి క్షుద్రశక్తులను ఉత్తమశక్తులగపరిణమింపజేయు స్వభావముకలదు. ఈ "మేధ" నాడిబలబడినయనంతరము ఆత్మజ్ఞానము యలవడగలదు.

423. పాములు విషజంతువులు. వాని పట్టుకొనబోయిన యెడల అవి నిన్ను కఱచును. మన్ను మంత్రించి వానిపైనిజల్లి వానిని వశముచేసికొను పాములవానికి పాములనుపట్టుకొనుట యంతకష్టమగు పనియేకాదు. ఏడెనిమిది పాములను సయితము అతడు చేతులకును మెడకును చుట్టుకొని యతడు ఆటలాడ గల్గును.

424. వంతెనక్రిందుగా నీరుపాఱుచు పోవునేగాని అక్కడ యదిమురుగదు. అటులనే ముక్తపురుషుని చేతులగుండా ధనము నడచిపోవునేగాని అందది నిలిచి పేరుకొనదు.

425. ఎవనికి ధనము దాస్యముచేయునో యతడే పురుషుడు. ధనమును వ్యయముచేయుట నెఱుగని వానిని పురుషుడనతగదు.

426. తమ ధనమును, తమ యధికారమును, తమ పేరుప్రతిష్ఠలును, పలుకుబడిని చెప్పుకొని గర్వించువారు కలరు. కాని యివన్నియు నాలుగుదినాలముచ్చటలే! చచ్చినవెనుక వీనిలో వెంటవచ్చునదేదియు లేదు.

427. ధనములో గర్వించదగిన యంశమేమియులేదు. నీవు ధనవంతుడవని చెప్పుకొనజూతువేని నీకంటె ఎందరో యధికధనవంతులుకలరు. వారితోపోల్చునెడల నీవుదరిద్రు

డవే అగుదువు. సంజచీకటులు క్రమ్మగానె మిణుగురుపురుగులుకాన్పించి తాముప్రపంచమునకు వెలుగునిచ్చుచున్నట్లు గర్వించును. కాని నక్షత్రములు తళతళ మెరయుట ప్రారంభముకాగానే వానిగర్వము అడంగును. అప్పుడు నక్షత్రములు "మేముజగమునకు ప్రకాశమునిచ్చుచున్నాము." అని ప్రగల్భములుపాగించును. చంద్రోదయముకాగా యవి వెలవెలపోవుచున్నవి. ఆచంద్రుడో తాను విశ్వమునంతను వెలుగుతో నింపి మనోహరసుందరమూర్తినై పఱగుచుంటినని ఆత్మలో పొంగుచుండును. ఇంతలో అరుణోదయమై తూర్పుదిశను సూర్యభగవానుడు యుదయించనున్నాడనిచాటును. అప్పుడు చంద్రుని ప్రభావమెక్కడ?

ధనికులమని విఱ్ఱవీగువారు ఈప్రకృతి సంఘటనల తలపోసి తమ భాగ్యభోగ్యములగూర్చి మిట్టిపడకుందురుగాక.

428. కామినీ, కాంచనముల మోహము మనస్సునుండి తొలగిన యనంతరము జీవునికి మిగులునదేమిటి? అప్పుడు బ్రహ్మానందము ప్రశాంతముగ పఱగ గలదు.

22వ అధ్యాయము.

# అహంభావము

429. అహంభావము నిలిచియుండునంతకాలము ఆత్మజ్ఞానముగాని, ముక్తిగాని సంభవముకాదు. జననమరణబంధము తొలగదు.

430. నేను ఈగుడ్డను నాముందు తెఱగా పట్టుకొనినయెడల ఎప్పటివలెనే నేను మీకు దాపుగనేయున్నను మీరునన్ను చూడజాలరు. అటులనే అహంభావమను తెఱవలన భగవంతుడు మీకుసర్వముకంటెను దాపుగనున్నను మీరువానిని చూడజాలకున్నారు.

431. ప్రశ్న—స్వామీ మాకీఅవరోధమేల ఏర్పడినది? మేముదైవమును చూడజాలకుండుటేల?

జవాబు—అహంభావమనునది జీవునియొక్కమాయ. ఈ అహంభావమే ప్రకాశమునుఅడ్డుచున్నది. ఈ "అహం, నేను"అనునదినశించెనాచిక్కులేదు. భగవదనుగ్రహమువలన 'నేనుకర్తనుగాను; ఆకర్తను' యనుభావము హృదయమున నెలకొనెనా ఈ జన్మయుండగనే నరుడు ముక్తుడగును. అతని కింక యేలాటిభయమును యుండదు.

432. పేరుప్రతిష్ఠలకై దేవులాడువారు భ్రాంతిలో పడినవారు. సర్వమునకును నియామకుడగు ఈశ్వరుడే అన్నిటిని నడిపించుచున్నాడనియు, సకలమునకును కారణము ఈశ్వరుడే

గాని వేఱొకటి కాదనియు, అట్టివారు మఱచుచున్నారు. బుద్ధిమంతుడు "భగవాన్! అంతయు నీవే; సర్వమును నీవే" అనును. పామరులును భ్రాంతిపరులును "నేను, నేను" అని ప్రలాపింతురు.

433. నీవు ఎంతకాలము "నేనెఱుగుదును" అనిగాని "నేనెఱుగను" అనిగాని పలుకుచుందువో యంతకాలమును నీవొక వ్యక్తిగ భావించుకొనుచునే యుందువు. నీలోని అహమును నేనుతొలగించువఱకును, సమాధిని ప్రాపించి అవ్యయాఖండబ్రహ్మమును కనుగొనజాలవు సుమీ!" అని నాజగజ్జనని పలుకుచున్నది. అంతవఱకును ఈ "నేను" అనునది నాయెదుట నిచిచియే యుండును.

434. వెల్లుల్లిరసము పోసినగిన్నెను వేయుసార్లు తుడిచినను ఆవాసనపోదు అహంభావమనునది యంతటి మొండిభావము. ఎంతటి మహాప్రయత్నములు చేసినను అది పూర్తిగ మనలను విడిచి పోదు.

435. ప్రశ్న:— నరునికి మోక్షము లభించుటెన్నడు?

జవాబు:— వాని అహంభావము నశించినప్పుడే!

436. సమాధిని సాధించి అహంభావమును తొలగించుకొన గల్గువారు చాలఅరుదు. సాధారణముగా యదివిడువనే విడవదు. విసుగు విరామములేకుండ తర్కించినను వివేకించినను ఈ అహం అనునది మరల మరలవచ్చి పైబడుచునే యుండును. రావిచెట్టును యీనాడు నఱికితిమిగదా అనుకొనిన రేపు చిగుర్చనే చిగుర్చును.

437. క్షుద్రాహంకారముతో ఎంతయో తీవ్రంపు పోరాటమునసలిపి, ఆత్మజ్ఞానముకొఱకై భల్లూకపు పట్టుపట్టి ప్రయత్నించి, సమాధిదశను సాధించగల్గినప్పుడు మాత్రము ఈ "అహ"మును దాని పరివారమును తొలగిపోగలవు. అహంభావముచాలమొండిది. దాని మూలముననే మనము తిరిగి తిరిగి యీలోకమున జన్మమెత్తుచుండుట !

438. "నేను భగవంతుని సేవకుడను"అను భక్తుని అహంభావము, విద్యాహంకారమనబడును. దానిని సిద్ధాహంకారమందురు.

439. ప్రశ్న—"నీచాహంకారమ"నగా ఎటువంటిది.

జవాబు—"ఏమిటి! వారునన్నెఱుగరా? నేనింత ధనికుడనే? నాయంతటిభాగ్యవంతు డింకెవడుగలడు? నన్నుమించి పోజాలువాడెవడు? అని ప్రలాపించు "అహంకారము" నీచాహంకారము.

440. తమస్సుయొక్క స్వభావమే అహంభావము. అజ్ఞానమువలననే అదిపుట్టి ప్రబలమగుచున్నది.

441. ప్రశ్న—నేనుముక్తుడనగుట ఎప్పుడు?

జవాబు—"నేను" అను మాటనీనుండి తొలగినప్పుడు! "నేను", "నాది" అనుట అజ్ఞానము; "నీవు, నీది" అనుట సుజ్ఞానము, నిజమగుభక్తుడు "దేవా! నీవేకర్తవు, సకలమును చేయునది నీవు. నేనునీచేతులలో ఉపకరణమాత్రమను. నీవు నాచేత ఏమిచేయించిన, నేనుదానిని చేయుచున్నాను. ఈసమస్తమును నీవిభూతియే. ఈయిల్లు, ఈసంసారము సర్వమును

నీయదియే; నాదికాదు. నీయాజ్ఞానుసారమే సేవయొనర్చుటకుమాత్రము నాకుహక్కుగలదు.” అనిపలుకును.

442. ఇనుము పరుసువేదిని (Philosopher's stone) తాకి బంగారముగా మారనంతవఱకు, నీచలోహముగనే యుండు తీరున,జీవునకు ఈశ్వరసాక్షాత్కారము కానంతవఱకు “నేను కర్తను”అను భ్రమతొలంగదు. అంతవఱకును “నేనుఈసత్కార్యముచేసితినిఆదుష్కర్మనుచేసితిని” అనుభిన్నభావము తప్పక నెన్నంటియేయుండును. ఈ భిన్నభావమే, యీద్వైతభావమే నిరంతరముగ సాగివచ్చుచున్న సంసారమునకు మూలమగు మాయ. ఉచితమార్గముననడుపుసత్వగుణప్రధానమై పఱగునది విద్యామాయ. దీనినిశరణుజొచ్చుదుమేని భగవంతునిచేర గల్గుదుము. ఇట్లుభగవంతుని ముఖాముఖినిచూచి వానిని ప్రసన్నుని చేసికొనినవాడు మాత్రమే మాయాసంసారమును దాటగల్గుచున్నాడు. భగవంతుడే కర్తయనియు, తాను అకర్తనయియు గ్రహించునతడు ఈశరీరముండగనే ముక్తుడు కాగల్గుచున్నాడు. (అనగా జీవన్ముక్తుడగుచున్నాడు.)

443. అహంభావము చాల చెడ్డది. అది నిర్మూలము కానిది ముక్తిచేకూరదు. లేగదూడనుచూడుము. అది పుట్టుటతోడనే “హంహై” (నేనున్నాను) అని యఱచును. అందు ఫలితార్థమేమి? అది పెద్దదైఎద్దగును.అప్పుడు దానిని నాగలికి కట్టుదురు. బరువులతోనింపిన బండ్లనది లాగవలసి యుండును. ఆపైనచో గుంజలకు కట్టివేతురు; ఒకొక్కప్పుడు చంపియు యుగూడ తిందురు. కానియింతగా దండనల పాలైనను,

ఆపశువు "అహం"కారమును వీడదు దాని చర్మముతో డోలు కప్పినప్పుడు "హం" (నేను) అను ధ్వని చేయును. దాని ప్రేవులను పెఱికి చీల్చి దూదేకులవాని నారిగావెనవేసి నప్పుడుగాని ఆపశువు వినయమునేర్చుకొనదు; అప్పుడీపశువు ప్రేవులు "తుహై" (నీవు) అను గానముజేయును. "అహం" (నేను) తొలగి "తు" (నీవు) అను భావము రావలయును. ఆత్మజ్ఞానముకలిగినగాని నరునకు ఈదశప్రాప్తముకాదు.

444. ప్రశ్న:—"అహం" కారము పూర్తిగ ఎన్నడును నశింపదా ?

జవాబు:—కాలపరిపాకమున కలువ రేకులు రాలిపో వును. కాని వానిమచ్చలు నిలిచియుండును. అటులనే నరుని "అహం"కారము పూర్తిగ వదలిపోగలదు; కాని పూర్వస్థితియొక్క చిహ్నములు నిలిచియుండును. అయినను అయ్యవి దుష్కర్మప్రేరకములు ఎంతమాత్రమును కావు.

445. నీవు "అహం"కారమును పోనడంచజాలనటుల కాన్పించినయడల, దానిని "దాసోహం" భావముగ నిలిచి యుండనిమ్ము. "నేను భగవంతుని కింకరుడను; నేను వాని భక్తుడను" అనుకొనునట్టి "అహం" భావమువలన అంతగా కీడుకలుగదు. మిఠాయీలు అజీర్ణవాతమునకు కారణము లగును; కాని కలకండ అట్టిదికాదు; దానియందంతటి దుర్గు ణములు లేవు.

దాసుని "అహం" భక్తుని "అహం", పశివాని "అహం" నీటిపైన పుల్లతో గీసినగీతను పోలియుండును. చాలా కాలము నిలువదు.

446. ,,నేను" అనుశబ్దమును గురించి ఎవడేని మననము చేసి దానిజాడ కనిపట్టవలయునని ప్రయత్నించినయెడల అది ,,అహం"కారమును సూచించు ఒకశబ్దముమాత్రమని తెలియవచ్చును. దానిని వదలించుకొనుట కడుదుర్లభము. దుష్టమగు అహంకారమా, నీవేవిధముగాను నన్నువదలకున్న నే నీశ్వరదాసుడను అను అహంకారరూపమునుధరింపుము. దీనినే పక్వమైన అహంకారమందురు.

447. నీకు గర్వమున్నయెడల, భగవత్కింకరుడననియో, ఈశ్వరతనయుడననియో భావనచేసి గర్వపడుము. మహనీయులందు శిశుస్వభావము కాన్పించును. వారు భగవంతుని యెదుట పసివారివలె నుందురు గాన వారికడ ,,అహం"కారముండదు. వారి బలమంతయు భగవంతునిదే. అది భగవంతుని నుండియేవచ్చును. వారిదేమియు నుండదు.

448. సమస్తమును ఈశ్వరేచ్ఛననుసరించి జరుగుననియు తాను ఆఈశ్వరునిచేతిలోని ఉపకరణమాత్రమనియు, ఎవడేని దృఢవిశ్వాసమును పడసెనేని అట్టివాడీ జన్మమందేముక్తుడగును. ,,ఓ భగవంతుడా! నీపనులు నీవచేయుచున్నాడవు! ఇట్లుండ అహా! వీరలు ,, నేను చేయుచున్నాడను అని వాకొనుచున్నారే!"

449 నీ ,,అహం" భావమురూపుమాసి నీవు పరమాత్మ యందు లయమగుగాంచునప్పుడు ముక్తిలభించును.

450. జీవుని నిజస్వభావము నిత్యసచ్చిదానందము. ,,అహం" కారమువలన పెక్కుఉపాధులుకలుగగా, అతడు తననిజస్వభావమును మఱచుచున్నాడు.

451. అందఱి దుఃఖములును క్రమక్రమముగ సమసిపోగలవు. కాని జ్ఞానికి వానిజ్ఞానము గూర్చిన ఆడంబరము వీడుట దుర్లభము సుమీ!

452. "జగజ్జననీ! నేను ఘనుడను, నేను బ్రాహ్మణుడను వారు క్షుద్రులు, మాలవారు అను భావములన్నింటిని నశింపజేయుము. ఏలయనవారలెవరు?, నీయనంత రూపాంతరములు గాక !"

453. ,,తల్లీ! నేను యంత్రమను; నీవు యంత్రివి. నేను గృహమును; నీవందుండుదానవు. నేను కత్తియొరను. నీవు కత్తివి. నేను రథమును, నీవు రథికవు. నీవు నాచేత ఎట్లు చేయించిన, నేను అటుల చేయుదును. నీవు మాట్లాడించిన తీరున నేను మాట్లాడుదును. నీవు నాలోనుండి వర్తించు రీతిని నేను వర్తింతును. ,,నాహం నాహం" (నేనుకాదు, నేను కాదు.) ,,త్వమసి" (అంతయు నీవే)"

454. రెండు తెఱగుల 'అహం' కారము కలదు; ఒకటి పక్వమయినది, రెండవది అపక్వమైనది. ,,నాదేమియులేదు, నేనేమి చూచినను, అనుభవించినను, వినినను, ఇంతేల నాశరీరము సయితము— నాది కాదు. నేను సదా నిత్యముక్త బుద్ధ

రూపమును' యిట్టిభావముతో వెలయు „అహం" కారము పక్వమైనది ఇది "నాయిల్లు, నాబిడ్డ, నాభార్య, నాతనువు' ఈరీతిగా తలపోయు „అహం" కారము అపక్వమైనది.

455. ప్రశ్న— „దాసోహం" భావముగలవాని అనుభవములును ప్రేరణలును ఎట్టిలక్షణములు గలవిగనుండును?

జవాబు— ఆభావము సత్యమును నిర్మలమును అగునెడల, యీఅనుభవములును, ప్రేరణలును, పేరునకుమాత్రము లీలగానుండును. బ్రహ్మసాక్షాత్కారానంతరము "దాసోహం" భావముగాని, భక్తభావముగాని, ఎవనియందేనినిలిచియున్నను, అతడు ఎవనికిని అపకారము చేయజాలడు. అట్టివానియందు వ్యష్టిభావంపు విషయాంతము హరించిపోయియుండును. పరుశవేదిని తాకినఖడ్గము బంగారుగ మారిపోవును. దాని ఆకారము నిలిచియుండునుగాని అది ఏరికిని హానికూర్పజాలదు.

456. శంకరాచార్యుల యొద్దయొక శిష్యుడు చిరకాలము సేవలుచేయుచుండెను. కాని గురువు వానికేమియు బోధించియుండలేదు. శంకరాచార్యులు ఒకతరి యొంటరిగాకూర్చుండియుండ, వెనుకనుండి ఎవరో వచ్చుచున్నటుల కాలి చప్పుడు ఆయనకు వినవచ్చెను. "ఎవరక్కడ" అనెను. „నేనే" అని ఆశిష్యుడు పలికెను. ఆచార్యులవారప్పుడు "నేను" అనుమాట నీకంత ప్రియమగునేని, దానిచే విశ్వమునంతటెని ఆవరించునంతగా పెంపుచేయుము; లేదా దానిని పూర్ణముగా విడిచివేయుము,, అని బోధించిరట!

457. నరుని లౌకిక ప్రవృత్తునిగను, కామినీకాంచనప్రియునిగనుచేయు "అహం" కారము క్షుద్రమైనది. ఈ "అహం" కారము నడుమచేరి వ్యష్టిని, సమష్టినుండి వేఱుపఱచుచున్నది. నీటిమీద పుడకనొకదానిని పడవేసిన యెడల ఆనీరు విభాగమైనట్లుకాన్పించును. ఈపుడకయే "అహం" కారము. దానిని తొలగించిరా, నీరంతయుఏకమై ఒక్కటగును.

458. వాననీరు ఎన్నడును మెట్లమీదనిలువదు; అదిపల్లమునకే ప్రవహించివచ్చును. అదేరీతిని భగవదనుగ్రహము గర్వితులయొక్కయు, డాంబికులయొక్కయు, హృదయముల నుండిజారి, దీనజనులహృదయములందు నెలకొనును.

459. బియ్యము, పప్పు, ఆలుగడ్డలుమున్నగునవి చల్లని నీళ్లుగలకుండలో వేసినను, దానికి నిప్పుసెగతాకనంతవఱకే వానిని మనముతాకగల్గుదుము. జీవునిస్థితియు యిటులనే యుండును. ఈ దేహమే భాండము, ధనము, విద్య, కులము, వంశము, అధికారము, పలుకుబడి మొదలగునవి బియ్యము, పప్పు, ఆలుగడ్డలు మున్నగువానికి పోల్పవచ్చును. "అహం" కారమే అగ్ని. 'ఈఅహం' కారముసోకినచో జీవునకుతీవ్రతము కల్గును.

460. సూర్యుడు లోకమునకంతకును వేడిని, వెల్తురును యొసగును; కాని మబ్బులుక్రమ్మి వాని కిరణములనుఅడ్డగించి వేయునెడల అతడేమియు చేయజాలడు. అదేవిధమున "అహం"కారము హృదయమును ఆవరించుచో భగవంతుడు అందుప్రకాశింపజాలడు.

461. "అహం"కారము భగవంతుని మనకు కానరాకుండ కప్పిపెట్టు మేఘము లీలనున్నది. సద్గురుకటాక్షము వలన ,,అహం"కారము అడగెనేని భగవంతుడు నిండు తేజముతో కాన్పింపగలడు. ఉదాహరణకు పటములో శ్రీరామచంద్రభగవానుని బొమ్మను చూడుము. (జీవుడగు) రామచంద్రభగవానుడు లక్ష్మణస్వామికి ముందుగ రెండుమూడు అడుగుల దూరమున మాత్రముండును. కాని (మాయాస్వరూపిణియగు) సీత వారిరువురకును నడుమనుండుటచేత, లక్ష్మణస్వామికి శ్రీరామచంద్రుని దర్శనము లభింపకున్నది.

462. ఒక్కొక్క ఉపాధిచేరినకొలదిని జీవుని నైజము మారుచుండును. ఎవడైనను నిగనిగలాడు నల్లంచు సన్నధోవతిని గట్టి సోకుగ దుస్తులు ధరించెనేని, నిధుబాబు విరచిత శృంగారగీతములు వాని పెదవులపై నాట్యము సలుప మొదలిడును. ఇంగ్లీషుబూట్లు తొడగినా కాలులేద్చుకొనుచుపోవు బక్కవానికైనను డంబము సోకును. తక్షణమే అతడు ఈలలువేయసాగును; మేడ మెట్లెక్కవలసినచో దొరగారివలె మెట్టుపైనుండి మెట్టునకు కుప్పించుచుపోవును. వానిచేతికొక కలము చిక్కినయెడల, కైవశమైన కాగితము మీద నెల్ల గిలుకసాగునుకదా!

463. ధనమనునది మిగుల తీవ్రస్వభావముగల ఉపాధి. ఏనరుడేని ధనికుడయ్యెనా వెంటనే పూర్తముగమారిపోవును.

464. వినయవిధేయతలతోనొప్పు బ్రాహ్మణుడొకడు (ఇక్కడికి దక్షిణేశ్వరమునకు) తెఱుచుగా వచ్చుచుండెడివాడు.

కొంతకాలమునకు అతడు రామానినాడు; వానిసంగతి యేమ య్యెనో మాకు తెలియలేదు. ఒకనాడు మేము కొన్నానగ రము బోటెక్కిపోతిమి. మేము పడవదిగుచుండగా గంగానది గట్టునకూర్చుండియున్న ఆబ్రాహ్మణుని కాంచితిమి. నదిపై నుండివచ్చు నిర్మలవాయువులు ననుభవించుచు దొరవలె కూర్చుండి యుండెను. నన్నుచూడగానే అనుగ్రహసూచనగా "ఓహో ఠాకూరా! క్షేమమా?" అనిపలుకరించినాడు. వాని కంఠస్వరమున మార్పునుగనిపట్టి హృదయునితో నేని ట్లంటిని: "హృదయా? వీనికేదియో సంపద చేజిక్కి యుండును. వీనిలో యెంతమార్పుచూపట్టుచున్నదో గ్రహిం చితివా?" అంతట హృదయుడు పకపకనవ్వసాగినాడు.

465. గర్వపడుట మహాధఃపతనము. కాకినిచూడుము; అదితానెంతయో బుద్ధిశాలిననుకొనును. అదెన్నడును వలలో చిక్కదు. ఏమాత్రము అపాయకారణముచూపట్టినను తప్పిం చుకొనిపోవును. కడునేర్పుతోదొంగిలించి మేతనుసంపాదిం చుకొనును. కాని పాపమాజంతువునకు అశుద్ధముతినక తప్ప దయ్యె. అతిగా తెలివియున్నందుకు, అనగా నీచపు చమత్కా రమున్నందుకు ఫలమిటులనుండును.

466. దంభము బూడిదప్రోవువంటిది. దానిమీద నీరు పడినతోడనే ఎండిపోవును. దంభముతో ఉబ్బిపోవువాని హృదయమున ప్రార్థనలు ధ్యానములు ఫలప్రదములు కాజాలవు.

467. రెండుసందర్భములందు భగవంతుడు నవ్వునట!

ఒకటి— జబ్బుముదిరి యొకడుచావనున్నప్పుడు వైద్యుడు వచ్చి, వానితల్లితో "ఎందుకమ్మా! ఆతురపాటునకు కారణమేలేదు. నీకొడుకుప్రాణముసంరక్షించుటకు నాదిభారము" అని పలుకుసమయమున;

రెండవది—ఇద్దఱుసోదరులుచేరి భూమినిపంచుకొనెంచి వారుకొలపగ్గములను చేబూని, పొలముమీదికిపోయి "ఈ ప్రదేశమునాది, ఆ ప్రదేశమునీది" అనుకొనుసమయమునను!

468. కొలదిచదువుగలవారు గర్వముతో తబ్బిబ్బగుదురు. ఒకమానవుడు నాతో భగవంతునిగూర్చి తర్కముసాగించినాడు "అబ్బో! ఈ విషయములన్నియు నేనెఱిగినవే!" అనెను. నేనంతట ,,ఢిల్లీకి పోయివచ్చినవాడు, తానటులపోయివచ్చితినని చాటుచు దంభములు పలుకునా? ఘనుడుతానుఘనుడనని వాకు్రచ్చుచుండునా?" అంటిని.

469. అజీర్ణవాతరోగముగలవాడు పులుసు వస్తువులు తనకు హానికరములని బాగుగాఎఱుగును! కాని అభ్యాసవశమున,అట్టివికండ్లపడెనా వానికినోరూరును. అటులనే ,, నేను ,, "నాది" అను సంకల్పములను ఎంతగా అడంచివేయ ప్రయత్నించినను, కర్మక్షేత్రమున దిగగనే అపక్వపు "అహం"కారము తలవెళ్ళబెట్టుచునే యుండును.

470. సతతము నీవిటుల తలపోయుచుండుము; "ఈ సంసారవిషయములు నావికావు; అవి భగవంతునివి; నేను వానిదాసుడను. వాని కోరికలు చెల్లించుటకే నేనిక్కడ

నున్నాను.” ఈభావము స్థిరపడినయెడల, నరుడు తనది అను కొనుట కేమియు మిగిలియుండదు.

471. ఉత్తమసమాధియను, సప్తమభూమికను పొంది బ్రహ్మభావమున లయముగాంచిన కొన్ని జీవాత్మలు మానవ లోకమునకు మేలుచేయ కరుణగలవారై తమ ఆత్మోన్నతిని నుండి దిగివత్తురు. వారు విద్యాహంకారమును అనగా ఉత్తమాత్మ భావనను నిలుపుకొనియే యుందురు. కాని ఈ “అహం”కారము ఉన్నదనుమాటమాత్రమేగాని నీటిమీద గీసినగీతను బోలియుండును.

472. హనుమంతునకు భగవంతుని సాకార నిరాకార స్వరూపముల రెండును గ్రహించుభాగ్యము లభించినది. అయినను ఆతడు భగవత్సేవకుడను „అహం” కారమును నిలుపుకొనియెను. నారద, సనకసనంద, సనత్కుమారుడును అటులనే నిలుపుకొనగల్గిరి.

(ఈసందర్భమున, నారదుడు మున్నగువారు భక్తులు మాత్రమేనా, జ్ఞానులుకూడనా, అను ప్రశ్న బయలుదేరినది. శ్రీరామకృష్ణపరమహంసులవారిట్లనిరి.)

(నారదాదులు బ్రహ్మజ్ఞానమును పడసినవారే. అయినను మర్మఅర్థ్వనులతో ప్రవహించు సెలయేరులరీతిని వారలు భాగవతస్తోత్రముల గానము గావించిరి; పరబ్రహ్మమును, తామును వేఱను స్ఫురణను కలుగజేయు లీలామాత్రపువ్యక్తిత్వమును అనగావిద్యాహంకారమునువారునిలు

పుకొనిరని తెలియుచున్నది. పారమార్థిక మహాతత్త్వమును యితరులకు బోధించునిమిత్తము వారటుల చేసియుండిరి.

473. తగులబడిన త్రాడునకు పూర్వపుఆకారము నిలిచి యున్నను, దేనినేని కట్టివేయుటకు పనికిరాని విధమున, బ్రహ్మజ్ఞానాగ్నిచేత దగ్ధమైన "అహం" కారముండును.

474. కొబ్బరిమట్ట పడిపోవునప్పుడు చెట్టుమీదనొక మచ్చనునిలిపి పోవును. దీనినిబట్టి ఆతావున ఒకమట్టయుండెడిదని మనకు తెలియవచ్చును. అటులనే బ్రహ్మవేతలకు క్రోధాది ఉద్రేకములు కృశించి నశించిన చిహ్నములు మాత్రము నిలుచును. అట్టివారి స్వభావము పసివానినైజమును బోలియుండును. పసివానినైజమున సత్త్వరజస్తమోగుణములు బలపడియుండని కారణమున అతడు ఒకదానియందు ఆసక్తినిపొందునటులనే దానిని విడిచివేయును: ఒక చిన్నపిల్లవానికడ చాలవిలువగల వస్త్రముండగా "నేను దీనిని ఎవరికిని యియ్యను. యిది మానాయనకొనిపెట్టినాడు." అని పట్టుదలతో మొదటచెప్పినను కూడ, దమ్మిడీ ఖరీదుచెయ్యని బొమ్మనిచ్చి ఆవస్త్రమును నీవు సంగ్రహింప గలుదువు. పసివానిదృష్టిలో ప్రతిది సమానమే. ఉత్తమాధమములను భేదభావము లేదు. కులభేదముల పాటింపడు. వానితల్లి యింకొకని చూపి "వాడునీఅన్న" అనిచెప్పినచాలును, ఆతడుకడజాతివాడైనను సరియే. ఒక్కకంచములో వానితోడ తిండితినుటకొడంబడును. వాని ద్వేషగుణము, శుచి, అశుచి అనుభావములునయితముయుండవు.

475. ఎవడో తనను ముక్కలుముక్కలుగా నఱుకవచ్చు చున్నటుల ఒకనికి కలవచ్చెను. దద్దఱిలిపోయి, ఆతడు మేల్కాంచును. తనగదితలుపులోపల గడియవేసియేయున్నటులను, అందెవరును లేనటులను తెలిసికొనును. అయినను కూడ కొన్నినిమిషములవఱకును వానిగుండెకొట్టుకొనుచునేయుండును. అటులనే మనఅభిమానాహంకారములు మననువీడి చనునప్పుడు తమమహిమను లేశమైన వెనుకవిడిచియేపోవును.

476. ప్రశ్న—మీరుసమాధిస్థితిలో నుండునప్పుడు, లీలగానైనను „అహం” కారము మీయందు నిలుచునా?

జవాబు-ఆహా! సామాన్యముగాకొంత „అహం„ కారము నిలిచి యుండును. బంగారపుసుద్దమీదవేసి రుద్దిన చిన్న బంగారురేకు పూర్తిగా అరుగకుండురీతి నుండును. బాహ్యస్మృతి యంతయు తొలగును; కాని బ్రహ్మానందమును అనుభవించుకొఱకు కొంత „అహం„కారమును భగవంతుడు నాలో నిలిపియుంచును.

ఒక్కొక్కప్పుడు మాత్రము, దానిని సయితము భగవంతుడు తొలగించివేయును. ఇది పరమోత్తమ సమాధిస్థితి. ఆస్థితి యిట్టిదని ఎవ్వరును పలుకజాలరు. అది జీవాత్మపరమాత్మగా సంపూర్ణముగా మారిపోవు అనిర్వాచనీయావస్థ. ఉప్పుతోచేసిన బొమ్మ సముద్రమును కొలుచుటకై దానిలో ప్రవేశించును. అది నీటిని తాకినతోడనే కరిగిపోవును. ఆపిమ్మట సముద్రము ఎంతలోతుగలదో చెప్పుటకై మరలివచ్చుటకు ఎవ్వరున్నారు?

477. ఒకసారి గురుదేవుడు తన శిష్యులలో నొకనిని వేడుకగా యిట్లు ప్రశ్నించెను? "సరేగాని, నాయందు అభిమానమున్నట్లు నీకు కాన్పించుచున్నదా? నాకు అభిమానమేమైన కలదా?"

శిష్యుడిటుల నెను. "అవును, కొంచెమున్నది. ఆ కొంచెము నిలిచియుండుట ఎందుకొఱకనగా; (1) శరీర రక్షణ కొఱకు, (2) భగవద్భక్తి సాధననిమిత్తము, (3) భక్తులసాంగత్యమునకూడియుండు యిచ్ఛవలన, (4) అన్యులకు సుబోధ గఱపుకోరికను బట్టియును. అయిననుకూడ మీ రెంతయో ప్రార్థింపబడిన యనంతరము అటుల నిలుపుకొనియుందురు. మీ ఆత్మయొక్క సహజదశ "సమాధియే" యని అభివర్ణింపనగును అని నాభావము. కాబట్టి మీకుగల అభిమానము మీరు ప్రత్యేకముగ ఉద్యమించి చేసినప్రార్థనాఫలమని చెప్పితిని.

గురువు—అవునుకాని ఈ జీవుని నిలిపియుంచుకొనునది నేనుకాదు. అటులచేసినది నాజగజ్జనని; నాప్రార్థనను అంగీకరించు యధికారమంతయు నాదివ్యమాతదే.

478. భగవద్దర్శనముచేసినవాడే నిజమగుజ్ఞాని. అతడు పసిబాలునితీరున నగును. బాలుడుతనదగు వ్యక్తిత్వముగలవాడుగనే తోచును. కాని వాని వ్యక్తిత్వము చూపులకు మాత్రమే; సత్యముకాదు. పెద్దవారలవ్యక్తి భావముతో పోల్చిన యెడల పసివారల వ్యక్తిత్వము శూన్యమైతోచును

479. సమాధిని సాధించిన పిమ్మటను ,,దాసోహం'' రూపమునగాని, ,, భాగవతోహం '' రూపమునగాని తమ ,,అహం,, కారమును కొందఱునిలుపుకొందురు. ఇతరులకు బోధచేయునిమిత్తము శ్రీశంకరాచార్యులవారు విద్యాహంకారమును నిలుపుకొనిరి.

480. ,,తల్లీ, నీదుకార్యములను నీవ చేసుకొనుచున్నావు; కాని నరుడు ,,నేను చేయుచున్నాను అని తలచును,, అనుచు ఎవడేని సర్వమును చేయునది భగవంతుడేయను విశ్వాసమును పూనినయెడల జీవన్ముక్తుడగును. (ఈ జీవముండగానే ముక్తుడగును.)

481. ఒకనికి తాను నాయకుడననియు, ఒక సంప్రదాయ నిర్మాతననియు, తలంపుకలదేని వాని "అహం"కారము అపక్వమైనది. అయినను బ్రహ్మానుభవమును పొందిన యనంతరము భగవంతుని ఆదేశము ననుసరించి, పరోపకారమునకై ఉపదేశములు చేయుటవలన హానిలేదు. పరిక్షుతునకు భాగవతమును బోధించునిమిత్తమై శుకమహామునికి అట్టి ఆదేశము కలిగినది.

482. గట్టిపాఱిన కలకండయందు, ఇతరములగు మధురపదార్థములందలి దుర్గుణములు లేనితీరున "దాసుడను" "ఉపాసకుడను" అనుకొను జీవాత్మయందు అపక్వజీవులందు గల దోషములుండవు, మఱియు వాని బావము భగవంతునే చేర్చును. నిజమునకు యది భక్తియోగమే !

—(o)—

23వ అధ్యాయము.

# ఆహారనియమము - ఆధ్యాత్మజీవనము.

483. పగలు తృప్తిగ భుజించుము; కాని రాత్రికాలమున తేలికగ కొలదిగ భుజింపుము.

484. విద్యార్థియొకడు భగవాన్ శ్రీరామకృష్ణులవారిని "ఒకే బ్రహ్మము సర్వజీవులందును వసించును గాన ఎవనిచేతి, ఆహారము తినినను హానియేమి?" అని ప్రశ్నించెను. నీవు బ్రాహ్మణుడవాయని యడుగగా ఆవిద్యార్థి అవునని ప్రత్యుత్తరమిచ్చెను. అంతట పరమహంసులవారు "అందువలననే నీవు నన్నిట్లడిగినావు. నీవు ఒకనిప్పుపుల్లను వెలిగించి దానిపైన యిన్ని ఎండుకట్టెలనే పడవేతువనుకొనుము. ఏమగును?" అని యడిగిరి.

విద్యార్థి:— ఆప్రోగుచే కప్పిపెట్టబడి, నిప్పు ఆరిపోవును.

పరమహంస:— కార్చిచ్చుమండుచుండగా, దానిలో పచ్చి అరటిబోదెలను చాలగ తెచ్చిపడవేతువు అనుకొనుము అవి ఏమగును?

విద్యార్థి:— ఒక్క క్షణములో అవి భస్మమైపోవును.

పరమహంస:— ఆవిధముననే నీయందలి ఆధ్యాత్మిక శక్తి కొలదిపాటిగనున్నప్పుడు, విచక్షణలేకుండ ఎవడిచ్చిన

ఆహారమునైనను తినుచుండువేని ఆశక్తి అడిగిపోవచ్చును. అదే ప్రబలముగ నున్నప్పుడు నీవు ఎట్టిఆహారము తినినను ఏమియు చేయదు.

485. శరీరమునకు వేడిచేయనట్టియు, మనస్సునకు ఉద్రేకము కల్గించనట్టియు ఆహారమునే భక్తుడు భుజింపవలయును.

486. ఎవడు సాత్త్విక శాకాహారమునే తినుచున్నను, బ్రహ్మప్రాప్తిని కోరుకొనడో, వానికి ఆసాత్త్వికాహారము సయితము గోమాంసమంత అనర్థకరమేయగును. ఎవడు గోమాంసము తినుచునుకూడ బ్రహ్మప్రాప్తిని కాంక్షించునో వానికి ఆగోమాంసము సయితము దేవతలారగించు అమృతమువంటిది కాగలదు.

487. శ్రాద్ధసమయములందిడు భోజనముల స్వీకరింపకుము. అట్టితిండి భక్తివిశ్వాసముల నాశముచేయును. ఇతరులచేత హోమాదులచేయించి జీవించుపురోహితుని యింటనుభోజనము చేయతగదు.

488. ఆహారవిషయములో ఏదిదొఱకిన దానినే తినదగదా?

పరమహంస—అది వానివాని ఆధ్యాత్మికదశను అనుసరించియుండును. జ్ఞానమార్గమున దానివలని హానియుండదు. జ్ఞాని ఆహారమును భుజించునప్పుడు, దానిని అతడు కుండలినీ అగ్నియందు హుతముచేయును. భక్తునివిషయమో వేఱు. భక్తుడు తనయిష్టదైవతమునకు నివేదన చేయుటకు అర్హమగు పవిత్రాహారమును మాత్రమే ఆరగించవలయును. మాంసా

హారము భక్తునకు తగదు. కాని నామాటవినుము. ఒకడు పందిమాంసము తినుచునుగూడ, భగవంతుని యెడ అనురక్తుడయ్యెనా అతడు ధన్యుడు. మఱియొకడు పరమాన్నమును లేక హవిష్యాన్నమునే ఆరగించువాడైనను, వానిమనస్సు కామినీ కాంచనములందు తగులువడి యుండెనా అతడు హతభాగ్యుడే !

489. నేనొకతరి మహమ్మదీయ గురునిచేత ఉపదేశమును పొంది, అనేకదినములు అల్లాస్మరణచేయుచు, మహమ్మదీయుల ఆచారములనే అవలంబించి వారి ఆహారములనే తినెడివాడను. ఆదినములలో నేను కాళీమాత దేవళమునకు పోజాలకపోతిని; హిందూదేవతానామముల స్మరింపనైన నాకు సాధ్యముకాలేదు.

## 24వ అధ్యాయము.

# ధ్యాననిష్ఠ

490. తీవ్రధ్యాననిష్ఠ ధ్యేయ వస్తువుయొక్క నిజలక్షణ ములను ప్రస్ఫుటముగావించి, ధ్యాతయొక్క ఆత్మయందు నెల కొనునటుల చేయును.

491. సాత్వీక స్వభావముగలవాడు ఎటుల ధ్యానిం చునో తెలియునా? ఆతడు అర్ధరాత్రి వేళను, ప్రక్కపై పరుం డియు, ముసుగు వేసికొనియు, ఇతరులు తననుచూడ రాకుండ ధ్యానము సలుపును.

492. ప్రారంభదశయందు, మనోసంయమనము చేయు నతడు, ఏకాంతస్థలములందు సాధనచేయవలయును; కాదేని అనేక విషయములు వానికి చంచలమును కల్పించును. పాలను నీటినిచేర్చి పెట్టితిమేని అవి కలసిపోవుటసత్యము. కాని పాలను చిలికి వెన్నగాచేసితిమేని, అటుల వెన్నగా రూపాంతరమును పొందినపాలు నీటిలో కలిసిపోవుటకు మారుగా ఆనీటిపైన తేలియాడుచుండును. అదేతీరున నిరంతరసాధనచేసి మనుజుడు ఏకాగ్రచిత్తమును పడసెనా, అది వాని అవరణమును ఉల్లం ఘించి, బ్రహ్మభావమున శాంతి ననుభవించుచుండును.

493. ప్రారంభకుడు ధ్యానసాధన సమయమున ఒకవిధ మగు నిద్రలో పడుచుండును. దీనికి యోగనిద్రయని పేరు: అట్టి.

తరుణమున వానికి పారమార్థిక దృశ్యములు తప్పక కాన్పించు చుండును.

494. "ధ్యాన సాధనయందు పక్వదశను సాధించిన వారికి మోక్షము మిగులదావు" అను సామెత కలదు. మనుజుడు ధ్యానమున ఎప్పుడు పరిపక్వదశను పొందునో తెలియునా? ఆతడు ధ్యాననిష్ఠయందు కూర్చుండగానే, వెంటనే ఆత్మావరణయందు నిమగ్నుడై, వాని ఆత్మపరమాత్మ సంయోగమును పడయుస్థితి సంప్రాప్తించినప్పుడు!

495. మందులు మధువున సమ్మిశ్రమైపోవు వడువున నీవు భగవంతునియందు విలీనమై పొమ్ము!

## 25వ అధ్యాయము.

# భక్తి లేక ఈశ్వరానురక్తి

496. అనురక్తియొక్క పూర్ణసిద్ధావస్థ లేక పరాభక్తి అనగా ఎట్టిది?

అనురాగసిద్ధావస్థయందు, అర్చకుడు భగవంతుని గూర్చి తనప్రియతమునిగానో, అత్యంతసన్నిహిత బంధువునిగనో, మననముచేయును. అదిగోపికలు శ్రీకృష్ణునియెడ చూపిన అనురాగమును బోలియుండును. వారిని వారుజగన్నాథునిగగాక సదాగోపీనాథునిగనే పాటించి అటులనే పిలుచుచువచ్చిరి.

497. నున్ననిఅద్దముపైని దేనినిగాని ముద్రింపవీలులేదు. దానికితగిన లేపనముల రాసినపిమ్మట రూపగ్రాహి (ఫోటో) యందువలె, చిత్రరూపములనుదానిపైని ముద్రింపవీలగును. అటులనే నరునిహృదయమునకు భక్తియనురసాయనిక లేపనమును కల్పించినయెడల భగవంతుని ఆకృతినే అందుస్థిరముగ ముద్రింప వసతిగల్గును.

498. చెఱువులోని చేపలు ఎంతదూరముగ నున్నను మధురమై నోరూరించగల ఎఱను నీట జల్లినయెడల అవి తక్షణమే నలుదిశలనుండి పర్విడివచ్చును. అదేతీరున, భక్తునిహృదయమున భక్తి విశ్వాసము అను ఎఱను వెదజల్లినచో చచ్చుఱ భగవంతుడు యచ్చటికివచ్చి చేరును.

499. హరినామోచ్చారణము చెవులకు సోకగానె నేత్రములు బాష్పపూరితములగు దశ ప్రాప్తించునంతదాక భక్తి సాధనలు అవసరములు. భగవన్నామము సూచితమగు వెంటనే ఆనందబాష్పములు వెల్లివిఱియ, హృదయముప్పొంగునతనికి భక్తిసాధనలు ఇంక నగత్యములేదు.

500. భగవంతుడు పంచదారకొండవంటివాడు. చిన్న చీమపోయి ఒకచిన్న నలుసును తెచ్చికొనును; పెద్దచీమపోయి ఒకపెద్ద పలుకును తెచ్చికొనును; కాని ఆకొండ ఎప్పటివలెనే యుండును; తఱుగదు. భగవద్భక్తులు యిటులనే యున్నారు. భగవంతుని విభూతులలో అత్యల్పమగుదానిని గాంచియే వారు పరవశులయిపోవుదురు. వాని మహిమలను, విభూతులను, అపరోక్షముగ జూచుటకు ఏవాడును భరింపనోపడు.

501. కొందఱికి గుక్కెడుసారా త్రాగినంతనే తలతిరిగిపోవును; మరికొందఱికి రెండుమూడుసీసాలు త్రాగినగాని కైపురాదు: వీరును వారును కైపువలని ఆనందమును సమముగనే పొందుదురు. అదేవిధముగ కొందఱు భక్తులకు భగవద్విభూతియొక్క ఒక్కకిరణముంజూచిన మాత్రాన పరవశత కల్గును; మఱికొందఱు భక్తులకు జగన్నాథుని ప్రత్యక్షముగ దర్శించినప్పుడే పారవశ్యము చేకూరును; వీరును వారును గూడ దివ్యానందభరితులేయై సమముగ ధన్యులగుదురు.

502. బ్రహ్మజ్ఞానము పురుషునిబోలునది; భక్తియో స్త్రీ వంటిది; జ్ఞానమునకు భగవంతుని అతిథిశాలవఱకే ప్రవే

శము లభించును; భక్తికో భగవంతుని అంతఃపురమును జొచ్చు వసతి యబ్బగలదు.

503. భగవద్భక్తిసాగరమున లోతుగ మునుంగుము. భీతి వలదు, అయ్యది అమృతసాగరముసుమీ ! నేను నరేంద్రుని తోడ ఒకప్పుడిట్లుపలికితిని:- "భగవంతుడుమధురసాగరము. ఆసముద్రమున లోతుగనీవు మునుగకోరుకొనవా ? వెడల్పు మూతిగల పాత్రిలోచక్కెరపానకము పోసిరనుకొనుము. దానిని త్రాగవాంఛించుఈగవు, నీవు అనుకొనుము.

నీవు ఎక్కడనుండి దానిని త్రాగెదవు ?

తాను దానిఅంచుననుండి త్రాగుదుననియు, లేక తాను దానిలోపడుట తటస్థించినయెడల దానిలోనేమునిగి చావవలసి వచ్చుననియు, నరేంద్రుడు బదులుపలికినాడు. అంతట నేనిట్లు చెప్పితిని.

"అబ్బీ ! నీవు ఆదివ్యసాగరమున లోతుగపొచ్చి నప్పుడు అపాయముకల్గుననిగాని చావుమూడుననిగాని భయ పడనవసరములేదనుటను మఱచినావు. ఆసచ్చిదానందసాగ రము అమృతసముద్రము; నిత్యజీవనముతో నిండియుండునది; వెడగుమానసులవలె, నీవు భగవదనురాగమున "హద్దుమీరి పోదునేమో ! యని భయపడకుము."

504; ప్రేమ కొలదిమందికి మాత్రమేలభ్యముకాగలదు. వారసాధారణప్రజ్ఞావంతులుగనుండి. భగవదావేశ కలితులై యుందురు. అట్టివారు భగవన్మహిమలకును అధికారముల కును వారసులై ప్రత్యేక వర్గముగ నేర్పడియుందురు. చైతన్య

దేవునివంటి ఈశ్వరావతారములును, ఈశ్వరాంశములగు పేరి పరమభక్తులును, ఈవర్గమునకు చెందినవారే.

505. ప్రేమకు విశిష్టలక్షణములు రెండుగలవు: ఒకటి బాహ్యప్రపంచ విస్మరణము; రెండవది, శరీరము యొక్క మఱపు:—

506. ఒకనికి సూటియైన మార్గము తెలియకున్నను, భగవద్భక్తియు, భగవంతుని తెలిసికొనవలయునను తీవ్రవాంఛయు నుండవచ్చును. అట్టివాడు తనభక్తియొక్క ప్రభావము వలననే భగవంతుని చేరజాలును. ఒక మహాభక్తుడు జగన్నాధమును దర్శింప పయనమైనాడు. పూరీ గజన్నాధమునకు త్రోవ నెరుంగక ఆవైపునకు పోవుటకుమారుగా వేఱుత్రోవను నడువసాగెను: కాని మిగుల నాతురపాటుతో తనకు త్రోవలో కనుపించిన వారినెల్ల అడుగుచు పోయెను. వారందఱును "ఇదిత్రోవకాదు. అల్లదిగో త్రోవ అట్లున్నది" అని చెప్పసాగిరి. ఎట్టకేలకు ఆభక్తుడు పూరి నగరముజేరి కృతార్థుడయ్యెను. అటులనే ఒకనికి యిచ్ఛయుండి, మార్గము తెలియకున్నను తొందరలేదు: వానికి ఎవరోత్రోవ జూపువారు దొఱుకుదురు: పథిమములో ఒకడుపొరబడినను, తుదకేనరేని వానికి సరియైన మార్గము చూపకపోరు.

507. భక్తి చంద్రుడు, జ్ఞానము సూర్యుడు, యనదగును. ఉత్తరపు కొనయందును, దక్షిణపు కొనయందును సముద్రములు కలవని చెప్పగా వింటిని. అచ్చట మిగుల శీతలముగ నుండును; సముద్రములు కొంతకొంతగా గడ్డకట్టిపోయి పెద్ద

పెద్ద మంచుగడ్డ లేర్పడును; వానిలో ఓడలు చిక్కుకొని కదలక నిలిచిపోవును:—(అటులనే భక్తిమార్గమున కొంతదూరము పోగా నరులును చిక్కుకొని పోదురా?)

అవును; నిజమే. అయినను సేగిలేదు. వీరినిచిక్కుబట్టుమంచు సచ్చిదానంద సాగరపుజలము ఘనీభవించగా ఏర్పడినది! బ్రహ్మసత్యము; జగత్తు మిథ్యఅను తర్కమును పూనుదురేని అజ్ఞానసూర్యతాపముచేత అమంచుకఱగును.

తరువాత ఏమిమిగులును?

సచ్చిదానందసాగరజలము మాత్రమే, ఆకారశూన్యమగునది మిగులును.

508. జ్ఞానప్రాప్తి పిమ్మట సయితము నారదుడు మొదలుగాగల ఆచార్య వర్గము లోకసంగ్రహణార్థము (లోకజనులకుఉపకారము చేయునిమిత్తము) భక్తిమార్గమును అవలంభించిరి.

509. ఎందువలననో తెలియకుండనే భగవంతునియందు అనురాగముపూనుటకలదు. ఇదిప్రాప్తించెనా యింకవాంఛింపదగినదేమియుండదు. అట్టిభక్తిగలినవాడిటులనును.

,,ఓదేవా! నాకు సంపదలువలదు. ఖ్యాతివలదు, ఆరోగ్యమువలదు, సుఖమువలదు. ఇట్టిదేమియు వలదు. నీపాదారవిందములందు నిర్మల భక్తిని మాత్రము ప్రసాదించుము."

510. వైధి భక్తినాబడు ఒకరీతి భక్తికలదు (ఇది శాస్త్రపద్ధతిని విధింపబడిన భక్తి). ఇన్నిపర్యాయములు భగవన్నామ

స్మరణచేయుట, కొన్ని సమయములందు ఉపవాసముచేయుట, కొన్ని ప్రత్యేకపూజాద్రవ్యములతో అర్చనలుచేయుట, కొన్ని తీర్థయాత్రలుచేయుట, ఇత్యాది విధులు వైధిభక్తికి లక్షణములు. ఇట్లు చాలాకాలము సాధన జరిపినయెడల పై తరగతిదగు "రాగభక్తి" అలవడును. అనురక్తి యిందు ప్రధానముగ కావలసినది. సాంసారికభావములు పూర్తిగ పోవలయును. మనస్సు భగవంతునిపైననే పూర్ణముగ స్థిరపడవలయును: అప్పుడుగాని వానిని చేరుట సాధ్యము కాదు. రాగభక్తిలేక భగవంతుని ఎవడును చేరలేడు.

511. స్వాభావికముగనే ఈరాగభక్తికలవారు కొందఱుందురు. ప్రాయికముగా వారికది పసితనమునుండియే అలవడనగును. అట్టివారు ప్రహ్లాదునివలె శైశవమునుండియు భగవంతునికొఱకై పరితపించుచు రోదనములు చేయుదురు. వారు నిత్యసిద్ధుల తరగతిలో చేరినవారు. సిద్ధాత్ములై జనించినవారు.

512. ప్రశ్న:—భగవంతునికొఱకై భక్తుడు సర్వమును త్యాగముచేయు టెందులకు?

ఉ:— శలభము దీపమును చూచినతోడనే చీకటినుండి పర్విడును. చీమ పానకములోపడి ప్రాణమైన విడుచునుగాని, తొలగి చనదు; అటేతీరున భక్తుడు నిరంతరము భగవంతుని కౌగిటజేరి సమస్తమును విడుచును.

513. భగవద్భక్తి రెండు రకములు:—

(1) శాస్త్రనియతమైన భక్తియొకటి. నిర్ణీత విధిగాపూజచేయవలయును. భగవన్నామము యిన్నితడవలు స్మరించవలయును. యిట్టి నీమములు కలవు. ఇదంతయు వైధిభక్తిచర్య. శాస్త్రప్రకారము ఏర్పడినది. దీనివలనసమాధి యందు అవ్యయబ్రహ్మము నెఱుంగు బ్రహ్మజ్ఞానము ప్రాప్తిం పవచ్చును. జీవాత్మపరమాత్మయందు లీనమై తిరిగి విడి రాకపోవచ్చును. సామాన్యభక్తుల చర్యయిట్టిది.

(2) కాని భగవదవతారముల యొక్కయు, ఈశ్వ రునికి ఆప్తులైనవారియొక్కయు విషయము వేఱు. భగవంతు నిపై వారికిగలప్రేమశాస్త్రవిధులచే కలుగునదికాదు. అది అంతరంగమునుండి ఆవిర్భవించును! ఆత్మలోనుండి వెల్లివిరి యును. (చైతన్యనిబోలు) భగవదవతారులును, వారిఅంత రంగ కోటిలోనివారలును, సమాధిదశయందు ప్రాప్తించు అఖండజ్ఞానమునుపడసినవారే; అటులయ్యును భగవంతునితల్లి, తండ్రీ, అనిభక్తిసలుపుచు, తమ పరమోన్నతపదవినుండి దిగివత్తురు. మఱియు "నేతి, నేతి," ఇదిగాదు ఇదిగాదుఅనుచు మెట్టుపిమ్మట మెట్టుగా విడిచివేసి శిఖరమునకు చేరుదురు. అచ్చటికి చేరి "తత్వమసి" అది యిదియే అందురు. కాని తాముఎక్కివచ్చిన మెట్లవరుసయు, తామప్పుడు చేరిన శిఖ రమువలెనే ఒకేతీరు నున్నము, యిటుక, ఇటుకపొడి చేర్చి కూర్చబడినవే అని వెనువెంటనే గ్రహింతురు. కాబట్టి వారు ఒకప్పుడు శిఖరముపైని నిలుచుచు, మఱొకప్పుడు మెట్లపైని ప్రచారముచేయుచు, పైకిని క్రిందికిని ఎక్కుచు దిగుచు నుందురు.

శిఖరమనగా సమాధియందు అఖండబ్రహ్మభావన అమరి, జీవాత్మ బాహ్యప్రపంచానుభవములచే చలింపనిస్థితి. మెట్లవరుసయన భౌతికప్రపంచము; మానవదృష్టికి ప్రవర్తిత మగు అవ్యయబ్రహ్మముయొక్క నామరూపాత్మకమయిన స్వరూపాంతరమేయని శిఖరముం జేరునప్పుడు విదితమగును!

514. ప్రశ్న:— కండ్లకు గంతలుకట్టనిది సాధికలేని క్రొత్తగుఱ్ఱములు ఒక్క అడుగైన పెట్టవుగదా. నరుని చిత్త వృత్తులు అదిమిపట్టనిది బ్రహ్మదర్శనమగుట సాధ్యమా?

జవాబు:— బ్రహ్మమునుచేరుటకై నిత్యానిత్యవివేక పథానువర్తియై నడచు జ్ఞానయోగివిషయమున ఆమాట సత్యమే. జ్ఞాని యిట్లువచించును:—"ప్రత్యక్షముగ బ్రహ్మ మును జూడగోరునతడు నిష్కల్మషుడు కావలయును. తన చిత్తవృత్తులన్నింటిని దహనము చేయవలయును. మొదటఆత్మ శిక్షణము, పిమ్మట బ్రహ్మజ్ఞానము!"

భగవంతుని, జేర్చు మరొకత్రోవకలదు. అదిభక్తి యోగము. ఒక్కసారి భగవద్భక్తి నరుని అంతరంగమున చొచ్చెనా—వాని పావననామగానముచే ఒక్కతడవభక్తుడా నందముతో పులకాంకురముగలవాడయ్యెనా- అహా! చిత్తనిరోధసాధనలు యింకేల? అట్టినిరోధము దానంతట అదియే చేకూరును సుమీ!

తీవ్రదుఃఖవేదనగల మానవుడు కయ్యములకు దిగుట కుగాని, విందులుగుడుచుటకుగాని, ఇతరములగు యింద్రియ భోగము లనుభవించుటకుగాని, శక్తుడగునా? అటులనే భగవ

ద్భక్తిలో నిమగ్నమైనయతను ఇంద్రియభోగములగూర్చి తలంపనైనంజాలడు సుమీ !

515. ఒక్కసారి దీపమును చూచినయనంతరముశలభము చీకటిని ఆశ్రయించునా ?

అహెూ! ఎన్నడును ఒల్లదు; అది ఆజ్యోతిలోపడి నాశముపొందును!

అయినను భగవద్భక్తునివిషయమున యిది సత్యమన రాదు. ఆతనిని ఆకర్షించివేయు దివ్యజ్యోతి తగులపెట్టదు; చంపనుచంపదు. అది మాణిక్యపు కాంతివంటిది; దీప్తిమంత మయ్యును మార్దవముగను, శీతముగను, శ్రమోపహారిగను నుండును, అది దగ్ధముచేయదు; హృదయమునకు శాంతిని ఆనందమును కూర్చును.

516. ఈ (సంసారలంపటపు) బేరగాండ్రు (క్షుద్రభోగములను) పుచ్చుపప్పునకై దేవులాడు చున్నారు. సంసార కల్మషమంటని అమలజీవులకు మాత్రమే భగవద్భక్తి దొరకగలదు. వారికి ఒకేదృష్టి; స్వామి పాదారవిందములపై నిశ్చలముగ మదిని నిలుపుటే ఏకైకవాంఛ !

517. భగవంతునిగూర్చిన విజ్ఞానము విశ్వాసముతో పాటువర్ధిలుచుండును. విశ్వాసము కొఱవడుతావున అధిక విజ్ఞానమునకై చూచుట వెఱ్ఱిపని.

518. భోగవిషయవాంఛ తగ్గినకొలదిని భగవద్భక్తి పెంపొందుచుండును.

519. పావనగంగ జ్ఞాని హృదయమున సమస్థితిని పాఱు చుండును. వానికీసంసారమంతయు కలయై తోచును. అతడు సదా తనఆత్మలోనె నిమగ్నుడై యుండును. భక్తుని విషయ మటులుండదు. వానియందు పాటుపోటు కాన్పించు చుండును. వేర్వేఱు చిద్భావములతో అతడు నవ్వుచు, ఏడ్చుచు, ఆటలాడుచు, పాటలుపాడుచు నుండును. భక్తుడగువాడు భగవంతునియందు నిలయ మేర్పఱచుకొని, వాని సమక్షమున ఆనందము ననుభవించుచుండును. ఆదివ్యానంద సాగరమున పడి, ఈదులాడుచు నీటిలోని మంచుగడ్డ క్రిందికి పైకి మునుగుచు తేలుచు నుండురీతిని మునుకలు వేయుచు తేలియాడుచు నుండును.

520 హృదయమున భగవద్భక్తి వెల్లివిఱియగనే కర్మత్యాగము తానంతనదియే వచ్చును. ఎవరినిభగవంతుడు కర్మలచేయ సృష్టిచేసినాడో వారుకర్మలచేయుచుంద్రుగాక. కాలపరిపాకమువాటిల్లినప్పుడు నరుడు సమస్తమును త్యజించి,"రమ్మా! ఓమనసా! హృదయపీఠమున అధిష్ఠించియున్న దైవముకడ మనము ఇరువురమును జాగరణము చేయుదముగాక!" అని పలుకగలడు.

భగవంతుని శరణుజొచ్చుము; లజ్జాభయములను విడనాడుము. నేభగవన్నామస్మరణ చేయుచు నృత్యముచేయునెడల ఎవరేమనుకొందురో అను నిట్టిశంకలనన్నిటిని పాఱద్రోలుము.

521. ఈ భగవద్భక్తి కడునరుదగువస్తువు! పతివ్రతయగు స్త్రీకి తన పతపైనుండునంతటి హృదయపూర్వకమగునట్టి

అనురాగము భగవంతునియెడ కలిగినప్పుడే భక్తిలభ్యపడును. నిష్కళంకభక్తిఅలవడుట మహాదుర్లభము. భక్తియందుమనస్సును అత్మయు భగవంతునియందే లయముగాంచవలయును అపిమ్మట (పరమోత్తమభక్తియగు) భావభక్తిఅలవడగలదు. "భావము" నందునరునకువాగ్బంధనమగును. శ్వాసయునిలిచి పోవును. కుంభకము తనంతనదియే అమరును. లక్ష్యమున గురిపెట్టి బాణమువేయువాని వాక్కును శ్వాసయు స్తంభించి పోవునటులనే అగును.

522. గోపికలనుగూర్చి ముచ్చటించుచుశ్రీపరమహంసుల వారు "మ" అను శిష్యునితో యిట్లనిరి:—

"వారల అనురాగము ఎంతచిత్రమైనదో! తమాల వృక్షమును చూచినంతనే వారలకు ప్రేమోన్మాదముపట్టెడిది. (తమాలవృక్షదర్శన మాత్రాననే రాధకు శ్రీకృష్ణుని నీల వర్ణము జ్ఞప్తికి వచ్చెడిది)

"మ":—గౌరాంగదేవునికిని యిట్లే! ఎదుట అడవి కాన్పించగానె ఆయన దానిని బృందావనమని భావించినాడు.

పరమహంస:— ఓ! అట్టిప్రేమావేశమున ఒక్క లేశము ప్రసాదముగ లభించెనా! ఎంతటి భక్తి అది! అటువంటి శ్రేష్ఠభక్తి వారియందునిండి పొర్లిప్రవహించినదిగదా!

523. రాధయు కృష్ణుడును దివ్యావతారములని నమ్మినను లేకున్నను విశేషమేమియులేదు. (హిందువులు క్రైస్తవులు నమ్మునటుల) దేవుడు అవతారము పొందివచ్చునని ఒకడు నమ్మవచ్చును. (ఈకాలపుబ్రహ్మసమాజమువారివలె) దేవుడు మానవ రూపము తాల్చునని నమ్మకపోవచ్చును. కాని భగ

వంతునియెడల తీవ్రభక్తి కలుగవలయునని అందఱునుపరితపిం చినచాలును. సాంద్రభక్తియొక్కటియే ముఖ్యావసరము!

524. పసిబిడ్డయొక్క అమాయికత్వము యెంతమధుర మైనది! ప్రపంచమునందలి ధనసంపదల నన్నింటికంటెను ఒక్కబొమ్మయం దెంతయో మక్కువచూపునుగదా! విశ్వాస పూర్ణుడగు భక్తుడట్టులుండును. ఇంకెవ్వరును ప్రపంచమం దలి ధనములను గౌరవములను విడిచివేసి, భగవంతునితోడిదే లోకమని కూర్చుండబోరు!

525 ఒక్క నిప్పురవ్వ తాకినంతనే కొండంత దూదియైనను దగ్ధమై గూవుమాయుతీరున, భక్తిపూర్వకముగా పావనమా భగవన్నామమును గానముచేసినమాత్రాన నీపాప రాసులన్నియు అదృశ్యము కాగలవు!

526. నరకలోకములోని అగ్ని మొదలగువానికి జడిసి పూజలుచేయుట ప్రారంభదశలోనివారికి తగును. పాపమ నెడు భావము కలిగి యుండుటతోడనే మతధర్మము పూర్తి యగుచున్నదని కొందఱి భావము. అది కేవలము క్షుద్ర మగు ప్రారంభదశయనుటను వారు మఱచుచున్నారు. అంత కన్నను ఉత్తమమగు ఆధ్యాత్మికదశయున్నది; భగవంతుని మన తండ్రియనియు, మన తల్లియనియుభావించి భక్తిచేయ వలయును.

527. "భావ" భక్తిపూనుదశ పచ్చిమామిడికాయను పోలును; "ప్రేమ" భక్తిదశ మామిడిపండును పోలునది!

528. సచ్చిదానందమయుడగు భగవంతుని తనతో చేర్చి బంధించుకొనుటకై భక్తుడు చేతబూను త్రాడువంటిది ప్రేమ. దాని సాయమున భక్తుడు భగవంతుని తనస్వాధీనమున నుంచుకొనును అనవచ్చును. అతడు పిలుచునప్పుడెల్ల భగవంతుడు వానికడకు వచ్చును.

529. పారశీకపు గ్రంథములలో నిట్లువర్ణింపబడియున్నది. మాంసములోపల ఎముకలున్నవి. ఎముకలలోపల మజ్జ యుండును. వాని అన్నింటిలోపలను ప్రేమయుండును.

530. శ్రీకృష్ణునకు త్రిభంగనామముకలదు; అనగా మూడు వంపులుతిరిగినవాడని అర్థము. మెత్తని వస్తువుమాత్రమే వంచినప్పుడిట్లు వంగగలదు. కావున శ్రీకృష్ణుని యీరూపము ఆయన యేకారణముచేతనో మెత్తబడియుండునని తెలుపుచున్నది. ఈ మెత్తపాటునకు ప్రేమయే కారణమందురు.

531. శ్రీరామకృష్ణ పరమహంసులవారు కేశవచంద్రసేనులవారితోనిట్లనిరి:—మీబ్రహ్మసమాజమువారు భగవంతునిచైదములను అంతగాస్తోత్రములు గావించుటేల? "ఓ దేవా! నీవు సూర్యుని సృష్టించినావు; చంద్రునిచేసినావు; నక్షత్రములను నిర్మించినావు!" ఇట్లేమేమొ అనుచుందురు! పూలతోటయొక్క అందమును—అందున్న చక్కని పూలను, కమ్మని వాసనలను చూచిమెచ్చుకొనేవారు చాలమందియుందురు; కాని తోటయజమానిని విచారించువారు చాలకొలదిమందియే! ఇందు ఘనతరగణ్యత యెవరిది? తోటదా? భగవంతునిదా? మననడుమ మృత్యువు నాట్యము సాగునంత

కాలము తోట మూడునాళ్ల బూటకమే! కాని తోటయజమానియొక్కడే నిత్యసత్యమూర్తి!

సారాయంగడికడ ఒకటిరెండు గుక్కలు త్రాగిన పిమ్మట, ఆఅంగడిలో ఎన్నిపీపాలలో ఎంతసారాయి అమ్మకమునకున్నదో అను విచారణ ఎవనికి పట్టగలదు? ఒక్కొక్కనికి ఒక్క సీసా ఎక్కువ! నరేంద్రుడు (వివేకానందస్వామి) కంటపడగానే నేను ఆనందపరవశమున మైమఱతును. మీ నాయన ఎవరనిగాని మీకెన్ని గృహములున్నవనిగాని ఎన్నడునువానిని అడుగనేలేదు.

532. నరులు, తమ సంపదలను అమితముగ గణనచేయుదురు. డబ్బు, ఇండ్లు, సామానులు చాలవిలువగలవానిగా చూచుకొందురు. కాబట్టి భగవంతుడును అటులనే తనసృష్టిని గూడ, సూర్యుని, చంద్రుని, నక్షత్రములను చూచుకొనునని వారు తలంతురు. కావున నరులు ఆయనచైదములనుగూర్చి పొగడ్తలు పలికినప్పుడు భగవంతుడు సంతోషమున ఉబ్బుననుకొందురు.

533. హఠభక్తిస్వరూపమెట్టిది? (Violent form of devotion) "జైకాళీ!" అనుచు సతతము భీకరముగ అఱచుచుండుటయో, లేక "హరిబోలో!" అను గానముతో చేతులెత్తి నృత్యముచేయుటో, పనిగాబూని పిచ్చివారైపోవుటే! ఈకలియుగములో శాంతిరూపములగు ధ్యానాదులకంటె శీఘ్రతరముగ ఫలించునది హఠభక్తియే. దానిసహాయమున భగవంతునికోట సత్వరము స్వాధీనమై పోగలదు.

534. లోకవృత్తములు సత్వరజస్తమో గుణమయములై యుండునటులనే భక్తియందును గుణభేదములుగలవు. నమ్రత గలిగి సాత్వికరూపమును, ఆడంబరముతో రాజసరూపమును, పశువృత్తితో తామసరూపమును తాల్చుభక్తిరూపములు గలవు. సాత్వికభక్తుడు రహస్యముగ ధ్యానములు సాగించును. అతడు తన పడకపైన దోమతెఱచాటున ధ్యానమును సాగించుటచేత, ప్రొద్దుట ఆలస్యముగ నిద్రలేచును. వానికి తిన్నని నిద్ర లేకుండుట, అందుకు కారణమని వానిమిత్రు లనుకొందురు. మఱియు కొంచెము అన్నము కూరయున్నవాని సంపాదనతో వాని దేహరక్షణ, వ్యాపారమును ముగియును. తిండిలోగాని బట్టలలోగాని భోగసూచన యుండదు; వాని యింటిలో అలంకారాది ఆడంబరవస్తు సముదాయముండదు. స్తోత్రపాఠముల నాశ్రయించి ప్రపంచములో ఉన్నతిని యతడు సాధించబోడు.

రాజసభక్తుడు దేహమునందు నామాలును, మెడనిండ తులసిపూసలును, ఒక్కొకప్పుడు బంగారులింగకాయలను ధరించును. దేవతార్చనవేళలందు పట్టుపీతాంబరముల గట్టుటలోను, తాళమేళములతో ఆడంబరముగ పూజల సలుపుటలోను మిగుల పట్టుదల చూపును.

తామసభక్తునికి అగ్నివంటి విశ్వాసముండును. బందిపోటువాడు బలముచూపి దోపిడులు చేయునటుల, ఇతడు భగవంతునిపైని పశుబలప్రయోగము చేయజూచును.

"ఏమిా! నేను స్వామి నామోచ్చారణ చేసియుకూడ యిం కను నేను పాపినా? నేను దేవునిబిడ్డను! వానిసర్వస్వము నకు హక్కుగల వారసుడను నేను!":—వాని తీవ్రవాదన లిటులుండును.

26వ అధ్యాయము.

# ఈశ్వరానుగ్రహము

535. మలయమారుతము వీచునప్పుడు, చేవగలచెట్లన్నియు శ్రీగంధపుచెట్లుగ మారునందురు. చేవలేనిబొంగు, వెదురు, తాటిచెట్టు మార్పుచెందక, ఉన్నట్లేయుండునట; అదేలాగున ఈశ్వరానుగ్రహము మానవకోటిపై కలిగినప్పుడు భక్తిసౌజన్యములుగలవారు పవిత్రఋషివరులై దైవమహిమతోనిండుదురు. ప్రాపంచికులగు క్షుద్రజనులు ఎప్పటివలెనే యుందురు.

536. చెదరి చంచలమైపాఱుచున్న నీరు చంద్రబింబమును విచ్ఛిన్నశకలములుగ (ముక్కలు ముక్కలుగ) తప్ప పూర్ణస్వరూపమును ప్రతిఫలింపజాలనిరీతిని ప్రాపంచికవాసనలతోడను వాంఛలతోడను కలతబారిన మనస్సులు భగవంతుని తేజమును పూర్తిగ ప్రతిఫలింపజాలవు.

537. మౌనముగ భగవన్నామస్మరణచేయుచు ఒకపుణ్యపురుషుడు జపమాలతిప్పుచుండెడివాడు. భగవానుడు వానితోనిట్లనెను "నీవేల ఒక్కస్థలమును అంటిపట్టుకొనియుందువు? ముందునకుసాగిపొమ్ము."

"భగవదనుగ్రహము లేక అటులజరుగజాలదు." అని ఆపుణ్యపురుషుడు ప్రత్యుత్తరమిడెను.

భగవానుడిట్లుల పలికెను. "భగవదనుగ్రహమనుగాలి నీతలమీదుగా రేయింబవళ్లు వీచుచునే యున్నది. సంసార సాగరమును వేవేగమే దాటిపోగోరుదువేని (మనస్సను) నీ పడవయొక్క తెఱచాపను విప్పుము.'

538. ఈశ్వరానుగ్రహమనుగాలి సతతమును వీచుచునే యుండును. సోమరులై సంసారసాగరమున నెమ్మదిగ బోవు వారలు దాని లాభమును పొందరు. చుఱుకుదనమును బల మును గలవారలు తమ మనస్సులను విప్పారజేసికొని హిత కరమగు ఆగాలిని పట్టుకొని త్వరలో తాము గమ్యస్థానమును చేరుదురు.

539. గాలి వీవనంత కాలము వేడిమి తగ్గుకొఱకై వీవ నతో విసరుకొనుచుందుము; ధనికులనక, దరిద్రులనక అంద ఱికిని ఉపకరించు వాయువువీచునప్పుడు మనము విసరుకొ నుట మానుదుము. పైనుండి చేయూత రానంతకాలము, మన పరమావధిని చేరుకొఱకు మనము తీవ్రముగ పాటుపడ వలసియుండును. అదృష్టవశమున ఆసహాయము లభ్యమై నప్పుడు మనమింకను శ్రమపడి పట్టుదలతో సాధనలుసాగించ నగత్యముండదు. అంతవఱకుమాత్రము పాటుపడవలసి నదే సుమీ!

540. గాలియే వీచునప్పుడు విసనకఱ్ఱలు నిరుపయోగము. ఈశ్వరానుగ్రహము లభించినప్పుడు ప్రార్థనలు, తపస్సులు విడువనగును.

541. కొన్ని చేపలకు చాల ఎముకల గూడులుండును. కొన్నింటికి ఒకే ఎముకల గూడుండును. కాని చేపలనుపట్టి తినువారు ఒక ఎముకలగూడుయున్నను హెచ్చుగనున్నను, ఎముకలను అన్నింటిని తొలగించి వేతురు. అదేతీరున కొందఱి పాపములు విశేషముగనుండును, కొందఱిపాపములు కొలదిగ నుండును. కాని ఈశ్వరానుగ్రహము లభించెనా అవిఅన్నియు తొలగింపబడి, వారు పవిత్రులుగ చేయబడుదురు.

542. నడిసముద్రమునపోవు ఓడకంబము మీాద ఒకపక్షి కూర్చుండెను. అచ్చట చాలసేపు కూర్చుండుటకు విసుగు కొని క్రొత్తచోటవ్రాలుటకై ఎగిరిపోయినది. కాని వాలుటకు తగినతావుగానక అలసిపోయినదై తిరిగి మొదట ఓడ కంబము నేచేరెను. అటులనె సామాన్యసాధకుడు తనక్షేమము కోరునట్టియు అనుభవశాలియుఅగు గురువుచూపిన శిక్షణయు సాధనలును చిరకాలము సాగించుటకు విసుగుచెందును; నిరాశుడగును; గురువునందు లక్ష్యము విడుచును: స్వంతముగ ప్రయత్నించి భగవంతునికనుగొందుగాక యను ధైర్యముతో లోకమున జొఱబాఱును. ఇటుల చాలకాలము వ్యర్థపుత్రో వలబోయి గతిగానక పూర్వపు గురుని కృపను ఆశీర్వాదమునుపొందుట కొఱకై తిరిగివచ్చును.

543. ఆకస్మికముగ ఏమియుసంభవించదా ?

జవాబు—లేదు. సాధారణముగా దీర్ఘ సాధనలు సాగించక ఎవడును సిద్ధత్వమును పొందడు. ద్వారకనాథమిత్ర గారు ఒక్కదినములో ఉన్నతన్యాయాధికారి కాలేదు. ఆయన

ఉత్తమన్యాయస్థానమున అధికారపీఠమున గూర్చుండుటకు పూర్వము సంవత్సరములకొలదిగ కష్టపడి పనిచేయవలసిన వాడయ్యేను. అటులశ్రమకోర్చి పాటుపడనిష్టములేని న్యాయ వాదులు నిరుద్యోగులై తమను గోరుకొను కక్షిదారులులేక ఊరకనుండవలసినదే. కానిహఠాత్తుగ దైవకృపచే అభ్యుద యము కలుగుటయు ఎన్నడోతటస్థించవచ్చును. కాళిదాసు నకు అటుల లభించినది. కేవలము పామరదశనుండి సరస్వతీ దేవి అనుగ్రహమువలన ఆకస్మికముగ భారతకవివరులందఱిలో మేటియనిపించుకొను స్థితికివచ్చినాడు.

544. ప్రశ్న— భక్తుడు ఎన్నడైన భగవంతునితోడి సంపూర్ణైక్యస్థితిని పొందగలడా? అగుచో ఎటులు?

జవాబు— యజమాని యొకడు, తనవద్దసేవకుని వినయసంపత్తికిని, సత్యశీలమునకును, ఉత్తమసేవకును మెచ్చి, వానిని తన అధికారపీఠముచెంతకు దీసికొనిపోయి బలాత్కారముగా వానిని అందు కూర్చుండబెట్టవచ్చును. సేవకుడు నమ్రతచేత వలదన్నను విడువడు. అదేతీరున ఈ విశ్వాధిపతియు తన ప్రియసేవకునియొక్క చిరకాల భక్తినిష్ఠ కును, విమలత్యాగమునకును ప్రీతుడై, వానిని తన సింహాస నమున జేర్చి బలాత్కారముగా తన దివ్యవిభూతిని వానికి ప్రసాదించగలడు. అయినను ఈశ్వరసేవకుడు తన సేవక భావము త్యజించి యజమానుని విభూతిని పాల్గొన నిచ్ఛగిం పక పోనగును.

545. మనకు ఆహారమును ప్రసాదించును కావున భగవంతుడు కృపాళుడు అనజాలము; ప్రతితండ్రియు తన బిడ్డలకు తిండిపెట్టవలశిన వాడే అగుచున్నాడుకాని, మనము వక్రగతుల నడచు సమయములందు, ఆయన మనలను దుష్టప్రేరణలనుండికాపాడును. కావున నిజముగాకృపాళుడు అనదగును.

546. ఒకగదిలో అనేక శతాబ్దములనుండి యున్న చీకటియైనను, దీపము వెలిగించినంతనే మటుమాయమగుచున్నది అట్లే అనే జన్మాంతరములనుండి పెరిగివచ్చిన పాపరాశియైనను భగవంతుని కటాక్షవీక్షణము ఒక్కటి ప్రసరించిన మాత్రాన ఎగిరిపోగలదు.

547. గృహస్థుడగు నొకభక్తుడు:— దేవా! మీరు భగవంతుని చూచితిరి అని వింటిమి. కావున మేమును భగవంతుని చూచునటుల చేయుము. ఆదేవదేవునితో మేము సఖ్యము చేసుకొనుట ఎట్లు?

పరమహంసులవారు:— సర్వమును ఈశ్వరేచ్ఛననుసరించి నడచును. భగవద్దర్శనమగుటకు కర్మమిగుల నావశ్యకము. నీవు చెఱువుగట్టున కూర్చుండి, "చెఱువులో చాలచేపలున్నవి" అని ఊరకఅరచుచుండినచో నీకేమైన దొఱకునా? చేపలను పట్టుటకు ఆవశ్యకములగు పరికరములను తెచ్చుకొనుము. గాలపుచువ్వ, దారము, ఎఱ తెచ్చి, నీళ్ళలో నూకలు చల్లుము. అంతట ఎంతలోతుననున్న చేపలో పైకివచ్చును. నీవప్పుడు వానిని చూచి పట్టుకొనవచ్చును.

మీరు పూరకకూర్చుండి, ఏమియు ప్రయత్నమే సేయక భగవంతుని చూపుమని మీరు నన్నడుగుచున్నారా ; పెరుగు తోడుపెట్టి, వెన్న చిలికి, మీనోటికి అందియ్యవలయునా! చేపను పట్టుకొని మీచేతిలోపెట్టవలయునా! మీకోరిక ఎంత విపరీతముగ నున్నదో చూచితిరా!

548. ఒకడు రాజనగరులోనికి పోయి రాజును చూడవలెననిన, అతడు నగరును సమీపించవలెను; ద్వారములను అన్నిటిని దాటవలెను. అటులగాక వెలుపలి గుమ్మము దాటగానె "రాజెక్కడ? అనినచో వానికిరాజు కానరాడు. అతడు సప్తద్వారములను దాటినగాని రాజును చూడలేడు.

549. ప్రశ్న—ఎట్టికర్మనుచేసి భగవంతుని చేరవచ్చును?

జవాబు—కర్మలందు భేదములేదు. ఈకర్మ చేసిన భగవంతుని చేరవచ్చును, ఆకర్మచేసినభగవంతుని చేరలేము అని తలంచరాదు.

సర్వమును భగవంతుని అనుగ్రహముపై నాధారపడి యుండును. వానిఅనుగ్రహము కావలెనా, నిష్కపటమైన తీవ్రవాంఛతో నీకర్మను నీవు నిర్వహించుము. భగవదనుగ్రహమువలన నీపరిస్థితులు అనుకూలములు కాగలవు; వాని దర్శనమగుటకు వలయుమార్గములు చక్కబడగలవు. నీవు సన్యసించకోరి, ఒకవేళ నీమీద నొకసంసారము ఆధారపడి యున్నయెడల నీతమ్ముడు ఆభారమును వహించగలడు.

బహుశా నీభార్యయు నీకడ్డమురాక, నీపారమార్థిక సాధనలందు నీకుసాయపడగలదు. అటులగాక నీవు వివాహమే చేసి కొనకపోవచ్చును. నీకు సంసారపుచిక్కులే లేకపోవచ్చును. అంతయు దైవకృప !

27వ అధ్యాయము.

# ఆత్మావలోకనదశ.

550. ప్రశ్న:—సమాధిదశయందు మనస్సుయొక్క స్థితి ఎటుండును?

జవాబు:—కొంతసేపు నీటివెలుపల నుంచబడిన చేప తిరిగి నీటవిడువబడినప్పుడు, ఎట్టిఆనందమును అనుభవించునో, అట్టి స్థితిలో నుండును.

551. పరుశవేదిని తాకిన ఉక్కుకత్తి బంగారుగ మారును. అప్పుడు దాని ఆకారము మారకున్నను ఉక్కుకత్తి వలె దేనిని ఛేదింపజాలదు. ఆతీరుననే భగవత్పాదారవిందముల తాకిన మనుజుని పైరూపుమారకున్నను, అతడేదుష్ట కార్యమును చేయనోపడు.

552. అది ముందుకు వెనుకకు పోవుచుండుస్థితి. నీవు పరబ్రహ్మమునకై మరలిపోదువు; నీవ్యక్తిత్వము ఆబ్రహ్మభావమున కలిసిపోవును; అదయే సమాధి: ఆపిమ్మట నీవు తిరుగుముఖము పెట్టుదువు. నీవ్యక్తిత్వమును నీవుపొంది, నీవు మొదట ప్రస్థానము (ప్రయాణము) సాగించిన తావునకు వచ్చి చేరుదువుకాని నీఆత్మ అల పరమాత్మనుండి పుట్టినదేయనియు, ఆయేకైక సత్పదార్థమునుండియే ఈశ్వరుడు, నరుడు, ప్రకృతి అనునవి అంశరూపమున పుట్టునవనియు తెలిసిపోవును. కాబట్టి నీవా రూపాంతరము లందొక్కదాని

తత్త్వమును గట్టిగ పట్టుకొంటివా నీవన్నింటి తత్త్వమును ఎఱింగిన వాడవగుదువు.

553. సముద్రమునమునిగియున్న సూదంటురాతికొండ దానిపైగపోవు ఓడను ఆకర్షించి, దానియందలి ఇనుపమేకుల నన్నింటిని లాగివేయును. అంతట ఓడచెక్కలన్నియు, ఒక దానినుండి యొకటి సడలిపోయి, ఓడసముద్రమున మునిగి పోవును; అటులనే భగవంతుని ఆకర్షణశక్తిఅనగా విశ్వ చైతన్యశక్తి జీవాత్మను ఆకర్షించునప్పుడు, ఒక్కక్షణములో నరుని వ్యక్తిత్వభావమును స్వార్థపరతయు రూపుమాయును. అంతటజీవాత్మ భగవంతుని అనంతప్రేమజలధియందుమగ్నమై పోగలదు.

554. పాలునీటితోచేరినప్పుడు సులభముగా దానితో కలిసిపోవును. ఆపాలనే వెన్నగామార్చుము. అప్పుడది నీటిలో కలిసిపోక దానిపై తేలియాడును. అదేవిధముగ జీవాత్మఒక్క సారి బ్రహ్మభావనను పడసెనా, అది నిరంతరము, అనుక్షణము, అనేకములగు ప్రబోధశూన్యములగు జీవాత్మలతో కలిసియుండుగాక, ఆదుస్సాంగత్యము దానిని చెరుప జాలదు.

555. క్రొత్తగా కాపురమునకువచ్చిన యువతి గృహకృత్యములందు గాఢముగమునిగియుండును; అటులుండుటఆమెకు పుత్రుడొకడు పుట్టువఱకే. ఆమెకుపుత్రోదయము కాగానే, సామాన్యపు యింటిపనులనన్నింటిని ఆమె విడిచివేయును. వాని యందామెకు ఉత్సాహముండదు. అందుకుమారుగా

ఆమె తనబిడ్డను దినమంతయు లాలనసేయుచు, ఆనందముతో ముద్దులాడుచు నుండును. ఈతీరుగ, పాఠురత్వమున నున్న మనుజుడు నానావిధకర్మలను జేయుచు దిరికలేకుండును. కాని వాని హృదయములో ఈశ్వరసాక్షాత్కారమైన తోడనే వానికిఆకర్మకలాపమునఆనందముండదు. ఇప్పుడతడు సదా భగవత్సాక్షాత్కారము ననుభవించుచు, వాని యిచ్ఛను పాలించుచు మురియుచుండును. వానికింక ఏయితర వ్యాపారమునందును సంతోషము కలుగదు. ఆదైవసంసర్గముయొక్క ఆనంద పారవశ్యమును పోగొట్టుకొన నిష్టపడడు.

556. కప్పపిల్లయొక్క తోక రాలిపోయినపిమ్మట, అది నీళ్ళలోను మెట్టమీదనుకూడ నివసించగలదు. భ్రాంతిగొలుపు అజ్ఞానమను తోకరాలిపోయిన మనుజుడు ముక్తుడగును. అంత నాతడు భగవంతునిలోను లోకములోను భేదములేకయుండగలడు.

557. యూదియా జాతివారు ఏసుక్రీస్తును శిలువపైని మేకులతో బంధింపజేసినప్పుడు, తాను అత్యంతబాధానుభవమునందుండియు, ఏసుక్రీస్తు "వారుక్షమింపబడుదురుగాక" యని ప్రార్థించగల్గుటకు హేతువేమి ;

పలుగుతో గ్రుచ్చి లేతకొబ్బరికాయ పెచ్చుతీయునప్పుడు, పలుగు దానికొబ్బరిలోనికి కూడ దూరిపోగలదు. కాని కురిడీకాయ లోనికొబ్బరి, చిప్పనుండి వేఱుపడియుండి, పలుగుచే చిప్పపగిలినను లోని కురుడీ హానిచెందకయుం

డును. ఏసుక్రీస్తు కురిడీకాయవంటివాఁడు; వానిఆత్మ వాని స్థూలశరీరమునుండి విడిపోయినది, కాబట్టి వానిస్థూలశరీర బాధ వానిని అంటలేదు. గ్రుచ్చిగ్రుచ్చి వానిశరీరమున మేకులు కొట్టినను, ఆయన పరమశాంతముతో శత్రువులక్షేమముకొఱకై ప్రార్థన చేయగల్గినాఁడు.

558 ఈప్రపంచములో అయిదురకముల సిద్ధులు కాన్పించుచున్నారు.

(1) స్వప్నసిద్ధులు—కలలయందు సుబోధముపొంది పరిపూర్ణతను పడసినవారు,

(2) మంత్రసిద్ధులు—ఏదేని పవిత్రమంత్రోపాసన మూలమున సిద్ధత్వము నందినవారు.

(3) హఠాత్సిద్ధులు—ఆకస్మికముగా గొప్పధననిధిని కనుగొనియో లేక శ్రీమంతురాలిని పెండ్లియాడియో ధనికుడయిన పేదవానిబోలి తటాలున పూర్ణత్వమును పొందినవారు. ఇట్లు అనేకులు పాపులు యేదోతీరునహఠాత్తుగ పావనులై దేవరాజ్యముం జేరుదురు.

(4) కృపాసిద్ధులు— ఈశ్వరానుగ్రహ ప్రాప్తిచేత పరిపూర్ణులగువారు. ఒకడు అడివిని నఱుకుచుండగా వానికొక ప్రాచీనసరోవరమో లేక భవనమో కాన్పించుననుకొనుడు. అతడిక బాధలుపడికష్టములకోర్చి వానిని నిర్మాణము చేసికొను యవసరముండదుగదా! ఆతీరుననే అదృష్టవశమున తామేమియు ప్రయత్నముచేయకయే పూర్ణజ్ఞానులగుట కలదు.

(5) నిత్యసిద్ధులు—పుట్టువుతోడనే సిద్ధులై యుండువారు. సొర గుమ్మడి మున్నగుతీగెలందు పూమొగ్గలు విచ్చుటకు పూర్వమే పిందెలుకానవచ్చును. అటులనే నిత్యసిద్ధులు పరిపూర్ణులయియే జన్మింతురు. సిద్ధత్వముంగూర్చి వారుచేయునటుల కాన్పించుసాధనలన్నియు, మానవజాతికి ఆదర్శముంజూపుట కొఱకుమాత్రమే అగును.

559. ప్రశ్న—సిద్ధిపొందినపురుషుడు పొందుస్థితియెట్టిది?

జవాబు—(నరుడుసాధించు పరిపూర్ణతను, బాగుగవండినకాయకూరలస్థితిని సిద్ధిఅనవచ్చును - శ్లేషాలంకారమునకు అవకాశముగలదు)

చిలుగడదుంపగాని, వంకాయగాని, సిద్ధినిపొందినప్పుడు (అనగా చక్కగా ఉడికినప్పుడు) మెత్తబడిగుజ్జునలెనుండును. అటులనే సిద్ధినిపడసినపురుషుడు, (అనగా పూర్ణత్వమును పొందినమనుజుడు) నిండునమ్రతయు, సాధుత్వమును కలిగియుండును.

560. పాదరసముగల పాత్రిలో పడవేసిన సీసపుముక్క దానిలో కఱగిపోవునటుల వ్యష్టిజీవాత్మ బ్రహ్మసాగరమునబడినప్పుడు తనప్రత్యేకతను విడిచివేయును.

561. ధ్యాననిష్ఠయందుండి, పక్షులుతనజుట్టులో గూండ్లు కట్టినను తెలియజాలనంతగా స్మృతివిడిచిన యాతనికి ధ్యానసిద్ధి లభించినదనవచ్చును.

562. ప్రశ్న:— సమాధిఅవస్థయందు దృశ్యప్రపంచజ్ఞానము (పరమహంసులవారికి) ఉండునా ?

జవాబు:—సముద్రములోపల గుట్టలు, పర్వతములు, గుహలు, లోయలు, కలవు కాని అవి పైకికానరావు. అటులనే సమాధి అవస్థయందు యతివిశాలమగు సచ్చిదానంద మహాసాగరము కానవచ్చును. వ్యక్తిజీవభావము దానిలో అణగిపోయి అవ్యక్తరూపమున నుండును.

563. ప్రశ్న:—దేవుడు నరుని హృదయమున ప్రవేశించుచో సూచనలెటులుండును ?

జవాబు:—అరుణకాంతులు సూర్యునిరాకను ముందుగ సూచించు విధాన, స్వార్థత్యాగము, అమలత్వము, సచ్ఛీలము అనునవి స్వామిరాకను ముందుగ తెలుపును.

564. రాజు సేవకునియింట విందారగింపబోవుచో, తన భాండారములనుండియే, ఆసనములు, అలంకారములు, భోజ్య పదార్థములు, సమస్తమును ముందుగ సేవకుని యింటికి పంపును. అప్పుడు సేవకుడు తనస్వామికి తగినటుల మర్యాదలుచేసిగౌరవించును. అట్లేభగవంతుడు రానున్నప్పుడు ముందుగనె భక్తిని, గౌరవమును, విశ్వాసమును, సద్భక్తుని హృదయమునందు ముందుగప్రవేశపెట్టును.

565. పరుశవేదితాకున బంగారముగ మారినయినుమును నేలలో పాతిపెట్టవచ్చును. లేదా పెంటకుప్పలో పాఱవేయవచ్చును. అది బంగారుగనే నిలిచియుండునుగాని పూర్వపు

స్థితికిమారదు. ఒక్కసారియైననుసరియే పరమేశ్వరుని పాదారవిందములు సోకిన నరునిదశ అటులుండును: ఆతడు లౌకిక వ్యవహారాడంబరములోనున్నను లేక అడవులందు ఏకాంతముగనున్నను వానికి ఏకళంకమును అంటబోదు.

23వ అ ధ్యా య ము.

# ముక్తి లేక జీవుని మోక్షము.

—:o:—

566. ప్రశ్న:—నరులందఱును భగవంతుని చూడ జాలుదురా ?

జవాబు:—ఏనరుడును సదా పూర్ణోపవాసము చేయ బోడు; కొందఱు ఉదయము తొమ్మిదిగంటలకే భుజింతురు; కొందఱు మధ్యాహ్నము; కొందఱు రెండుగంటలకు; యింకకొందఱు సాయంతనము; సూర్యుడుక్రుంకిన పిమ్మట ఆహారము తిందురు. అదేతీరుగా ఎప్పుడో ఒకప్పుడు, ఈ జన్మలోనో, లేక యింక కొన్నిజన్మల యనంతరమో, అందఱును ఈశ్వరసాక్షాత్కారమును పొందియేతీరుదురు.

567. లోభ మోహముల జిక్కియున్న మనస్సు, పైబెరడునకు అంటుకొనియుండు పచ్చిపోకకాయవంటిది. పోకకాయ పక్వము కానంతవరకును. తనరసముతోడనే పైడొల్లకు అంటుకొనియుండును. కాని సకాలమున దాని రసము ఎండి పోయి అది డొల్లనుండి విడివడును; కదిలించినప్పుడెల్ల లోట లోటమనుచు తాను లోనవిడివడి యున్నటుల తెలుపును. అటులనే భోగము, ధనము నెడ గాగమనుజిగురుఎండబారెనా, నరుడు ముక్తుడే !

568. "దేనికైనను నైజగుణముపోదు." అనిఒకడుఅనగా మఱొకడు "నిప్పుబొగ్గులోప్రవేశించి దానికి నైజమగు నలు

వును నాశముచేయుచున్నది సుమీ!" అని ప్రతిపలికినాడు అటులనే జ్ఞానాగ్నిచేత మనస్సుతప్తమగునేని, దాని నైజ గుణమునశించి యది బంధకముగనుండుట మానును.

569. లక్షలాదిగ ఎగురవేయు గాలిపటములలో ఒకటి రెండుమాత్రమె, దారముత్రెంపుకొని స్వేచ్ఛనుపొందును. అదేవిధమున ఎన్నివందలమందియో సాధకులలో ఒకరిద్దరు మాత్రము సంసారబంధములనుండి విముక్తులగుదురు!

570. దయ్యముపట్టినమనిషి తనకు గ్రహముసోకినట్లు గ్రహించగానే, ఆదయ్యము విడిచిపారిపోవును. అటులనే మాయచే ఆవేశితమైన జీవాత్మ తనను మాయఆవేశించినటుల తెలియగానే, ఆమాయ విడిచిపోవును.

571. వేయించిన వరిగింజలు నేలపైనిచల్లినచో మొలక యెత్తవు. వేయించని పచ్చివడ్లుమాత్రమే మొలుచును. అదే రీతిగ ఒకడు సిద్ధదశనుపొంది మరణించినయెడల మరల జన్మ నెత్తనగత్యములేదు; ఆసిద్ధదశయందే మరణించునతడు, సిద్ధత్వమును పొందువఱకును, మరలమరల జన్మించుచునే యుండును.

572. మనస్సే సర్వమును! మనస్సునకు స్వాతంత్ర్యము పోయెనా నీకును పోవును. మనస్సు స్వేచ్ఛగనుండెనా, నీవును ముక్తుడవే; అప్పుడునానిపిన తెల్లనిగుడ్డవలె మనస్సునువిరంగులో నైననుముంచవచ్చును. ఆంగ్లభాషచదివినయెడల, నీనిశ్చయము నకు విరుద్ధముగకూడ నీప్రసంగములో ఆంగ్లశబ్దములు చొచ్చు కుండ ఆపలేవు. సంస్కృతముచదివిన పండితుడు శ్లోకములను

నిదర్శనముగ జూపుచుండును. చెడ్డవారిపొత్తుగల మనస్సు, ఊహాలందును, సంభాషణలందును తనరంగును వెలువరించుచుండును. సాధుసంగమున కాలముగడపుమనస్సు దైవధ్యానమునందుమాత్రమే నిలుచును. మనస్సు ఎటువంటి సహవాసముచేయునో అటుల నెల్ల తననైజమును మార్చుకొనుచుండును.

573. సర్వమును మనస్సునుబట్టియేయుండును. భార్యయెడగలుగు అనురాగము ఒకరకము; కొమరితపైగలుగు ప్రేమ వేఱొకరకము. ఒకనికి ఒకవైపు భార్యయు, రెండవవైపు కొమరితయునుండినచో, ఆతడు యిరువురను లాలనచేయును గాని వానిచిత్తవృత్తులు భిన్నములుగ నుండును.

బంధనము మనస్సునది; ముక్తియు మనస్సునదే! "నేనుముక్తాత్మను. నేను ఈశ్వరతనయుడను! నన్నెవరు బంధించగలరు?" అని నీవు ధిక్కరించిపలికితివా నీవుముక్తుడవే! ఒకనిని పాముకఱచినను, అతడు పూర్ణవిశ్వాసముతో దృఢముగా "లేదు, విషము లేదు; లేదు!" అని పలికినయెడల వానికి విషబాధయెంతమాత్రము నుండదు.

574. జీవితకాలమంతయు పాపమనియు, నరకయాతనలనియు విలాపములు చేయుచుండుటేల? భగవన్నామస్మరణచేసి "ఓస్వామీ! నేనుచేయరాని పనులను ఎన్నింటినో చేసితిని, చేయవలసినపనులను ఎన్నింటినో చేయకవిడిచితిని. ప్రభో! నన్నుక్షమింపుము." అనిఒక్కసారిపలుకుము. అటుల పలుకుచు భగవంతునియందు సుస్థిరవిశ్వాసముంచుము. నీపాపములన్ని తొలగింపబడును సుమీ!

## 29వ అధ్యాయము.

# జ్ఞానియొక్క సమదృష్టి.

—(0)—

575. గాలి శ్రీగంధపుసువాసనను, మురుగుడు పీనుగు వెలిగ్రక్కు చెడుకంపునుకూడ మోసికొని పోవును. కాని ఆగాలి వీనితో కలియదు. అదేవిధముగా ముక్తాత్ముడు ప్రపంచములో నివసించుచుండును, కాని ఆప్రపంచములో కలిసిపోడు.

576. సాధువొకడు జనముతో నిండియున్నవీధిలోపోవుచు, ఒకదుష్టుని కాలివేలిని పొఱబాటున త్రొక్కుట తటస్థించెను. ఆదుష్టుడు కోపావేశుడై, ఆసాధువును స్మృతితప్పిపడిపోవునటుల నిర్దయుడై మోదెను. ఆసాధుని శిష్యులు చాల శ్రమచేసి, అనేక ఉపచారముల సలిపి వానికి స్మృతి తేర్చిరి. వానికి కొంచెము స్పృహరాగా "స్వామీ! మీకీ ఉపచారములు చేయునదెవరో గుర్తుతెలియునా?" అని అడిగిరి. "ఆహా? నన్ను కొట్టినయాతడే సందేహమేమి?" అని ఆసాధుసత్తముడు జవాబుచెప్పెను. నిజమగుసాధువునకు శత్రుమిత్రులను భేదభావము తోచదు.

577. సద్వంశీకురాండ్రగు పుణ్యస్త్రీలను చూచునప్పుడు, పతివ్రతా వేషముదాల్చి నిరాడంబరముగ నాజగజ్జననియే వారియందు నాకు కానవచ్చును. మఱియు అత్యాడంబరముతో సిగ్గునువిడిచి శృంగారించుకొని వీధిపంచలందు కూర్చుండు నగరవ్యభిచారిణీస్త్రీలను చూచినప్పుడును, నాకు

ఆదివ్యమాతయే వేఱొకరీతిని లీలసలుపుచున్నటుల నాకు గోచరించును.

578. క్షమయే సన్యాసికి ప్రధానలక్షణము.

579. నీటముంచిన కడవలోపల నిండుగ నీరుండును; మఱియు దానిచుట్టుకూడ నీరుండును; అటులనే భగవంతుని యందు నిమగ్నమైన జీవునియందు పరమాత్మ సర్వవ్యాపియై, బాహ్యమునకూడ ఎల్లెడల నావరించియుండును.

580. శాంతి ధర్మరుులతో జీవనముగడపుచు ప్రజల నిందా స్తోత్రములు సరకుగొనక వర్తించును.

581. మనుజుడు మైదానముపైనున్న సమయమున అల్పమగు గడ్డిని మహోన్నతములగు మఱ్ఱిచెట్లనుచూచి "ఆహా! ఈవృక్షము ఎంతఉన్నతమైనది! ఈగడ్డి ఎంతకొద్దిది!" అనుచుండును. ఆతడేపెద్దపర్వతము నెక్కి ఎత్తగు దానిశిఖరము నుండి చూచునప్పుడు గడ్డియు వృక్షమును వేఱుపఱచుటకు వీలుగాని పచ్చని తృణజాలముగ గోచరించుట తెలియును. అటులనే లౌకికపురుషుల దృష్టిలో సంపత్తు, ఉద్యోగము, మున్నగుభేదములు తోచును. ఒకడు రాజ్యముపాలించురాజు, మఱొకడు చెప్పులుకుట్టు మాదిగ, ఒకడుతండ్రి వేఱొకడు కొడుకు,ఇట్లెన్నియో భేదములు కాని దివ్యదృష్టి ప్రాప్తించినవానికి సర్వమును సమమైతోచును; ధర్మాధర్మములు, ఉత్తమాధమములు అను తారతమ్యములు రూపుమాసిపోవును.

582. ఒకసారి భక్త్యావేశముతో పరవశుడై యున్న సాధు వొకడు శ్రీరామకృష్ణపరమహంసులవారుండు రాసమణీదేవి

గారి కాళీదేవళమునకువచ్చెను. ఒకనాఁడు ఆయనకు భోజనము దొఱకలేదు; ఆకలిగానున్నను ఆయన ఎవరిని యాచించలేదు. భోజనానంతరము ఎంగిళ్లు పారవేయుగొందిలో ఆకులనాకుచున్న కుక్కకడకుపోయి ఆయన "అన్నా! నాకుపాలీయకుండ ఒంటరిగ నీవేతినుచున్నావా?" అనెను. అట్లనుచు కుక్కతోకూడ కలిసితినసాగెను. అట్టివింత సహవాసగానితో భోజనముచేసిముగించి, కాళీమాతయాలయమునకు తిరిగివచ్చి దేవళములోనివారికెల్ల గగుర్పాటొదవునటుల మహా భక్త్యావేశముతో ఆయన దేవిస్తోత్రము చేయగడంగెను. కొంతవడికి ప్రార్థనముగించి ఆయన వెడలిపోవుచుండగాంచి, తనబంధుడగు హృదయముఖర్జీగారిని ఆయనవెంటబోయి ఆయన యేమనునో తిరిగివచ్చి చెప్పుమని పరమహంసులవారు పంపిరి. హృదయుడు వానివెంట కొంతదూరము పోయెను. ఆసాధుసత్తముడు వెనుకకుతిరిగి "నీవు నావెంటవచ్చుచుంటివి, ఏల? అని అడుగగా స్వామీ! నాకేమేని బోధచేయుము!" అని హృదయుడు పలికెను. అంతట ఆమహానీయుడిట్లుపదేశించెను. "ఈమురికి గోతిలోని నీరును, ఆపావనగంగాజలమును నీకెప్పుడు సమమైతోచునో, వేణుగానమును అల్లరిమూకల గోలయు నీచెవికి ఎన్నడు సమానముగతోచునో, అప్పుడు నీవు పరమజ్ఞానావస్థను పొందినట్లగును."

హృదయుడు మరలివచ్చి యీమాటలను పరమహంసులవారికి వినిపించగా వారిట్లనిరి. "ఆపురుషుఁడు సమాధిస్థితిని జ్ఞానసిద్ధిని పొందినవాఁడు. సిద్ధత్వమును పడసినయతడు

బాలునివలెను, పిశాచమువలెను, పిచ్చివానిపోలికను, ఇంకను చాలమారువేసములతోడను తిరుగులాడుచుండును."

583. బలిపీఠము, బలియగు జంతువు, బలికై దానిని నఱకు నరుడు, ముగ్గురును ఒకే తత్త్వమని తెలిసికొంటిని.

584. ప్రతినరాకృతియందును భగవంతుడు చరించుచు పుణ్యులందును, పాపులందును శిష్టులందును, దుష్టులందును ఆయన ప్రత్యక్షమగుటను అపరోక్షముగ గ్రహించుదశకు నేనిప్పుడువచ్చితిని. కావున నేను వేర్వేఱు జనులను కలియు నప్పుడు యిట్లనుకొందును:— "సాధురూపమున భగవంతుడు దుష్టురూపమున భగవంతుడు, యోగ్యునిరూపమున భగవంతుడు, అయోగ్యునిరూపమున భగవంతుడు (అన్ని రూపములందును భగవంతుడే!")

585. భగవంతునియందు విద్య, అవిద్య రెండును కలవు. విద్యామాయ నరుని భగవంతునిదిక్కు నడపును. అవిద్యామాయ వానిని పెడత్రోవకులాగి భగవంతునికి దూరము చేయును. జ్ఞానము, భక్తి, వైరాగ్యము, కరుణ, యివన్నియు విద్యామాయయొక్క సూచనలు; వీనిసాయమున భగవంతునిచేరవచ్చును.

కాని యింకొకమెట్టు పైకిపోతివా బ్రహ్మజ్ఞానములభించును. భగవంతుని పొందినట్లే ఈదశయందు భగవంతుడేసర్వమును అయ్యెనని నేనుగ్రహింతును. ఇంతేల ప్రత్యక్షముగ చూడగలను. అంగీకరించుటకుగాని, త్యజించుటకుగానిఏమియు లేదు. ఎవరిమీదనైనను నేనుకోపముపూనుట సాధ్యపడదు.

ఒకసారి నేను బండిలో నెక్కిపోవుచుండగా ఒకమిద్దెపై నిలుచుండిన ఇరువురువ్యభిచారిణులు గాంచనయ్యెను. కాని వారిలో నాదివ్యజననియే ప్రత్యక్షమగుటచేత ప్రణామము చేసితిని.

ఈ చిత్తవైఖరి నాకు లభించినప్పుడు (దక్షిణేశ్వరాలయమునందలి) కాళీమాతను పూజించుటకును, అర్పణలు చేయుటకును, సాధ్యముకాకపోయినది. నాస్థితిచూచి దేవాలయపు యజమాని నన్ను మందలింపసాగెను. అప్పుడు నాకెంత మాత్రము రోషమువచ్చినది కాదు; వానిమందలింపులు విని నవ్వెడివాడను.



## 30వ అధ్యాయము.

# ఆత్మజ్ఞానము — సంఘాచారములు

586. చెట్టునపండి తనంతటతాను రాలినపండు చాలమధురముగనుండును; కాని కోసిపాడవేసినకాయ అంతతియ్యగా నుండదు. మఱియు వాడి ముడుతలుపడును. అదేతీరున సిద్ధత్వమునుపొంది సమస్తభూతములతోడను పరమైక్యభావమును బడసిన పురుషునినుండి కులాచారములు తమంతతామె రాలిపోవును. అట్టిపరమాత్మజ్ఞానుభవముకలుగనంతకాలమును ఇతరులందు ఎచ్చుతగ్గులుపాటించుగుణము తొలగిపోదు. వారంతవఱకును కులభేదములను అనుసరించవలసినవారే అగుదురు. అజ్ఞానస్థితిలోనె కులభేదములను విడిచివేసి విచ్చలవిడిగ వర్తించుచు సిద్ధత్వమును పొందినటుల నటించెనేని కృత్రిమముగా పండవేసిన పచ్చిపిందెవలె చెడకతప్పదు.

587. తుపానుగాలి వీచుసమయమున రావిచెట్టుయేదో, మఱ్ఱిచెట్టుయేదో భేదముచేయుటకష్టము. అదేతీరున బ్రహ్మజ్ఞానానిలము వీచునప్పుడు కులభేదములు పాటింప వీలుండదు.

588. భగవద్భక్తిని పూర్తిగ గ్రోలినభక్తుడు నిజముగా సారాత్రాగినవాడే! అట్టిదశలో ఆతడు ఉచితానుచితములను గమనించలేడు.

589. ప్రశ్న—బ్రహ్మజ్ఞానమును ప్రాపించిన యతడింకను జంద్యమునుంచుకొనుట మంచిదా?

జవాబు—ఆత్మజ్ఞానమును పొందగనే సకలబంధములును వాటంతటవియే రాలిపోవును. ఆపిమ్మట నీవు శూద్రుడనియు, నీవు బ్రాహ్మణుడనియు, నీవుత్తమజాతివాడనియు, నీవు అధమజాతివాడనియు తారతమ్యములుండజాలవు. కావున కులాధిక్యతకు చిహ్నమగు జంధ్యమును దానంతట అదియే రాలిపోవును. కాని ఒకనికిభేదములు ఎచ్చుతగ్గులు స్ఫురించునంత వఱకును వానిని ఆతడు బలాత్కారముగా త్రోసిపుచ్చరాదు

590. తప్పత్రాగినవాడు చొక్కాను ఒక్కొకప్పుడు తలకు చుట్టుకొనుచు, ఒక్కొకప్పుడు కాళ్లకుతొడుగుకొనుచు నుండుతీరున బ్రహ్మవేత్తపురుషుడు బాహ్యప్రపంచజ్ఞానము గోల్పోయి వర్తించును.

591. పుండు మానిపోయిన అనంతరము పొక్కు దానంతనది రాలిపోవును. అంతదాక ఆగక యాపొక్కును బలాత్కారముగ లాగివేసితిమా, నెత్తురుకారనారంభించును. అటులనే బ్రహ్మజ్ఞానతేజము కలుగగానే కులభేదము వానంతట అవియే వీడిపోవును; కాని పామరులుగ నుండియు, అట్టిభేదములను తిరస్కరించుటతప్పు. అందువలన అనేకములగు అనర్థములు పొసగును.

592. ఈకాలపునరులు ప్రతిదాని సారాంశమును తెలియగోరుదురు. వారికి మతమునందును సారమే కావలయునే కాని అప్రధానాంశములు వారికక్కఱలేదు. (క్రతువులు, కర్మలు, నియమములు, నోములు, ఏవియు పాటింపరు)

593. మంచిముత్యమును గర్భమునందు తాల్చు ముత్తెపు చిప్పకు అంతగా విలువలేదు; కాని ఆముత్యము పరిపక్వమగుటకుగాను ఆచిప్ప చాల ప్రధానమైనదే! ముత్యమును దీసికొనిన నరునకు ఆచిప్ప వ్యర్థమే కావచ్చును. అట్లే కర్మలు క్రతువులు బ్రహ్మపదవిని సాధించినవానికి అవసరములుకాకపోవచ్చును.

594. భగవన్నామోచ్చారణ చేయువారు పవిత్రులగుదురు. (దక్షిణేశ్వరమునకు దాపునగల) ఆర్యాదగ్రామమున కృష్ణకిశోరుడను జ్ఞానికలడు. ఆయన ఒకసారి బృందావనమునకు తీర్థయాత్ర వెడలెను. ఒకనాడాయన యిటునటు తిరుగుచుండగా, నూతిదాపున నిలుచుండియున్న ఒకమనుష్యునిగాంచి తనకు కొంచెము నీళ్ళుతోడిపెట్టుమని అడిగెను. ఆ మనుష్యుడు తానొక మాలవాడననియు బ్రాహ్మణునకు నీరుతోడియిచ్చుటకు తగనినియు చెప్పెను. "ఒకసారి భగవన్నామోచ్చారణ చేసి పావనుడవు కమ్ము" అని కృష్ణకిశోరు పలికెను. ఆమనుష్యుడటుల భగవన్నామమును ఉచ్చరించి, ఆయనకొఱకు నీరుతోడిపెట్టెను. ఆయన బహునిష్ఠాగరిష్ఠుడగు బ్రాహ్మణుడయ్యును ఆనీరు త్రాగినాడు! ఆయన విశ్వాసమెంత గొప్పదో!

595. ఒకపర్యాయము కృష్ణకిశోరు "నీవు ఎందులకు జందెము తీసివేసితివి? అని అడిగెను. నాకీ (బ్రహ్మభావన) ప్రాప్తించినప్పుడు, అశ్వినీ జంఝామారుతము వీచినప్పటివలె (1864 సంవత్సరపు ఉప్పెనవలె) అన్నియు కొట్టుకొని

పోయినవి. నాకు బాహ్యప్రపంచ స్పృహయే లేదయ్యె. అప్పుడు నా జందెమునుగాని కట్టుకొనిన బట్టనుగాని జాగ్రత్తచూచువా రెవరు? తీవ్రమగు బ్రహ్మభావనయందు మునిగిపోయి, ప్రతిదినము చాలసేపు కట్టుబట్టకూడ లేక దిస మొలతో నుంటిననియు నాకు తెలియలేదు. కృష్ణకిశోరు జందెము తీసివేసితినని నన్నాక్షేపించినప్పుడు "భగవంతుని గూర్చిన పారవశ్యత నిన్ను ఆవేశించినప్పుడు నీకీవిషయము స్పష్టపడును లెమ్ము" అంటిని.

## 31వ అధ్యాయము.

# భక్తుల లక్షణములు

596. బాగుగ బరువులతో నింపిన రైలుబండ్లవరుసను ఇంజను సులభముగ లాగికొనిపోగలదు. అటులనే భగవంతుని ప్రియసంతానము భక్తివిశ్వాసభరితులై ఐహికజీవనపు కష్టనిష్ఠురములను భరించుటలో దిగులుపడరు. మఱియు అనేకులను భగవంతునివైపునకు త్రిప్పి నడుపగలరు.

597. చకుముకిరాయి, యుగాంతరములుగ నీటియడుగున పడియుండినను దానిలోనిఅగ్ని కోలుపోదు. నీయిష్టము ఎప్పుడైననుసరియే దానినిఉక్కుతో కొట్టుము. తళుక్కుమని అగ్ని నివెలిగ్రక్కును. గాఢవిశ్వాసముగల భక్తుడట్టులుండును. సంసారికమలములు వానిని ఎన్నిచుట్టుకొనియున్నను వాని భక్తివిశ్వాసములకు నాశముండదు. భగవన్నామము చెవిని బడినతోడనే అతడు భక్తావేశము పూనగలడు.

598. ప్రశ్న—భగవద్భక్తుని బలము ఎందున్నది ?

ఉ—అతడుభగవంతునిబిడ్డ ! భక్తిచేవెల్లివిరియు ఆనందబాష్పములు వానికి అవిజేయమగు ఆయుధము !

599. ఒక జ్ఞానియు, ఒకభక్తుడును, అడవిగుండ పోవుచుండిరి. త్రోవలో వారికి ఒకపులి కాన్పించినది. "మనము పాఱిపోవలసిన కారణము కాన్పించదు. సర్వశక్తిమంతుడగు

భగవంతుడు మనను కాపాడగలడు." అని జ్ఞానిపలికెను. "సోదరా! అటులకాదుసుమీ! పరుగెత్తి పోదమురమ్ము! మనయత్నముచేతనే కాగలపనికై భగవంతునికి శ్రమకలిగించుటెందుకు?" అని భక్తుడు పలికెను.

600. పాము భీకరవిష జంతువు; దానిని పట్టుకొనబోయినవానిని కఱచును. కాని పాముమంత్రము నేర్చినయతడు, చాలపాములను సులభముగ పట్టుకొనుటేగాక, వానిని ఆభరణములవలె కంఠమునను హస్తములందును అనేకములుగా ప్రేలవేసికొనగలడు. అటులనే పారమార్థికజ్ఞానము కలవాడు లోభమోహముల విషముచేత భంగపడడు.

601. తామర లేచినకోల గోకినకొలదిని దురద హెచ్చుచుండును; ఎంతగోకిన అంత సుఖముగానున్నట్లు తోచును. అట్లే ఈశ్వరారాధకులు భగవత్స్తోత్రముల పాటలలో తృప్తి చెందరు.

602 భగన్నామస్మరణ మాత్రాన ఎవని శరీరము పులకరము పొందునో, ఎవని నేత్రములు ఆనంద బాష్పములతో నిండునో అట్టివానికి అది తుదిజన్మ!

603. మంచికలకండను రుచిచూచినవాడు బెల్లపుతెట్టెను తిని ఆనందింప జాలడు. సుందర మందిరములందు నిద్రపోవువాడు పెంటకుప్పలపై పరుండి సంతసింప జాలడు, అటులనే బ్రహ్మానందమును రుచిచూచినవాడు సంసారిక సుఖములందు సంతుష్టి నందజాలడు.

604. పారమార్థిక చింతగలవారు, సంఘాచారముల కతీత మగు ఒకకూటముగ నేర్పడుదురు.

605. స్త్రీ అనుదినము తనభర్తతో నమువు ముచ్చటలను బయటికి చెప్పుటకు సిగ్గుపడును. ఆ రహస్యములను ఆమె ఎవరితోడను చెప్పదు; చెప్పుటకిష్టముపడదు. ఒకవేళ కర్మము చాలక అది బయలుపడినా తహతహపడును. అయినను తన ప్రాణసఖితో మాత్రము దాపరిక మింతయు లేక సర్వమును చెప్పును. ఇంతేగాదు అట్టి సఖితో చెప్పుటకై ఆరాటపడును; చెప్పగల్గినప్పుడు అత్యానందము నందును. అదేతీరున భగవద్భక్తుడు తానీశ్వరసన్నిధిని అనుభవించిన బ్రహ్మానందమును గురించి నిజమగుభక్తునికితప్ప యితరులకు తెలుపనిచ్చగింపడు; మఱియు అట్టిభక్తునికి తనఅనుభవములను తెలుపుటకు ఆతురపడుచు, అటుల జరిగినప్పుడు ఎంత సంతసించును.

606. రాజునే తనప్రియుడుగా గలిగినస్త్రీ దరిద్రుని ప్రేమింపదు. అటులనే భగవంతుని కృపావీక్షణముల బడసిన నరుడు సాంసారిక తుచ్ఛభోగములకు ఆశపడజాలడు.

607. చేటతేలికయై పనికిమాలినపదార్థములను ఎగురకొట్టివేసి ఘనమై ఉపయోగపడుపదార్థములను తనలోనిలుపుకొనును. ఉత్తమనరుల లక్షణము అటులుండును.

608. ఇసుకయు, పంచదారయు కలసియుండినను, చీమ యిసుకరేణువులనువిడిచిపెట్టి పంచదారనే తీసుకొనును. అటులనే పావనమూర్తులగు పరమహంసలును సాధుసత్తములును

అయోగ్య విషయములనుండి వేఱుచేసి సద్విషయములను చేకొనగలరు.

609. ప్రశ్న:— ఇంద్రియలోలతయు, ఐహికసుఖ వాంఛయు, ఎప్పుడు నశించును ?

ఉ:— అఖండబ్రహ్మానంద సాగరుడగు పరమాత్మయందు సర్వసుఖములును, సర్వానందములును, పర్యవసించును. దేవునియందానందము ననుభవించువారు అల్పము తుచ్ఛమును అగు ఐహికభోగములను మెచ్చుకొనజాలరు.

610. ఆవులమందలోనికి అన్యజంతు వేదియైన చొఱబడినయెడల, ఆఆవులు కొమ్ములతో కుమ్మియు, గిట్టలతో తన్నియు దానిని తఱిమివేయును. కాని మఱొక ఆవే వచ్చినయెడల అవన్నియు చుట్టుచేరి దానితో నెయ్యమునుజూపి ఒకదానినొకటి నాకుకొనును. అటులనే భక్తుడు వేఱొకభక్తుని కలిసికొనినప్పుడు యిరువురును మహదానందమును పొంది, యెడబాటునకు ఓర్వకుందురు. కాని అవిశ్వాసియొకడు తమతో చేరనేని వారందఱుచేరి వానిని దూరముగ వెడల నడుపుదురు.

611. భగవద్భక్తుడు ఏకాంతవాసమున యిష్టపడకుండు టేల ?

జవాబు:— గంజాయి త్రాగునతడు సహవాసగ్రాండ్రు లేకుండ పొగత్రాగి ఆనందింప జాలడు. అటులనే భగవద్భక్తుడు భాగవతసంగము లేకుండ దూరముగ నెక్కడనో

ఈశ్వరుని పావననామ సంకీర్తనము చేయుటచేత ఆనందింప జాలడు.

612. వడివడిగపారు జలప్రవాహము కొన్నికొన్నిచోట్ల గిరగిర సుడులు తిరుగుచు పోవును. కాని త్వరలోనె ఈస్థితిని దాటిపోయి తిన్నని త్రోవను వడిగ ప్రవహించును. అట్లే భక్తుని హృదయము తఱుచుగా నిరాశ, దుఃఖము, అవిశ్వాసము అను సుడుల చిక్కుచుండును; కాని యీస్థితి క్షణకాలపు నైపరీత్యమె; చిరకాలముండదు.

613. ప్రశ్న:— దుశ్చరితయగు స్త్రీ భక్తుని వెంటబడి వానిని తన దుర్వర్తనమునకు లోబఱచుకొనుటకు ప్రయత్నించిన ఏమగును ?

ఉ:—పక్వమైయున్న మామిడిపండును గట్టిగా నొక్కిన యెడల, దానిలోని టెంకయు గుజ్జును తప్పించుకొనిపోయి తోలుమాత్రమే చేతిలో మిగులుతీరున, భక్తునిహృదయము భగవంతునికడకు తప్పించుకొనిపోవును; మట్టి గుల్లయగు తనువు మాత్రమే ఆస్త్రీచేత చిక్కును.

614. మామిడిపండుతిని, ఎవరికైన తెలిసిపోవునేమోయని పెదవులను బాగుగ తుడుచుకొనువారు కొందఱుందురు. మఱికొందఱో తమకొకమామిడిపండు దొఱకగానే యితరులను కూడ కేకవేసిపిలిచి వారితో పండును పంచుకొనితిందురు! అట్లేకొందఱు బ్రహ్మానందముదొఱకగానె ఎవరికి తెలియకుండ తామేఅనుభవింతురు. మఱికొందఱో తమ అనుభవమును ఇతరులకును కల్గింతురు.

615. నిజమైన భక్తుడు తనను ఏమానవుడును చూడజాలని ఏకాంతముననున్నప్పుడు సయితము, భగవంతుడు నిరంతరము తనను చూచుచుండునని గ్రహించి, పాపకార్యములను ఆచరించజాలడు. ఎవడు ఒంటరిగ నట్టడవిలో, తననొక యౌవనవతియగు మోహనాంగి యితరనరునికంటబడునను భీతిలేని తావున, వలపుజూపిన యెడల, భగవంతుడు తమనుచూచుచున్నాడను భయముతోడ లోబడకుండునో, మఱియు కామవీక్షణములనైన ఆమెవైపుపోనీయడో, అట్టివాడు నిజమైన దైవభక్తుడు. పాడుపడినయింటిలో ఎవరును లేనిసమయమున బంగారుసంచి కనబడినను దానినితాకక ఎవడు నిగ్రహము చూపునో, ఆతడు నిజమగుభక్తుడు. నలుగురు ఏమనుకొందురో యను భీతిచేత కర్మకలాపముల నిర్వహించువాడు నిజమై భక్తుడుకాడు. నిశ్శబ్దముగ ఏకాంతస్థలమున నిర్వహింపబడు మతమే మతము. ఆడంబరము డాంబికము సాగుచోట సర్వమును బూటకమే, శుద్ధమోసమే!

32వ అధ్యాయము.

# సన్న్యాసాదర్శము.

616. ఒకమనుష్యుడు, జబ్బుగానుండిన తనబిడ్డను చేతులలో నిడుకొని ఔషధముకొఱకై ఒక సాధువుచెంతకు పోయెను. మరునాడురమ్మని ఆసాధువు వానితో చెప్పెను. మరునా డతడురాగా "ఆబిడ్డకు మిఠాయి పెట్టకు; త్వరలోనె నెమ్మదించును" అని సాధువుపలికెను. అందు కామనుజుడు "అయ్యా! ఈమాట నాకు నిన్ననే చెప్పలేకపోతిరా?" అనగా సాధువు యిట్లనెను. "అవును. చెప్పెడివాడనే; కాని నిన్ననాముందటనే చక్కెరయున్నది. అదిచూచి నీబిడ్డడు "ఈసాధువు తాను పంచదారమెక్కుచు యితరులను తినవద్దంటాడు; వట్టిమోసగాడు; అని పలికియుండును.

617. యోగులును సన్న్యాసులును పాములబోలువారు. పాము తనకై కలుగును త్రవ్వుకొనదు. చుంచు చేసికొనిన కలుగులోదూరి నివసించును. ఒక కలుగు నివాసయోగ్యము కానిచో మఱొక కలుగులో ప్రవేశించును.

అటులనే యోగులను, సన్న్యాసులును, తమకై యిండ్లను కట్టుకొనరు; ఇతరుల యిండ్లలోకాలము గడుపుకొందురు—ఈదినమున యీయింటిలో, రేపు వేరొకయింటిలో!

618 ప్రశ్న:— సన్న్యాసాశ్రమ స్వీకారమునకు తగినవాడు ఎటులుండును?

ఉ— ఎవడు రేపు తానేమి తినునో, ఏమి ధరించునో అనుచింతలేక ప్రాపంచిక విషయములను పూర్తిగా విడిచి వేయునో అతడు నిజముగ సన్న్యాసి అగుటకు తగినవాడు. ఎత్తగు చెట్టునెక్కి తనప్రాణమునకును అవయవములకును ఏమి అపాయము కలుగునో అనుచింత యిసుమంతయు లేక, అవసరమగునేని ఆఉన్నత స్థలమునుండి నిర్భయముగా క్రిందికి దుముకు మనుష్యునివలె నుండును.

619. సన్న్యాసియొక్క శిక్షణా విధానము చాలా కఠినమైనది. అయినను ప్రజల కతడు బోధకుడుగనుండువాడు కావున అట్టి కఠినశిక్షణమును పడవలయును. ప్రజలు వాని జీవనసరణిని ఆదర్శమును గాంచియే జ్ఞానమును పొందవలసియున్నది. అట్టివాడు స్త్రీలున్న చోట ఉండకపోవుటేగాక, వారి రూపపటములనైనను చూడతగదు. ఆశిక్షణము అంతకఠినమైనది!

620. ఒకడు సన్న్యాసుల కావివస్త్రమును ధరించినప్పుడు, అతడు నిజమగు సన్న్యాసివలె అనగా సాధువువలె వర్తించవలయును. నాటకములో రాజువేషము వేసినవాడు సరిగా రాజువలెను, మంత్రివేషము వేసినవాడు సరిగా మంత్రివలెను, నటించుటను మీరు చూడలేదా? ఒకసారి పగటివేషగాడు సన్న్యాసివేషము వేసికొని గ్రామాధిపతి యింటికి వచ్చెను. ఆగ్రామనాయకుడు వానికొక ధనపుసంచిని బహుమానమీయబోయినాడు. అతడు దానిని పుచ్చుకొనుటకు నిరాకరించి వెడలిపోయెను. కొంతసేపటికి తనవేషమును తీసివేసి, బూడిదను కడిగికొని మరలవచ్చెను. గ్రామాధికారి యయ్యా

దలచినడబ్బును అప్పుడియ్యుమని వేడుకొనెను. అతడు సన్న్యాసివేషముతోనుండగా ధనమును తాకనైనను వానికి ఒగనిపనియైనది! కాని తరువాత పావలాడబ్బు లిచ్చినను బహు వినమ్రుడై పుచ్చుకొనెను.

## ౩౩వ అధ్యాయము.

# మానవులలో భిన్నవర్గములు.

౬21. తమయందలి సత్త్వరజస్తమోగుణముల ఆధిక్యతను బట్టి మానవులు భిన్నభిన్నగుణములు కలవారుగనుందురు.

622. జీవులన్నియు ఒక్కటరువే; కాని వానివాని పరిశాంతి రములనుబట్టి నాలుగురకములుగ నుండును.

(1) బద్ధజీవులు:—బంధనమున నున్నవి.

(2) ముముక్షులు:—బంధనమును తొలగించుకొనవలయు నని తీవ్రప్రయత్నములు చేయునవి.

(3) ముక్తజీవులు:— బంధనమునుండి తప్పించుకొనినవి.

(4) నిత్యముక్తజీవులు—బంధనమున చిక్కకయే సదా స్వేచ్ఛతోనున్నవి.

623. పూర్ణములపై పూత వరిపిండియే; కాని లోపలిపూర్ణ ము వేఱుగానుండును. పూర్ణముయొక్కమంచిచెడ్డలు లోపలి పదార్థము ననుసరించి యుండును. అటులనే నరులందఱి శరీర ములును ఒకేరకము పదార్థములతో నేర్పడినను వారి హృద యముయొక్క పవిత్రతా తారతమ్యమునుబట్టి వేర్వేఱు గుణ ములుగలవారుగ నుందురు.

624. మానవులు తలగడదిండ్ల గలేబులవంటివారు. ఒక గలేబు ఎఱ్ఱగా నుండవచ్చును. యింకొకటి నీలముగా నుండ

వచ్చును. వేఱొకటి నల్లగానుండవచ్చును. కాని అన్నింటిలో నుండునది ఒకేరకపు దూదియే. నరుల స్థితియు యిట్లే యుండును. ఒకడు సుందరరూపి, మఱొకడు నల్లనివాడు; ఇంకొకడు ధర్మాత్ముడు, వేఱొకడు ధూర్తుడు. అయినను వారందఱిలోపలను ఒకే పరమాత్మయే వసించుచుండును.

625. పల్లెకారి యొకడు ఏటిలో వలవేయుగా చాలచేపలు పడినవి. కొన్నిచేపలు వలలో నిశ్చలముగా కదలక పడియున్నవి. అవి వలనుండి బయటపడవలయునని యత్నమే చేయవు. కొన్ని గంతులువేసి చాలపెనగులాడినవి; కాని తప్పించుకొనలేవయ్యెను; మఱికొన్ని చేపలుమాత్రము ఏదో తీరున తప్పించుకొని బయటపడినవి. ఈతీరున ప్రాపంచిక జనులు మూడురకములవారు కాన్పించుచున్నారు.

(1) బంధనమున జిక్కియు యున్నను విడివడ ప్రయత్నము చేయనివారు.

(2) పెనగులాడువారు— ముముక్షువులు.

(3) ముక్తులు— స్వేచ్ఛను పొందినవారు.

626. మూడుబొమ్మలున్నవి:— ఒకటి ఉప్పుతో చేసినది; రెండవది గుడ్డతో చేసినది, మూడవది రాతిలో చేసినది. ఈ బొమ్మలను నీటిలోముంచినయెడల మొదటిది కఱిగిపోయి రూపనాశమునందును; రెండవది చాలనీటిని పీల్చుకొనును; కాని ఆకారమున మారదు; మూడవది నీటిని తనలో చొఱనీయదు. మొదటిబొమ్మ తన జీవాత్మను విశ్వాత్మలో చేర్చి సర్వాత్మైక్యమును బడసిన నరునివంటిది. రెండవది భక్తుని

బోలునది; అది దివ్యజ్ఞానానందములను నిండుగ గ్రోలును. చూడనది నలుసంత సత్యజ్ఞానమునైనను హృదయమున చొఱనీయని లౌకికవ్యావృత్తిగలవాని బోలునది.

627. అన్నినీళ్ళును నారాయణ స్వరూపమే; కాని అన్ని రకముల నీళ్ళను త్రాగుటకు పనికిరావు. అటులనే అన్ని ప్రదేశములందును భగవంతుని నిలయము లనుట నిజమే. అయినను అన్నిప్రదేశములును నరుడు దర్శించదగినవిగ నుండవు. ఒకరకమునీరు కాళ్ళుకడిగికొనుటకు మాత్రము ఉపయోగించును; వేఱొకరీతినీరు పుక్కిలించుటకు పనికిరావచ్చును; మఱొకరీతినీరు త్రాగుటకుఅర్హముగనుండును. కొన్నిరకముల నీరు ఎందుకును కొఱగాక తాకుటకుగూడ పనికిరాకుండును. అట్లేవేర్వేఱుస్థలములున్నవి. కొన్నింటిసమీపమునకుమాత్రము పోదగును; కొన్నింటిలోనికి చొఱదగును. మఱికొన్నింటిని దూరమునుండిచూచుటకును దగకుండును.

628. పులిలోనయితము దేవుడుకలడనుట సత్యమే. ఆకారణముచేత మనము సమీపమునకుపోయి ఆజంతువునకు ఎదుఱుగ నిలువరాదు. అతినీచపురుషులందును భగవంతుడుండుట నిజమే. అంతమాత్రాన మనమందఱితోడను సహవాసము చేయదగదు.

629. ఒకబ్రాహ్మణుని కుమారుడు పుట్టుకచేత బ్రాహ్మణుడగుచున్నాడు. అయినను అటులపుట్టుకచే బ్రాహ్మణులైనవారిలో కొందఱుమాత్రమే పండితులగుచున్నారు; కొందఱు పురోహితులగుచున్నారు; మఱికొందఱు వంటవారగు

చున్నారు. ఇంకకొందఱు భోగకాంతవాకిట ధూళిలోపడి కొట్టుకొను వారగుచున్నారు.

630. ఈ క్రింద పేర్కొనబడు వారింగూర్చి జాగ్రతతో నుండగావలయును.

(1) (హద్దుపద్దులేకుండ) సతతము వాగుచుండు నోరు గలవాడు.

(2) కపట హృదయము గలవాడు.

(3) చెవులలో తులసియాకులను ధరించి మహాభక్తుని లీల నటించువాడు.

(4) నిండాకు ముసుగు వేసికొని నడయాడు స్త్రీ

(5) మిగుల అనారోగ్యకరమగు పాకుడుతో నిండియున్న మురుగుడు గుంటలోని చల్లనినీరు.

34వ అధ్యాయము.

# గృహస్థులకు హితబోధ.

631. ఒక స్తంభమును పట్టుకొని పడిపోదుననుభయము లేకుండ వడిగ గిఱగిఱతిరుగు బాలునివలెనే భగవంతుని స్థిరముగ బట్టుకొని, నీసాంసారిక ధర్మముల నిర్వర్తించుకొనుచుండుము; నీకు అపాయముండదు.

632. ప్రశ్న:—ఏదినమున కాదినము, తిండికై పాటుపడ వలసిన నేను, ప్రార్థనాది కర్మలను ఎట్లు నిర్వర్తించగలను?

ఉ—నీవు ఎవరికొఱకై పాటుపడుదువో ఆతడే నీఅవసరముల దీర్చును. నిన్నీలోకమునకు పంపుటకు పూర్వమే భగవంతుడు నీపోషణకు ఏర్పాటుల చేసియున్నాడు.

సంసారపరిశోధనలందుజిక్కి జీవించుచును పూర్ణతను సాధించు నాతడు మహావీరుడనదగును.

633. ప్రశ్న:—ప్రకృతికిని భగవంతునికిని సామరస్యము కుదుర్చుటెట్లు ?

ఉ—ఆవైశ్యవనితను చూడుము. ఆమె ఎన్నివిధముల పనులు చక్కబెట్టుచున్నదో! రోటిలోఅటుకులువేసి ఒకచేత రోకలిపూనిదంచుచున్నది; రెండవచేతితో బిడ్డనుసాకుచున్నది. మఱియు అటుకులుకొనవచ్చినవారితో బేరమాడుచున్నది. అటుల ఆమె అన్నిపనులు చేయుచున్ననుకూడ, రోకలిజారి

కాలిమీదపడి హానిచేయకుండ అతిజాగరూకతతో మెలగు చున్నది. ఆవిధముగా నీవు సంసారములోనుండుము; కాని సర్వదా భగవంతుని సంస్మరించుచుండుము; వాని మార్గము నుండితొలగి ఎన్నడును వర్తించకుము.

634. మొసలికి నీటిపైని ఈదులాడుటయిష్టము. కాని అది పైకిరాగనే వేటగాండ్రు దానిపై గురిపెట్టుదురు. కావున విధి లేక అదినీటిలోపలనేయుండవలసినదై పైకిరాపీలులేకుండును. అయినను సురక్షితముగాపైకివచ్చుటకు అవకాశము చూపట్టి నప్పుడెల్ల, బుస్సలుకొట్టుచు పైకిలేచి, ఆనందముతో నీటిపైని ఈదులాడును. ఓమానవా! సంసార సాగరములో తగుల్కొని నీవు ఆనందసాగరో పరిభాగమున ఈదులాడ వాంఛించు చున్నావు. కాని సంసారతాపత్రయములు నీకవకాశము నొస గుటలేదు. అయినను దిగులుపడకుము. తీరికచిక్కినప్పుడెల్ల ఆతురపడి భగవంతుని పిలువుము, భక్తిమెయి ప్రార్థింపుము, నీదుఃఖముల నన్నిటిని వానికి తెలుపుకొనుము. సమయము వచ్చినప్పుడు భగవంతుడు నిన్ను రక్షించి ఆనందసాగరమున ఓలలాడ జేయగలడు.

635. యువతులు నాలుగైదు కుండలను దొంతరగా తల మీద పెట్టుకొని నీళ్లు తెచ్చికొనునప్పుడు, త్రోవలో తమ కష్టసుఖములను గురించి ఒండొరులతో ముచ్చటలాడుకొనుచు పోదురు. అయినను ఒక్కకుండలోని నీరైనను తొణికి పోనీ యరు. ధర్మమార్గమున నడచుయాత్రికుడు అటుల వర్తించవల

యును. తనకు ఎట్టి పరిస్థితులు వాటిల్లినను కూడ, తనహృదయము న్యాయమార్గము తప్పిపోకుండ జాగ్రత్త పడవలయును.

636. దిక్సూచి యందలి (కాంతశక్తిభరితమగు) సూది నిరంతరము ఉత్తరదిశను చూపుచుండును. అందువలన ఓడ దారితప్పకుండ సముద్రముపైని పోగల్గుచున్నది. అట్లే మానవునిహృదయము భగవంతునివైపు తిరిగి యున్నంతకాలమును ఆతడుసంసారసాగరమున దారితప్పకుండ పోగలడు.

637. నీ వుధ్యానముచేయు సమయమునందు, ధ్యానమనగా హేళనచేయునట్టియు, సాధువులను సాధువర్తనమును నిరసించునట్టియు జనులకు దూరముగ పొమ్ము.

638. వ్యభిచారిణియగు వనిత తన యింటిపనుల నన్నిటిని సవరించుకొనుచును తనమనస్సును విటునిపైనుంచు తీరున, ఓగృహస్థుడా! నీసంసార వ్యవహారములనన్నింటిని నిర్వర్తించుకొనుచుండుము; అయినను నీహృదయమును భగవంతునిపైని నిలువుము.

639. శ్రీమంతునియింటబిడ్డకు పాలిచ్చుదాది, ఆబిడ్డను తన బిడ్డవలె ప్రేమతోచూచును, తనబిడ్డకాదని సదా గుర్తునుంచుకొనియే వర్తించును. అటులనే నీవునీబిడ్డలకు పోషకుడవును, ఉపచారకర్తవుమాత్రమే అనియు, వారి నిజమగు తండ్రి భగవంతుడనియు సదా జ్ఞప్తినుంచుకొనుము.

640. ఒకనాడు కొందఱు బ్రహ్మసమాజపు బాలురు తాము జనకుని ఆదర్శమును అనుసరించుచు సంగములేకుండ కుటుంబమున మెలగుచుంటిమని నాతోచెప్పిరి. నేనిట్లుపలికితిని:-

"ఆమాట చెప్పుట సులభమే. కాని నిజముగా జనకునిబోలి వర్తించుటవేఱు. తగులువడకుండ సంసారవ్యవహారముల నడపుట అతిదుర్ఘటము. ప్రారంభదశలో జనకుడు ఎట్టినిష్ఠురనియమముల నవలంబించెనో తెలియునా? కాని మీ రందఱు అట్టి కఠిననియమములను అనుసరింపుడని చెప్పను. కాని భక్తిని సాధనచేయవలయుననియు, శాంతిగలచోట కొంతకొంత కాలము నివసించుడనియు మిమ్ముకోరుచున్నాను. కొంచెము జ్ఞానము, భక్తిని సంపాదించుకొనిన అనంతరము సంసారమున దిగుడు. పాలు కదలకుండ నొకచోటపెట్టినగాని పెరుగుగా తోడుకొనదు. కదిలించినను, ఒకకుండనుంచి మరియొక కుండలోనికి మార్చినను కూడ, పెరుగుచెడును. జనకుడు నిస్సంగుడు; అందువలన వానిని "విదేహుడ" నియు పేర్కొందురు. ఆతడు జీవన్ముక్తుడై మెలగినాడు. దేహస్ఫురణను రూపుమాపుట చాలకష్టమగు సాధన. జనకుడు మహావీరుడు సుడీ! ఒకచేత జ్ఞానము. రెండవచేత కర్మ అను రెండుఖడ్గములను అవలీలగ ధరించిన ధీరుడు!"

641. నీవు నిస్సంగుడవై సంసారమున వర్తించ కోరుదువేని, ఒక సంవత్సరమో, ఆరునెలలో, ఒక్కనెలయో, తుదకు పండ్రెండు దినములైనను ఏకాంతస్థలమున, మొదటగా భక్తి సాధనచేయవలయును. ఏకాంతవాసకాలమున భగవంతునిగూర్చి నిరంతరధ్యానము చేయవలయును; భక్తిని ప్రసాదింపుమని దేవుని వేడుకొనవలయును. ఈప్రపంచములో నీవు నీదనుకొనదగినది యిసుమంతయు లేదనుభావ

ము మరలమరల నీమనస్సున మననము చేయవలయును. నీవు "నావారు, నావారు" అనుకొను వారందఱును యెప్పుడో యొకప్పుడు నిన్ను విడువవలసినవారే యనుట నిశ్చయమని తెలియుము. భగవంతుడొక్కడే నీవాడు! నీసర్వస్వమును ఆయనయే. వానిని నీవానిగ జేసికొనుట యెట్లాయను చింత ఒక్కటియే నీకుండదగినది.

642 నీపరిస్థితులు పాపప్రేరణలు గలచోటునకు బలాత్కారముగ నిన్ను తోడ్కొనిపోయినయెడల, నీదివ్యజనని స్మరణను నీతోడతీసికొనిపొమ్ము. నీమనస్సున సమితము దాగియుండు దుష్టచింతలనుండి ఆమె నిన్ను కాపాడగలదు. ఆజనని యెదుటనుండెనేని, దుష్కార్యములును, దుశ్చింతలును నీదరిరాసిగ్గుపడి పారిపోవును.

643. నీచేతులకు ముందుగా చమురురాచుకొని, పనసపండును ఒలచినయెడల, ఆపండుయొక్క జిగటరసము నీచేతులకు అంటుకొని నిన్ను తిప్పలు పెట్టదు. ముందుగా నీవు పరమాత్మజ్ఞానమను రక్షపూనుకొంటివా, సంపదల మధ్యను, సంసారమునడుమను నీవు జీవించినను, అవి నిన్నెంతమాత్రమును బాధించవు సుమీ!

644. దాగుడుమూతలాటయందు ఒక ఆటగాడు తల్లిని తాకినయెడల, తఱుముకొనివచ్చువాడు వానిని దొంగచేయ జాలడు. అటులనే ఒక్కసారిమనము భగవత్సాన్నిధ్యమును పొందితిమా సంసారబంధములు మనను ఇంక బాధింపవు. తల్లినితాకిన ఆటగాడు తనను తఱిమి

ద్రోహమును చేయుదురను భయములేకుండ యిష్టము వచ్చిన ట్లుల తిరుగాడు చందమున, భగవంతుని పాదముల స్పృశించిన వాడు సంసారమను వినోదక్షేత్రమున నిర్భయముగ తిరుగ గలడు. వానికి సంసార తాపత్రయముల చిక్కు లేదు; ఎదియు వానిని బంధించునది యుండదు.

645. తాంత్రికుడు, మృతునిఆత్మ సాహాయ్యమున దేవతను ప్రత్యక్షము చేసికొను సాధనచేయుచో, అతడు క్రొత్తపీనుగు మీద కూర్చుండి దాపున అన్నమును కల్లును ఉంచునట. ఉపాసనా సమయమున, ఆపీనుగకు తాత్కాలికముగ ప్రాణ మువచ్చి, ఎప్పుడైన నోరుతెరచిన యెడల, ఆసాధకుడు కని పెట్టి, ఆపీనుగునం దప్పుడావేశించిన భూతమును తృప్తిపరచు టకై, కల్లును ఆపీనుగ నోటిలోపోసి, అన్నమును నోటకూరు నని చెప్పుదురు. అతడు అటులచేయని యెడల ఆభూతము వాని ఉపవాసమును భంగపఱచి దేవతా ప్రసన్నము కాకుండ అడ్డపడునట. అటులనే ఈసంసారము పీనుగుపైని వసించుచు, బ్రహ్మానందపదవిని పొందగోరుదువేని, సంసారమున నిన్ను బాధించు వారిని తృప్తిపఱచుటకవసరములగు వస్తు వులను ముందుగ సంపాదించి పెట్టుకొనుము; లేదా నీభక్తి సాధనలకు అడ్డుదగిలి, జీవన తాపత్రయములు నిన్ను చీకాకు పఱచును.

646. వీధిలో బిచ్చమెత్తుకొనుచు తిరుగు పాటగాడు తాంబురను ఒక చేతితో మీటుచు, చిఱతను ఒక చేతితో వాయించుచు, నోటితో కూడ కీర్తనలు పాడుచుండును గదా!

అటులనే ఓ సనాతీ ! చేతులతో నీ కుటుంబ వ్యవహారముల నన్నిటిని చేసికొనుచుండుము; కాని పూర్ణహృదయముతో భగవన్మహిమలను తలంచి గానము చేయుచుండుము.

647. బాలుని హృదయమందలి ప్రేమ పూర్ణముగను అభిన్నముగను నుండును. కొన్నాళ్లకు అతనికి పెండ్లికాగనే సగముహృదయమైనను భార్యకు పంచబడును; ఇక బిడ్డలు పుట్టినప్పుడు యింకొక పాతికభాగము వారికి పోవును; మిగతా పాతికభాగమును వాని తల్లి, తండ్రి, గౌరవము, మర్యాద, వేషము, పౌరుషము మున్నగువానికి పోవును. అందువలన భగవంతునికై అర్పణ చేయుటకు వానియొద్ద ప్రేమ మిగులకుండును. కాబట్టి బాలుడుగనుండగ, పంపుడు పడిపోకుండ వాని హృదయము పూర్ణముగ నున్నప్పుడే, మొదలకడ వాని హృదయమును భగవంతునికై త్రిప్పిన యెడల, అతడు భక్తుడై, సులభముగా దైవమును కాంచ గల్గును. కాని పెద్దవారైన మానవులు అటుల చేయజాలుట సులభము కాదు.

648. సంసారముననే నిలుచు జ్ఞానులకును, సన్యాసము పుచ్చుకొను జ్ఞానులకును భేదమేమని మీరు నన్ను ప్రశ్నించినయెడల, యిరువురును సములని నేను చెప్పుదును. ఇరువురకును జ్ఞానము సమమే; ఒక్కటే. కాని సంసారియై జీవించు జ్ఞానికి, ఏకొలదిగనైనను, కామ్యకర్మల ఆకర్షణ యుండును గాన భయ కారణము కలదు. పొగచూరియున్న గదిలో

నీ వెంత జాగ్రత్తతో మెలగినను, ఎప్పుడో కొంతమసి అంటు కొనక తప్పదు గదా!

649. చిన్నబిడ్డలు తల్లిని వదలి దూరముగా గదిలో బొమ్మలను పెట్టుకొని యథేచ్ఛగా ఆటలాడుకొనుచుందురు. కాని తల్లిరాగానే బొమ్మలనన్నిటిని త్రోసివేసి అమ్మా! అమ్మా! అని కేకలువేయుచు ఆమెచుట్టు చేరుదురు. మీరలు కూడ ఈ ప్రపంచములో, సంపదలు, గౌరవములు, కీర్తులు మొదలగు బొమ్మలతోడి ఆటలందు మఱిగి యున్నారు! ఇతరమేమియు మీకక్కఱలేదు. కాని ఒక్కసారి మీరా జగజ్జననిని మీహృదయములో కాంచితిరేని, ఈ సంపదలు ఈ ఖ్యాతులు, ఈ గౌరవములు మీకింక ఆనందము నొసగ జాలవు. వీనిని సర్వము విడిచివేసి ఆతల్లికడకు పర్విడుదురు!

650. సమస్తమును త్యాగముచేసి, భగవంతుని పాదారవిందములకడచేరుడని మీరు సంసారులను కోరినయెడల వారు మీమాటాలకించరు. కావున చాలగా ఆలోచనచేసి యీమానవులను ఆకర్షించుటకొఱకు చైతన్యనిత్యానందులు ఒకయుపాయమును పన్నిరి. "సోదరులారా! హరినామ స్మరణచేయుచు పాయసముల గుడుపుడు. వన్నెకత్తెల కౌగిండ్ల ననుభవించుడు." రండు! రండు! అని బోధించుచు వారికి ఎఱజూపిరి. వీనికాశపడి ప్రజలు భగవన్నామ సంకీర్తనము చేయుటకై గుమిగూడెడివారు. కాని వలలోచిక్కుకొనెడి వారు. క్రమక్రమముగా వారు భగవన్నామామృతమును గ్రోలినకొలదిని, నిత్యానందుని బోధలోని రహస్యార్థము

వారికి తెలిసిపోయినది. భగవద్భక్తిచేత వారిహృదయముల నుండి వెల్లివిరిసివచ్చు ఆనందబాష్పముల పారవశ్యముతో పాయసములు తులతూగవయ్యె! ఆత్మానంద పారవశ్యమున నిలువలేక పడిపోయి భూమిని కౌగలించుకొనుటే, వయ్యారంపుయువతుల కౌగిలింతలనుమీరు ఆనందమని వారికి తెలియవచ్చెను.

651. బయటికిపోయి శత్రువు నెదిరించి పోరుటకు పూర్వము యోధులు తమ నివాసముల చెంతను, బహిరంగ యుద్ధరంగమునవాటిలుఅపాయములు లేనితావున, రణ కౌశలమును నేర్చుకొందురు. అటులనే సన్యాసాశ్రమపు కఠిన నిష్ఠలను పూనుటకు పూర్వము, మీ ఆత్మోన్నతిని గడించుటకు, గృహస్థ జీవనపు సౌకర్యములను వినియోగించుకొనుడు.

652. నీవు గృహాజీవనమును విడిచి సన్యాసివైనను, సంసారివై యుండినను, ఒక్కటియే— నీహృదయమున మాత్రము భగవంతునిపై స్థిరముగ నిలుపుము చాలును. ఒక చేతితో నీగృహస్థ ధర్మములను నిర్వహించుము; రెండవ చేతితో స్వామి పాదముల బట్టుము. గృహకృత్యములు నీకు లేనప్పుడు నీరెండు చేతులతోడను భగవంతుని పాదములను హృదయమున నద్దుకొనుము.

653. గృహస్థుడు సయితము భగవంతుని సాక్షాత్కారము పడయవచ్చును. జనక మహారాజును చూడుడు, అతడు రాజఋషి. కాని ఆకస్మికముగా జనకరాజువంటివారగుట పొసగదు. జనకమహారాజు లోక వ్యవహారాడంబరములకు

దూరముగా, ఏకాంత వాసముచేయుచు ధ్యాన సాధనలును ఎన్నిసంవత్సరములో సాగించియున్నాడు. కావున గృహస్థులు ఏకాంత స్థలములందుచేరి, అప్పుడప్పుడు మూడేసి దినములైనను, భగవత్సాక్షాత్కారము పొందునిమిత్తము, సాధనలు చేయుచుండుట చాలమేలు గూర్చును!

౬౫౪. "లోకము భగవంతునిది; నాదికాదు' అని కృతనిశ్చయుడవైయుండుము. "నేను వాని ఆజ్ఞలను చెల్లించుటకై ఏర్పడిన వాని సేవకుడను మాత్రమే!" అనుట మఱవకుము.

౩౫వ అధ్యాయము.

# లోకవృత్తము — ఆధ్యాత్మికత

——:o:——

655. ఒక సేద్యగాడు దినమంతయు తన చెఱుకుతోటకు నీరు తోడుచుండెను. తన పనిని ముగించిచూడగా ఒక్క చుక్క నీరైనను తోట కెక్కలేదని తెలిసివచ్చెను. నీరంతయు ఎలుకలకలుగులగుండ నేలలోనికి పోయినది. తన హృదయమున రహస్యముగా కీర్తికొఱకును, సుఖముల కొఱకును, సౌకర్యముల కొఱకును భూరిసంపదల కొఱకును, గొంతెమ్మ కోరికలను పెంచుకొనుచు, భగవదారాధనలు చేయు భక్తునిస్థితి పైనిచెప్పిన సేద్యగాని స్థితిని బోలియున్నది. అతడు ప్రతిదినము ప్రార్థనలు చేయుచున్నను పురోభివృద్ధి కాంచడు. వానిభక్తియంతయు కోరికలనెడు ఎలుకల కలుగుల ద్వారమున వ్యర్థమై పోవుచుండును. తనజన్మాంతము వఱకు ఇట్టిభక్తి చేయుచున్నను ఆతడు ఎప్పటియట్లేయుండును, కాని అభివృద్ధి పొందజాలడు.

656. ప్రశ్న:—ధ్యానమందుండగా మనస్సు చంచలించుటకు కారణమేమి?

ఉ:—మిఠాయిఅమ్మువాని దుకాణములో పెట్టియుంచిన మిఠాయిమీద ఈగలు వ్రాలియుండును. కాని పాకీవాడొకడు అశుద్ధపుతట్ట తీసుకొని ఆత్రోవనురాగానే, ఈగలు మిఠాయిని విడిచివేసిపోయి అశుద్ధముపైనివ్రాలును. కాని

తేనెటీగ సదా విచ్చినపూలపైననే నిలుచునుగాని అశుద్ధవస్తువులకైపోదు. లౌకిక పురుషులు ఈగలవలె అప్పుడప్పుడు భగవద్భక్తియను మిఠాయిని రుచిచూతురు, కాని వారి అపవిత్ర సంస్కారములు సహజముగా వారిని క్షుద్రవాంఛలవైపునకే లాగుచుండును. మహాత్ములగు పరమహంసలో, సదా భగవత్కృపనుగూర్చి ధ్యానముచేయుచు ఆనందపరవశులై యుందురు.

657. పూర్తిగ సంసారబంధమున జిక్కిన నరుడు అశుద్ధమునపుట్టి అశుద్ధమునచచ్చు పురుగువంటివాడు; వానికి ఇతరమేమియు తెలియదు. సామాన్యసంసారి ఒకప్పుడు అశుద్ధము మీదను, ఒకప్పుడు మిఠాయిమీదను వ్రాలుచుండు ఈగను బోలువాడు. ముక్తాత్ముడో సర్వదా పూదేనియనే త్రాగుచు, ఇతరమును చవిగొనని భ్రమరము వంటివాడు.

658. లౌకికపురుషుని హృదయము పేడకుప్పలోని పురుగు వంటిది. అది నిత్యము పేడలోనె కాలముగడుపుచు, అక్కడనేయుండగోరును. కర్మముచాలక ఎవరైనను దానిని ఆ మలిన స్థలమునుండితీసి తామర పువ్వునందుంచినను, ఆ పువ్వుయొక్క కమ్మనివాసనను భరించలేక చచ్చిపోవును. అటులనే లౌకికజనుడు తమ లౌకికవ్యవహారములను చింతలను వాంఛలను విడిచి ఒక్కనిమిషమైనను బ్రతుకజాలడు.

659. కాల్చనికుండ పగిలినయెడల, కుమ్మరి దాని మట్టిని ఉపయోగించి వేఱొక కుండను చేయగలడు. కాని కాల్చిన కుండ పగిలెనా వాడటుల చేయజాలడుగదా! అదేవిధమున

మనుజుడు అజ్ఞానదశలో మరణించెనేని ఆతడు మరల జన్మ నెత్తును; కాని అతడు బ్రహ్మజ్ఞానాగ్నియందు తప్తుడై సిద్ధత్వ మును పొంది మరణించుచో తిరిగి జన్మకు రాడు.

660. ప్రశ్న:— లోకచింతగల మనుజుని పోలిక యెట్లుండును ?

జవాబు:— ముంగిసల పెంచువాని కుండలోని ముంగిసను పోలియుండును. ముంగిసలపెంచువాడు గోడలో ఎత్తుగా ఒక కుండను పెట్టును. త్రాడు నొకదానిని తెచ్చి ఒక కొసను ఒదులుగా ముంగిస మెడకు తగిలించును; రెండవ కొసకు బరువు నొకదానిని కట్టును. ముంగిస కుండలోనుండి వెలువడి గోడదిగివచ్చి ఇటునటు తిరుగులాడును. ఏదేని భయము తోచగానె చటచట పైకిపోయి కుండలో దూరి దాగకొనును. కాని పాపము, త్రాడునకు రెండవ కొసను కట్టియున్న బరువు, దానిని సుఖముగా ఆకుండలో కూర్చుండ నీక క్రిందికి లాగుచుండును. అటులనే లోకవ్యావృత్తుల మునింగియుండు జనుడు జీవనపు కష్టనష్టములచే బాధితుడై అప్పుడప్పుడు ప్రపంచమునకు అతీతముగపోయి భగవంతుని శరణు చొచ్చును. కాని పాపము, లౌకిక వ్యవహారభారమును అంటలి వ్యసనములును, వానిని మరల మరల ఇహలోక దుఃఖములలోనికి పడలాగుచునేయుండును.

661. రెట్టింపు నీటితో కలిపిన పాలను (గడ్డగట్టిన) క్షీరముగా మార్చుటకు చాలకాలము పట్టును; శ్రమయు కలుగును. దుష్ట పాపచింతలనెడు మురికినీటితో పలుచబడిన సంసా

రుల మనస్సును పవిత్రభూతముచేసి, సద్భక్తి పూరితముగ ఘనమగుదానిగ నొనర్చుటకు చాలాకాలము పట్టును; శ్రమయు అధికముగా పడవలసివచ్చును.

662. దయ్యముపూనిన మనిషిమీద మంత్రించిన ఆవాలను చల్లి ఉచ్చాటన చేయుదురు. కాని ఆ ఆవాలలోనె దయ్య మాసించియున్నచో వానివలనదయ్యమెటులపోగలదు? నీవు భగవద్ధ్యానమునబెట్టు హృదయము లౌకికివాంఛలతో దుష్టమై యున్నయెడల, అట్టి క్షుద్రసాధనముతో నీధ్యాన నిష్టలను జయప్రదముగ ఎట్లు సాగించ గలవు ?

663. చిలుకముదిరి, దానికంఠమందలి స్వరనాడులు గిడసబారిన తరువాత, దానికి సంగీతమునేర్పుట వలనుపడదు. అది చిన్నదిగానుండి, మెడమీది ఎఱ్ఱచాఱ కాన్పించక మునుపే దానికి గీతములు నేర్పవలసి యుండును. అటులనే ముసలితనమున భగవంతునిపైని మనసు నిలుప నేర్పవలయుననిన సాధ్యముకాదు; చిన్నతనములో అవి సుసాధ్యమగును.

664. కాల్చనిమట్టితో కుమ్మరిబొమ్మలనుతయారుచేయును; గాని కాల్చిన మట్టితో అతడేమియు చేయజాలడు; అదేవిధముగ లౌకికవ్యసనములఅగ్నిలోపడి నరుని హృదయము దగ్ధమయిన వెనుక ఉత్తమాశయములు దానినిమార్చి, ఏదేని సుందర రూపము నొసగవలయుననిన సాధ్యముకాదు.

665. ఈగ నరశరీరమందలి పుండుపైనొకప్పుడు వ్రాలును; మరల దేవుని కర్పణచేయు నైవేద్యముపైని వ్రాలును. అట్లే

సంసారుని బుద్ధి కామినీకాంచనభోగముల తగులవడియుండును, ఒక్కొకప్పుడు పారమార్థిక విచారణకు దిగుచుండును.

666. దమ్ముకొనిన అగ్గిపుడక ఎంతఅదిమిగీసినను మండక పొగవిడును. కాని పొడిగానున్న అగ్గిపుడక తేలికగాగీసినను వెంటనే రగుల్కొనును. ఉత్తమభక్తుని హృదయము ఎండిన అగ్గిపుడకవంటిది. భగవన్నామస్మరణ ఇసుమంతకలిగినను వానిహృదయమునుండి భక్తి ప్రభవించును. లోలత్వమున దమ్ముకొని భోగమునతడిసియున్న గృహస్థునిహృదయము తడిసినవిప్పపుల్లవలె ప్రబోధమును పొందదు. అట్టివానికి తఱుచుగా ఆత్మప్రబోధనము కల్గించినను దివ్యభక్త్యాగ్ని రగులువడనే పడదు.

667. మామిడిపండును దేవునికి అర్పణచేయవచ్చును; లేదా ఏదోవిధముగా వినియోగము చేసికొనవచ్చును; కాని కాకి దానిని ఒక్కసారి పొడిచిన చాలును, అది ఎందుకును కొఱగానిదగును. అది దేవతార్పణకా పనికిరాదు; బ్రాహ్మణునికి దానమీయుటకా కొఱగాదు; మఱియు ఉత్తములెవరును దానిని తినదగదు. అట్లే బాలబాలికలు వారి హృదయములు నిర్మలములుగ నున్నప్పుడే అనగా వారు భోగవాంఛలచే అపవిత్రులు కాకమునుపే భగవంతుని సేవకు అర్పణ చేయదగుదురు. ఒక్కసారి భోగవాంఛలు వారి మనముల జొచ్చెనా, ఇంద్రియలోలతయను దయ్యము తన క్షుద్రచ్ఛాయలను వారిపై నొక్కసారి ప్రస

రింపచేసేనా, అంతట వారిని సదా ధర్మమార్గమున నడువం జేయుట దుర్లభమగును.

668. లేత వెదురువాసమును సులభముగా వంచనగును; ముదురు వెదురును గట్టిగబట్టి వంచబోతిమా అది విరుగును గాని వంగదు. బాలుర మతులును సులభముగ భగవంతుని దిశకు మరల్పవచ్చును; కాని శిక్షణ మొఱుంగని పెద్దవారల మతులు ఎటుత్రిప్పబోయినను పట్టు తప్పిపోవును.

669. వరిపొలములలో చేపలను పట్టుటకు పెట్టు వెదురు మావుల ద్వారములగుండా నిగనిగలాడుచు నీరు ప్రవహించుటనుచూచి చేపల సమూహములును ఆనందముతో అందు ప్రవేశించును. కాని అందొకసారి ప్రవేశించిన వెనుక తప్పించుకొని బయటపడజాలవు. అటులనే బుద్ధిహీనులు సంసారపు వలలలో మాయసుఖముల కాశపడిజొరపడుదురు. మావులజొచ్చు చేపలవలెనే వీరును సంసారములందు జొరబడగలరే కాని దానిని త్యజించి విరాగులుకాలేరు సుడీ!

670. ధనమదాంధులు, దుర్గర్వులు, జ్ఞానపాషండులును ఆత్మజ్ఞానము పడయుటకు అనర్హులగువారిలో లెక్కింప బడుదురు. "ఒకానొకచోటున మంచిసన్యాసి యున్నాడు. చూచి వత్తమా?" అని ఎవరైన వీరితో ననినయెడల, వీరు తప్పకుండ సాకులనుపన్ని రాజాలమని చెప్పుదురు. కాని తమ మనస్సులలో మాత్రము "మనము పలుకుబడిగల పెద్ద మనుష్యులము! ఎవనినో చూచుటకు రమ్మనిన మనము పోతగదు." అని తలంతురు.

671. ఈ ప్రపంచములో తమకు ఆకర్షవంతమగునదే మియు లేకున్నను, ఏదో విధమగు తగులాటమును కల్పన చేసికొని అందులో చిక్కుకొను మనుష్యులు కొందఱుందురు. తన పోషణకోరు కుటుంబముగాని, తన రక్షణ అవసరమగు బంధువులుగాని లేని మానవుడు ఏదియో పిల్లినో, కోతినో, కుక్కనో, పిట్టనో పెంచ నారంభించి దానితో లీలలు సలుపుచుండును. పాలకొఱకగు పరితాపమును తేట చల్లనీటితో చల్లార్చుకొనజూచునట్లు! మాయ మానవజాతిపైని పడ వేయుటవల్ల చమత్కార మిట్టిది!

672. మెత్తని రేగడపైని ముద్ర పడునటుల రాతిపైని పడదుగదా! అటులనే భక్తుని హృదయముపైని పరమార్థ జ్ఞానము అంకిత మగునటుల, బద్ధాత్ముని హృదయముపైని నాటదు.

673. సంసారానురక్తునియందు పారమార్థికమగు సర్వము నెడను వానికిగల వెగటు ప్రస్ఫుటముగ గోచరించును. భక్తి గీతమునుగాని, స్తోత్రమునుగాని, తుదకు భగవన్నామమును గాని అతడు విననొల్లడు; అంతట పోక యితరులనుగూడ నిరుత్సాహముచేసి మాన్పును. ఎవడు ప్రార్థనల నిరసించునో, సజ్జనసంగములను సాధుపురుషులను నిందించునో, అట్టివాడు ప్రపంచమునకు దాసుడు!

674. కొలిమిలో బాగుగ కాలుచున్నంతవఱకును ఇనుము ఎఱ్ఱగ కాన్పించును; కాని అందుండి తొలగినపిమ్మట నల్లబడును. సంసారులును యిట్లేయుందురు. తాము దేవళములోనో, భక్తుల

నడుమనో ఉన్నంతకాలమును ధర్మచింతలతో పరవశులుగ కాన్పింతురు; ఆసహవాసము తొలగించినపిమ్మట భక్తిభావ మంతయు శూన్యమైపోవును.

675. ప్రశ్న—సంసారులు సర్వమును త్యజించి భగవంతునికొఱకై ఏల పరుగిడజాలరో?

ఉ:—నరులు వేర్వేఱువేషములనుదాల్చినటనలు చేయు నాటకరంగమువలె యీప్రపంచమున్నది. కొంతకాలముతమ ఆటలను సాగించనిది వీరు తమవేషములను తొలగించుకొన జాలరు. కొంతకాలము వారియాటలను వారి నాడనిండు! అంతట వారే తమవేషముల చాలింపగలరు!

676. మొసలికి ఏఆయుధమును భేదింపజాలని గట్టిపొలుసుతోనేర్పడిన కవచముకలదు. గృహాస్థులట్టివారు. వారికి నీవెన్నిపారమార్థికబోధలు చేసినను, అవి వారిహృదయమున జొచ్చజాలవు.

677. వంతెనక్రింద నీరు ఒకవైపునుండిచొచ్చి రెండవ వైపునుండివెడలిపోవురీతిని గృహస్థులకుచేయు ధర్మబోధ ఒకచెవినుండిదూరి రెండవచెవిగుండ జారిపోవును. అందేమియు దానిజాడయైన నిలువబోదు.

678. దుఃఖములును జీవనవ్యథలును గాఢముగా నెత్తిపైబడి మొట్టునుగాక, సంసారనిమగ్నులు కామినీకాంచనములపై మోహమును సులభముగ నిగ్రహించి, మనస్సును భగవంతునివైపు త్రిప్పనొల్లరుగదా!

679. మనస్సు చంచలమై తడబడుచుండునంతకాలమును నరునకు సద్గురునివలనను, సాధుసంగమువలనను ఏమియు మేలు చేకురబోదు.

680. అచ్చటచ్చట నేరుకొనినగింజలతో పావురముల బుగ్గలెటులనిండియుండునో, అటులనే సంసారుల హృదయములు ప్రాపంచికభావములతోడను సంకల్పములతోడను నిండియుండునని వారితో కొంచెము ముచ్చటించినచో తెలియ వచ్చును.

681. పాపాత్మునిహృదయము ముంగురులుచుట్టుకొను జుట్టు వంటిది. ఆజుట్టును సరళముగదువ్వుటకు నీవెంతప్రయత్నించి నను ఫలముండదు. దుష్టునిమనస్సును సరళముగను నిర్మలముగను మార్చుటకు చేయుయత్నమును అటులనే వ్యర్థమగును.

682. రాతిముక్కలో నీరుయింకనితీరున బద్ధజీవుని హృదయమున ధర్మబోధచొచ్చజాలదు.

683. మేకు రాతిలోచొఅజాలదు. కాని మట్టిలో తేలికగ చొచ్చగలదు. అటులనే సాధుబోధనాస్తికుని హృదయమున చొఅదు. కాని భక్తునిహృదయమున అతిసులభముగ నాటుకొనును.

684. పసిబాలునకుగాని, బాలికకుగాని, సంభోగానందమన అర్థముకాదు. అటులనే సంసారులకు ఆత్మసంయోగానంద మన అర్థముకాజాలదు.

685. జిడ్డుగానున్న అద్దమున ముఖబింబము సరిగా కాన రానిరీతిని కళంకితహృదయమున శివస్వరూపము ప్రకాశింప జాలదు. జిడ్డును తొలగించినయెడల ఆ అద్దమున ముఖ వైఖరి చూచుకొనుటకు వీలుపడు తెరగున హృదయము పవిత్ర వంతమగునేని దానియందు భగవంతునిరూపు కాన్పించును.

686. ఒకసారి పెరుగుతోడుపెట్టినకుండలో పాలు పోయుట కెవరును సాహసించరు. పాలు విరిగిపోవునేమో యను భయము బాధించును. ఆకుండను వంటచేయుటకును వినియోగించరు; నిప్పుమీద పెట్టిన విచ్చిపోవునని జడియు దురు. కాబట్టి అది దాదాపుగా నిరుపయోగమన్నమాట! అట్లే గృహవ్రతునికి గురువు ఉత్తమసదోధలు చేయసాహ సించడు. గృహస్థుడు వానికి అపార్థములు కల్పించి, తన పబ్బములు గడుపుకొనుటకు ప్రయత్నించును. కొంచెము శ్రమను కలిగించు సత్కార్యములందును వానిని నియోగించ జాలడు. అప్పుడతడు తన గురువు తన మంచితనమువలన లాభము పొందజూచుచున్నాడని అపవాదము చేయగలడు.

687. లౌకికునకు, జ్ఞానికున్నంత తెలివియు, జ్ఞానమును ఉండవచ్చును. ఆతడు యోగిపడునంత శ్రమను కష్టమును పడవచ్చును; సన్యాసి చేసినంత త్యాగమును చేయవచ్చును. కాని వాని కఠిన ప్రయత్నములన్నియు వ్యర్థములే. ఏలయన వాని శక్తులన్నియు వక్రగతిని నడచును; ఆతడెన్నిపాట్లు పడినను, భగవంతునికొఱకు కాక, భౌతిక సంపదలు భోగములు, ఖ్యాతికొఱకే.

688. పూర్వ సంస్కారబలము యెంత గొప్పదో చూచితిరా! ఒకానొకచోట కొందఱు సన్న్యాసులు కూర్చుండి యుండిరి. అప్పుడొక పడుచు ఆత్రోవనువచ్చినది. అందఱును తమ దైవధ్యానములందే నిమగ్నులైయుండిరి; ఒక్కడు మాత్రము రహస్యముగ ఆమెవంక చూడ్కి నిలిపినాడు. ఇట్లు స్త్రీసౌందర్యముచే ఆకర్షింపబడిన యతడు పూర్వము గృహస్థుడై యుండి, సన్న్యాసమున ప్రవేశించునప్పటికి ముగ్గురుబిడ్డల కనియున్నవాడు.

689. సంసారవ్యావృత్తియందు మునగియున్నవానికి బ్రహ్మజ్ఞానము అబ్బదు. వానికి భగవత్సాక్షాత్కారము కాజాలదు. బురదనీటిలో చుట్టునున్న చెట్లుమున్నగునవిగాని సూర్యుడుగాని ప్రతిఫలింపజాలునా?

690. ఐహికరతునకు ఎన్ని దుఃఖములువచ్చినను, ఎన్ని కష్టములు వాటిల్లినను, ఎన్నడును జ్ఞానము రాబోదు. ఒంటెలకు ముండ్లతుప్పలు ఇష్టము. అవి వానిని మేసినకొలదిని నోట నెత్తురు కారుచుండును. అయినను అవి ముండ్లతుప్పలనే తినునుగాని మానవు.

ఒకొక్కప్పుడు గృహస్థులగతి ఉడుమును పట్టుకొనిన పాముకీతి నుండును. అది ఉడుమును తినజాలదు, విడువను జాలదు. గృహస్థుడు సంసారములో సారమేమియు లేదని గ్రహించవచ్చును. సంసారము గుజ్జునదిలేక ఎండిపోయిన తోలు టెంకమాత్రము మిగిలిన పుల్లమామిడిపండును బోలి యుండును. అయినను ఈసంసారులు దానిని త్యజించి భగ

వంతునిపై తమ మనస్సులను నిలుప జూడకున్నారు!

వారిలో నింకొక చిత్రముకలదు. సంసార తాపత్రయములనుండి వారిని తొలగించి సజ్జనులు సాధువులు నుండు సమాజమున వేదాంతగోష్ఠియందు నిలిపిన యెడల వారిహృదయమునకు ఆనందమే గోచరించదు. ఎప్పుడు వెడలిపోదుమాయని తహాతహాపడుదురు. పెంటకుప్పలలో పుట్టి పెంటకుప్పలలో పెరుగుపురుగులు పరిశుభ్రస్థలమున మంచి అన్నములో పెట్టినయెడల అవిబ్రతుకలేక చచ్చును గదా!

691. సాధువుచేతనున్న కమండలువు, ఆతడు తీర్థయాత్రలు చేయు, 'ధామముల' నాల్గింటిని దర్శించినను, దానిరుచి ఎప్పటివలె వగరుగనే యుండును. సంసారనిమగ్నుల స్వభావమును అట్లేయుండును.

692. లౌకికపురుషులు ఐహికఫలములకు ఆశించి చాల పుణ్యకార్యములను ధర్మక్రతువులను చేయవచ్చును; కాని ఆపదలు, దుఃఖము, దారిద్ర్యమువచ్చినప్పుడు ఆభక్తి ఆ ధర్మచింత ఎగిరిపోవును. వారు దినమంతయు "రాధాకృష్ణా రాధాకృష్ణా" అని అఱచుచుండు చిలుకవంటివారు. చిలుకను పిల్లిపట్టుకొనినప్పుడు, అది భగవన్నామమును మఱచి "కా" "కా" అనియే అఱచును.

కావున నేనేమందునంటే అటువంటి వారికి ధర్మబోధలు చేయుట వ్యర్థమని, నీవెన్నియుపదేశములు చేసినను సంసారులు మారరు.

693. కొత్త పరుపుమీద కూర్చుండునప్పుడుఅదిఅణగును. కాని పైబరువు పోగానే అది యెప్పటి ఆకారముపొందును. గృహస్థులును అటులనే చేయుదురు. వారు పురాణశ్రవణము చేయునంతకాలమును ధర్మబుద్ధితో నిండియుందురు. ఇంటికి పోయిగృహకృత్యములలో ప్రవేశించగానె తాము వినిన ఉన్నత ధర్మభావములను బొత్తుగమఱచిపోయి, ఎప్పటి నీచకార్యములకే పాల్పడుదురు.

694. లోకవ్యావృత్తులుగల పురుషులు భక్తులతోగూడి అప్పుడప్పుడు ఇక్కడికివచ్చుట చూచినాను. వారికి వేదాంత ప్రసంగమనిన గిట్టదు. ఇతరులు భగవంతునిగూర్చియు పారమార్థికతనుగూర్చియు, దీర్ఘకాలము ముచ్చటించుచుండుట చూడ వారు సహించలేక చీకాకుపడుదురు. ఊరకకూర్చుండుటయు వారికి కష్టముగనుండెను. "ఎప్పుడు బయలుదేఱుట? ఎంతసేపువుంటారు?" అని తమస్నేహితులను రహస్యముగ నడిగేవారు. అప్పుడాస్నేహితులు "కొంచెము తాళుడు; త్వరలోనెవత్తుము." అనుచుంటయుకలదు. ఈమాటలకు వారు విసుగు చెంది "సరే! మీరుమాట్లాడుచుండుడు. మేముపోయి పడవలో కనుపెట్టుకొనియుంటాము" అనుచు వెళ్లెడివారు!

695. మనుష్యులలో రెండురకములవారు కలరు. పేరునకు మాత్రము మనుష్యులు ఒకరకము. ప్రబోధమానసులగువారు ఇంకొకరకము. భగవంతునిగూర్చి తపించువారు ఈ రెండవరకములో చేరినవారు. కామినీకాంచనములకై ఆరాటపడువారు నామమాత్ర మానవులు.

-:0:-

36వ అధ్యాయము.

# మహిమలు

696. సిద్ధులకొఱకై దేవులాడువారిని మహిమల ప్రకటించు వారిని దరిచేరకుడు. అట్టిపురుషులు బ్రహ్మపథమును వదలి చరించువారు, బ్రహ్మముంజేరు యాత్రాపథమున, అడ్డము వచ్చుచుండు మహిమల వలలలో వారిబుద్ధులు తగులుపడి యుండును. ఈ మహిమలంగూర్చి హెచ్చరికతోనుండు వానికై ఆశపడకుడు.

697. ఒకడు పదునాలుగేండ్లు అడవిలో ఘోరతపస్సు చేసి, తుదకు నీళ్లపై నినడుచుసిద్ధిని సంపాదించినాడు. ఈసిద్ధికలిగెనని ఆనందపరవశుడై, తనగురుసన్నిధికిపోయి, "గురుదేవా! గురుదేవా! నేను నీటిపై నినడుచు మహిమను పడసితిగ!" అనెను. వానిగురువు వానినిట్లు చీవాట్లుపెట్టినాడు. "ఛీఛీ! పదునాలుగేండ్లశ్రమకు ఇదియాఫలము? ఆహా! నీవొక కాని డబ్బును సంపాదించినవాడవైతివి! నీవుపదునాలుగేండ్లు పాటు పడి గడించినదానిని సామాన్యనరులు పడవవానికి కానిడబ్బు నిచ్చి పొందగలరు సుమీ!"

698. భగవాన్ శ్రీరామకృష్ణపరమహంసులవారి బాల శిష్యులలో ఒకడు ఇతరుల మనోభావములను ముఖముచూచి గ్రహించుశక్తిగలవాడయ్యెను. దీనింగూర్చి అత్యానందభరితుడై వచ్చి తనశక్తినిగురించిగురుదేవులతో ప్రశంసించెను. పరమ

హంసులవారు వానిని మందలించి యిట్లనిరి:- "సిగ్గు సిగ్గు! బిడ్డా! నీశక్తియుక్తులను ఇట్టి క్షుద్రవిషయములందు వ్యయము చేయకుము!"

699. మందులిచ్చుచు, గంజాభంగీలను సేవించుసాధువు యోగ్యుడనతగదు. అటువంటివాని సాంగత్యము చేయకుడు.

700. నేను పంచవటికడ తీవ్రసాధనలు చేయుచుండు దినములలో గిరిజ అను నొకపురుషుడు అచ్చటికివచ్చెను. ఆయన గొప్పయోగి. ఒకతడవ చీకటిరాత్రిలో, నేను నాగదిదగ్గఱకు పోవయత్నించుచుండగా, ఆయన తనచేతిని పైకెత్తినాడు. వానిచంకలోనుండి గొప్పవెలుగుబయలుదేఱి మార్గమంతయు చక్కగ కాన్పించినది. నాహితవాక్కునువిని, ఆయన తనసిద్ధిని వినియోగించుట మానివేసి, బ్రహ్మసాధనకై తన మనస్సును మరల్చినాడు. కొన్నాళ్లకు వాని కాశక్తితగ్గిపోయినది; కాని సత్యమగు పరమార్థమును సంపాదించుకొనగల్గినాడు.

701. ఒకశిష్యుడు తానుధ్యానముచేయు సమయమున దూరమున జరుగుసంగతులు ప్రత్యక్షముగ తనకుగోచరించుననియు ఆసమయమున కొందఱుప్రజలు ఏమిచేయుచుందురో స్పష్టముగ తెలియవచ్చుననియు, అనంతరము విచారించగా తనఅనుభవము సత్యములయ్యెననియు, శ్రీపరమహంసులవారికెఱిగించెను. అంతట వారు బిడ్డా! కొన్నిదినములు ధ్యానమునుమానుము. ఇట్టిదూరదర్శనములు మున్నగుమహిమలు బ్రహ్మసాక్షాత్కారమునకు అడ్డుతగులును సుమీ!" అని చెప్పిరి.

702. సిద్ధులను అశుద్ధముబోలి త్యజించవలయును. యోగ సాధనలవలనను, ఇంద్రియ సంయమనమువలనను ఇటువంటి సిద్ధులు లభించుచుండును. కాని ఎవరు వీనిపైని, మనస్సు నిలువుదురో వారక్కడచిక్కుబడి పోదురు. ఇంక పైకి పోజాలరు.

703. చంద్రము అనువానికి అదృశ్యఘుటికాసిద్ధి లభించినది. దాని సాహాయమున, ఇతరులు తననుచూడకుండ, ఇచ్ఛానుసారము అతడెచ్చోటికైనపోగలడు. ఆమహిమలలవడినపిమ్మట క్షుద్రభోగములకై దానినివినియోగించసాగినాడు. నేనుఅతనిని మందలించినను, అతడు సరకుచేయడయ్యెను. అతడు ఇతరులకు కానరాకుండ ఒకపెద్దమనుష్యుని భవనమునప్రవేశించి, అందొకయువతితో వ్యభిచరించసాగినాడు. కడకతడు తన సిద్ధినికోల్పోయినాడు. ఎందుకునుకొఱగాని పతితుడై పోయినాడు.

704. శ్రీకృష్ణుడు అర్జునునితో నిట్లనెను. "నీవునన్నుపొందవలయుననినచో, నీకడ అష్టసిద్ధులలో నేదేని యున్నంతవఱకు కృతార్థుడవు కాజాలవు."

మహిమలవలన "అహం" కారము బలపడి బ్రహ్మము మఱుగుపడును.

705. ఒకొక్కప్పుడు సిద్ధులవలన గొప్పఅనర్థములు వాటిలును. ఒకగొప్పసిద్ధునిగురించి "తోటపూరి" అనువారు నాతోడచెప్పిరి. ఆయన సముద్రతీరమున కూర్చుండియుండగా గొప్పతుపాను రేగెనట. ఆగోలకు విసుగుచెంది, ఆసిద్ధుడు

"తుపాను ఆగిపోవుగాక !" అనగనే వానిమాటప్రకారము జరిగినది. సరిగా ఆసమయమున అతివేగముతో ఒకఓడ నిండు తెఱచాపలతో సముద్రముమీద పోవుచున్నదట! ఆకస్మికముగా తుపానుఆగగనే, ఆఓడమునిగినదై, అందున్నవారందఱును సముద్రముపాలైరి! అంతమందికి ప్రాణహానిగల్పించిన పాపము ఆసిద్ధునికి తగిలినది. అదికారణముగా వాని కామహీనుయుపోయినది; మీదుమిక్కిలి నరకప్రాప్తియు ఘటిల్లినది!!



## 37వ అధ్యాయము.

# కర్మఫలము

706. జీవుడు గతజన్మను చాలించి ప్రపంచమునుండి వెడలుసమయమునచేయు సంకల్పానుసారమగు శరీరమును పొందును. కాబట్టి భక్తిసాధనలు చాల అవసరములు. చిరకాలాభ్యాసమువలన సాంసారికచింతలు మనస్సునుండి జారిపోయి, దైవచింత మాత్రమే జీవుని అంటియుండును. అది మరణ సమయమునను విడువదు.

707. నేను ఒకచోట రెండు బుడ్డగొట్టినయెద్దులను చూచితిని. ఆవొకటి ఆతోవనుపోవుచుండగాంచి, ఒకయెద్దు ఉద్రేకమును పొందినది; రెండవది శాంతముగనున్నది. ఈచిత్రవర్తనమును కనుగొని ఈయెద్దులయొక్క పూర్వచరిత్రను విచారించితిని. మొదటిది పెద్దదై ఒక ఆవుతో మెలగిన పిమ్మట దానికి బుడ్డగొట్టిరట; రెండవదానికి చిన్నదూడగా నుండగనే కొట్టిరని తెలియవచ్చినది. పూర్వసంస్కారబలము అంత గొప్పది. సంభోగ సుఖమును పొందకుండ సంసారమునుత్యజించిన సాధువులు స్త్రీలు కాన్పించినప్పుడు కామోద్రేకమును పొందరు. సంసార భోగముల ననుభవించి, ముసలివారైన పిమ్మట కాషాయవస్త్రమును తాల్చువారు, చిరకాలము ఇంద్రియ సంయమనము చేసియు పూర్వ సంస్కారములకు లొంగుట కలదు.

708. ఎఱిగిగాని ఎఱుగకగాని స్పృహ యుండిగాని స్పృహలేకగాని, భగవన్నామస్మరణ చేసినయెడల అట్టి స్మరణ సత్ఫలము తప్పక లభించును. స్వబుద్ధిపూర్వకముగా ఏటికిపోయి దానిలో స్నానముచేసినవానికిని స్నానఫలము కల్గును; వేఱొకనిచేత నీటిలోనికి దింపబడినవానికిని స్నాన లాభము కల్గును; మఱియు నిద్రలోనుండగా ఎవరైన మీాద నీళ్లు పోసిననుకూడ స్నానము చేయుట లభించును!

709. పుడమిలో బద్ధజీవులు మరణసమయమందు సయితము సంసారవిషయములగూర్చియే మాట్లాడుదురు. తీర్థయాత్రలుచేసియుండుగాక, గంగాస్నానము కావించియుండు గాక, తావళములు చేబూని జపములు చేసియుండుగాక హృదయములో సంసారవ్యసనములు దాగియుండినచో ఫలములేదు; ప్రాణావసానకాలమునను అవి పెకుబుకుట నిజము. ఆసమయమున సంధిలో ప్రలాపములు సాగింతురు. చిలుక సామాన్యస్థితిలో "రాధాకృష్ణా" అని పవిత్రగానము చేయవచ్చును; కాని పిల్లినోట చిక్కినప్పుడు కిచకిచ మను స్వాభావికపు కూతయే వచ్చునుగదా !

710. దైవభక్తి లేకపోటవలన నరుడు చాలబాధ పడ గలడు. కావున తన ప్రాణావసానసమయమున భగవంతుడు తలపునకువచ్చునట్టి సాధనను చేయవలయును. అందు కుపాయము "దైవభక్తి సాధనమే!" ముందుగా అటువంటి సాధన చేసియున్నయెడల అవసానకాలము అది వానికి తలపు నకువచ్చును.

౨౭వ అ ధ్యా య ము.

# సర్వమత సామరస్యము.

711. ఒకే నీరు వేర్వేఱుజాతులవారిచేత వేర్వేఱు పేరులతో పిలువబడును. ఒకజాతివారు జలమందురు; ఇంకొక జాతివారు పాని అందురు; వేఱొకజాతివారు వాటర్ అందురు; మఱొకజాతివారు యవ్వా అందురు. అట్లే సచ్చిదానందమయ పరబ్రహ్మమును కొందఱు దేవుడనియు, కొందఱు అల్లాఅనియు, కొందఱు హరిఅనియు కొందఱు బ్రహ్మయనియు సంబోధింతురు.

712. పెద్దచెఱువునకు అనేకము రేవులుండును. ఏ రేవున ఎవరు దానిలో దిగినను స్నానముచేయవచ్చును. నీరుదీసికొని పోవచ్చును. ఒక రేవు మఱొక రేవుకంటె శ్రేష్ఠతరమని పోట్లాడుట వ్యర్థమని. అటులనే బ్రహ్మానందసరోవరమునకు చాల రేవులున్నవి. ఈ రేవులలో దేనిగుండనైనను సరియే నిర్మలహృదయముతో శ్రద్ధాభక్తులతో సరాసరి పొందు. మీకు నిత్యానందజలము లభించగలదు. అంతేగాని నా మతము వేఱొకని మతముకన్న శ్రేష్ఠమని వాదులాడబోకుడు.

713. భగవంతునికి అనేక నామము లున్నవి. ఆయనను చేర్చురూపములును అనంతములుగనున్నవి. నీకే నామము

ఏరూపమునచ్చునో దాని సాహాయ్యముననే నీవు వాని సాక్షా
త్కారమును పొందగలవు.

714. కుమ్మరిదుకాణములో కుండలు, కూజాలు, డాకలు, మూకుళ్లు మున్నగునవి అనేక పరిమాణములతో అనేక స్వరూపములతో నుండును. కాని అన్నియు ఒకే మట్టితో చేయబడినవియే. అటులనే భగవంతుడు ఒక్కడు; కాని ఆయాయుగములలో, ఆయాదేశములలో భిన్నభిన్న నామములతోడను భిన్నభిన్న స్వరూప లక్షణములతోడను పూజింపబడుచుండును.

715. ఒకే పంచదార పక్షులు మృగములు మొదలగు ననేక చిత్రరూపములను పొందగల్గును. అటులనే మధుర మూర్తియగు జగజ్జనని వేర్వేఱుయుగములందు వేర్వేఱు ప్రదేశములందు వేర్వేఱు నామరూపములదాల్చి పూజల నందును.

716. వేర్వేఱుమతసాంప్రదాయములు భగవంతునిచేరుట కగు వేర్వేఱుమార్గములే. కాళీఘట్టమునందలి కాళీయాలయమునకు భిన్నభిన్నమార్గములు చాలగనున్నవి. అటులనే స్వామిసదనముచేరుటకు మార్గములనేకములున్నవి. ప్రతిమత శాఖయు మానవులను భగవంతునికడచేర్చుట కుపయోగించు ఒకానొకత్రోవ అన్నమాటే!

717. ఒకేబంగారముతో వేర్వేఱుపేరులుగల వేర్వేఱు రూపములతోనుండు నగలుచేయబడుతీరునఒకేదేవుడువేర్వేఱు దేశములలో వేర్వేఱు కాలములందు వేర్వేఱు నామరూప

ములతో పూజింపబడును. ఆయన భిన్నభిన్నములగు భావనల తోడను విధానములతోడను పూజింపబడినను, అనగా కొందఱు భగవంతుని తండ్రిఅనినను, కొందఱు తల్లిఅనినను కొందఱు సఖిఅనినను, మఱికొందఱు నాథాఅనినను, మఱి కొందఱు ఆయనను తమహృదయకోశమందలి పెన్నిధిగ భావనచేసినను, ఇంకకొందఱు వానిని తమ పసిబిడ్డగ జూచు కొనినను, ఒకేదేవుడు వేర్వేఱు భావనాసంబంధములతో పూజింబడుచుండెనన్నమాటయే !

718. ఒకసారి బర్ద్వాను మహారాజు నాస్థానమునందు శివుడుఘనుడా విష్ణువుఘనుడాయని పండితులలో చర్చబయ లుదేఱినది. సభ్యులలో కొందఱు శివుడు శ్రేష్ఠుడనిరి; మఱికొందఱు విష్ణుడు శ్రేష్ఠుడనిరి. చర్చతీవ్రరూపము దాల్చి నది. అప్పుడొక పండితుడు "అయ్యలారా ! నేను శివుని చూడలేదు, విష్ణుని చూడలేదు. వారిరువురిలో ఎవరుఘనుడో నేనెట్లు చెప్పగలను?" అనెను. ఆవిధముగా ఒక దేవతను మఱొక దేవతతోపోల్చి తారతమ్యము నెంచబోకుడు. దేవ తలలో ఒక్కనిసాక్షాత్కారమును పడసినను, దేవతలంద ఱును ఒకే బ్రహ్మముయొక్క వ్యక్తస్వరూపములే అని తెలిసిపోవును.

719. ప్రశ్న—అన్నిమతములలోని దేవుడును ఒక్కడే అగునెడల ఆయన వేర్వేఱుమతములవారిచేత వేర్వేఱువిధ ముగా వర్ణింపబడుటేల ?

ఉ:— భగవంతుడు ఒక్కడే. కాని వానికళలు అనేకము! ఒక గృహయజమాని ఒకనికి తండ్రి, ఒకనికి తమ్ముడు, ఒకనికి అన్న, ఒకామెకు మామ, మఱొకామెకు భర్త కావచ్చునుగదా! అటులనే వానివాని భావనావిశేషము ననుసరించి ఒక్కొక్క భక్తుడు ఒక్కొక్క తీరున భగవంతుని అభివర్ణించును.

720. ఒకడు మేడమీదికి నిచ్చెనతోడనో, వెదురుసాయముననో, మెట్లమీదుగనో, త్రాడుతో నెగబ్రాకియో పోవచ్చును. అటులనే భగవంతుని చేరుటకు మార్గములు సాధనలు చాలగానున్నవి. ప్రపంచములోని ప్రతిమతమును అట్టి మార్గములలో నొకదానిని చూపును.

721. ఇద్దఱుమనుజులు ఊసరవెల్లిరంగునుగురించి తీవ్రముగ వాదులాడుచుండిరి. "ఆత్రాటి చెట్టుమీద నేనొక ఊసరవెల్లిని చూచినాను; అది చక్కగ ఎఱ్ఱనిరంగుతో నున్నది" అని ఒకడనెను. వానిపలుకులు ఖండించుచు నీమాటతప్పు. నేనును దానిని చూచినాను. అది యెఱ్ఱగా నుండదు. అది నీలముగా నుండును" అనెను. వాదనచేత తమ తగవును త్రెంపుకొనలేక యిరువురును వేఱొక మనుష్యునికడకు పోయిరి. ఈతడు సదా ఆచెట్టుకడనే వసించువాడు; ఆఊసరవెల్లి రంగుల మార్పులన్నియు చూచినవాడు. వీనికడకువచ్చి వాదులాడువారిలో ఒకడు "అయ్యా ఆచెట్టుమీది ఊసరవెల్లి ఎఱ్ఱగానుండును కాదండీ?" అనెను. అందుకామనుష్యుడు "ఔనయ్యా!" అనెను. రెండవవాడు

"ఏమిటండీ? అదెట్లు? దానిరంగుఎఱ్ఱనకాదే; నీలముగా నుం డును!" అనెను. అందుకును ఆమనుష్యుడు నెమ్మదిగా "అవు నండీ!" అనెను. ఆమనుజునకు ఊసరవెల్లి తఱచుగా రంగులు మార్చుకొనుచుండునని తెలియును. కావున వాదులాడుఇరు వురి భిన్నవాదనలకును "ఔను" అని అతడు చెప్పగలిగెను. అటులే సచ్చిదానందము వేర్వేఱుస్వరూపములతో నొప్పునది. భగవంతుని ఒక్కకళ మాత్రమే చూచిన భక్తుడు ఆరూప మునుమాత్రమే ఎఱుంగును కాని భగవంతుని వివిధకళలను చూచిన భక్తుడు "ఈ రూపములన్నియు ఆ భగవంతునివే. ఆయన స్వరూపము లనంతములు" అనగలడు. భగవంతుడు నిరాకారుడు; సాకారుడుకూడను. ఆయన అనంతరూపములను ఎవడును ఎఱుంగజాలడు.

722. ప్రతిమానవుడును తనమతమునే అవలంబించవల యును. క్రైస్తవుడు క్రీస్తుమతమును మహమ్మదీయుడు మహ మ్మదుమతమును అవలంబించవలసినదే. హిందువునకో ప్రాచీన ఆర్యఋషుల మార్గము నవలంబించుట శ్రేష్ఠము.

723. నిజముగా ధర్మిష్ఠియగు పురుషుడు ఇతరమతము లన్నియు సత్యమునుజూపుమార్గాంతరములేయని తలచ వలెను. మనము ఎల్లప్పుడును అన్యమతములయెడ గౌరవము జూపుచు వర్తించవలెను.

724. ఏమతమునందుగాని, ఏసాంప్రదాయమునగాని. అసహనముండరాదని శ్రీపరమహంసులవారి అభిప్రాయము. ప్రతిస్త్రీయు ప్రతిపురుషుడును తనమతమునెడల గాఢభక్తియు

శ్రద్ధయు కలిగియుండవలయుననియు అసహనము కూడదనియు చెప్పుచుండెడివారు.

725. ('దళములు' అనగా వర్గములు అనియు నీటిపైని మొలచు 'నాచు' అనియు వంగభాషలలో శ్లేషార్థములు కలవు.)

ప్ర:— దళములను ఏర్పాటుచేయుట మంచిదా?

ఉ:— దళములు పాఱుదలనీళ్లలో పెరుగవు. అవికదల మెదలని మఱుగునీటిలో పెరుగును. ఎవనిహృదయము సదా దైవమువైపునకు ప్రవహించుచుండునో వానికి ఇతరవ్యాప్తులకు అవకాశముకాన్పించదు. పేరుప్రఖ్యాతులకై దేవురించునతడు దళముల సృష్టించుచుండును.

726. నక్కకూతలు సర్వత్ర ఒక్కటిగనే యుండును; జ్ఞానులబోధలును సర్వత్ర ఏకరీతిగనే యుండును.

727. వాదులాడతగదు. నీయభిప్రాయములను నీవిశ్వాసములను నీవు స్థిరముగ నిలుపుకొనుతీరున ఇతరులును తమ అభిప్రాయములను విశ్వాసములను స్థిరముగ నిలుపుకొనుటకు నీవు స్వాతంత్ర్యమునంగీకరించవలయును. కేవలమువాదులాటచేత నీవొకని పొఱబాటును సవరించుకొనునటుల చేయజాలవు. ఈశ్వరానుగ్రహము కలిగిననాడు ప్రతిమానవుడును తన తప్పులను తానె తెలిసికొనగలడు.

728. విద్యుద్దీపములయొక్క వెలుతురు ఆయాస్థలములందు వేఱువేఱుగా ప్రకాశించును. అయినను ఆవెలుతురు

నకు ఆధారమగు విద్యుచ్ఛక్తి ఒకేయంత్రమునుండి వచ్చును. అట్లే మతబోధకులు అన్ని దేశములందును అన్ని కాలములందును దీపములవలె ప్రకాశించుచుందురు. వారందఱియందును తేజరిలు ఆత్మప్రకాశము ఒకే పరబ్రహ్మమునుండి వచ్చుచున్నది.

729. కొన్ని సంవత్సరములకు పూర్వము హిందువులును బ్రహ్మసమాజమువారును అత్యుత్సాహముతో తమ తమ మత ధర్మములను బోధింపసాగగా, ఆమతముల రెండింటిని గూర్చియు మీఅభిప్రాయమేమని ఒకరు శ్రీపరమహంసుల వారిని అడిగినప్పుడు శ్రీవారిట్లనిరి:— "ఆ రెండు వర్గముల ద్వారమునను నాదివ్యమాతయే తన పనిని సాగించుచుండుట నాకు కాన్పించుచున్నది!"

730. నరులు తమ భూములను కొలకోలలతోడను, హద్దుగీతలతోడను పంపుడులుచేసికొనవచ్చును; కాని నెత్తి పైగానున్న ఆకాశము నెవరును పంచుకోజాలరు. ఆఅదృశ్యాకాశము సర్వమును ఆవరించి సర్వమును తనయందు ధరించుచున్నది. అటులనే జ్ఞానశూన్యుడు తన మూర్ఖతవలన నామతము మాత్రము సత్యమైనది; నామతమే శ్రేష్ఠమైనది అని వాదులాడును. కాని వానికి జ్ఞానప్రాప్తి కలిగినపిమ్మట ఈశాఖాసాంప్రదాయముల పోరాటములకు అతీతముగా ఏకమును, అఖండమును, నిత్యమును, చిన్మయమునగు ఒక్క బ్రహ్మమేయుండునని తెలిసికొనును.

731. తన బిడ్డలుజబ్బుగానుండగాతల్లిఒకనికిఅన్నము కూర మఱొకనికి సగ్గుజావ రొట్టె, వేఱొకనికి కుడుము వెన్న పెట్టు తీరున భగవంతుడు వారివారి నైజగుణములకు తగునటుల వేర్వేఱు మార్గములను జనులకు అనుగ్రహించుచున్నాడు.



# 39వ అ ధ్యా యము.

## ఈ యుగమునకు తగినమతము

732. ఈకలియుగమునకు నిజముగా తగిన అధ్యాత్మిక భక్తిసాధన అల భక్తవత్సలుని నిరంతరనామస్మరణయే!

733. నీకు నిజముగా బ్రహ్మసాక్షాత్కారము కావలయునేని, హరినామస్మరణయందు విశ్వాసముంచి నిత్యానిత్య వివేకముతో వర్తించుము.

734. చేపలనుతినువారు నిరుపయోగమగు తలను తోకను పారవేసి, మధ్యమెత్తనిభాగమును తిందురు. అటులనే మన పురాతనస్మృతులందలి విధులను ధర్మములను విచారించునప్పుడు, కాలక్రమమున వచ్చిపడిన కాలుష్యములను తొలగించి, ఇక్కాలమునకు అనుకూలములగు సద్ధర్మములనే అవలంబించవలయును.

735. నరుడు కరుణజూపునప్పుడు క్రైస్తవుడుగను, బాహ్యకర్మకలాపములందు పట్టుదలచూపుచో మహమ్మదీయుని వలెను, సర్వభూతసమత్వమును పాటించునప్పుడు హిందువుగను వర్తించవలెను.

736. చేతులతో తాళము వేయుచు హరినామమధుర గానము ఉచ్చస్వరముతో చేయుము; నీకు ఏకాగ్రచిత్తమలవడును. చెట్టుక్రిందకూర్చుండి చప్పట్లుకొట్టినయెడల దాని కొమ్మలమీదకూర్చున్న పక్షులు ఎగిరిపోవును. హరినామ

స్మరణచేయుచు చేతులుకట్టినయెడల నీహృదయమునుండి దుష్టచింతలెల్ల పాఱిపోవును.

737. భక్తిఆత్మార్పణముల సాధనమూలమున భగవంతుని సాంగత్యమును అభ్యసించుటయే భక్తియోగము. ఈ యోగము కలియుగమునకు ఎంతయు అనుకూలము. ఈకాలమునకు అదే యుగధర్మము. దానివలన కర్మ క్షీణించిపోగలదు. నిరంతరధ్యానముయొక్క ఆవశ్యకత నిది నేర్పును.

738. మున్ముందు భక్తిని సంపాదించుకొనుము. తక్కుంగల విషయములన్నియు నీకు లభింపగలవు. ముందు భక్తి, పిమ్మట కర్మ! భక్తి శూన్యమయ్యెనా కర్మనిరర్థకము. స్వతంత్రముగా కర్మ నిలువజాలదు.

739 ఈకలియుగమునకు నారదీయభక్తి విధ్యుక్తము కర్మయోగమునకు, అనగా శాస్త్రములందు విధింపబడిన కర్మజాలమునంతను నిర్వహించుటకు కాలముండదు.

740. దశమూలపచన మను కషాయము ఈ దినములలో జ్వరమునకు ఔషధము కాజాలకున్నదని తెలియును గదా! ఆ మందు పనిచేయుటకు ముందుగనే రోగికి యమలోకయాత్ర ఘటిల్లవచ్చును. కావున ఈ కాలమునకు (కొయినా) జ్వరరసాయనమే తగినది!

40వ అధ్యాయము.

# వివిధాంశములు.

741. నరుడు రెండురకముల సంస్కారములతో పుట్టుచున్నాడు: (1) విద్యా సంస్కారము— ఇది మోక్షము వైపునకు దారిజూపును. (2) అవిద్యాసంస్కారము—ఇది సంసారము వైపునకును బంధనమునకును దారితీయును. పుట్టుకసమయమునందు ఈ రెండుసంస్కారములు త్రాసు సిబ్బెలవలె సమముగానుండుననవచ్చును. సంసారము తన సుఖములను ఆనందములను ఒకసిబ్బెలో వేయును; ఆత్మ తన ఆకర్షణను రెండవసిబ్బెలో నిడును. మనస్సు సంసారమును కోరుకొనెనా ఆసిబ్బెబరువై క్రిందికిదిగును. అటులకాక ఆత్మను కోరుకొనెనా ఆసిబ్బెబరువై దైవము వైపునకు దిగును.

742. ప్రశ్న—జీవన్ముక్తునియందు మాయయుండునా?

ఉ—శుద్ధ మేలిమిబంగారుతో నగలను చేయుట పొసగదు; ఏదో కొంత కలితీ కలపవలెను. నరునికి శరీరమొకటి యున్నంతకాలమును ఆశరీరధర్మములు నడచుకొఅకు కొంతమాయ యుండవలయును. బొత్తుగ మాయచేవిడువబడిన యతడు యిరువదియొక్కదినములకంటె బ్రతుకడు.

743. ప్రశ్న— కృతనిశ్చయబుద్ధిలేక తాత్కాలికపు విరక్తిచే సంసారమునుత్యజించిన సన్యాసి స్వభావమెటులుండును?

ఉ—తండ్రితోడనో, తల్లితోడనో లేక భార్యతోడనో తగవుల బెట్టికొని సన్యసించినవానిని ఆతురసన్యాసి అనవచ్చును. వాని సన్యాసము తాత్కాలికము; ఏ ధనికుడో లాభసాటిపనిని చూపినయెడల అది ఎగిరిపోవును.

744. పరమహంసులవారు ఉన్మాది (పిచ్చివాడు) అనియు చాలమంది ఐరోపా జిజ్ఞాసువులవలె ఏదో విషయముంగూర్చి కలతచెందగా వారిమనస్సు వికలమైనదనియు ఒకానొక బ్రహ్మసమాజ బోధకుడు పలికినాడు. కొంతకాలమునకు శ్రీపరమహంసులవారు వానితో ముచ్చటించుచు ఇట్లనిరి:— "యూరపునందు సయితము విద్యాధికులు ఏదోవిషయమును గూర్చి గాఢతర విచారణను పెట్టుకొనుటచేత పిచ్చివాండ్రగుదురని మీరు చెప్పుదురు. సరే వారి విచారణాంశము భౌతికమా? పారమార్థికమా? భౌతికమైనయెడల, భౌతిక పదార్థములగూర్చి నిరంతరము యోచనచేయువారు పిచ్చివారగుటలో ఆశ్చర్యమేమున్నది? కాని ఏజ్ఞానము జగమునంతను ప్రకాశింపజేయునో అజ్ఞానముంగూర్చి మననము చేయుటవలన నరుడు జ్ఞానశూన్యుడగుటెట్లు? మీ శాస్త్రగ్రంథము లటుల బోధించునా?

645. ప్రేమ మూడురకములు— (1) స్వార్థరహితమైనది (సమర్థము) (2) పరస్పరము (సమంజసము) (3)స్వార్థమగు సామాన్యప్రేమ (సాధారణము)

(1) సమర్థప్రేమ ఉత్తమమైనది. ప్రియుడు ప్రేయసి యొక్క క్షేమమునే గమనించునుగాని, తనకష్టములను బాధలనుగూడ సరకుచేయడు.

(2) సమంజసప్రేమ అన్యోన్యమైనది. ప్రియుడు తన ప్రేయసి ఆనందమునేగాక తనసౌఖ్యమునుగూడ జాగ్రత్తగ చూచుకొనును.

(3) సాధారణప్రేమ అధమము. ఇందు నరుడు తనసుఖమునే చూచుకొనునుగాని తన ప్రేయసి సుఖదుఃఖములను పాటింపడు.

746. శ్రీశంకరాచార్యులయొద్ద ప్రతి యంశమునను వారిని అనుకరించు ఒకానొక మూర్ఖశిష్యుడుండెను. శ్రీశంకరులవారు "శివోహం" అనునప్పుడెల్ల ఆతడును "శివోహం" అనెడివాడు. వానికి బుద్ధిగఱపనెంచి శ్రీశంకరులవారు కమ్మరి కొలిమివాకింతమున పోవుచు మూసలో కరగియున్న లోహమును తీసికొని త్రాగినారు; మఱియు శిష్యునికూడ అటులనే త్రాగమనిరి కాని గురునివలె ఈపనిని శిష్యుడు చేయజాలక పోయెను. అప్పటినుండి "శివోహం" అనుటయు మానినాడు. క్షుద్రానుకరణము ఎన్నడునుకూడదు. పెద్దల నడవడిని జూచి తమను వర్తనము సవరించుకొనుట సర్వత్ర తగును గాని, అర్థహీనపు అనుకరణములు చేటుదెచ్చును.

747. సంసారములోనుండి బ్రహ్మజ్ఞానమును చెందిన వారెవరన జనకమహారాజును ఉదాహరణగా ఎల్లప్పుడు చెప్పుదురు. మానవచరిత్రలో అట్టి ఉదాహరణ యిది ఒక్కటియే! సాధారణముగా సంసారములోనుండి కామినీ కాంచన విసర్జనలేనిది బ్రహ్మసాక్షాత్కారము పొందుట దుర్లభము. శ్రీజనకమహారాజు ఓకడే కామినీకాంచన

విసర్జనలేక అట్లుబ్రహ్మజ్ఞానము పొందినది. నీవున్ను జనకుడవని తలంచవద్దు. ఎన్నియుగములో గడచినవిగాని ప్రపంచములో మఱియొకజనకుడు యింతవఱకును పుట్టియుండలేదు.

748. పాచి చిన్నచిన్న మురుగుడుగుంటలందు పెరుగునుగాని, మిక్కిలి పెద్దసరస్సులందు పెరుగదు. అటులనే స్వార్థపరత, కపటము, మూర్ఖతమూలముగా వెలసినకూటములందు పాక్షికసంప్రదాయము వర్ధిలును; కాని నిష్కళంకములై విశాలాశయములుగలిగి, స్వార్థరహితవర్తనముతో వెలయు సమాజములందు అట్టిసంకుచిత విషయములు ప్రవర్ధనము కాజాలవు.

749. హిందూమతమునకును బ్రహ్మసమాజమతమునకును భేదమేమని ఒకబ్రహ్మసమాజభక్తుడు ప్రశ్నించగా శ్రీపరమహంసులవారిటుల తెలిపిరి:—ఏకస్వరమునకును రాగమునకును గలభేదమే వానికున్నది. బ్రహ్మసమాజము "బ్రహ్మమను" ఒక్కసర్వముతో తృప్తిచెందుచున్నది. హిందూమతమున చాలస్వరములుకూడి మధురమౌ రాగముగ నేర్పడుచున్నవి.

750. భావమును స్వరూపమునుగూడ పాటించుడు; లోపలనుండు భావనయు పైకికాన్పించు ప్రతీకమును మాన్యములే.

751. వరిగింజ మొలకయెత్తి పెరుగుటకు అందుండు అంకురమే ముఖ్యావసరమయినదనియు, పైనిఊకప్రధానమైనది కాదనియు సామాన్యముగ తలంతురు. అయినను ఊకను తొలగించి బియ్యపుగింజను నేలలో నాటినయడల, అందుండి

అంకురము వెలువడి మొక్కయై పంటనీయజాలదు. పంటను కోరుచో ఊకతోగూడ చెక్కుచెదఱకయున్న విత్తనమునే నాటవలయును. కాని వండుకొని తినుటకు కోరినయెడల పైపొట్టును తొలగించి శుభ్రమైనబియ్యమునే చేకొనవలసియుండును. మతపరిచారమునకు, మతరక్షణకును క్రతువులు, కర్మలు అవసరములే. అవి సత్యాంకురములను దాల్చిన కర్ణికలవంటివి. కాబట్టి అంతర్యసత్యమును స్వానుభవమునకు తెచ్చుకొనునంతదాక, ప్రతినరుడును వానిని ఆచరించవలసినదే.

752. దీపముయొక్క స్వభావము వెలుగునిచ్చుట! దాని సహాయమున కొందఱు, తినుబండారములను వండుకొందురు. కొందఱు కృత్రిమ పత్రములను సృష్టింతురు; కొందఱు ఉత్తమశాస్త్రములను చదువుకొందురు. అటులనే కొందఱు భగవన్నామస్మరణచేసి ముక్తి పడయజూతురు; కొందఱు నీచస్వార్థములను సాధించుకొందురు. భగవంతుని పావన నామముమాత్రము అమలమై అటులనే నిలిచియుండును.

753. క్రొత్తభాషను నేర్చుకొనమొదలిడిన యతడు, తన సంభాషణయందు ఆభాషాపదములను తఱచుగావాడుచు తన పాండిత్యమును ప్రదర్శించజూచును; కాని దానిని బాగుగ నేర్చినయతడు మాతృభాషను మాటలాడునప్పుడు ఆనూతన భాషాపదములను ప్రయోగించచూడడు. మతసాధనల సాధించువారిటులనే వర్తింతురు.

754. వట్టికడవలో పోయునీరు బుడబుడ ధ్వనుల కల్పించును. కాని నిండియున్నకడవలో నీరుపోసినచో అట్టిధ్వరాదు.

అటులనే బ్రహ్మసాక్షాత్కారమును పొందనినరుడు భగవంతునిగూర్చియు, వానిలక్షణముల గూర్చియు వృథావాదనలకు దిగును; బ్రహ్మసాక్షాత్కారమును పడసినయతడో ఆ దివ్యానంద పరవశుడై మౌనము దాల్చును.

755. ప్రశ్న:— నరునియందు దైవత్వము ఎంతకాలము నిలుచును?

ఉ:—ఇనుము నిప్పులోనున్నంతకాలము ఎఱ్ఱగానుండును. దానిని నిప్పులోనుండి వెలుపలికితీయగా నల్లబడును. అట్లే నరుడు బ్రహ్మభావనను అనుభవించునంతకాలము ఆదివ్య ప్రభావము కలిగియుండును.

756. గంగానదీతీరమున వసించువారు పవిత్రులు.

757. ఒక తార్కికుడువచ్చి "జ్ఞాతజ్ఞేయజ్ఞానములనగానేమి?" అని శ్రీపరమహంసులవారి నడిగిరి. అందుకు భగవాను లిట్లనిరి.

"మహాశయా! పాండిత్యవిశేషము ప్రకటించు ఈవిషయములు నాకు తెలియవు. నాకు నాలోనిఆత్మ నాదివ్యజనని మాత్రమే తెలియును."

758. మానసతత్వ ప్రబోధముగాంచిన యతడే నిక్కమగు మానవుడు. తక్కినవారు పేరునకుమాత్రమే మానవులు.

769. దుర్లభమగు మానవజన్మ దొఱకినను ఈజన్మను బ్రహ్మసాక్షాత్కారము పడయుటకై వినియోగించనివాని జన్మవ్యర్థము.

760. లేగదూడచాలచురుకుగను, ఆనందముగను,కాన్పిం చును. దినమంతయు చెంగుచెంగున దుముకులాడుచుండును. తల్లికడ పాలు(త్రాగునప్పుడు మాత్రమే నిలకడగ నుండును. కాడిమెడమీదవేసి పలుపుపెట్టగనే నిరుత్సాహము చెంది, ఆనందమునకు మారుగా దుఃఖమును మోమున దాల్చును. క్రమక్రమముగా చిక్కి శల్యమగును. సంసారబాధలు మీదపడనంతవఱకును బాలురు ఆనందముతో కేళీలుగొట్టు చుందురు. వివాహబంధముతో సంసారమున తగుల్కొని, కుటుంబబాధ్యతను నెత్తినబడగానే పొంగిపాటు అణగును. ముఖమున నిరుత్సాహము, విచారము, దిగులు మూర్తీభ వించును. క్రమముగా ముఖము ముడతలుపడి, చెక్కిళ్లు నుండి యౌవన తేజము జారిపోవును. ప్రాతఃకాలమారుతము వలెను, నవకోమల పుష్పములీలను, హిమవారి బిందుపోల్కి ని ఆజన్మాంతము బాలవికాసమును నిలుపుకొనువాని జన్మ ధన్యము !

761. క్రొత్తగా పట్టణమునకువచ్చువాడు, రాత్రి పరుం డుటకు తగిన గదినొకదానిని మొదటగా విచారించుకొని అచ్చట తనసామానును చేర్చుకొనవలెను. ఆపిమ్మట స్వే చ్ఛగా నగరవిచిత్రముల జూడపోవచ్చును. అటుల చేయ నిచో రాత్రి చీకటిలో నిలువతావులేక చాలబాధలు పడ వలసివచ్చును. అటులనే ముందుగా భగవంతునియందు నిత్య శాంతిధామమును కుదుర్చుకొని, అనంతరము తన నిత్యకృత్య ములమీద ఇటునటు సంచరించుట క్రొత్తగా సంసారమున ప్రవేశించినవానికి క్షేమము. లేదా మృత్యువను భీకరకాళ

రాత్రి ఆసన్నమైనప్పుడు అనేకయాతనలకు లోనై బహు దుఃఖము ననుభవించవలసివచ్చును.

762. మున్ముందుగా భగవంతుని ప్రాపు సంపాదింపుము, ఆపిమ్మట ధనము నార్జింపుము. ఈవరుసను తలక్రిందు చేయ జూడకుము. పారమార్థికత సంపాదించిన యనంతరము గృహస్థుడవైతివా నీమనశ్శాంతికి భంగమురాదు.

763. చిన్నపిల్లలు చావిడిగదిలో విచారము భయము ఆటంకము లేకుండ స్వేచ్ఛగా బొమ్మలు పెట్టుకొని ఆట లాడుదురు కాని తల్లి కనబడగానే తమ బొమ్మలనన్నిటిని విడి చివేసి "అమ్మ! అమ్మ!" అనుచు పర్విడుదురు. ఓనరుడా! నీవును ఈభూలోకమున ధనము, కీర్తి ప్రతిష్ఠమున్నగు బొమ్మ లతో మిగులపరవశమునజిక్కి ఆటలాడుచున్నావు. నీకేమియు భయముగాని, దిగులుగాని, విచారముగాని లేకున్నది. కానినీవు ఒక్కసారి ఆదివ్యమాతదర్శనమయ్యెనా, నీకీవిషయములందు మక్కువ నిలువదు. వీని నన్నిటిని తన్నివేసి నీవా అదివ్యజనని సన్నిధికి పర్విడుదువు సుమీ!

764. ఎఱిగియో ఎఱుగకనో ఎటులైనను మృతసరో వరమున పడెనేని, నరుడు అందుమునిగి అమృతుడగును. ఇచ్ఛికముగగాని, పరప్రేరణచేతగాని, ఎటులైననునేమి భగ వన్నామస్మరణ చేయునెడల, తుదిసిమనుజుడు అమరత్వమును పొందును.

765. సదా హరికీర్తనము జరుగు నింటిని దయ్యము చొచ్చబోదు.

766. "హరి" అనగా మన హృదయములను హరించువాడు అని అర్థము. "హరిబలము" అనగా మనబలము శ్రీహరి అన్నమాట.

767. పామరులు విమర్శింతురనిగాని, లోకము వెక్కిరించుననిగాని, మత సాధనగూర్చి లజ్జపడకుము. అటువంటి జనుల నందఱిని గణనచేయనర్హముగాని పురుగులుగ నెంచుము.

768. మానవులు ఎంతసులభముగా స్తోత్రముచేయుదురో అంత సులభముగా నిందలు చేయుదురు. కావున వారు నిన్నుగూర్చి యేమన్నను సరకుసేయకుము.

769. నిత్యమును అనిత్యముసాహాయ్యముననే కనుగొనవలయును; సత్యమును అసత్యము నాధారముచేసికొని కనుగొనవలయును. నిర్వికారమును సవికారముయొక్క సాహాయ్యమున ప్రాపించవలయును.

770. గృహస్థులుగానుండి మోక్షసాధనముల సాగించువారు కోటగోడ చాటునుండి పోరాడు యోధులవంటివారు. సంసారములత్యజించి బ్రహ్మసాధనలకుపూను సన్యాసులు బయట బయలుమీద యుద్ధముచేయు భటులబోలువారు. బయట బయలునందు పోరాడుటకంటె కోటలోపలనుండి యుద్ధముచేయుట ఎక్కువక్షేమకరమును సుకరమును గూడనగును.

771. అనులోమ విలోమవాదమని తర్కము రెండు తెగలుగలది. అనులోమప్రకరణమున సృష్టినాధారముచేసికొని సృష్టికర్తను తెలిసికొందుము; అనగా "కార్యము"

ననుసరించిపోయి "కారణము"ను తెలిసికొందుము. పిమ్మట విలోమవాదము ప్రారంభమగును. ముందు బ్రహ్మమును పొంది, విశ్వమునందలి ప్రతికార్యమునందును ప్రతిఅంశము నందును వాని పరిభావము వ్యక్తమగుటను తెలిసికొందుము.

ఒకటి పృథక్కరణపద్ధతి; రెండవది సమ్యక్కరణ పద్ధతి. మొదటిది అరటిదొప్పలను వలుచుచుపోయి నడుమ నున్న ఊచను కనుగొనుటవ టిది. రెండవది ఒకపొఱమీద ఒకపొఱగా దొప్పలను పేర్చుచు పోవుటవంటిది.

772. ప్రశ్న—సాత్త్విక, రాజసిక, తామసికపూజ లనగా ఎట్టివి? భేదమేమి?

ఉ—సంపూర్ణహృదయముతో, నిరాడంబరముగా, ఆర్భాటమేమియులేక, పూజలర్పించునతడు సాత్త్వికభక్తుడు. పూజామందిరమును అలంకరించుటలో మిగుల శ్రద్ధపూని, నృత్యగీతాదుల ఆర్భాటమును సమకూర్చి, హెచ్చుధన మును వెచ్చించి సమారాధనలుచేసి, పూజార్చనలను జరుపువాడు రాజసికభక్తుడు; నోరులేని గొఱ్ఱెలను మేకలను వందలకొలదిగా బలిపీఠములమీద నఱికి ప్రోగువేసి, మాంసము మద్యములతో సహా కుంభముపోసి, చిందులువేయుచు పదాలుపాడుచు పూజలుచేయువాడు తామసికభక్తుడు;

773. ప్రశ్న:— సంసార మెటువంటిది?

ఉ:— చర్మము టెంకమాత్రము గల ఎండిన పుల్ల మామిడికాయవంటిది. గుజ్జుండదు. దానినేరికొని తినినచో కడుపులోశూలలపుట్టును.

774. జ్వరాతిశయముచేత విదాహముగలిగి పీడితుడగు రోగి సముద్రములోని నీరంతటిని త్రాగివేయగలననితలచును. ఆజ్వరముతగ్గి ఎప్పటిస్థితికివచ్చినప్పుడు గిన్నెడు నీటినైనను త్రాగడు; పురిసెడు నీటితో సంపూర్ణముగాతృప్తిపడును. అటులనే "మాయా" జ్వరపీడితుడై, తన కించిజ్జత్వమును మఱచిన నరుడు అనంతుడగు భగవంతుని విభూతులనన్నిటిని తనచిన్ని హృదయమున యిముడ్చుకొనగలనని తలచును. వాని యీభ్రాంతి తొలగినప్పుడు దివ్యజ్ఞానకిరణమొక్కటియే చాలును వానిని పరమానందభరితుని చేయుటకు !

775. ఒకానొక పెద్దమనుష్యుడు "నాకొమారుడు హరీశుడు పెద్దవాడుకాగనే వానికి పెండ్లిచేసెదను; కుటుంబ వ్యవహారములన్నియు వానికి విడిచివేసి సన్యసించి నేను యోగాభ్యాసము మొదలిడెదను" అని చెప్పెను. ఈపలుకులువిని శ్రీపరమహంసులవారు వానితో "భగవద్భక్తి"ని సాధన చేయుటకు నీకెన్నడును అవకాశము దొఱకదు సుమీ. ఆపిమ్మటనుగూడ "ఈహరీశునకును ఆగిరీశునకును నాపై ప్రేమానురాగముమెండు. నేను సన్యసించితినా, వారు బెంగగొందురు. హరీశునకొకకొడుకు పుట్టనీలే. మనమని పెండ్లికూడ చూడవద్దా!" అనబోదువు! ఈవిధముగా నీగొంతెమ్మకోరికలకు హద్దుండబోదు" అనిరి.

776. సన్నని ధాన్యపుగింజలను పోవిడిచి ముతకగింజలను నిలుపుకొనుట జల్లెడకు స్వభావము. అట్లే దుష్టాత్ములు, సద్విషయములను జారిపోవిడిచి, దుర్విషయములను నిలిపి

యుంచుకొనుచుందురు. చేటయొక్కయు, మహాత్ముల యొక్కయు స్వభావము దీనికివ్యతిరేకముగ నుండును. (తాలు, తప్ప, చెత్త తోసివేసి ఉపయోగకరమగు గట్టిగింజలను నిలుపుకొనును.)

777. దుఃఖాశ్రువులును,ఆనంద బాష్పములును ఒకేకంటి నుండి వచ్చును ; కాని వేర్వేఱు కొనలునుండి ప్రవహించును. దుఃఖముచేవచ్చు కన్నీరు ముక్కుదాపుకొనలనుండియు, ఆనందముచే గలుగు కన్నీరు వెలుపలి కొనలనుండియు వచ్చును.

778. "మిత్రులారా! నేనెంతకాలము బ్రతుకుదునో అంకాలము ఏదియో నేర్చుకొనుచునే యుండగలను."

779. భగవంతుడు ఇచ్ఛించుచో సూదిబెజ్జములో సామజమును (ఏనుగును) దూర్చగలడు. ఇచ్ఛానుసారము ఆయన యేమైనను చేయగలడు!

780. భరతుడు, ప్రహ్లాదుడు, శుకదేవుడు, విభీషణుడు, పరశురాముడు, బలి, బృందావనగోపికలును భగవంతుని సేవించునిమిత్తము తమ పెద్దలయెడ అవిధేయులై వర్తించిరి.

781. ప్రశ్న— మతధర్మములు క్షీణించుటకు కారణమేమి?

ఉ:— వాననీరు నిర్మలమైనదేకాని అది భూమిపై పడునప్పటికి సంపర్క దోషముచేత మలినముగ నుండును. మిద్దెలు తూములు, కాలువలు, అన్నియు మురికిగా నున్నప్పుడు వాని గుండ ప్రవహించు వర్ష జలమును మురికిగానె యుండునుగదా!

(ఇట్లే మతధర్మములును ఆ యా ప్రచారకుల లోపములచేత దోషభూయిష్ఠములు కాగలవు).

782. సాధువే సాధువును గుర్తించగలడు. నూలువర్తకుడే నూలుయొక్క నాణెము గుణగణములు తెలియగలవు.

783. పాపము, రసము, (Mercury) జీర్ణమగుట దుర్లభము.

784. ముల్లంగిగడ్డ తినిన వానికి ముల్లంగివాసన త్రేణుపులేవచ్చును; దోసకాయ మెసవిన వానికి దోసకాయవాసన త్రేణుపులేవచ్చును. అటులనే నోటవచ్చుమాటలు మనస్సులోనున్న సంకల్పములకు అనుసరణముగానె యుండును.

785. చాకలివానియింట మురికిగుడ్డలు అనేకముండును; కాని అవన్నియు వానివికావు. ఉతుకగానె వానియిల్లు కాళీయగుచుండును. స్వంతసంకల్పములులేనివారు చాకలివాని పగిదినుందురు. భావములవిషయమున నీవు చాకలివానిలీల నుండకుము.

786. ఈశ్వరవాణి ఒకొక్కప్పుడు పిచ్చివారినోటను, త్రాగుబోతులనోటను, పసిబిడ్డలనోటను విననచ్చును.

787. గ్రంథము అనగా సదా సచ్ఛాస్త్రమనిఅర్థముకాదు. "గ్రంథి" అనగా "ముడి" అను అర్థముకూడతఱచుగాదానికి చెల్లును. నరుడు గ్రంథమును చదువునప్పుడు, గర్వమును విడిచి పూర్ణహృదయముతో సత్యమును తెలిసికొనవలయును. అట్టి దీక్షలేనియెడల, వేడుకగా చదువుటచేత, విషమ

పాండిత్యము, అహంకారము, గర్వము, మున్నగునవి, వాని హృదయమున గ్రంథులై కూడును. (బాధించును)

788. మనస్సును, హృదయమును, పవిత్రముచేయు చదువుమాత్రమే విద్య! తదితరమగు ఎఱుక అంతయు అవిద్యయే.

789. వంగభాషలో ఏమూడు అక్షరములకును ధ్వనిలో పోలికయుండదు. శ, ష, స, అనువానికి మాత్రము పోలిక కలదు. ఆమూటికికూడ "శాంతించుము" అను అర్థముకలదు. దీనినిబట్టి మనము అక్షరాభ్యాసము చేయుచున్నప్పుడును, బాల్యమునుండియు "శాంతితోనుండుము" అను పాఠమునే నేర్చుచున్నామని గ్రహించవచ్చును. ప్రతివానికిని శాంతియే పరమభాగ్యము.

790. (1) సర్వోహం (అంతయు నేనే) (2) తత్వమసి (ఈసర్వమును నీవే) లేక (3) త్వమేవస్వామి; అహమేవ సేవకః (నీవు యజమానివి; నేను సేవకుడను) అని పలుకగల చిత్తపరిపాకదశ నరునియందు కలిగినప్పుడు భగవంతుడు ప్రత్యక్షము కాగలడు.

791. స్త్రీ లందఱును, జగజ్జనని అవతారములే. కావున స్త్రీ జనమునెల్ల తల్లులుగ భావనచేయవలయును సుడీ!

792. సాధువును చూడబోవునప్పుడును, దేవాలయము నకు పోవునప్పుడును వట్టిచేతులతో పోరాదు. పూజ్యులకు అర్పణచేయుటకై ఏదేని స్వల్పముగనైనను తీసికొనిపోవలెను.

793. ఇతరులేమి చేయవలయునని నీవు కోరుదువో, దానిని నీవును జేయుము.

794. చిలుక ఎగిరిపోయిన వెనుక ఎవడును పంజరముమీద శ్రద్ధవహించడు. ప్రాణమనెడు చిలుక ఎగిరిపోయిన వెనుక మిగిలియున్న కళేబరము ఎవరికిని అక్కఱలేదు.

795. ఎవరికిని కొఱగాని వానియందుకంటె, అనేకుల గౌరవ మర్యాదల బడయుచు, వినయవిధేయతలతో అనుసరించబడు నతనియందు దైవశక్తి అతిశయముగ నుండును.

796. తెల్లని గుడ్డమీద నల్లనిడాగు నలుసంతపడినను ఎంతో అసహ్యముగ గాన్పించును. అటులనే సాధువునందు చిన్నలోపమున్నను ప్రకాశమునకువచ్చి బాధకరమగును.

797. ఇతరులు శిరస్సువంచుతావున నీవును వంచుము. వినయవర్తనము వ్యర్థముగపోదు.

798. అద్దెయింటిలో కాపురమున్నయెడల బాడుగ చెల్లించవలయు రీతిని, శరీరమునువాడుకొనినందుకు జీవుడు రోగపీడలనెడు పన్నులను చెల్లించుకొనవలయును.

799. ఇనుమును కొలిమిలోకఅగ్గి చాలసేపు శుద్ధిచేసిన గాని మంచిఉక్కుకాదు. అప్పుడు దానిని మంచికత్తిగాచేసి, నీయిష్టమువచ్చినటుల ఎటుపట్టిన నటువంచవచ్చును. ఆతీరుననే మనుజుని ఆపదలను కొలిమిలో చాలసార్లుకాచి, బాధలనెడు సమ్మెటలతో మోదిన అనంతరము వాని హృదయము స్వచ్ఛమగును; వినయసంపత్తిగలదగును. అప్పుడతడు భగవత్సాన్నిధ్యమున మెలగుటకు అర్హుడగును.

800. (కలకత్తాలోని కోటీశ్వరుడగు) యదునాథమల్లికు వంటి శ్రీమంతుని భవనములగురించియుధనరాసులగురించియు విచారణసేయువారు అనేకులుందురు; కాని వానిని స్వయముగాచూచి వానిపరిచయమును చేసికొనగోరువారు అరుదు. అటులనే వేదాంతగ్రంథముల చదువువారును మతధర్మములగూర్చి ఉపన్యాసములు చేయువారును పెక్కండ్రుందురు. కాని బ్రహ్మమును చూడగోరువారును, సాయుజ్యము బడయుటకై శ్రమదీసికొనువారును చాల కొలదిగనే యుందురు.

801. ఒకనికి న్యాయవాది (ప్లీడరు) కాన్పించగానెవ్యాజ్యములు కోర్టులు తలపునకు వచ్చును. అటులనే సద్భక్తులను చూచినప్పుడు భగవంతుడును పరలోకజీవనమును తలపునకు రాగలవు.

802. బ్రహ్మానందము లభించినప్పుడు దానితోడ మైమఱపు కలుగును. అట్టివాడు కల్లుత్రాగ నవసరములేదు; త్రాగినవానివలెనే కాన్పించును. నేను నాదివ్యజనని పాద దర్శనము చేయుసమయమున అయిదుసారాబుడ్లు త్రాగినంతకైపెక్కును. అట్టిస్థితియందు ధారాళముగాతిండినైనతినుటకు వీలుండదు.

803. సమారాధనలని చాలామందిని చేర్చి విందులు చేయుట ఎందులకు? అటులచేయుట సర్వభూతములందును ప్రజ్వలించుచుండు ప్రాణాగ్నియందు ఆహుతులిడుటే అనిగదా మీతలంపు? అట్లయిన దుర్వర్తనులును, నీచ చారిత్రులును

అగు క్షుద్రమానవులను, అట్టి సమారాధనలందు ఆదరించ వగదుసుడీ!

అటువంటి పాపములు వారు కూర్చుండుస్థలమును సయి తము చాలబారల లోతువరకు అపవిత్రము చేయునంత ఘోర ములుగా నుండును.

804. పూర్వము కసాయివాడొకడు దూరముననున్న వధశాలకు ఒక ఆవును తోలుకొని పోవుచుండెను. ఆకసాయి వాడు దానిని క్రూరముగ చెండాడుటవలన ఆ ఆవు చాలా తిప్పలు పెట్టసాగెను. దానిని తోలుకొనిపోవుట వానికి దుర్ల భమైనది. ఇట్లుచాలసేపు శ్రమపడి మధ్యాహ్నవేళకు ఎట్టెటో ఒకగ్రామముచేరినాడు. చాల అలసినవాడై, ఒకధర్మసత్రవు నకుబోయి, అచ్చటనొసగబడు సదావ్రతమును పొల్గొని నాడు. అందువలన పొట్టనిండ తృప్తిగాతినినవాడై, సేదదేతి సులభముగా ఆవును తోలుకొనిపోయి వధశాలకు చేర్చగల్గి నాడు. ఆగోవును హత్యచేసినపాపములో కొంతభాగము సదావ్రతమునొసగినవానికిని ప్రాప్తించినది. కాబట్టి అన్న మునుగాని, బిచ్చమునుగాని ఎవరికైనపెట్టి పుణ్యముసంపా దింపనెంచువాడు ఆదానమును పుచ్చుకొనువాడు దుష్టుడును పాపవర్తనుడును కాడుగదా యని వివేకించి చేయుచుండ వలయును.

805. ప్ర:— ఈజగత్తు అసత్యమా?

ఉ:— నీవు బ్రహ్మమును చూడజాలనంతవఱకు నీకు జగము సత్యమే. ఏలయన, నీవుబ్రహ్మమును చూడజాలవు

కాన, "నేను, నాది" అను బంధములతో జగమునకు అంట కట్టుకొనియేయుందువు. అజ్ఞానమువలన భ్రాంతుడవై, ఇంద్రియభోగములందు తగుల్కొని, మాయాఘాతమున అట్టి అడుగున పడిపోదువు. తరుణోపాయము దాపున నూటిగ నున్నను, మాయ మానవులను మిగులఅంధులనుచేసి వైచును.

806. ఒక్కసారిగా జ్ఞానమును కలుపుటకు వీలులేదు. దానిని పొందుటకు కాలముపట్టును. తీవ్రస్వభావముగల జ్వర మున్నదనుకొనుడు. ఆస్థితిలో వైద్యుడు "కొయినాను" ఇయ్యడు. దానివలన లాభముండదని అతనికి తెలియును. ముందుగ జ్వరము రోగిని విడువవలెను. దీనికికాలము అవసరము. పిమ్మట "కొయినా" గాని మతేమందుగాని ఇయ్య వీలుపడును. జ్ఞానమును బడయగోరు నరునిస్థితియు యిట్టిదే. నరుడు సంసారతాపత్రయములలో మునిగియున్నంతకాలమును ధర్మోపదేశములు వ్యర్థములగును. కొంతకాలము సంసార విషయములఅనుభవమునుపొందనీయవలెను. వానిసంసారప్రీతి ఒకింత తగ్గిన వెనుక ధర్మోపదేశములు వానియందుఫలించు స్థితి వచ్చును. అంతవఱకును వానిగూర్చిచేసిన ఉపదేశములన్నియు వ్యర్థములే!

807. సంధ్యగాయత్రియందు లయమందుచున్నది. గాయత్రి ప్రణవమున లయమగుచున్నది. ఈ ప్రణవము సమాధియందు లయముగాంచుచున్నది. ఇటుల (సంధ్యావందనాది) కర్మ యంతయు సమాధియందు పరిసమాప్తిపొందుచున్నది.

808. ఎవనియందు బుద్ధియు హృదయమును పూర్ణవికాసమునుపొంది, సమతకువచ్చియుండునో, అట్టివాడు ధన్యుడు. అటువంటివాడు ఎచ్చటనున్నను సమంజసముగ వర్తింపజాలును. వాని నిర్మలభక్తి పరిపక్వముకాగా అతడు నిశ్చల విశ్వాసము గలిగియుండును. అప్పుడు అతడు యితరులతో నడుపు వ్యవహారములందు లోపముండదు. ఆతడు లౌకిక వ్యవహారములను చక్కబెట్టునప్పుడు దక్షతచూపును; పండిత సభలందు, ఉత్తమవిద్యాప్రదర్శనముచేత తనవాదనను నిలుపుకొనును; తర్కమున అద్భుతచాతుర్యమును చూపును. తల్లి దండ్రులయెడ విధేయుడై భక్తిసలుపును; బంధుమిత్రులయెడ హితవర్తనుడై అనురాగము చూపును; ఇరుగుపొరుగు వారియెడ దయాదాక్షిణ్యములు గలిగి ఉపకారము సలుపుటకు సిద్ధముగనుండును. భార్యయెడ ప్రేమాంపువేలుపై వర్తించును. అట్టి పురుషుడే నిజముగా సిద్ధాత్ముడు!

809. సంసారము ఎంతఅశాశ్వతమైనదో నీకు తెలియును. మనముకాపురముండు యింటిసంగతి కొంచెము చూడుము. ఎంతమంది దానిలో పుట్టినారో! ఎంతమంది దానిలో చచ్చినారో! ప్రపంచవిషయములు మనయెదుట ఒక్కక్షణము కాన్పించును; మరునిమిషమున అదృశ్యమైపోవును. నీవారుగా నీవుచూచుకొనువారుమరణమున నీవు కనుమూయగనే, నీవారనుమాట ముగియుచున్నది. సంసారికి ఎంతటిబలముగల బంధములుండునో చూడుము. కుటుంబములో తన పోషణపై నాధారపడువారెవరును లేకున్నను, మనుమని పెండ్లిచూడవలయునను కోరికనుపెట్టుకొని, కాశికిపోవ నిరాకరించును.

"నాహరి ఏమైపోవునో?" అనుతలంపు వానిని సంసారమునకు బంధించియే యుంచును. ఈడుపువలలో పడిన చేప బయట పడిపోవుటకు వీలున్నను అది పోజూడదు. కంబళిపురుగు తానల్లుకొనిన గూటిలో ముడుచుకొని పడియుండి అందేచచ్చును. ఇటువంటి సంసారము అసత్యము కాదా? మఱియు అశాశ్వతము కాదా?

810. పెద్దపిల్లలమందను కని పెంచినంతమాత్రాన నరుడు స్తుతిపాత్రుడు కాజాలడు. అందు సత్యమగు పురుషత్వమేమియులేదు. కుక్కలు పందులు సయితము పిల్లలను కనుట లేదా? పెంచుటలేదా? సత్యమగు పురుషత్వము స్వధర్మనిర్వహణమున కలదు. అట్టిపౌరుషమును చూపినవాడు అర్జునుడొక్కడు!

811. బాహ్యప్రపంచస్ఫురణతో నున్నప్పుడు మనస్సు స్థూలవిషయములనే గమనించుచు, అన్నమయకోశమున వసించును. ఈకోశము అన్నముపై నాధారపడు జీవుని స్థూల కవచము. మనస్సు అంతర్ముఖమైనప్పుడు, ఇంటిద్వారమును బంధించి అంతఃపురమున ప్రవేశించినట్లగును. అనగా అది సూక్ష్మశరీరమునప్రవేశించి, అందుండి కారణశరీరము ప్రవేశించును. తుదకు మహాకారణమును చేరును. ఆదశయందు మనస్సు అవ్యయబ్రహ్మమున లయమగును. ఆస్థితిని గురించి ఏమివచించుటకును సాధ్యపడదు.

812. పరమహంసులవారు జబ్బుపడినప్పుడు శశిధరపండితులవారుచూచి "రోగగ్రస్తమైన అవయవముమీద

మనస్సును ఏకాగ్రముచేసి మీరేల మీరోగమును కుదుర్చు కోరాదు?" అని అడిగిరి.

శ్రీ పరమహంసులవారిట్లనిరి:— "నేను బ్రహ్మార్పణముచేసియున్న మనస్సును కేవల రక్తమాంసకోశ మగు ఈశరీరముపైని ఎట్లు పెట్టగలను?"

శశిధరపండితులు మరల యిట్లనిరి:-"మీ జబ్బునెమ్మదింపజేయుమని జగజ్జననిని మీరేలప్రార్థింపరాదు?

శ్రీపరమహంసులవా రిట్లు జవాబుచెప్పిరి—"నేను నాతల్లినిగూర్చి స్మరించినతోడనే నాస్థూలశరీరము అదృశ్యమైపోవును. నేను పూర్తిగ దానినుండి తొలగియుందును. కాబట్టి అప్పుడీస్థూలశరీరమును గురించి ప్రార్థించుటకే సాధ్యము కాదు."

813. శ్రీరామకృష్ణ పరమహంసులవారివ్యాధి ముదిరి, వారేమాత్రమును ఆహారపానీయములు తీసుకొనజాలని స్థితిలో ఇట్లువచించిరి:-

"నేనిప్పుడు అనేకములగు నోళ్లతో మాటలాడుచు తినుచు ఉన్నాను. నేనుఆత్మలకు ఆత్మను;నాకు అనేకముఖము లున్నవి. నేను అఖండాత్మను. గొంతులో వ్రణముగల నరచర్మముతో కప్పబడినాను. ఆశరీరము రోగగ్రస్తమైనప్పుడు, అది మనస్సును బాధించును. వేడినీరు మీదపడినప్పుడొకడు "ఈనీరు నన్ను కాల్చినది" అనవచ్చును. కాని సత్యమేమనగా, ఉష్ణము వానినికాల్చును గాని నీరెన్నడును కాల్చదు. బాధయంతయు శరీరమునందుండును; రోగమంతయు శరీ

రముదే. ఈ బాధయు ఈరోగమును ఆత్మను పట్టిచేర జాలవు.

814. శరీరమునందు తీవ్రబాధయున్నను కూడ, నరుడెట్లు ఆత్మవిచారము సలుపవలయునో ఎట్లు బ్రహ్మభావనయందు మునిగియుండవలయునో, నేర్పుకొఱకే అల జగన్మాత ఈ జబ్బును కల్పించినది. తీవ్రబాధతోడను, ఆకలితోడను శరీరము పీడనొందుచున్న సమయమున, నరుని వశమున నివారణోపాయము లేనప్పుడును, ఈ శరీరమునకు అధిపతి ఆత్మ సుమీ అని నాకు నాజనని బోధించుచున్నది. ఆత్మ ద్వైవీయమనియు, బ్రహ్మభావము సత్యమైనదనియు, నరుడు సిద్ధత్వమును సాధించినప్పుడు సర్వబంధవిముక్తి లభ్యమగుననియు, విశ్వాసశూన్యులకు సందేహనివృత్తి చేయుటకొఱకు దివ్యమాత ఈజబ్బును కల్పన చేసినది.

815. శ్రీ రామకృష్ణ పరమహంసులవారు కేశవచంద్ర సేనులతో నిట్లనిరి:— "నీవు బాధపడుచున్నావు; కాని నీజబ్బునకు అర్థము గొప్పదిగనున్నది. ఈ శరీరములో నీవు చాల ఆధ్యాత్మికావస్థలను గడిపియున్నావు. తత్ఫలితముగా ఈశరీరము బాధపడుచున్నది. పారమార్థికతరంగము లేచునప్పుడు దేహస్మృతి అదృశ్యమగును; కాని అది తుదిని దేహమును బాధించును. గంగాజలములమీద పెద్దపొగయోడ నడుచునప్పుడు, కొంతసేపటికి పెద్దతరంగములు లేచి ఒడ్డునకు కొట్టుకొనును. ఓడ పెద్దదైనకొలదిని తరంగముల దెబ్బ బలతరముగనుండును. ఒక్కొకప్పుడు వానివలన ఒడ్డువిరిగిపడును. ఏనుగు

చిన్నగుడిసెలో జొఱబడినయెడల, అది దానిని ఉఱ్ఱూత లూగించి, విరుగలాగును. అటులనే ఆత్మావేశానుభవము చేత సాధకునిశరీరము కదలబారి ఒకొ్కకప్పుడు విచ్చి పోవును. అప్పుడేమిజరుగునో తెలియునా? ఆయింటిలో నిప్పున్నయెడల చాలసామాగ్రిని తగులబెట్టివేయును. అటులనే దివ్యజ్ఞానాగ్నిచేత వ్యసనములన్నియు, కోపము మొదలగు శత్రువర్గము దహింపబడును. తుదకు "నేను, నాది" అను స్పృహయే నాశముచెందును. శరీరము తీవ్రబాధనుపొంది, చెదిఱిపోగలదు. సర్వమును ముగిసెనని నీవు తలంచవచ్చును. కాని "అహం" కారము లేశమేనియున్నంతవఱకును భగవంతుడు నిన్ను ముక్తునిచేయడు. నీవొకవైద్య చికిత్సాలయములో రోగిగాప్రవేశించియెడల నీవు పూర్తిగ రోగముకుదురువఱకును నిన్నువిడువరు సుమీ!"

816. నాశరీరస్థితిని చూచినపిమ్మట "శరీరము ఇంత శుష్కించియున్న స్థితిలో అంత పారమార్థికత విజ్ఞానసంపద నే నెన్నడును చూచియుండలేదు" అని హృదయుడు అనేవాడు. నాశరీరము బలహీనముగనున్నను నేనితరులతో భగవంతుని గూర్చి ప్రసంగించుట మానలేదు. ఒకసారి, నాకు జ్ఞాపకమే, కేవలము శల్యావశిష్టముగనున్నాను; అప్పుడును నాకొక శరీరమున్నదనే గుర్తేలేకుండ గంటలకొలది కాలము పారమార్థిక విషయములగురించి ప్రసంగములు చేయుచుండెడి వాడను.

817. (కేశవచంద్రసేనుల వారితో)— "తోటమాలి ఒకప్పుడు రోజాపూల మొక్కల వేళ్లపై మట్టితీసివేసి వానిపైని మంచుపడనిచ్చును. ఒకప్పుడు పూలు పెద్దవిగా పెరుగునిమిత్తము వేళ్లను నఱుకుచుండును. బహుశః భగవంతుడు నిన్నిట్లు ఘనకార్యములకై సిద్ధము చేయుచుండబోలును!

818. ఒకశిష్యుని ప్రశ్న:— స్త్రీ జనమును మేమెటుల చూడవలయును?

ఉ:— బ్రహ్మసాక్షాత్కారమును బడసి దివ్యదృష్టిని సంపాదించుకొనినవానికి వారినిచూచిన భయములేదు. ఆతడు వారి నిజస్వరూపముల గాంచును; వారు జగజ్జనని అంశములని తెలిసికొనును. కావున అటువంటివాడు వారి యెడ గౌరవమర్యాదలను చూపుటేగాక, పుత్రుడు జననిని వలె సాక్షాత్పూజల నర్పించును.

819. స్త్రీలు సద్గుణములతో జనించనీ లేకపోనీ, పతివ్రతలు కానీ వ్యభిచారిణులుకానీ,వారిని సర్వత్ర ఆనందమాయి దివ్యస్వరూపములుగ చూడవలయును.

820. వ్యవసాయదారులు గిత్తలబేరము ఎటులచేతురో తెలియునా? ఓహో! ఆవిషయములలో వారెంతయో నేర్పఱులు. మంచివానిని చెడ్డవానిని వివేకించుట వారికి చక్కగ తెలియును. ఒకగిత్తయొక్క చుఱుకుదనమును కనుగొనుటెట్లో వారికి ఎఱుకయే! ఊరక తోకతాకెదరు; ఓహో! ఫలితము చిత్రము! చుఱుకుదనములేనివి చలించవు, నిద్రపోవు

వానివలె పడుకొనియెయుండును. చుఱుకుదనము కలవియో, అబ్బో, తమజోలికివచ్చినందుకై ఆగ్రహపడినటులలేచును. వ్యవసాయకులు ఈరకమువానినే కోరుకొందురు.

ఎవడేని ప్రయోజనపరుడై జీవించునెడల తనయందు నిజమగు పౌరుషమును తాల్చవలయును. కాని పౌరుషహీనులు చాలమందియుందురు—పాలలోనాన వేసిన మరమరాల వలె మెత్తనై అంటుకొనిపోవుచుందురు. వారిలోబలమే శూన్యము. నిలువబడి పనిచేయుసమర్థత యుండదు. సంకల్ప శక్తి సున్న! అట్టివారిజీవనములు వ్యర్థములు.

821. శంభుమల్లికుగారు ఒకసారి "అయ్యా! నాసంపదనంతను దివ్యమాత పావన పాదపద్మములుచెంత అర్పణము చేసి మరణించునటుల నన్నాశీర్వదించుడు" అని కోరెను. నేనిట్లు చెప్పితిని:- "ఏమనుచుంటివి ? అదంతయు నీవు గొప్ప సంపదగా ఎంచుకొనవచ్చును; ఆదివ్యమాతకో పాదముల క్రింద నీవుత్రొక్కుచు నడుచుధూళికన్న ఏమియు అతిశయముగ చూపట్టదుసుమీ !"

822. ఒకసారి దక్షిణేశ్వరమునందలి రాచమణిరాణిగారి తోటలో దొంగతనముజరిగినది. విష్ణ్వాలయమందలి విగ్రహములకు ధరించిన ఆభరణములన్నియు పోయినవి. (రాణీగారి అల్లుడును దేవాలయధర్మకర్తయునగు) మధురనాథుగారును నేనును ఏమిజరిగెనో చూడబోతిమి. మధురనాథుగారు "ఓదేవుడా! నీవసమర్థుడవు. దొంగలు నీనగలనన్నిటిని దోచుకొనిపోయిరే! అడ్డుపడలేకపోతివి!" అనెను.

సేనంతట, వారిని గాఢముగా మంగళించి "ఇట్లు పలుకుట ఎంత బుద్ధిహీనత! మీరాగా విగ్రహముద్వారమున అర్పించు స్వామికి ఈ ఆభరణరాశియంతయు ఒకనుల్లిగడ్డను మించిన విలువగలవి కావు సుడీ! ఆదేవదేవునినుండియేగదా, లక్ష్మీదేవి సయితము తన వైభవమునంతనుపడయునని జ్ఞప్తినుంచుకొనుడు!" అని చెప్పితిని.

823. ఎవడెంతగా ధనము సర్పించినను భగవంతుడు లెక్కసేయునా? ఎన్నడునులేదు! ప్రేమను భక్తిని ఎవడర్పించునో వానిపైని స్వామికి కృపగల్గును. స్వామి తనను గూర్చి చేయబడు ప్రేమను, భక్తిని, వివేకమును వైరాగ్యమును మాత్రమే గణనచేయును.

824. బ్రహ్మసాక్షాత్కారమునుగోరి,అనేకులుదీర్ఘకాలము నిష్ఠలను, జపములను, ధ్యానములను, తపములను, పూజలను సలిపిన పవిత్రస్థలములందు భగవంతుడు ప్రత్యక్షమైయుండు నని యెఱుంగుము. వారి శ్రద్ధవలన అధ్యాత్మభావములు అక్కడ ఘనీభూతములైయుండు ననవచ్చును. అట్టిప్రదేశము లందు పరమార్థభావమునకు ప్రబోధముకలుగుటయు బ్రహ్మ సాక్షాత్కారము లభించుటయు అందువలననే స్మృతిదాటి పోవుకాలమునుండియు అసంఖ్యాకులగు సాధువులు, భక్తులు బ్రహ్మవిదులు ఇట్టితీర్థములను దర్శించి, సకలవాంఛలను మట్టుపెట్టి, భక్త్యావేశిత హృదయములతో బ్రహ్మపరోక్షానుభూతికొఱకై నిష్ఠలుసలిపియుందురు. కాబట్టి భగవంతుడు సర్వత్రనిండియున్నను ఈక్షేత్రములందు ప్రత్యేకముగ ప్రసన్ను

డగుచుండును. ఏక్కడత్రవ్వినను నీరుదొఱకగలదు. కాని బావియో, కోనేరో, సరస్సోయున్నచోట త్రవ్వవలసిన పని లేకరేు, కావలయునన్నప్పుడెల్ల సంసిద్ధముగ నీరుదొఱకును గదా!

825. ఆవులు పొట్టలనిండ గడ్డిమేసి, నెమ్మదిగ ఒక చోడ పరుండి నెమరువేయును; అటులనే నీవొక పుణ్యతీర్థమును దర్శించినపిమ్మట, అక్కడ నీమనస్సునకుతట్టిన పవిత్ర సంకల్పములను శ్రద్ధగా కూడబెట్టుకొనియుంచి, ఒక ఏకాంత స్థలమునకూర్చుండి వానిలో నీవు నిమగ్నమై పోవువఱకును మననము చేయవలయును. ఆక్షేత్రమునుండి నీవు మరలగానె ఆసంకల్పములను నీమనస్సునుండి జారిపోనిచ్చి, యింద్రియభోగములందు పడిపోరాదు.

826. భూమినలుదిక్కులను త్రిమ్మరినను అందున కేమియు (సత్యమగు మతము) చిక్కబోదు. ఉన్నదంతయు ఇక్కడనే (హృదయమందు) ఉన్నది.

827. అహంకారనాశమును ఎట్లు చేయవలయునో తెలియునా? వడ్లుదంచునప్పుడు, వారప్పుడప్పుడు ఆగి, ధాన్యము మెదిగెనో లేదో చూతురు. సన్నసరకును తూచునప్పుడు నడుమ నడుమ ఆగి, త్రాసుపుల్లసరిగా ఆడుచున్నదో లేదో అని త్రాసును సవరించుచుందురు. అటులనే నాలోనిఅహంభావము అణగిపోయినదో లేదో చూచుకొనుటకు, అప్పుడప్పుడు ఆత్మనిందచేసికొనుచుండెడివాడను. ఒకొక్కప్పుడు నాశరీరమును పరిశీలించుకొనుచు ఇట్లుతలపోసెడివాడను.

ఈశరీరమును చూడు. ఎముకలు మాంసముతో కూడిన పంజరముకాక ఇదేమిటి? ఇందులో నెత్తురు, చీము, ఇంక నిట్టి మలినపదార్థములుతప్ప యేమున్నవి? ఆహా! దీనినిగురించి మహాగర్వమును పూనుచుండుట ఆశ్చర్యముకాదా?"

828. భగవంతునియొక్కయు, గురువుయొక్కయు, సాధుసత్తమునియొక్కయు, అనుగ్రహములను పొందినను, ఒక్కదాని అనుగ్రహము లేకపోయినా, జీవునికి నాశము తప్పదు. ఒకడు అదృష్టవశమున పైమూడురకములగు వరములను పొందుగాక, వానిహృదయము తనను తాను అనుగ్రహించుకొనినయెడల—తానుతరించవలయునను ఆతురపాటు దానికిలేనియెడల—ఎన్నియున్నను నిష్ఫలము!

829. సాధనాక్రమము మూడుతెరగతులగనుండును:—(1) పక్షుల స్వభావముగలది (2) కోతుల స్వభావముగలది. (3) చీమల స్వభావముగలది.

1. పక్షివచ్చిఒకపండును పొడుచును. ఆపోటుతో పండుక్రిందపడిపోవును. ఇక అది పక్షికిదొరకదు, (అటులనే కొందఱుసాధకులు అతితీవ్రముగా సాధనలను సాగింతురు. వారితీవ్రతయే వారిప్రయత్నములను భగ్నముచేయును.)

2. కోతి పండును నోటకఱచుకొని, కొమ్మనుండి కొమ్మకుదుముకులాడుట దానిస్వభావము. ఇట్లుదుముకులాడునప్పుడు పండు దానినోటినుండి జారిపోవుచుండును.

(అటులనే సాధకుడు కొన్నికొన్ని సమయములందు జీవనక్లిష్టసమస్యలు వచ్చినప్పుడు తనసాధనావిధానమును జారవిడుచును. పట్టునిలుపుకొనలేడు.)

(3) చీమ నెమ్మదిగను పట్టుదలతోడను తన ఆహారమును వెదకిపట్టుకొనను. దానిని జాగ్రత్తగా తన పుట్టలోనికి చేర్చి సుఖముగా భుజించును. ఇట్టి చీమవర్తనమును బోలు సాధన శ్రేష్టమయినది. ఇందు ఫలప్రాప్తి నిశ్చయము.

830. పసిపిల్లలు తమ యొడళ్ళను మురికిచేసికొనుట వారి స్వభావము. కాని తల్లి వారినటుల నుండనీక తరుచుగా వారి శరీరములను కడుగుచుండును. అట్లే నరుడెంతగా పాపములు చేయుచున్నను, భగవంతుడు తుదకు వానికి తరుణోపాయమును చూపకతప్పదు.

831. చీకటి గదియొకటి కలదు. దానిలోనికి ఒక చిన్న రంధ్రముగుండా బైటనుండి వెలుగు కిరణమొకటి వచ్చుచుండెను. ఆగదిలోనుండు నరునకు వెలుగనగా ఆకిరణమే నను భావము కలుగును. ఆతడు క్రమేణ కిటికితలుపులను ద్వారములను తెఱచుచు, లోపలికి వెలుగువచ్చు అవకాశములు హెచ్చుచేసినకొలదిని హెచ్చుగ వెలుగును చూడగలడు.

కాని బహిరంగమున పొలములో నిలుచున్నవానికి అంతా వెలుతురే!

. ఈపోలికను భగవంతుడు బుద్ధియొక్క స్వభావ సమర్థతల ననుసరించి ప్రత్యక్షమగుచుండును.

832. నరుడు పరమాత్మను సమీపించినకొలదిని, ఎక్కువ ఎక్కువగా తన అనంతస్వభావ విభూతులను భగవంతుడు నవ్యతర ప్రత్యక్షము గావించుచుండును. తుదిని నరుడు జ్ఞాన పరిపాకమును బడసి పరమాత్మ యందైక్యము గాంచును.

833. దేవకీదేవికి చెఱలో శ్రీకృష్ణ దివ్యదర్శనప్రాప్తి లభించినను, అంతమాత్రాన ఆమెకు బంధనము విడిపోలేదు.

834. ఒక గుడ్డివాడు గంగా పవిత్రజలములందు స్నానము చేయుటచేత, వానిపాపములన్నియు నశించిపోయెను; కాని గ్రుడ్డితనము విడిచిపోదయ్యెను.

835. భక్తునకు శారీరకముగా ఎటువంటిసుఖములు దుఃఖములు కలిగినను శ్రద్ధాభక్తి జ్ఞానముల మహోత్పలములు వానికి చెందకుండవు. ఆ విభవములు తుంటువడవు. చూచితిరా, పాండవులకు ఎటువంటి ఘోరతరాపదలు వాటిలినవో! అయినను వారి సుజ్ఞానతేజము భంగపడలేదు.

836. "రోగము దానిపనిని అది చేయుగాక; శరీరము బాధపడుగాక. మనసా! నీవు నిత్యానందముతోడ నుండుము!"

837. భర్తతోడి కాపురము చేయుచును బ్రహ్మచర్యము నాచరించు స్త్రీ, సాక్షాత్తు జగజ్జనని స్వరూపమే!

838. నేను సర్వమును అంగీకరించెదను. జాగరము, స్వప్నము, సుషుప్తి, తురీయము, బ్రహ్మము, జీవుడు, ప్రకృతి అన్నియు అల పరమాత్మయొక్క వ్యక్తరూపములే. లేకున్నచో పరిపూర్ణత్వమునకు లోటువచ్చును. అందువలన నాకు ఖండాఖండ రూపములు రెండును సమ్మతములే.

839. ఒకానొక భక్తుడగు కట్టెలకొట్టువానికి దివ్యమాత ప్రసన్నమై కృపజూపినది; కాని కట్టెలు కొట్టువృత్తి మాత్రము వానికి తప్పలేదు. వెనుకటివలెనే కట్టెలకొట్టి అమ్ముచూ, స్వల్పజీవనము చేయుచుండెను.

840. మేడకట్టుచుండు కాలమున, పరంజా చాలఅవసరమే. కాని కట్టుడపుపని ముగిసినయనంతరము పరంజా ఎవరికినిఅవసరముండదు. అటులనే విగ్రహారాధనము ప్రారంభమున అవసరమే గాని పిమ్మట నవసరముండదు.

841. కోపము తమోగుణలక్షణము. కోపమువచ్చినప్పుడు మానవుడు వివేకమును పూర్తిగ పోగొట్టుకొనును. హనుమంతుడు లంకను నిప్పంటించి దహించెను కాని ఆసమయమున సీతాదేవియున్న గదికూడ తగులపడునేమోయని ఊహించుపాటి వివేకమువానికి లేకపోయెను.

842. భగవంతుని శరణుజొచ్చినవానినడకలో తడబాటుండదు.

843. సూక్ష్మధర్మముల భావమును నిజముగా గ్రహింపజాలువారు అరుదుగానుందురు. లోకులచేత దుర్మార్గులుగా చూడబడువారియందు సయితము యోగ్యులుండుట సంభవించును.

844. లౌకికులు భగవంతుని ఎట్లు తలపోయుదురో తెలియునా? తమలోతాము ఆటలాడుకొను సమయమున చిన్నపిల్లలు ప్రలాపించి నట్లుండును. ఒక్కొకప్పుడు వారు "దేవుని తోడు నామాటనిజము" అందురు. పెద్దవాండ్రు ఒట్లు పెట్టుకొనుచుండగావిని వీరును నేర్చియుందురు. లేదా బడాయికోరొకడు పూలతోటలో విలాసముగ తిరుగాడుచు పూవునొకదానిని పెఱికి "ఆహా! భగవంతుడీ పుష్పమును ఎంత మనోహరముగ చేసినాడు!" అని బుద్ధి నెక్కడనో పెట్టుకొని

అశ్రద్ధగా పలికినట్లుండును. ఎఱ్ఱగ కాలియున్న ఇనుపకమ్మి మీాద గోరునీరు చిలుకరించినటుల క్షణకాలపు పలుకువిని! భగవంతుని గూర్చి తీవ్రపిపాస యుండవలెను సుడీ! ఆమహా సముద్రములో దుమికి మునిగిపోవలసినదే.

845. ఆత్మయొక్క విభూతిని ప్రకటించు గర్వము గర్వము కాదు; ఆత్మకు అవమానముంగూర్చు వినయము వినయ ముకాదు.

846. యాచనచేత నరుడు క్రుంగిపోవును. బలిచక్రవర్తిని యాచించబోయినప్పుడు విష్ణుదేవునంతటివాడు వామనుడు కావలసివచ్చెను. నీవు ఎవరినుండియేని దేనినైనను యాచింపబూనితివా తక్షణము నీకు హీనతవాటిలునని భగవంతు డట్లు నిదర్శనమును చూపినాడు.

847. శివాంశతో పుట్టినవాడు జ్ఞానియగును. ఆతడు నిరంతరము "బ్రహ్మసత్యము, జగన్మిథ్య" అనుభావముతో నుండును. విష్ణ్వాంశతో పుట్టినవానికి భక్తిశ్రద్ధలందేనాడును లోపముండదు. ఎన్నడైన తర్కముగాని, పండితప్రకర్షగాని వానిని ఆవహించి, క్షణకాలము భక్తిశ్రద్ధలు వన్నెతగ్గినను, యాదవకులమును నాశముచేసిన ముసలమువలె తీవ్రరూప మున పునరుద్ధరణమునందును.

848. ఆత్మ నిర్లేపుడని (దేనిని అంటనివాడని) వేదాం తులు చెప్పుదురు. పాపముగాని పుణ్యముగాని, దుఃఖముగాని సుఖముగాని దానిని అంటవు. అయినను దేహభ్రాంతి గల

వారిని ఇవి బాధించును. గోడకు మసి అంటుకొనునుగాని ఆకాశమునకు అంటుకొనజాలదు సుమీ!

849. బాలుని బోలు విశ్వాసమును పూనినగాని నరుడు బ్రహ్మావలోకనము చేయజాలడు. ఎవనినైనను చూపి, వాడు నీ అన్న అని తల్లి చెప్పినయెడల చిన్నబిడ్డడు వానిని తన సోదరుడుగ భావించును. "అటుపోకు, అక్కడ బూచి యున్నది" అని తల్లి చెప్పుచో అక్కడ బూచియేదో యున్నదనియే పసివాడు విశ్వసించును. అట్టి పసివారికున్నట్టి విశ్వాసముగల మనుజులపైని భగవంతునికి కరుణ కలుగును. లోకవ్యవహర్తలవలె గణితములు వేయు బుద్ధులుగలవారికి భగవంతుడు సులభుడుకాడు.

850. అద్వైతజ్ఞానము పరమోత్తమమైనది. అయినను మొదట పూజకుడు పూజ్యుడనుభావము పూని క్రమసాధనను చేయవలెను. (అనగా భగవంతుడు నాపూజల నందుకొనువాడు, నేను పూజలర్పించువాడను అను భావము ప్రారంభమున పూనవలయును). తుదను సులభగా అద్వైతజ్ఞానమును పడయవచ్చును.

851. అర్జునుడు సత్యమగు పేరుకు: దేనిని తన ధర్మమని నమ్మెనో, దేనిని ఆచరించుట యోగ్యమని విశ్వసించునో, దానిని చేసితీరెను.

852. జీవన్ముక్తులనంటుకొని కొంచెము మాయయుండును. పూర్ణ బ్రహ్మజ్ఞానము కలిగినపిమ్మట ఇరువదియొక్కదినములలో శరీరము పడిపోవును.

853. మనస్సునిలుచు ఏడుస్థానముల (చక్రముల లేక పద్మముల) గురించి వేదములు చెప్పుచున్నవి. మనస్సుఐహిక విషయములగూర్చివిచారించునప్పుడుఅది లింగ, గుహ్య, నాభి స్థానములందుండును. ఆస్థితిలో మనస్సునకుఊర్ధ్వదృష్టియుండదు కామినీకాంచనములపై వాంఛలతోనిండియుండును.

నాలుగవస్థానము హృదయము. మనస్సు ఈస్థానము చేరునప్పుడు ఆత్మప్రబోధము ప్రథమమునకలుగును. సాధకునకు ఒకవిధమైన తేజము ఎల్లెడలకాన్పించును. భయాద్భుతములుతోచును. ఈదశయందు మనస్సు ప్రాపంచికవిషయములకై అధోదృష్టిపూనదు.

కంఠము అయిదవస్థానము. మనస్సు ఈస్థానముచేరునప్పుడు అజ్ఞానము లేక అవిద్యఅంతయు నశించును. అప్పుడు భగవంతునిగూర్చి తప్ప యితరవిషయముల ప్రశంసవిన నిష్టముండదు. భగవంతునితప్ప ఇతరవిషయముల ప్రస్తావము వచ్చెనేని సాధకుడాస్థలమును విడిచివెడలిపోవును.

ఆరవస్థానము నొసలు (భ్రూమధ్యము). మనస్సు ఈచక్రము జేరినప్పుడు రేయింబవళ్లు భగవద్విభూతులు గాన్పించుచుండును. అప్పుడును "అహం" నేను జ్ఞప్తికొంత యుండును. ఇచ్చట అసాధారణ దివ్యమహిమను చూచునాతడు ఆనందపరవశుడై దానిం జేరవలయుననిఉత్సాహము పడును; కాని చేరలేడు. అది జ్యోతియొక్క తేజమును బోలియుండును. తాకుటకు వీలగునటుల కాన్పించును, గాని అదము అడ్డమై తాకనీయునట్లుండును.

శిరస్సు ఏడవస్థానము. మనస్సు అక్కడచేరినప్పుడు నరునికి సమాధికలుగును. జ్ఞానియై బ్రహ్మమును గాంచును. ఆదశయందు శరీరము చాలాకాలము నిలువదు. స్మృతియుండదు. ఏమియు తినజాలడు; నోటపాలుపోసినను అది వెలుపలికి జారిపోవును. ఈస్థితిలో నరుడు ఇరువదిఒక్క దినములుండి మరణించును.

854. సమాధిని పొందిన యనంతరము సర్వకర్మలును తొలగిపోవును. బాహ్యపూజలు, జపములు మొదలగు భౌతిక కార్యములు సాగవు.

ప్రారంభమున కర్మాడంబరము విశేషముగ నుండును. ఒకడు భగవత్సాన్నిధ్యమును చేరుకొలదిని ఆడంబరము తగ్గుచు వచ్చును. తుదకు ప్రార్థనలు భగవన్నామస్మరణయు నిలిచిపోవును.

(బ్రహ్మసమాజ ప్రముఖుడగు శివనాథశాస్త్రిగారితో నిట్లనిరి:—) మీరు సభాస్థానమునకు చేరనంతవరకు, మీపేరు ప్రఖ్యాతుల గూర్చియు గుణగణముల గూర్చియు ప్రేక్షకులు చెప్పుకొనుచుందురు. మీరు రాగానే ఆప్రసంగము లన్నియు ఆగిపోగలవు. ప్రతివాడును మిమ్ముకను చూచుటతోడనే ఆనందించును. "అడుగో శివనాథబాబు వచ్చుచున్నాడని మాత్రము పలుకుదురు.— తదితర ముచ్చట లన్నియు కట్టువడును.

855. భగవదనుగ్రహము లేనిది, నీవెంతగా ప్రయత్నము చేసినను నీకు సాక్షాత్కారము దొరకదు. కాని భగవదను

సులభముగ వచ్చునదికాదు. నీహృదయమునుండి పూర్తిగా అహంకారమును తొలగించుకొనవలయును. "నేను కర్తను" అనుపాటి అహంకారమున్నను నీకు బ్రహ్మసాక్షాత్కారము లభించదు. భాండాగారమున (వస్తువులుంచు గదియందు) ఎవరేని ఉన్నయెడల, ఇంటి యజమానుని ఆభాండాగారము నుండి ఏమితెచ్చిపెట్టుమని అడిగినను, "భాండాగారములో ఎవరో ఉన్నట్లున్నారు; చూడుము. అతనిని తెచ్చియిమ్మని అడుగుడు. నేను అక్కడికి పోనగత్యములేదు" అనును. "నేను కర్తను" అని భావించువాని హృదయమునందు భగవంతుడు ప్రత్యక్షముకాడు.

856. భగవంతుడు తన కృపమూలమున ప్రత్యక్షమగును. ఆయన జ్ఞానసూర్యుడు. ఆయనకిరణ మొక్కటిమాత్రమే ఈప్రపంచమును తెలివితో నింపుచున్నది; దాని మూలమున మనము ఒకరినొకరు తెలిసికొనుచున్నాము. ఎన్నిరీతుల జ్ఞానమునో పొందుచున్నాము. ఆయన తన తేజమును, తనముఖము పైకి త్రిప్పుకొనినప్పుడుమాత్రమే మనము ఆయనను దర్శించగలము.

857. రక్షకభటుడు రాత్రివేళ దొంగలాంతరు చేతబట్టుకొని తిరుగుచుండును. అతనిని ఎవరునుచూడలేరు. తనదీపము సాహాయ్యమున అతడు ఎల్లరను చూడగలడు; ఇతరులు కూడ దానిసహాయ్యమున ఒకరినొకరు చూచుకొగల్గుదురు. ఎవరైనను ఆభటునిచూడవలయునన్న వానితో "అయ్యా! దయచేసి నీలాంతరును నీముఖమువైపునకు త్రిప్పుకొనుము.

నేను నిన్ను చూడగోరుచున్నాను." అని బ్రతిమాలవలసి వచ్చును. ఇదేరీతిని నీవు భగవంతుని ప్రార్థించవలయును. "ఓదేవా! నీజ్ఞానజ్యోతిని నీపైకి త్రిప్పుకొనుము. నేను నిన్ను చూడ వాంఛించుచున్నాను." అని మనవిచేయవలయును.

858. ఇంటిలో దీపములేకపోవుట యింటివారి దారిద్ర్యమునకుగుర్తు. కాబట్టి నరుడు తన హృదయమునందు జ్ఞానదీపమును వెలిగించుకొనవలయును. "ఓమనసా! జ్ఞానదీపమును వెలిగించి" బ్రహ్మమాయిని, "కనుగొనవే!"

859. బూటకము సర్వత్రచెడుగే. అసత్యపువేషముకూడ చెడ్డదే. నీమనస్సు నీవేషమునకు తగినటుల యుండనియెడల నీవుగొప్ప ఆపదలపాలగుదువు. ఈరీతిగనే నరుడు మోసగాడై దొంగపనులు చేయుటకును, అబద్ధములు పలుకుటకును జంకులేనివాడగును.

860. ఒకభక్తునిప్రశ్న:—దివ్యమాతకు "యోగమాయ" అను పేరేల వచ్చినది?

శ్రీపరమహంసులవారి ఉత్తరువు:— యోగమాయ అనగా ప్రకృతిపురుషుల సంయోగము. నీవుచూచునదెల్ల వాని రెంటిసంయోగము తప్ప యితరమేమియుకాదు. శివకాళీవిగ్రహమును చూడలేదా? కాళి శివునిపై నిలిచియుండును. శివుడు శవమువలె పడియుండును; కాళి శివునిపై నిశ్చలముగ దృష్టినిలిపి వానిపైని నిలిచియుండును. ప్రకృతిపురుషుల సంయోగమే దీనికంతకును అర్థము. పురుషుడు అకర్త; కావున శివుడు శవమువలె కదలక పడియుండును.

కాని వానితోడి సంయోగమహిమచేతనే ప్రకృతి సృష్టి, స్థితి లయములను చేయుచున్నది. రాధాకృష్ణవిగ్రహముయొక్క అర్థమును ఇదియే.

861. తల్లి తండ్రి, సోదరి సోదరుడు, భార్యాభర్త, బిడ్డలు, చుట్టాలు అను బంధుప్రేమయే "మాయ". సర్వ జీవుల యెడలను సమమై ప్రవహించు అనురాగమును "దయ" అందురు.

862. సత్యమందు తీవ్రభక్తికలవానికి భగవంతుడు ప్రత్యక్షమగును. ఇందుకు వ్యతిరేకముగా సత్యమునందు గౌరవములేక వర్తించునెడల వాని సర్వమును ఒక్కొకటే నాశమగును. సాక్షాత్కారదశను పొందినపిమ్మట నేను చేతులందు పూలు పట్టుకొని "ఓతల్లీ! ఈ నీప్రకృతిజ్ఞానమును నీఅజ్ఞానమును, నీపుణ్యమును నీపాపమును, నీశుభమును నీఅశుభమును, నీధర్మమును నీఅధర్మమును, అన్నిటిని నీవే తీసికొనుము. దివ్యమాతా! వినిర్మలభక్తినిమాత్రము నాకొసగుము" అనిప్రార్థించితిని. అయినను నేనిట్లు ఆతల్లితో పలికినప్పుడు "నీసత్తును నీఅసత్తును తీసికొనుము" అనజాలనైతిని. ఆజగన్మాతకు నేను అన్నిటిని తిరిగి ఒసగితిని, కాని "సత్యము"ను విడువజాలనైతిని.

863. బ్రహ్మసాక్షాత్కారమునకు చిహ్నములలో నొకటిగ "మహావాయువు" అను మహచ్ఛక్తి ప్రబోధముగాంచి చంగున శిరస్సునకెగురును. అప్పుడు సమాధిలో పడుదుము. అంతట పరోక్షానుభూతి కల్గును.

864. ప్రశ్న—భగవంతుడే ఈజీవులుగా ఉన్నయెడల ఇక పాపములేదు; పుణ్యమును లేదుగదా ?

ఉ—అవును; ఉన్నది, మఱియు లేదుకూడను. ఆయన మనలోని అహంకారమును నిలిపినప్పుడు, ద్వైతభావమును, పుణ్యాపాపముల విచక్షతయు నిలుపును. ఒక్కొక్కప్పుడు కొందఱిలోని అహంకారమును బొత్తుగతొలగించును; అట్టివారు పుణ్యాపాపములకు అతీతులు. నరుడు బ్రహ్మసాక్షాత్కారమును పడయునంతవఱకు ద్వైతదృష్టియు శుభాశుభభేదములును ఉండితీరును. ధర్మాధర్మములు రెండును నీకు సమములే యనియు భగవంతుడేమిచేయించిన దానినే చేయువాడననియు నీవు నోటిమాటలతో అనవచ్చును. కాని నీ హృదయములో అవన్నియు వట్టిపలుకులే యని తెలియుచుందువు. నీవేదేని చెడుపనిచేయగానె నీ అంతరాత్మ బాధించుచునే యుండును.

865. నీవు ప్రజలతో కలిసి యుండబోవునప్పుడు వారందఱి యెడలను నీకు ప్రేమ యుండవలయును. వారితో స్వేచ్ఛగా కలిసి యేకమైపొమ్ము. "ఓ! వారు సాకారమును నమ్మెదురు; నిరాకారమును నమ్మరు అనియో, వారు నిరాకారమును నమ్మెదరు సాకారమునందు విశ్వాసముచూపరు అనియో, అతడు హిందువు, ఇతడు క్రైస్తవుడు, వేఱొకడు మహమ్మదీయుడు అనియో పలుకుచు, మూతి విఱిచి వారిని ద్వేషించబోకుము. భగవంతుడు తననుగూర్చి ఎంతవఱకు తెలిసికొను అవకాశమునిచ్చునో అంతవఱకే నరుడు ఆయనను తెలిసికొనగలడు.

మఱియు మానవులు వేర్వేఱు స్వభావములుగలవారై యుండుట నెఱిగి, వారితో నీవు సాధ్యమగునంతవఱకే కలియ వలయును. నీవు మాత్రము అందఱిని ప్రేమించవలసినదే.

అంతట నీయింటికి (నీఅంతరాత్మలోనికి) మరలిపోయి శాంత్యానందముల ననుభవించుము. అక్కడ నీవు నీసత్యాత్మను కనుగొనగలవు.

866. అపరోక్షానుభూతిని పడయుటకు గట్టిప్రయత్నము అవసరము. ఒకనాడు నేను భావసమాధిలోనుండగా నాకు హాలధరసరస్సు కాన్పించినది. (ఇదిశ్రీరామకృష్ణపరమహంసులవారి జన్మగ్రామమగు కర్మకారపురమున వారిపూర్వీకులు వసించినయింటియెదుట నున్నది.) ఒక మోటుమానిసి నాచు ముక్కలను తీసివేసి నీటిని ముంచుకొనుచున్నటులను అప్పుడప్పుడు దానిని చేతిలోనికిదీసికొని పరీక్షించుచున్నటులను కన్పించినది. నాచును తొలగించనిది నీరుకనబడదు—కష్టపడి సాధనచేయనిది భక్తి అలవడదు, బ్రహ్మసాక్షాత్కారము లభించదు— అనినాకు నేర్పుటకో యనునటుల నాకాదృశ్యము చూపబడినది. ధ్యానముసలుపుట, భగవన్నామస్మరణ చేయుచు తులసీమాలత్రిప్పుట, హరిమహిమలపాడుట, ప్రార్థనలుచేయుట, దానములొసగుట, యజ్ఞములుచేయుట మొదలగు సత్కార్యములు భగవంతుని ప్రసన్నునిచేయును.

867. "ఈయీకర్మలుచేయవలయుననిశాస్త్రములువిధించుచున్నవి. కావున నేను చేయుచున్నాను"—అనునట్టిభావము "వైధీభక్తి" అనిపించుకొనును. "రాగభక్తి" అను నింకొక

విధభక్తికలదు. భగవంతునియెడగాఢప్రేమయున్నవారికి కలుగును. ప్రహ్లాదుని భక్తి అటువంటిది. "రాగభక్తి" అలవడిన పిమ్మట "వైధీకర్మ" అనగా శాస్త్రనియమిత కర్మలుచేయ నవసరములేదు.

868. నరునికి సత్యజ్ఞానప్రాప్తియైన పిమ్మట వానికి భగవంతుడు ఏదోదూరపువస్తువుగ గోచరించడు. అప్పుడు "ఆయన" గా కాక "ఈయన" గా ఇచ్చట మనహృదయములోపల ఉన్నవాడుగ భగవంతుడు దాపైతోచును. ఆయన అందరిలోనున్నాడు. ఆయనను వెదకువారికెల్ల అక్కడ దర్శనమిచ్చును.

869. ప్ర:— గృహస్థజీవనముగడుపుచుండగను జ్ఞానప్రాప్తియైనయెడల, ఎటులగ్రహించవచ్చును?

ఉ:— హరినామము చెవినిబడగనే వెల్లివిరియు బాష్పములును గగుర్పాటును చిహ్నములు. స్వామిపేరు వినినంతనే కండ్లనుండి నీరుప్రవహించెనా, రోమము నిక్కబొడుచుకొనెనా, అట్టివాడు నిజముగా జ్ఞానియైనట్లే!

870. భగవంతునియెడ విశ్వాసములేని కారణముననే నరుడు దుఃఖముల ననుభవించును.

871. వేదాంతమునకు శంకరాచార్యులవారు చేసిన అర్థము సత్యమైనదే. దానింగూర్చి రామానుజాచార్యులవారు చెప్పినదియు—వారివిశిష్టాద్వైతమును—సత్యమే!

872. నరునందలి అంతరాత్మప్రబోధము గాంచినగాని వానికి బ్రహ్మసాక్షాత్కారము కాదు.

873. తర్కము ద్వారమునగలుగు జ్ఞానము ఒకరకము; ధ్యానమువలనగలుగు జ్ఞానము వేఱొకరకము; మఱియు భగవత్ప్రసన్నముచేగలుగు జ్ఞానము మఱొకరకము అని నేను గ్రహించినాను.

874. మనుజునందు శుద్ధసత్వము ప్రధానముగ నున్నప్పుడు అతడు కేవలము భగవధ్యానమున కాలము గడుపును; ఏయితర వ్యాపారమునందును వానికి హితవుండదు. ప్రారబ్ధవశమున కొందఱు పుట్టి శుద్ధసత్వగుణముగలవారై పుట్టుదురు. కాని నిష్కామకర్మలను పూనికతో చేయుచుండిన యెడలను శుద్ధసత్వగుణము అలవడగలదు. రజోగుణముతో మిశ్రమైన సత్వగుణముగలవాని మనస్సు నెమ్మదిగా వేర్వేఱుదిశలకు లాగబడును; "నేను ప్రపంచమునకు మేలుకూర్తును" అను అహంభావమును తెచ్చిపెట్టును. సామాన్యజీవులు లోకోపకారమునకు పూనుట చాల అపాయకరము. కాని కేవలము ఇతరుల క్షేమమునిమిత్తము, అపేక్ష యేమియులేకుండ పనిచేయునెడల అపాయముండదు. "నిష్కామకర్మ" అనగా నిటువంటిదే. అటువంటి కార్యములను చేయుట వాంఛనీయమే. కాని అందఱును చేయలేరు! చాలకష్టము!

875. అందఱును కర్మచేయువలసియే యుండును—కొలదిమంది మాత్రమే కర్మత్యాగము చేయనగును. అందుకు తగిన శుద్ధసత్వగుణము లదిమందియందే యుండును. స్వలాభాపేక్షలేకుండ కర్మ చేయుగా చేయుగా, రజస్సుతో

కలిసిన సత్త్వగుణము, ఆరజోగుణాంశమునుండి విడివడి శుద్ధ సత్త్వముగా తుదిని మారును. ఇటుల శుద్ధసత్త్వగుణమును పడయుటచేత నరుడు బ్రహ్మసాక్షాత్కారమును పొంద గల్గును. సామాన్యజనులకు శుద్ధసత్త్వమయదశ అనగా అర్థముకాదు.

876. పంచభూతములతో ఏర్పడిన ఈశరీరమును "స్థూల శరీరము" అందురు. సూక్ష్మశరీరము మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారములతో కూడి ఏర్పడును. బ్రహ్మ దర్శనానందమును గ్రహించి బ్రహ్మైక్యానందమునందే నిలుచుట కనువగు శరీరము కారణశరీరము. తంత్రశాస్త్రమున దీనిని "భగవతీతనువం"దురు. ఈ అన్నింటికిని అతీతముగా నుండునది "మహాకారణము"—అది మూలకారణము.

877. భగవత్సాక్షాత్కారము కానిది "ప్రేమ' లభించదు.

878. బ్రహ్మసాక్షాత్కారమయిన చిహ్నములు కలవు. భక్త్యావేశము మీకెవరియందు కాన్పించునో వారు బ్రహ్మ పరోక్షానుభూతిని బడయుటలో ఆలస్యముండదని గ్రహించుడు.

879. భక్త్యావేశము వివేకరూపమునను, వైరాగ్యరూపమునను, సర్వభూతదయ, సాధుజనసేవ, భాగవతసంగము, హరినామకీర్తనము, సత్యసంధత, మొదలగు సద్గుణపుంజ రూపమునను ప్రకాశించును.

880. ప్రశ్న—భగవాన్, సదసద్విచారముచేత, మనస్సునందు ఇంద్రియ సంయమనమును సాధించుట అవసరమగునా?

ఉ:—మంచిది, అది యింకొక మార్గమే — సదసద్విచారపంథా! భక్తిమార్గమున యింద్రియనిగ్రహము తానంతనదియే వచ్చును. అతిసులభముగ వచ్చును. భగవంతునియెడ అనురక్తి హెచ్చినకొలదిని ఇంద్రియభోగములందు అరుచియేర్పడును. బిడ్డవచ్చినదినమున తలిదండ్రులు భోగముల చింతపెట్టుకొనరుగదా!

881. భగవద్భక్తిని ఒకకవి పెద్దపులికి పోల్చినాడు. పెద్దపులి మృగములను దిగమ్రింగులాగున భక్తి నరునిశత్రువర్గమగు కామక్రోధాది వ్యసనములను మ్రింగివేయును. ఒక్కసారి భగవద్భక్తి పూర్ణప్రబోధమునుపొందెనా, కామము క్రోధము మున్నగు దుర్వ్యసనములన్నియు నిర్మూలములగును. శ్రీకృష్ణ భక్తిమూలమున బృందావనగోపికలకు అటువంటిదశ ప్రాప్తించినది.

882. భక్తిని అంజనమునకును పోల్తురు. రాధ ఒకతడవ "ఓహో సఖులారా! నాకు సర్వత్ర శ్రీకృష్ణుడే కాన్పించుచున్నాడు!" అనగా తక్కినగోపికలు "నీకండ్లకు ప్రేమాంజనమును పెట్టుకొన్నావు; అందుమూలమున నీకట్లుకాన్పించుచుండును!" అనిరి.

883. సిద్ధులలో రెండురీతులవారు కలరు: సాధనసిద్ధులు, కృపాసిద్ధులు. మంచిపంటపండించుకొనుటకై కొందఱు అతి

కష్టములతో కాలువను త్రవ్వి తమ పొలములకు నీరుపెట్టుకొనవలసియుండును. నీటికొఱకై కొందఱెట్టి శ్రమనేమియు పొందనవసరములేకపోవును. వానలువచ్చి పొలములనిండ నీరునింపును. అందఱును శ్రమలుపడి సాధనలుచేసి మాయ తగిలించు సంకెళులను తప్పించుకొనవలసి యుండును. కాని కృపాసిద్ధులకీశ్రమలన్నియు నుండవు. (వారికి భగవత్కృప వలననే సిద్ధత్వము చేకూరును.) వీరి సంఖ్య అత్యల్పము !

884. గోపికలభక్తి "ప్రేమభక్తి!" ఈభక్తిని "కేవల భక్తి" అనియు "తీవ్రభక్తి" అనియుకూడ పిలుతురు. "మిశ్ర భక్తి" అన నేమొ తెలియునా? భక్తితో జ్ఞానముకలిసిన యెడల దానిని మిశ్రభక్తిఅందురు. "శ్రీకృష్ణుడు సర్వమయుడు. అతడే పరబ్రహ్మము. అతడే రాముడు. అతడే శివుడు. అతడే మహాశక్తి!" అను భావనను పోలియుండును. కాని అటువంటి జ్ఞానమేమియు ప్రేమభక్తిలో మిశ్రమై యుండదు. హనుమంతుడు ద్వారకకువచ్చి తాను సీతారాములను మాత్రమే చూడనిచ్ఛగింతుననెను. అందువలన శ్రీకృష్ణస్వామి రుక్మిణిని సీతరూపు ధరించుమనినాడు. లేకున్న హనుమానుని సమాధానపఱచు మార్గము లేదు. పాండవులు రాజసూయయాగమునుసలిపినప్పుడు, యుధిష్ఠిరుడు సింహాపీఠమున కూర్చుండ రాజులందఱును వానికి నమస్కరించిరి. ఆసమయమున విభీషణుడు తాను శ్రీకృష్ణునకుతప్ప మరెవరికిని నమస్కరించనని పట్టుపట్టెను. అప్పుడు శ్రీకృష్ణుడే యుధిష్ఠిరునికి నమస్కారము చేసెను; ఆపిమ్మట విభీషణు

మును నేలపై సాగిలపడి తనకిరీటము నేలమోపి యుధిష్ఠిరునకు మ్రొక్కినాడు.

885. ప్రేమభక్తిలో రెండు ముఖ్యాంశములున్నవి— "నేను" "నాది" అనుభావములు ("నేను" భక్తుడను; భగవంతుడు "నావాడు" అనుభావములు)

యశోద తానుతప్ప మరెవరును తన గోపాలుని శ్రద్ధగాచూడరని భావించేది; తాను పోషణ చేయనియెడల గోపాలుడు చిక్కిపోవును అనుకొనెడిది. తనకృష్ణుని భగవద్భావముతో చూచుట ఆమెకు హితవుకాదయ్యెను. భక్తుని "మమకారము" (నాదనుభావము) "భగవంతుడు నావాడు, నాస్వంతము—నా గోపాలుడు !" అనుభావమును కల్పించును. ఉద్ధవుడు యశోదను చూచి, "తల్లీ ! నా కృష్ణుడు శ్రీహరిస్వామియే. ఆతడు విశ్వమునకు చింతామణి! అతడు మనుజమాత్రుడుకాడు." అనిపలికెను. ఆపలుకలువినిన యశోద "కాదు, కాదు" అటులకాదు. నేను చింతామణినిగూర్చి అడుగుటలేదు. 'నా' గోపాలుడెటులున్నాడో చెప్పుము. చింతామణి పోనీ! నాగోపాలుడు!" అనెను.

886. గోపికల నిష్ఠ అద్భుతమైనది. కృష్ణుడు మధురలో నుండగా, ద్వారపాలకులను బ్రతిమాలుకొని, సభామందిరము చేరిరి. అచ్చట శ్రీకృష్ణుడు రాజవేషముతో కిరీటమునుధరించి యుండగాకాంచి, నేలచూపులుచూచుచు, "ఈకిరీటధారి యెవడు? మనము వీనితోమాటాడ తగదు. అటులచేయుట

మనకృష్ణునియెడ అపచారముచేసినట్లగును. అయ్యో! మన స్వామిఎక్కడ? పీతాంబరముకట్టి, నెమలిపింఛమునుధరించు మనపరమప్రియుడేడీ?" అని తమలో తాము గొణుగసాగిరి. ఆహా! ఈగోపికల అనన్యభక్తి ఎట్టిదో.

887. ఎటువంటివానికి విశ్వాసముకుదురునో ఎటువంటి వానికికుదరదో సూచించు శరీరచిహ్నములున్నవి. ఎముకలు కనబడునటుల బక్కచిక్కి, గుంటలుపడిన కండ్లతో, మెల్ల చూపులుగల మనుజులవంటివారికి సులభముగ విశ్వాసము కుదురదు.

888. లౌకికవ్యవహారములు చక్కబెట్టునప్పుడు మనో శక్తి చాలవ్యర్థమైపోవును. సన్యాసమును స్వీకరించినగాని ఆనష్టమును పూరించ శక్యముకాదు.

889. తండ్రినుండి ప్రథమ జననము కలుగును. రెండవ జననము ఉపనయనకాలమున ప్రారంభమగును. సన్న్యాసము మూడవజననము.

890. జ్ఞాని "శివోహం; నేనుపరమాత్మను" అనును. కాని భక్తుడు "ఓహో! ఈసర్వమును ఆయన విభూతియే సుడీ!" అనును.

891. నీసాధనామార్గమేదైనను సరియే, మనస్సుసంపూర్ణ ముగ నిశ్చలతను పొందినగాని యోగము లభ్యముకాదు; ఇది మహారహస్యము. మనస్సు సదా యోగికి వశమైయుండు; యోగి మనస్సునకు వశుడుకాడు.

892. మనస్సు రెపరెప కొట్టుకొనుట పూర్తిగమాని నప్పుడు శ్వాసనిలిచిపోయి కుంభకముఘటిల్లును. కుంభకము భక్తియోగముద్వారమునను ఘటిల్లును. తీవ్రభక్తిచేతను శ్వాసనిలిచిపోవును.

893. నరేంద్రుని ప్రశ్న:—"తంత్రశాస్త్రమున బోధింపబడు నటుల స్త్రీలమధ్యనుండిసాగింపబడు ఆత్మసాధనా పద్ధతిని గురించి మీ అభిప్రాయమును సెలవిండు."

శ్రీపరమహంసులవారి ఉత్తరువు:—"వద్దు, అవి నిరపాయమైనమార్గములుకావు; చాల దుర్లభమైనవి; అవాంతరములు కల్పించునవి. తంత్రశాస్త్రానుసారము మూడువిధములగు సాధనలుకలవు. వీరుని సాధన, సఖీసాధన, పుత్రభావసాధన. నాది పుత్రభావన. భగవంతునికి మాతృరూపము నారోపించునది. జగజ్జనని ప్రియసఖురాలుగ భావించుకొను సాధనయు మంచిదే. కాని 'వీరుని సాధన (వీరాచారము) అపాయములతోగూడినది. తనను దివ్యమాత పుత్రునిగా భావనచేసికొనుసాధన చాలనిర్మలమైనది."

894. ఒకభక్తుని ప్రశ్న:— (ఆధ్యాత్మసాధనలకు పూను భర్తనుగురించి) నీవు నన్ను ఉచితవిధిని చూడకున్నచో నేను ఆత్మహత్యచేసికొందును అని భార్యబెదరించిన యెడల అతడేమిచేయవలసియుండును?

శ్రీ పరమహంసులవారు:— "అటువంటిభార్యను విడిచివేయవలయును. భగవత్సాక్షాత్కారమునకు అడ్డుపడు పెండ్లమును విడువవలసినదే; ఆమె ఆత్మహత్యచేసికొననీ లేక

ఏమైనకానీ. భగవంతుని చేరకుండ అడ్డుపడుభార్య అవిద్యారూపిణి! కాని రాజు దుష్టుడు, భార్యమొదలగువారందఱును భగవంతునియెడ నిర్మలభక్తికలవానికి వశులగుదురు. ఒకనికి సత్యమగు భక్తియున్నయెడల భార్యయు క్రమక్రమముగా దైవమార్గమున తిరుగగలదు. అతడు యోగ్యుడగునేని, భగవత్కృపవలన, భార్యయు యోగ్యురాలగును.

895. బ్రహ్మసాక్షాత్కారము పొందినపిమ్మట భగవంతుడు సర్వత్ర సర్వమునందును ప్రత్యక్షముగ నుండును. కాని భగవత్ప్రసన్నత నరునందు శ్రేష్ఠముగ నుండును; మఱియు సత్వగుణప్రధానులగు భక్తులందు అత్యంత శ్రేష్ఠముగ నుండును. కామినీకాంచనములయెడ వ్యసనము ఉత్తమ భక్తులకుండదు.

896. భక్తునిప్రశ్న:— "స్వామీ! నాకొక సందేహమున్నది. మనకు స్వేచ్ఛకలదందురు; అనగా ధర్మముగాని అధర్మముగాని మన యిష్టమువచ్చినటుల చేయగలమందురు. అది సత్యమా? మనయిచ్ఛకు స్వాతంత్ర్యము కలదా?"

శ్రీపరమహంసులవారు:— "సర్వమును భగవంతుని సంకల్పము ననుసరించి నడుచును! ఇదంతయు వానిలీల! ఆతడు మనచేత అనేకవిధముల అనేకకార్యములను- మంచివి చెడ్డవి, కొద్దివి గొప్పవి, క్షుద్రమైనవిఘనమైనవి—చేయించుచుండును. యోగ్యులు అయోగ్యులు ఎల్లరు వాని మాయయే— వాని లీల. ఉదాహరణకు చూడుడు: తోట

లోని చెట్లన్నియు ఎత్తులోను, యోగ్యతలోను, సౌందర్యము లోను సమానములు కావు.

,,బ్రహ్మసాక్షాత్కారము కానంతవఱకును నరుడు తాను స్వతంత్రుడ ననుకొనుచుండును. కాని భగవంతుడే యీభ్రాంతినివానియందు నిలుపువాడు. లేనియెడలపాపకార్య ములసంఖ్య చాలగా హెచ్చిపోవును. ప్రజలు పాపపు పనుల చేయుటకు జంకక, దోషకార్యములకు శిక్ష అనుభవించ వలయునను బాధ్యతలేక విచ్చలవిడి వర్తింతురు."

"సరే! బ్రహ్మసాక్షాత్కారము పడసినవాని భావన యెట్లుండునో తెలియునా? —"నేను యంత్రమను, నీవుయంత్ర చోదకుడవు; నేను గృహమను, నీవు గృహాధిపతివి; నేను రథ మను, నీవు రథికుడవు. నీవు కదలించుతీరున నేను కదులుదును. నీవు పలికించినరీతిని నేను పలుకుదును." ఇట్లుండును!

897. శ్రీచైతన్యస్వామికి మూడురకముల దశలుండెడివి. (1) మనస్సు స్థూలసూక్ష్మశరీరములందు వసించునప్పుడు జాగ్రదవస్థ. (2) మనస్సు కారణశరీరమున ప్రవేశించి "కార ణానందమును" అనుభవించునప్పుడు అర్ధజాగరము. (3)మహా కారణమున పూర్తిగమనస్సు లయమగునప్పుడు అంతర్ము ఖమై యుండు తురీయము.

ఈవర్ణనకును వేదాంతుల పంచకోశములకును పోలిక యున్నది. (1) స్థూలశరీరము—అన్నమయకోశము. ప్రాణ మయకోశమును. (2) సూక్ష్మశరీరము—మనోమయ విజ్ఞాన మయకోశములు. (3) కారణశరీరము—ఆనందమయకోశము.

మహాకారణము ఈపంచకోశములకు అతీతముగ నుండును. మనస్సు మహాకారణమున ప్రవేశించునప్పుడు చైతన్యస్వామికి సమాధిదశ ప్రాప్తించెడిది. దీనిని నిర్వికల్పసమాధి లేక జడ సమాధి అందురు."

898. ప్రారబ్ధ సంస్కారములుండుటవలన నరుడు సంసార త్యాగము చేయవలయునన్నను చేయలేడు. ఒకసారి యోగి యొకడు రాజును తన దాపున కూర్చుండి భగవధ్ధ్యానము చేయుమనెను. అందుకారాజు ,,అయ్యా! అదిపోసగదు. నేను నీసామీప్యమున నుండవచ్చును; అయినను నాకు భోగ మున్నది గదా! నెను ఈఅడవిలోనే ఉండిపోయినయెడల బహుశః ఇచ్చటనే ఒకరాజ్యమేర్పడగలదు. నేను నాభోగ మును అనుభవించక తీరదుగదా!" అనెను.

899. "అనాహత" ధ్వని దానంతటదియే శబ్దించు చుండును. ఇది ,,ఓం" అను ప్రణవనాదము. ఇది పరమాత్మ నుండి కలుగును; యోగులు దీనిని వినగలరు. సామాన్య లౌకి కులు దీనిని వినజాలరు. ఈనాదము ఒకపక్షమున నాభిస్థానము నుండియు, రెండవ పక్షమున పరబ్రహ్మమునుండియు పుట్టు నటుల యోగులకు తెలియవచ్చును.

900. పురాణముల ప్రకారము భక్తుడును భగవంతుడును వేఱు. నేనొక వ్యక్తిని భగవంతుడు వేఱొకవ్యక్తి. ఈశరీరము ఒక ఘటమువంటిది; మనస్సు బుద్ధి అహంకారము ఆకుండ లోని నీటిని బోలునవి. బ్రహ్మము సూర్యుడు. ఆసూర్యుడు

ఈనీటిలో ప్రతిబింబించుచున్నాడు. ఈరీతిగా భక్తులు ఆయా దేవతామూర్తులను చూచుచుందురు.

901. కాని వేదాంతము ప్రకారము బ్రహ్మము మాత్రమే సత్యము - మూలాధార వస్తువు; తదితరమంతయు మాయ_స్వప్నమువలె అసత్యము. బ్రహ్మమను సాగరమున తేలుచు "అహం" అను పుడకయున్నది. ఈపుడకను తీసివేసినయెడల అఖండమై ఒక్కనీరే వ్యాపించియుండును; ఆపుడక ఉన్నంత వఱకును దానిచేత రెండు భాగములుగా విభజింపబడినటుల కాన్పించుచు దానికిరెండువైపులను నీరుండును. బ్రహ్మజ్ఞానము కలుగగానె నరుడు సమాధి అవస్థను చెందును. "అహం" అనునది అదృశ్యమైపోవును. వేదాంత మతానుసారము జాగ్రత్తు సయితము అసత్యమే.

902. తల్లియు తండ్రియు నరునికి ప్రధానులు. వారు సంతుష్టులైనగాని ఏపూజలును ఫలించవు. చైతన్యస్వామి చరిత్రి చూడుడు. భగవద్భక్తి పరవశుడయ్యును, తాను సన్యాసమును స్వీకరించుటకు పూర్వము తల్లిని సమాధాన పఱచవలసినవాడయ్యెను. "తల్లీ! దుఃఖపడకుము; అప్పు డప్పుడువచ్చి నిన్ను దర్శించుచుందును." అని చెప్పినాడు. నరుడు తీర్చవలసిన ఋణములున్నవి:— దేవతల ఋణము; ఋషులఋణము; జనకులఋణము; భార్యఋణము—ఎన్నో యున్నవి. తల్లిదండ్రులఋణమును తీర్చనియెడల ఏకర్మము ఫలప్రదము కాజాలదు. భార్యయెడకూడ ఋణముండును.

903. కొందఱు, కొందఱితో మెలగునప్పుడు మనము జాగ్రత్తతో మెలగవలయును. (1) ధనికులు, వారికి ధనబలము, మనుష్యబలము, మఱియు ఇతరవిధబలము కలదు. వారుతలచుకొనిరేని నీకుఅపకారముచేయగలరు. నీవువారితో జాగరూకుడవై మెలగవలయును — వారుచెప్పుదానికెల్ల తలయూచి సరే అనవలసియుండవచ్చును. (2) కుక్క. అది మొఱగినప్పుడును కఱవవచ్చినప్పుడును, ఆగి ఈలవేసి దానిని శాంతిపఱచవలెను. (3) ఆబోతు. అది నిన్ను పొడవవచ్చినప్పుడు కొన్నిశబ్దములచేసి దానిని శాంతిపఱచవలెను. (4) త్రాగుబోతు. వానిని రెచ్చకొట్టితివా అతడు నానానీచభాషణములతో నిన్ను బూతులుతిట్టును. కాని "మామా! ఓహో! ఎట్లాఉన్నావు?" అనుచు వానిని బుజ్జగించిన యెడల వాడానందించును. నీదగ్గఱచేరి పొగత్రాగుచు స్నేహముచూపును.

904. కొందఱుపామునైజముకలవారుందురు. వారెప్పుడు కాటువేయునది నీకు తెలియదు. వారివిషమునకు విరుగుడుకను కొనుటకు చాల శ్రమపడవలసియుండును. లేదా వారిమీద నీకు ఆగ్రహముపుట్టి నిను క్రోధావేశుని చేయును.

905. ఎవడు ఎటువంటి సహవాసగాండ్రతో తిరుగునో అటువంటిగుణములు వానికి అబ్బును. మఱియు ఎవనికెట్టివంటి గుణములుండునో అటువంటిసహవాసమునే అతడు కోరుకొనును.

906. "స్త్రీలమధ్య వసించుచును, వారిని ఎఱుగనట్టి జనుడు నిజముగ వీరుడు."

907. ఒకపండితుడు:— దివ్యజ్ఞానసమాజము వారు మహాత్ములున్నారందురు. గంధర్వలోకము దేవయానలోకము సూర్యలోకము చంద్రలోకము అనుచు ఏమేమో లోకములున్నవనియు, నరుని లింగశరీరము వీనిలో సంచారము చేయగలదనియు అందురు. ఇట్టివిషయములుఅనేకము వారు చెప్పుదురు. స్వామీ! ఈదివ్యజ్ఞానమునుగూర్చి మీ అభిప్రాయ మేమి?

శ్రీపరమహంసులవారు:-భక్తియొక్కటి శ్రేష్ఠమైనది-భగవంతునియెడ అనురాగము. వారు భక్తిని ఆదరింతురా? ఆదరింతురేని మంచిదే. బ్రహ్మసాక్షాత్కారము తమ పరమార్థముగ పెట్టుకొనిరా మంచిదే. కాని సూర్యలోకము, చంద్రలోకము, గంధర్వలోకము అను నిట్టి అల్పవిషయములందు మునిగియుండుట సత్యమగు బ్రహ్మసాధన కాదని మాత్రము జ్ఞప్తినుంచుకొనుడు. భగవత్పాదారవిందముల యెడ భక్తికొఱకై తీవ్రసాధనలు చేయువలయును; హృదయము ఆవేదనపడునట్లు గావించవలయును! ఆయావిషయములందు పర్విడు మనస్సును మరల్చి భగవంతునిమీదికే త్రిప్పవలయును. భగవంతుడు వేదములలో లేడు, వేదాంతమునందు లేడు, ఏశాస్త్రమునందును కానరాడు! నరుని హృదయము వానికొఱకై మహాపరితాపమును పొందినగాని ఏమియు ఫలము రాబోదు. సాంద్రభక్తితో దైవప్రార్థనలు చేయుచు, పారమార్థిక సాధనలను చేయువలయును. భగవంతుడు సులభముగా చిక్కువాడుకాడు. సాధనఅత్యవసరము.

908. "నేతి, నేతి!" అనుచు విశ్వమును దాటిపోయి, ఆత్మపరోక్షానుభూతిని పొందుటే జ్ఞానము. విచారము చేయుచు పోయి దృశ్యజగమును బుద్ధినుండి తొలగించుటచేత సమాధి లభించును; పిమ్మట ఆత్మ సాక్షాత్కారము కలుగును.

"విజ్ఞానము" అనగా హెచ్చువివేకముతోడను పూర్ణత తోడను ఎఱుగుట అని అర్థము. కొందఱు పాలనుగూర్చి వినియుందురు; కొందఱు పాలను చూచియుందురు. మఱి కొందఱు పాలను రుచిచూచియుందురు. దానిని చూచినవాడు జ్ఞాని. దానిని రుచిచూచినయతడు విజ్ఞాని అనబడును; అతడే దానిని పూర్ణముగ నెఱింగినవాడు. భగవంతునిచూచి, కేవలము మన బంధువువలె వానితోడ సంసర్గము కలిగి యుండుటకు విజ్ఞానమని పేరు.

909. మొదట "నేతి, నేతి" (ఇదికాదు, ఇదికాదు) అను మార్గమున అవలంబించవలయును. ఈపంచభూతాత్మక శరీరము బ్రహ్మముకాదు. ఇంద్రియములు, మనస్సు, బుద్ధియు బ్రహ్మముకాదు; అహంకారమును బ్రహ్మముకాదు. బ్రహ్మము సకలతత్వములకును అతీతము. నీవు మేడచేరుటకు ఒక టొకటిగా మెట్లనన్నిటిని విడిచివేయవలయును. మెట్లెన్నటికిని మేడకాజాలవు. కాని నీవు మేడచేరినపిమ్మట, ఏుటుకలు, సున్నము సిమెంటు ఇసుక మున్నగు పదార్థములతో మేడ ఏర్పడినదో, ఆపదార్థములతోడనే మెట్లును నిర్మాణమైయున్న వని గ్రహింతువు. బ్రహ్మముగా తెలియబడునదే జీవజగత్తులు నైనది— ఈ యిరువదినాలుగు తత్వముల రూపమును తాల్చి

నది అదియే. ఆత్మ అనబడునదియే పంచభూతములుగ మారినది. ఈభూమి ఆత్మయైనచో, ఇంత గట్టిగానుండు టేల నని నీవు ప్రశ్నించబోదువు. కాని భగవంతుని యిచ్ఛకు ప్రతిదియు సాధ్యమే. రక్తము వీర్యము కూడి మాంసము శల్యమును ఏర్పడుటలేదా? సముద్రపు నురుగు ఎంత గట్టి పడుటలేదు!

910. భగవత్సాక్షాత్కారము లభించినపిమ్మట జగత్తు మిథ్యగా కాన్పించదు. బ్రహ్మమును చేరినయతడు, ఆబ్రహ్మమే ఈసర్వమును—జీవులును జగత్తును — అయ్యెనని తెలిసి కొనును. అటువంటివాడు తనబిడ్డలకు అన్నము పెట్టునప్పుడు, శ్రీగోపాలకృష్ణునికే అన్నము పెట్టుచున్నటుల భావించును; తన తల్లిదండ్రులను పార్వతీపరమేశ్వరులనుగ నెంచి వారికి సేవలొనర్చును. బ్రహ్మసాక్షాత్కారమును పొందిన యనంతరము ఎవడేని గృహస్థుడుగనుండి సంసారము చేసినను, భార్యతో సంభోగించబోడు. భార్యాభర్తలిరువురును భక్తులై జపతపములతో కాలముగడుపుదురు. సర్వభూతములందును బ్రహ్మమేయుండుట నెఱిగి వారు సకలప్రాణులను సేవింతురు; అన్నిటియందును పరమాత్మనే పూజింతురు.

911. ఒక శిష్యుడు:— "నిజముగా సాధువైనవానిని గుర్తించుట ఎట్లు?

శ్రీపరమహంసులవారు:—"ఎవనిహృదయమును ఆత్మయు పూర్ణముగ భగవదర్పితములైయుండునో అతడు నిజముగుసాధువు. కామినీకాంచనములను త్యాగముచేసినవాడు

నిజమగుసాధువు. నిజముగాసాధువైనవాడు స్త్రీని మోహముతో చూడడు. ఆతడు స్త్రీ యనిన దూరముగానుండును; సమీపమునకు రాతటస్థించిన యెడల అమెను తనతల్లిగాభావించి గౌరవముచేయును. నిజమగుసాధువు నిరంతరము దైవధ్యానము చేయుచుండును; సర్వమునందు బ్రహ్మముకలడను భావనతో సకలభూతములను సేవించును. సాధువులందివి సామాన్యలక్షణములు."

912. శరీరము నిర్మాణమైనది; వినాశమును పొందును కాని ఆత్మకు మరణములేదు! పోకకాయ పోలిక:— పోక కాయ పక్వమైనప్పుడు లోపలి గింజ పైడొల్లనుండి విడిపోవును. కాని పచ్చిగానున్నప్పుడు ఆవిత్తును పచ్చని బెరడును విడదీయుట దుర్లభము. బ్రహ్మమును చేరినప్పుడు అనగా బ్రహ్మసాక్షాత్కారమును పొందినప్పుడు— ఆత్మ శరీరమును నుండి భిన్నమను జ్ఞానము కలుగును.

913. ధ్యానమునందు ఏకాగ్రచిత్తత కలిగి పిమ్మటఏమియు కనబడక, వినబడకయుండును. దృష్టియు స్పర్శజ్ఞానమునువిడిచి పోవును, శరీరముమీదుగా పాము ప్రాకిపోయినను తెలియరాదు! ఆవిషయము ధ్యానముచేయువానికి తెలియదు; పామునకును తెలియదు!

914. తీక్షణ ధ్యానమునందు ఇంద్రియ ధర్మములన్నియు ముకుళితములై పోవును. మనస్సుయొక్క బాహ్యప్రసారణము పూర్తిగ ఆగిపోవును. బహిర్ద్వారము కట్టుబడిపోయినట్లగును. జ్ఞానేంద్రియానుభవములైదును— శబ్ద స్పర్శ రూప రస

గ్రంధములు తెలియరాక వెలుపలనేయుండును. ధ్యానసమయ మున ప్రథమమున యింద్రియానుభవములు మనస్సునకు గోచరించును; ధ్యానము తీక్ష్ణమైనప్పుడు అవి గోచరించవు— సమీపించలేక దూరముగ నిలిచిపోవును.

915. క్షుద్రస్వభావములు గలవారు:—రోగనివారణము చేయుట, వ్యాజ్యములుగెలుచుట, నీటిపై నడచుట మొద లగు — మహిమలకొఱకును సిద్ధులకొఱకును దేవులాడు దురు. నిజమగు భక్తులు స్వామిచరణారవిందములుతప్ప యిత రమును కోరనేకోరరు.

916. "మహాభావ" మనగా పరబ్రహ్మభావము. అది శరీ రమునకును, మనస్సునకును గూడ భయంకరమగు విఘాత మును చేకూర్చును. మదపుటేనుగు చిన్నగుడిసెలోదూరి దానిని ఉట్టూతలూగించినటుల — ఒక్కొకప్పుడు దానిని భిన్నాభిన్నము చేసివేయును. ఈదశ గడచినయనంతరము, పూర్వము ఎంతదుఃఖము వాటిలునో అంతయధికమగు ఆనం దము లభించును.

917. భగవంతునినుండివేఱుపడు భావనచేగలుగు విరహ వేదన అబ్బా! చెప్పనలవికాదు. అటువంటివిరహవేదనను అనుభవించిన (శ్రీచైతన్యస్వామి శిష్యులగు) రూపుడు సనా తనుడు అనువారి తాపాగ్నివలన, వారేచెట్టునీడను కూర్చుం డిరో ఆచెట్టుఆకులు సయితము వాడిపోయినవట! అటువంటి దశలో నేను మూడుదినములు దాదాపు స్మృతిలేకయుంటిని! నేను కదలలేక ఒకచోటపడియుంటిని! నాకుకొంచెము స్మృహ

వచ్చినప్పుడు బ్రాహ్మణి (శ్రీపరమహంసులవారికి తాంత్రిక సాధనలు నేర్పిన యామె) నన్ను తీసికొనిపోయి స్నానము చేయించెడిది. కాని ఆమె నాచర్మమును తాకలేకుండెడిది. ఆమె నాశరీరమునంతను దట్టముగ గుడ్డలతో చుట్టి ఆగుడ్డలమీద చేతులు వేసి పట్టుకొనెడిది. నాశరీరమునకు పులిమిన బురద మన్ను వేడెక్కెడిది! ఆస్థితవచ్చినప్పుడు పెద్దయీటెను నా వెన్నెముకగుండ గ్రుచ్చుచున్నట్లు బాధకలిగెడిది. చచ్చిపోవు వానివలె బొబ్బలుపెట్టితిని. కాని ఆబాధకు పిమ్మట అత్యంత దివ్యానందము కలిగెడిది.

918. పండ్రెండుపత్సరములు వీర్యమును సంరక్షించు కొనినవానికి గొప్ప మహిమలు అలవడును. నూతన నాడి యొకటి సృష్టియగును. దానిని "మేధానాడి" అందురు. ఆనాడి బలపడినప్పుడు నరుడు సర్వమును జ్ఞప్తినుంచుకొనఁ గలడు; సర్వమును ఎఱుంగ గలడు.

919. వీర్యనష్టమువలన శక్తి క్షీణించును. అనేచ్ఛితముగ సంభవించు శుక్లనష్టమువలన అంతగా అపాయములేదు. కాని సిద్ధులుసహా స్త్రీల గలియఁదగదు.

920. సంపూర్ణ బ్రహ్మచర్యము నవలంబింపక ఆధ్యాత్మిక రహస్యముల గ్రహింప నలవికాదు.

921. స్త్రీభోగమును విడిచినవాఁడు ప్రపంచమును త్యజించినవాఁడే! భగవంతుడు వానికి కడుచాపున నుండును.

922. సత్యమగు సాధువురయొక్క మనస్సు ముప్పాతిక భాగము భగవదర్పితమైయుండును; ఒక్క పాతిభాగము

మాత్రము ఐహిక వ్యాపారములకు వినియోగమగును. భక్తుడు సదా దైవకార్యము లందెక్కువ ఉత్సాహియై యుండును. పాము తోకత్రొక్కినయెడల మహాకోపము చెందును. ఒడలంతటికంటె పామునకు తోకయందు స్పర్శ జ్ఞానమెక్కువ.

923. పరమహంసదశ పంచాబ్దముల బాలుని దశను పోలియుండును. వానికి స్త్రీ పురుష భేదము తెలియదు. అయి ననుకూడ లోకమునకు ఆదర్శము జూపునిమిత్తము పరమ హంసయు స్త్రీలవిషయమున జాగరూకుడై మెలగవలయును.

924. నిష్కాపట్యము సులభగా భగవంతునికడచేర్చును. రాళ్లులేక చక్కగదున్ని మెత్తగాచేయబడిన నేలయందు విత్తనము సులభముగా మొలకనెత్తి పెరిగి ఫలమునిచ్చు తీరున, అమాయకునియందు వేదాంతబోధలు సులభముగా ఫలప్రదములగును.

825. ప్రాపంచిక వ్యావృత్తులు గలవారి భక్తిసాధనా ఫలితము తాత్కాలికము. (ఆసంస్కారములు చాల కాలము గిలువవు.) కాని నిరంతరము భగవద్భక్తిసలుపువారు ప్రతి శ్వాసముతోడను ఈశ్వరనామోచ్చారణచేయుదురు. కొందఱు తమలోతాము "ఓం రామ ఓం" అని నిరంతరము స్మరణ చేయుచుందురు. జ్ఞానయోగావలంబులు "సోహం" అని పఠింపుచుందురు. కొందఱి జిహ్వ ఏదో మంత్రమునో స్తోత్ర మునో ఉచ్చరించుచు, కదలుచునేయుండును.

926. జప తపములు సదా ఆచరించుచుండవలయును.

927. బహుస్వల్పసంఖ్యాకులు మాత్రమే జ్ఞానబోధకు అర్హులుగనుందురు. భగవద్గీతలో యిట్లున్నది: వేలకొలది జనులలో ఒక్కడు భగవంతుని తెలియగోరును; అటుల తెలిసికొనగోరు వేయిజనులలో ఒక్కడుమాత్రము బ్రహ్మమును తెలిసికొని కృతార్థుడు కాగల్గును. కామినీకాంచనములంగూర్చి వ్యసనము తగ్గినకొలందిని జ్ఞానాభివృద్ధి చేకూరగలదు.

928. సాంసారికజీవనమున డబ్బుతో నిమిత్తమున్నమాట నిజమే. కాని దానినిగూర్చి విస్తారముగా చింతించతగదు. సంపదనార్జించు చింతకూడదు. దానంతటవచ్చుదానితో తృప్తిపడుట శ్రేష్ఠము. ధనముకూడబెట్టుకోరిక యుండతగదు. ఎవరు తమహృదయమును తమజీవనమును భగవదర్పితము చేయుదురో, ఎవరు భగవద్భక్తులై వానియందే శరణుజొత్తురో, అట్టివారలిట్టివిషయముల చింతపెట్టుకొనజాలరు. అటువంటివారి వ్యయము ఆదాయము ననుసరించి నడచును. ఒకవైపునుండి ధనమువచ్చుచుండ రెండవవైపునుండి వ్యయమగుచుండును.

929. శాక్తేయులలో సిద్ధులను కౌలులందురు; వేదాంతులు పరమహంసలనియు, బౌలసంప్రదాయికవైష్ణవులు శాయినులనియు అందురు.

930. పనులనన్నిటినివిడిచివేసి సాయంసమయమున దైవధ్యానము చేయవలయును. సంజవేళలందు సహజముగా భగవద్భావనలువచ్చును. క్షణకాలముక్రిందట సకలమును దృగ్గోచరములై యుండెనే, యిప్పుడవి చీకటులచే కప్పివేయబడినవి!

ఎవరిట్లు చేసిరి! ఈ మొదలగు భావములు స్ఫురించును. మహమ్మదీయులు సాయంకాలమునందు పనులన్నియు మానివేసి నమాజునకు కూర్చుండుట చూడలేదా?

931. నీవు భగవంతునకు ఏమి అర్పణ చేసినను నీకు వేయి రెట్లు తిరిగి యొసగబడును. కావున సర్వకర్మలందును తుదిని ఆకర్మఫలమును కృష్ణార్పణము చేసి నీళ్లు విడువవలయును.

932. యుధిష్ఠిరుడు తన పాపములను సయితము కృష్ణార్పణము చేయబోగా "వలదు, వలదు. అటుల చేయకుము. నీవు శ్రీకృష్ణునకు దేనిని అర్పణ చేసినను అది వేయియంతలై తిరిగి నీకు వచ్చును" అని భీముడు హెచ్చరించినాడు.

933. ఒకడు ధ్యాననిష్ఠలను ఇతరులకు తెలియరాకుండ ఎంత రహస్యముగ చేసిన అంత లాభకరము.

934. భగవంతుడు అనేకరూపములు తాల్చి ప్రసన్నుడగును: ఒకప్పుడు నరరూపమునను, ఒకప్పుడు చిన్మయరూపమునను ప్రసన్నుడగును. కాని ఈ దివ్యస్వరూపములందు విశ్వాసముండవలయును.

935. శ్రీకృష్ణుడు సయితము రాధాయంత్రముతో మహాసాధనలు చేసియున్నాడు. ఈ యంత్రమే బ్రహ్మయోని—దాని ధ్యానార్చనలు సాధన చేయవలయును. ఈ బ్రహ్మయోనినుండి అనంత బ్రహ్మాండములు ప్రభవించును!

936. కుండలిని ప్రబోధము కాంచినగాని ఆత్మప్రబోధము కలుగదు. కుండలినీశక్తి మూలాధారకమలమున నిద్రించు

చుండును; అది మేల్కాంచినప్పుడు సుషుమ్నయందు ప్రవేశించి, స్వాధిష్ఠానమణిపూరకాది పద్మములగుండపోయి, తుదకు సహస్రారము చేరును. అప్పుడుసమాధిదశ లభించును. నాకిదంతయు స్వానుభవమున తెలిసినది.

937. నిశ్శబ్దముగనుండు స్థలమునజేరి, హరినామమును పలుకుచుండుట జపమనబడును. ఇట్లొకడు ఎడతెగకుండ హరినామస్మరణను నిండుభక్తితోచేసెనేని తుదకు వానికి భగవద్విభూతులు గోచరములగును. బ్రహ్మసాక్షాత్కారమును లభించును. ఒడ్డునకు ఒకకొనతగిలించియున్న పొడువగు గొలుసుకొనను పెద్దదుంగకట్టబడి నీటిలోపలమునిగియున్నది. ఆగొలుసుపట్టుకొని, కడియములను తడవుకొనుచు పోతివేని నీవాదుంగనుచేరగల్గుదువు. అటులనే ఒకడు జపముసలుపుచు దైవధ్యానమున మునింగిపోయినయెడల తుదను భగవంతుని ప్రత్యక్షము చేసికొనగల్గును.

## 41వ అ ధ్యా య ము.

# నీ తి క థ లు.

938. ఈవిశ్వమంతయు బ్రహ్మమయమేయని ప్రకటించు అద్వైత సిద్ధాంతమును ఒకరాజునకు వాని గురువు బోధించి నాడు. అందువలన రాజునకు పరమానందము కలిగినది. ఆతడు తన రాణినిసమీపించి "రాణికిని రాణీదాసీజనమునకును భేదములేదు. కావున రాణీదాసియె నాకు రాణిగ నుండ వచ్చును" అనెను. రాణి తన భర్తమాటలకు నివ్వెఱబోయి నది. ఆమె గురువుగారికి వర్తమానమంపి "అయ్యా! మీబోధల మహాదుష్ఫలమును చూడుడు" అని దీనముగ మొఱలిడినది. గురువు రాణిని ఓదార్చి, "నేడు రాజు భోజనము చేయుసమమున అన్నముతోపాటు ఆవుపేడనుకూడ పళ్లెరమునందు పెట్టించుము" అని సలహా చెప్పినాడు. భోజనసమయమున గురువును రాజునుకలిసి భోజనమునకు కూర్చుండిరి. అన్నముతోపాటు వడ్డించబడినఆవుపేడను చూడగనే రాజునకువచ్చినఆగ్రహము వర్ణింపనలవికాదు. దీనిని కనిపట్టిన గురువు "ఆర్యా, నీవు అద్వైతజ్ఞానము కలవాడవు. ఈఅన్నమునకును పేడకును భేదమేలపాటింతువు?" అని ప్రశ్నించినాడు. రాజంతట పట్టరానిక్రోధముతో "అద్వైతినని గర్వోక్తులుపలుకు మీరేపేడను తినండి" అని అఱచెను. గురువంతట "మంచిది!" అని తానొక సూకరము (పంది)గ

మారి అత్యానందముతో ఆవుపేడను భక్షించి, తిరిగి మానవ రూపునుధరించి నిలిచినాడు. రాజంతట సిగ్గుదెచ్చుకొని రాణితో పిచ్చిప్రసంగములు చేయమానినాడు.

939. "మీరేల మీసతితోఁగూడి గృహస్థధర్మమును నడపరైరి?" అని ప్రశ్నింపగా శ్రీపరమహంసులవారిటుల జవాబు చెప్పిరి:—

"కార్తికేయుఁడు ఒకదినమున పిల్లిని గిల్లినాడట. ఇంటి లోనికి పోయినప్పుడు తనతల్లిచెంప గీచుకొనిపోయియుంట కాన్పించినది. దానినిచూచి ఆకుమారస్వామి "అమ్మా! నీబుగ్గమీద ఈగాయమెటుల కలిగినది?" అని అడుగగా, "ఇది నీపనియే; నీగోటిగీతయే యిది" అని ఆజగజ్జనని ప్రత్యుత్తరమిడినది. కార్తికేయుడు వెఱగుపడి "అదెట్లమ్మా! నేను నిన్ను రక్కిన జ్ఞప్తిలేదే!" అనెను. "బిడ్డా! ఈయుద యమున నీవు పిల్లిని గిల్లినమాట మఱచిపోతివా?" అని తల్లి అడిగినది. "అవునమ్మా, నేను పిల్లిని గిల్లితిని. అయిన నీబుగ్గమీద గాయముపడుటెట్లు తల్లీ?" అని పలికినాడు. "ముద్దులబిడ్డా! ఈజగమున నాకు వినా ఏమియులేదు. సృష్టి యంతయు నేనే! నీవెవరిని హింసించినను నాకే హింస కలుగును." అని తల్లిచెప్పినది. ఈపలుకులాలకించి కుమారస్వామి అత్యాశ్చర్యముచెంది, తాను వివాహమాడరాదని నిశ్చయించుకొనినాడట! అతడెవరిని భార్యగా గ్రహించ గలడు? అటుల స్త్రీజనమునందెల్ల మాతృభావమును గఱచిన కుమారస్వామి పెండ్లియాడుటకు జంకినాడు. నేను కార్తికే

యుని బోలియున్నాను. నేను ప్రతిస్త్రీని నాజగజ్జననిగ భావన చేతును."

940. బ్రాహ్మణుడొకడు ఒకసన్యాసిని కలిసికొని చాల సేపు మతవిషయములగురించియు లౌకికవ్యవహారముల గురించియు, ప్రసంగించినాడు. తుదకు ఆసన్యాసి వానితో "బిడ్డా! చూడుము, ప్రపంచములో ఎవరిపైనను ఆశపెట్టు కొనుటతగదు. నీవు నీవారుగానెంచుకొను నెవరును నీవారుకారు సుమీ!" అనెను. బ్రాహ్మణునకు నమ్మకము కుదరలేదు. తాను రేయింబవళ్ళు ఎవరికొఱకై పడరానిపాట్లుపడుచున్నాడో, అటువంటి తనకుటుంబమువారు అవసరముపట్ల తనకు సాయ పడబోరనుటను అతడెటుల నమ్మగల్గును? కావున నిట్లనెను:- "అయ్యా! నాకు ఇసుమంత తలనొచ్చెనా, నాబాధతొలంగు నిమిత్తము తనప్రాణమును సయితము ధారవోయునంత ప్రేమతో నాతల్లి నన్నుచూచునే! అటువంటి నాప్రియజననిని నేను నమ్మకొనలేకున్నచో, ఇంకెవరిపై నేనాధారపడ గలనో ఊహింపజాల!"

సన్యాసి యిటులపలికెను:— "అటులనా! అయితే ఆమె నీకు ప్రాపైయుండునదే కావచ్చును! కాని నీవు చాలపొఱ బడుచున్నావు, నిజము. నీతల్లిగాని, పెండ్లాముగాని కొడుకు గాని నీకొఱకై తమప్రాణముల నర్పింతురని ఎన్నడునునమ్మ బోకుము. కావలసినచో నామాటలను రుజువుచూడవచ్చును. ఇంటికిపోయి కడుపులోశూలచేత మితిలేనిబాధపడుచున్నటుల నటించుచు పడికొట్టుకొనుచుండుము. నేనువచ్చినీకొక చిత్రి మును చూపెదను."

అంతనా బ్రాహ్మణుడు ఇంటికిబోయి అలాగుననే చేసెను. వైద్యులెందఱో రావింపబడిరి; కాని ఎవరునుఏమియు చేయజాలరైరి. రోగితల్లి వెక్కి వెక్కి యేడ్చుచున్నది; వాని ఆలు బిడ్డలు రోదనము చేయుచున్నారు. ఆతరుణమున సన్న్యాసివచ్చినాడు. "ఈవ్యాధి దుర్నివార్యమైనది. ఎవరైనను ఈరోగిప్రాణమునకు బదులుగా తనప్రాణమును అర్పించు వారున్నతప్ప ఏమాత్రమును ఆశలేదు." అన్నాడు. ఈపలుకులు విని ఎల్లరును తెల్లబోయి నిలుచుండిరి. ఆసన్న్యాసి రోగి యొక్క ముసలితల్లినిచూచి, "మీఅందఱిని పోషించు ఈ కుమారుడుమరణించిన వెనుకవృద్ధాప్యమున నీవుండుటబ్రతికియు చచ్చినట్లేయుండును. వాని జీవమునకు మారుగా నీప్రాణము నిత్తువేని వానిని రక్షించగలను. వాని తల్లివైయుండియు వానికొఱకు నీవీపాటిత్యాగమును చేయనియెడల లోకములో నింకెవరుదిక్కు వానికి?" అని పలికినాడు.

ఆవృద్ధస్త్రీ దగ్గుచు తడబడుచు యిట్లనెను: "స్వామీ, స్వామీ! నాబిడ్డడికొఱకు మీరు నన్నేమిచేయుమనిసెల విచ్చినను చేయుటకునేని సంసిద్ధమే! నాప్రాణమా? వాని బ్రతుకుతోపోల్చిన నాదెంతపాటిది? కాని—అయ్యో—నేను చచ్చిపోయినతర్వాత — ఈపసికూనలందరు—ఏమైపోదురో అనుతలపుచేత—పిఱికితనము తోచుచున్నది! నాపాపమెంతటిదో! ఈపసివాండ్రను విడువలేను."

సన్న్యాసియు తన అత్తయు నిటుల ప్రసంగించుచుండ వినిన, రోగిభార్య, తన తల్లిదండ్రులజూచి రోదనముచేయుచు

"ప్రియజనకులారా! మీరేమగుదురో అనుచింతవలన నేనిట్టి త్యాగమునకు పూనజాలకుంటిని! కటకటా!" అని ప్రలాపింపసాగెను. ఆనెవైపుతిరిగి సన్యాసి తన ప్రాణనాథుని క్షేమముకొఱకు వానితల్లి త్యాగముచేయ జంకియున్నస్థితిలో తానైనసాహసించునేమొ యని విచారించెను. అంత నామె "అయ్యో! నేనెంతటిపాపిష్ఠిదాననో! నానోదుట వైధవ్యము వ్రాయబడెగాబోలును! నాకొఱకై శోకసాగరమున మునుగు తల్లిని తండ్రిని విడిచివేసి, నేనేమిచేయగలను?" అనినది. ఈరీతిగా ప్రతివారును తప్పించుకొనిరి. తుదకు సన్యాసీ రోగితోనిట్లనెను.

"ఇకనిటుల చూడుము! ఒక్కరుమాత్రమేని నీకొఱకై ప్రాణమర్పించువారు లేరైరి. ఈలోకములో నెవరిని నమ్మకొనదగదని నేననినమాటలు ఇప్పటికైన భోధపడెనా?" ఇదంతయు కనిపెట్టుచున్న బ్రాహ్మణుడు తన బూటకపు సంసారమును త్యజించి ఆసన్యాసి ననుసరించి వెడలినాడు!

941. ఒకమానవుని పారమార్థికఫలము వానిమనస్సు యొక్క స్థితిని, జీవితాదర్శమును, అనుసరించియుండును. అది వాని హృదయముపై నాధారపడును గాని బాహ్యాకర్మలపై నాధారపడియుండదు. ఇద్దఱు స్నేహితులు భాగవతపురాణ కాలక్షేపము జరుగు తావునకు ప్రక్కగా పోవుచుండిరి. "అనుగో అక్కడికిపోయి కొంతసేపు పురాణమును విందము." అని ఒకడనినాడు. "వద్దు మిత్రమా! భాగవతమువిని నందున ఫలమేమున్నది. ఆవేశ్యవాటికకుపోయి వినోదముగ

కాలక్షేపము చేయుదము.” అని రెండవయతడు అనెను. మొదటి వాడు దీని కొడంబడలేదు. అతడు భాగవతము చదువుచోటికి పోయి, వినుటకై అటకూర్చుండెను. రెండవవాడు వేశ్యవాటి కరుపోయెనుగాని, తానాశించిన ఆనందమును అనుభవించ లేకపోయెను. కావున అతడిటుల తలపోయసాగెను:— “అకటా! నేనిక్కడికి ఏలవచ్చితిని? నామిత్రుడు శ్రీహరిలీలలను పావనకథలను వినుచు ఎంత సంతోషముతో నుండెనో కదా!” ఇటుల అపవిత్రస్థలముననుండి అతడు హరిని ధ్యానము చేసినాడు. రెండవవాడో భాగవతకథను వినుచును సంతసము లేకయుండెను. అటకూర్చుండి తనను తాను నిందించు కొనుచు “ఏమీ, ఎతబుద్ధిహీనుడనైతిని? నామిత్రునితోడ భోగముసానియింటికి పోనైతినే! అతడక్కడ ఎంతవిలాసముగా కాలము గడుపుచుండెనో గదా?” అని గొణుగుకొనసాగెను. ఆతడు భాగవతమును చదువుతావున కూర్చుండెనను పేరేగాని, అక్కడనున్నంత సేపును వానిమనస్సు భోగముసాని యింట తాను అనుభవించియుండగల వేడుకలపైననే యుండెను. ఇట్లు అతనిహృదయము నీచసంకల్పములతో మలినమైయుండుటవలన, అతడు స్వయముగా భోగము వాండ్ర యింటికి పోకపోయినను పాపమునే పొందినాడు. భోగవాటికరుపోయిన రెండవవాడు తాను అపవిత్రస్థలమునన్నను, హృదయము శ్రీహరి కథాకాలక్షేపముమీదనే యుండుటవలన భాగవత శ్రవణము చేసిన పుణ్యమును పడసెను.

942. వైశాఖమాసమున ఒక చిన్న మేకపిల్ల తల్లికడ నాట లాడుచు, చంగు చంగున ఎగురుచుండెను. అచ్చట నది రోజా పూలనుచూచి తల్లితో తానాపూవులను కొన్నిటిని తిని విందారగింతుననని చెప్పెను. అందుకు తల్లి యిట్లనెను:— "బిడ్డా! ఆపూలను నీవందుకొనుట అంత సులభకార్యము కాదు. ఆపూలు నీకుచిక్కులోపల నీవు అనేకములగు తిప్పలు పడవలసియుండును. రాబోవు నవరాత్రి పండుగదినములు నీకంతగా శుభదినములు కావు. ఎవరేని నిన్ను కొనిపోయి దుర్గాదేవికి బలియీయవచ్చును; అదితప్పిన కాళికి నిన్నర్పింప వచ్చును. అదృష్టవశమున ఆగండమును తప్పినను జగద్ధాత్రికి నిన్నారగింపు చేయుదురేమో. అప్పుడు మనజాతిలో మగ వాని నన్నిటిని జాతరలో నఱికివేయుదురు. మహాదదృష్టము నీపాలబడి నీవిన్ని గండములను గడచి, సురక్షితముగ బ్రతికి పెద్దదానవైనయెడల దీపావళినాటికి రోజాపూల విందు తిందువుగాని లెమ్ము! అప్పుడు మంచి రోజాపూలు చాలక గలవుకూడను."

ఈకథలోని మేకపలికినటుల మన కోర్కెలను తీర్చు కొనుటలో అత్యుత్సాహము కూడదు. మన జీవనసరణిలో తటస్థించు అనేక క్లిష్టపరిస్థితులను జ్ఞప్తినుంచుకొని యావనపు గొంతెమ్మ కోరికలను ఆపుకొనదగును.

943. ఒకమనుష్యుడు ఒకసాధువును అత్యంత వినయముతో సమీపించి "స్వామీ! నేను కడు దీనుడను; సాధుసత్తమా! నేనెట్లు తరింతునో తెలుపవేడెదను" అనెను. సాధువు వాని హృదయమునగల భావమును గ్రహించి

"మంచిది; నీవుపోయి నీకంటె క్షుద్రతరమైనదానిని దేనినైన తీసికొనిరమ్ము" అనెను. అంతట ఆమనుష్యుడు వెడలిపోయి, అచ్చటచ్చటచూచి, తనకన్న హీనతరముగనుండుదానినికను గొనలేకపోయెను. తుదకు తన పురీషమునుగాంచి "ఓహో! ఇదిగో, నాకన్న నీచతరమైనది ఉన్నది" అనుకొని దానిని సాధువుచెంతకు దీసికొనిపోవుటకై చేతితోపట్టుకొనబోయెను. అప్పుడాపురీషమునుండి ఒక ధ్వనియిట్లు వినవచ్చెను:— "ఓపాపీ! నన్ను తాకబోకుము. నేనొక మధురమును రుచ్యమునైన పూపమనై దేవతార్పణమునకు తగియుంటిని; చూచువారెల్లను నానందించియుండిరి. నాదురదృష్టదేవత నన్నునీకడకు దెచ్చినది; నీసంసర్గము నన్నీహీనదశకు తెచ్చినది; నరులు నన్నుచూచిఅసహ్యించుకొనుచు ముక్కులను గుడ్డలు పెట్టి గట్టిగమూసికొని పారిపోవుచున్నారే! నేను నీసంసర్గకు వచ్చినది ఒక్కసారియే; అయ్యో నాకర్మమిట్లయినది! నన్ను నీవు మరల నొకసారి తాకితివేని నాకింకను ఎటువంటి హీనతరదశరాబోవునో గదా!

ఆమనుజుడు ఈరీతిగా నమ్రతనేర్పబడి, అత్యంతము వినయశీలుడయ్యెను. తుదను ఉత్తమపరిపూర్ణత్వమును బడసెననుట తథ్యము.

944. ఒకడు చాలఋణములనుచేసి, ఋణదాతలబాధలను తప్పించుకొను నిముత్తము పిచ్చియెత్తినట్లు నటించసాగెను. వైద్యులు వాని రోగనివారణ చేయజాలరైరి. వానికి ఔషధములను యిచ్చినకొలదిని వానిపిచ్చి హెచ్చగుచుండెను.

తుదకొక బుద్ధిశాలియగు వైద్యుడు నిజమును కనుగొనెను. అంతట ఆవైద్యుడు వానిని చాటునకు దీసికొనిపోయి "అయ్యో! నీవిటుల చేయుట క్షేమమా? పిచ్చియెత్తినటుల నటించుటచేత నీవు నిజముగాపిచ్చివాడవే కాగలవు సుమీ! ఇప్పటికే నీయందు కొన్ని ఉన్మాదచిహ్నములునాకు కాన్పించుచున్నవి!" అని మందలించినాడు. ఈపలుకులు వానిహృదయమున గాఢముగ నాటినవి; వానిదోషము వానికి గోచరించినది. అంతట పిచ్చివానినటనను యతడు విడిచివేసినాడు. నీవు నిరంతరముగా ఎటువంటివాడవైనటుల నటింతువో అటువంటివాడవే యగుదువు.

945. ఒకానొక ధనికుని ప్రధానసేవకుడు వాని ఆస్తినంతను పరిపాలన చేయుచుండెను. ఈ ఆస్తి ఎవరిదని అడిగినయెడల "అయ్యా, యీసంపదయంతయు నాదే; ఈయిండ్లు, ఈతోటలు అన్నియు నావే" అనేవాడు. ఇట్లుపలుకుచు చాల గర్వాతిశయముతో త్రిప్పుకొనుచు నడిచేవాడు. అతని యజమానుడు ఎవరును చేపలపట్టవలదని కఠినశాసనముచేసియున్న చెఱువులో ఈసేవకుడొకనాడు ఒక్క చేపనుపట్టుట తటస్థించినది. వాని దురదృష్టమువలన అప్పుడే వానియజమానుడు యచ్చోటికి వచ్చి ఆమోసగాడు చేయుచున్న పనిని స్వయముగా చూడనయ్యెను. అంతట యజమాని కినిసి తక్షణమే వానిని దూరముగ వెడలగొట్ట నాజ్ఞయిడుటయేగాక, మిగులఅవమానించి పలువురు చూచుచుండగా చివాట్లు పెట్టినాడు. పాపము ఆసేవకుని స్వంతసొత్తగు కొన్నిగిన్నెలు గుడ్డలుగల ప్రాత

పెట్టెను తీసికొనిపోవుటకుగూడ అవకాశమీయక తఱుము గొట్టించినాడు. దుర్గర్వమునకు ఫలమిటులుండును !

946. ఒకగుడిచెంతగా సన్యాసి యుండేవాడు. ఎదురుగా ఒకభోగముదాని యిల్లుండేది. అనేకులు నిరంతరము దాని యింటికి వచ్చిపోవుటగాంచి, ఒకనాడు సన్యాసి దానిని పిలిచి "దివారాత్రములు నీవిటుల విటులతో నీచసల్లాపముల కాలము పుచ్చుచున్నావే! నీకు రానున్నముందుగతి ఎంతఘోరముగానుండునో ఎఱుంగుదువా? అని చివాట్లుపెట్టినాడు. పాపము, ఆసాని మిగుల విచారపడి అంతరంగమున పశ్చాత్తాపముతో తన పాపముల క్షమింపుమని దైవమును ప్రార్థించసాగినది. అయినను వ్యభిచారము దానికి వంశాచారమైయుండుటచేత, మరేవృత్తిని సులభముగాఅవలంభించి జీవించుటెన్నగానక, తన తనువు వ్యభిచరించినప్పుడెల్ల మరిమరి పశ్చాత్తాపము పొందుచు దైవమును ప్రార్థించుచుండేది. ఆసన్యాసి తాను చేసిన హితబోధ వ్యర్థమైనదిగదా యని విసిగికొనుచు, ఆసాని జీవితమున ఎందరువిటగాండ్రు దానియింటికిబోవుదురో లెక్క వేయ సంకల్పించినాడు. ఆదినమునుండి ఆసానియింటిలోనికి పురుషుడు ప్రవేశించినప్పుడెల్ల ఒకబెడ్డనుతీసి రొుక చోటున వేయసాగినాడు. రానురాను ఆబెడ్డలు పెద్ద కుప్పగా పేరినవి. ఒకనాడాయన సానికి ఆకుప్పనుచూపి, "ఓవనితా ! ఈకుప్పను చూచితివా ? నీపాపపు హీనకార్యమును మానుమని నేను నిన్ను మందలించినపిమ్మట నీవెన్నిసార్లు వ్యభిచరించితివో అన్నిసార్లకు అన్నిరాళ్లుపేర్చగాయింత

కుప్ప ఏర్పడినది! ఇంకనైనను నీదుర్వృత్తిని మానుమని చెప్పుచున్నాను" అని గద్దించిచెప్పెను. పాపము, ఆదీను రాలు తన పాపభారమునుగూర్చి భీతిచెంది, తన అశక్తతను గూర్చి దుఃఖించి "భగవంతుడా! నా యీ ఘోరజీవనము నుండి నన్నురక్షింపవా?" అని అంతరంగమున మొఱలిడ సాగినది. ఆప్రార్థనను భగవంతుడు వినినాడు; ఆనాడే యమదూతలు ఆసాని యింటిమీదుగాపోయినారు. ఆమె యీ ప్రపంచమును విడిచి చనినది. ఈశ్వరేచ్ఛవలన ఆ నాడే సన్యాసియు దేహత్యాగముచేసినాడు. యమదూతలు సన్యాసియొక్క జీవునిపట్టుకొని అధోలోకములకు గొనిపోయిరి; విష్ణుదూతలు వచ్చి సానిజీవుని వైకుంఠమునకు దీసికొనిపోయిరి. ఆసాని అదృష్టమునుగాంచి సన్యాసి గొంతెత్తి యిట్లనెను. "భగవంతుని సూక్ష్మధర్మనిర్ణయమిటులుండునా? నేను నాజీవితమును జపతపనిష్ఠలతో సర్వత్యాగముచేసి గడపితిని? నన్ను నరకమున కీడ్చుకొనిపోవుచున్నారు! నిరంతర కళంకజీవనమును గడపిన వ్యభిచారిణిని వైకుంఠమునకు గొనిపోవుటయా?"

ఈపలుకులువినిన విష్ణుదూతలిటుల తెలిపిరి:— "భగవంతుని నిర్ణయములు సదా న్యాయముగనే యుండును; నీవెటుల సంకల్పింతువో అట్టిఫలితముల ననుభవింతువు. నీవు ప్రఖ్యాతులకై యత్నించి బాహ్యాడంబరముతోడను గర్వముతోడను జీవనముం గడపితివి; భగవంతుడు నీకు దానినే లభింపజేసినాడు. నీహృదయము భగవంతునికొఱకై తపించి

యుండలేదు. ఈవేశ్య కాయికముగ పాపమాచరించినను రేయింబవళ్లు భగవంతుని పూర్ణహృదయముతో ప్రార్థించినది. జనులచేత నీశరీరమును, ఆమెశరీరమును ఎటుల చూడబడెనో యోచింపుము. నీవెన్నడును శరీరముతో పాపము చేయలేదు గాన నీశరీరమును వారు పూలతోడను మాలలతోడను అలంకరించి, మేళతాళములతో ఊరేగించి పుణ్యనదిలో విడువబోవుచున్నారు! ఈ వేశ్యశరీరము పాపమాచరించియున్నదిగాన ఈక్షణమున నదికాకులచేతను గ్రద్దలచేతను చీల్చి వేయబడుచున్నది. అయినను ఈమెహృదయము పవిత్రవంతమైయుండె గాన పావనలోకములకు బోవుచున్నది. నీహృదయము సదా ఆమె పాపకార్యములనే మననము చేయుచుండె గాన అపవిత్రమైనదై అపవిత్రుల లోకమునకే పోవుచున్నది. యథార్థమున వ్యభిచారివి నీవుగాని, ఆమె కాదు!"

947. ఒకబ్రాహ్మణుడు తోటను వేయించుచుండెను. రాత్రింబవళ్లు దానిని జాగ్రత్తగా కనిపట్టి చూచుచుండెను. ఆతడు అత్యంత ప్రీతితో రక్షించుచున్న మామిడిమొక్కను ఆవొకటి తోటలోపడిమేసినది. తనకు ప్రియముగానుండిన ఆమొక్కను ఆవు మేయుచుంట చూడగానే బ్రాహ్మణునికి రౌద్రము రగుల్కొనివచ్చెను. అంతట బడితెతీసికొని మోదగా ఆయావు గాయములచేచచ్చిపడినది. బ్రాహ్మణుడు గోహత్యచేసినాడను వదంతి ఎల్లెడలవ్యాపించినది. ఈబ్రాహ్మణుడు వేదాంతిననిప్రకటించుకొనుచుండెడివాడు. గోహత్యదోషమునుతనపైనారోపించగానే, తానునిర్దోషిననని రుజువు

చేయుటకుగాను ఇట్లుపలుకసాగెను:— "కాదు కాదు; నేను గోహత్య చేయలేదు. ఆపని చేసినది నాచేయి సుడీ! ఈహస్తమునకు అధిష్ఠాన దేవత యింద్రుడు; కావున ఎవరేని ఆవును చంపినదోషముకట్టుకొందురేని అది ఇంద్రునిగాని నాదికాదు."

స్వర్గమందలి యిందుడ్రీపలుకులు వినినాడు. ఒకవృద్ధ బ్రాహ్మణవేషమును ధరించి ఈతోటస్వంతగాని కడకు వచ్చి యిట్లు ప్రసంగించ నారంభించినాడు:—

ఇంద్రుడు:— అయ్యా! ఈతోట ఎవరిది?

బ్రాహ్మణుడు:— నాయదియే.

ఇంద్రుడు:— ఇది చాల సుందరమునుగాన్నది. కడునేర్పరి యగు తోటమాలిని మీరు సంపాదించియుందురు. ఆహా! ఎంతసొగసుగా, ఎట్టి చిత్రవిచిత్రాకారములతో మొక్కలను నాటించినాడో!

బ్రాహ్మణుడు:— ఇదంతయు నాపనియేనండీ! ఈచెట్ల నన్నింటిని నేను స్వయముగ పరీక్షించుచు స్థలనిర్ణయముచేసి పాతించి పోషించుచుందును.

ఇంద్రుడు:— అట్లనాఅండీ! మీరు మహా నిపుణులండీ! బహు బాగుగ చిత్రాకారముల కల్పనచేసి మొక్కలను పాతించినారు.

బ్రాహ్మణుడు;— అంతయు స్వయముగనే చేసినదే!

ఇంద్రుడు:— (చేతులుజోడించి) ఈతోటలోజరిగిన పను లన్నియు నీయవియేయని, వానింగూర్చిన ఘనతనంతను నీవే

గైకొనుచుంటివి గదా! ఆవునుచంపిన దోషమును మాత్రము, పాపము, ఆయింద్రుని నెత్తిన పడవేయుట చాల అన్యాయము సుమీ! ”

948. నవనాగరిక విద్యావంతుడొకడు సంసారులు ఐహిక తత్పరులుగానుండక తప్పదని శ్రీపరమహంసులవారితో వాదించసాగెను. అప్పుడు శ్రీపరమహంసులవారిట్లనిరి:—

“ఈనాటి సంసారుల ఔదార్యము ఎటువంటిదో తెలియునా? ఒకబ్రాహ్మణు యాచనకువచ్చినయెడల గృహ యజమాని తనభార్యయే యింటి వ్యవహారములన్నియు చక్కబెట్టుచుండునుగాన; తాను డబ్బువిషయము లేవియు పెట్టుకొనడుగానను, గృహకృత్యముల జోక్యములేనివాడు గానను, ఆబ్రాహ్మణునితో “అయ్యా! నేను డబ్బు తాకు వాడనుగాను; నన్ను యాచించవచ్చి నీవు వృథాకాలయాపన చేసికోనేల?” అనును. ఆబ్రాహ్మణుడు అతిదీనముగా ప్రార్థించుచు పీడించువాడైనయెడల “సరే, రేపురండయ్యా; ఏమైనవీలుంటే చూచెదను” అని చెప్పును. ఈఅధర్మమూర్తి యగు గృహస్థు, ఇంటిలోనికిపోయి, భార్యతో “ఓసీ, చూచితివా! పాపము ఒక పేదబ్రాహ్మణుడు, చాల కష్ట దశలోనున్నాడు. ఒకరూపాయి యిత్తము” అనును. “రూపాయి” అనుమాట చెవినిబడగనే భార్య రుద్రాణి రూపుదాల్చి, “ఆహా! ఎంత ఔదార్యమండీ! రూపాయలు పుల్లియాకులో రాళ్లో అనునటుల మీకు కాన్పించుచున్నవి కాబోలు! వెనుక ముందు చూడనక్కఱలేదు; పాఱవేయ

వచ్చు! ” అని వేళాకోళముగ వచించును. ఐహిక తాత్పరత నెఱుంగననెడి యాబ్రాహ్మణుడు మోము తేలవేసి “అబ్బే, ఆబ్రాహ్మణుడు చాలపేదవాడు అంతకంటె తక్కువ నిచ్చిన బాగుండదు ” అని నంజుచు మాటాడబోవును. “వీలుకాదు ఒక్క బేడకన్న హెచ్చు యిచ్చుటకు అవకాశములేదు. ఇష్టమైనయెడల అదియ్యండి ” అని భార్య పలుకును. ఈబ్రాహ్మణుడు ఐహికచింతలుపెట్టుకొనడు గాన, భార్యయిచ్చిన దానినేతీసికొనును. మరునాడాయాచకునకుదక్కునది బేడయే. ఐహికచింతలు పీడితిమని చెప్పుకొను గృహస్థులు నిజముగా స్వాతంత్ర్యములేనివారు; ఏలయన వారు స్వయముగా కుటుంబవ్యవహారములను చక్కబెట్టుకొనరు. తాము చాలయోగ్యులమనియు సాధుపుంగవులమనియు అనుకొందురు. కానియథార్థమునకు ఇల్లాండ్రఅదుపులోనుండి వారలుచెప్పునటుల వర్తించువారే; వీరియొద్ద సామాన్య పురుషస్వభావము నుకొంతవడియుండును.

949. బావిలో ఒక కప్ప యున్నది. అది ఆనూతిలో బహుకాలమువాసము చేసినది. అదిదానిలోనెపుట్టి, దానిలోనెపెరిగనకప్ప. ఒకనాడు సముద్రములోనుండెడి కప్పవచ్చి యీనూతిలోపడుట తటస్థించెను. నూతిలోనికప్ప క్రొత్తగావచ్చిన దానిని చూచి “ఎక్కడిదానవు?” అని ప్రశ్నించినది.

సముద్రపుకప్ప :— “నేను సముద్రమున నుండుదానను.”

నూతికప్ప:—“సముద్రమా! అదెంత పెద్దదిగానుండును ? ”

సముద్రపుకప్ప:—“అది చాల పెద్దది!”

నూతికప్ప కాళ్లుబారసాచి "మీసముద్రము ఇంత విశాల ముగా నుండునా?" అనెను.

"అంతకన్న చాలవిశాలముగానుండును" అని సముద్రపు కప్ప ప్రత్యుత్తరమిచ్చినది!

నూతికప్ప తానున్న చోటినుండి ఒక్కగంతువేసి "సముద్రము ఇంతగొప్పదిగానుండునా!" అనెను.

"మిత్రమా! సముద్రపు వైశాల్యమును యీనూతితో పోల్చి చెప్పజూతువా ?" అని సముద్రపుకప్ప జవాబిచ్చినది.

నూతికప్ప యిట్లునొక్కి వక్కాణించినది:— "లేదు; ఈ నాబావికన్న పెద్దది ఎందునులేదు. నిజముగా, ఇంతకు మించి ఏదియు పెద్దదైయుండజాలదు. ఈ కప్ప బొంకులాడు చున్నది; దీనిని ఇక్కడనుండి లాగివేయవలయును."

సంకుచితాభిప్రాయములుగల నరులు ఈ తీరున నుందురు. తమ చిన్నచిన్న బావులలో కూర్చుండి జగమంతయు గూడ తమ నివాసములకన్న పెద్దదిగనుండజాలదని ధీరముగ వాదింతురు!

950. ఒకదొంగ రాజునింటికి కన్నము వేసి, అర్ధరాత్రి వేళ లోపలప్రవేశించినాడు. రాజు తనకుమార్తెను ఏటిగట్టున నుండు సాధువులలో నొకనికిచ్చి పెండ్లిచేయుదునని రాణితో చెప్పుచుండగా వినినాడు. ఆదొంగ యిటుల తలపోసెను:— "మంచిది! నా అదృష్టముపండినది. రేపు నేను సాధువువేషము ధరించి ఏటికడనున్న సాధువులమధ్యకూర్చుండును. బహుశః రాజు తనకుమార్తెను నాకేయియ్యగలడు!"

మరునాడు వాడటులనే చేసినాడు. రాజుగారి యుద్యోగులు వచ్చి రాజపుత్రికను పెండ్లిచేసికొమ్మని ఏసాధువునడిగినను యెవడునుఒడంబడడయ్యెను. తుదకువారు సాధువేషముతోడ నున్నదొంగకడకువచ్చి తమ ఉద్దేశ్యమును తెలిపిరి. ఈదొంగ ఊరకున్నాడు. అంతటవారు రాజునొద్దకుబోయి ఒకయువకుడగు సాధువున్నాడనియు, వానిని ప్రాధేయపడి రాజపుత్రికను పెండ్లాడుటకై ఒడంబఱచవచ్చుననియు తక్కిన సాధువులు ఇష్టపడలేదనియు తెలిపిరి. అప్పుడు రాజు స్వయముగా ఈ సాధువుచెంతకుపోయి, తన కుమార్తెను పెండ్లియాడి తనను అనుగ్రహించవలయునని అతిదీనముగా ప్రార్థించెను. రాజువచ్చి వేడుకొనుటచూడగనే దొంగవానిహృదయము మారిపోయినది. అతడిటుల తలంపసాగెను:— "నేను సాధువేషమునుమాత్రము ధరించి యుంటిని. ఆహా! రాజంతవాడువచ్చి ప్రాధేయపడుచు వేడుకొనసైనది! నేను నిజముగా సాధువునే ఐనయెడల నాకు లభింపగల మహత్తర లాభములను ఎవరూహించజాలుదురు!" ఈతలపులు వానిహృదయమున గాఢముగ నాటినవి. బూటకపువేసము వేసి పెండిలిచేసుకొనుటకన్న, తనవర్తనమును మార్చుకొని, ఇక నిజముగాసాధుశీలమును అలవఱచుకొనుటయే శ్రేష్ఠమని నిశ్చయించుకొనినాడు. అతడు వివాహమాడ నిరాకరించినాడు; సాధువులలోనెల్ల ఉత్తమసాధువు కాగల్గినాడు. యోగ్యమైనవేషమునుధరించుట సయితము ఒకానొకప్పుడు తలవనితలంపుగా శుభప్రదము కాగలదు!

951. ఒక పేద బ్రాహ్మణునకు ధనికుడగు వర్తకుడు శిష్యుడుగానుండెను. ఆవర్తకుడుచాలలోభి. ఒకనాడాబ్రాహ్మణునికి తన పవిత్రమైన పుస్తకమును మూటకట్టుకొనుటకు చిన్నగుడ్డముక్క కావలసివచ్చినది. ఆయన తనశిష్యునిదగ్గరకు పోయిఅడిగినాడు. వర్తకుడిట్లుపలికెను:—"అయ్యో, రెండు గడియలక్రిందజెప్పినయెడల మీకుకావలసినదిఇచ్చియుందును; నాకెంతయో విచారముగనున్నది! మీకు పనికివచ్చెడు చిన్న గుడ్డ ముక్క యిప్పుడేదియులేదే; ఏమి దురదృష్టము! కానిండు మీరడిగిన దానిని జ్ఞప్తియందుంచుకొందును; మీర ప్పుడప్పుడు జ్ఞప్తికితెచ్చుచుండుడు." పాపమా బ్రాహ్మణుడు నిరాశతో వెడలిపోయెను. గోడప్రక్కనున్న వర్తకుని భార్య యీగురుశిష్యుల సంభాషణను వినినది. ఆమె వెడలి పోవుచున్న బ్రాహ్మణుని యింటికి పిలిపించి "స్వామీ! యీ గృహ యజమానుని మీరడిగినది ఏమి?" అని విచారించి నది. బ్రాహ్మణుడు జరిగిన వృత్తాంతమును వినిపించినాడు. "చిత్తము;మీరింటికివెళ్లండి.మీరుకోరినగుడ్డ రేపుపంపబడును" అనివర్తకునిభార్య చెప్పినది. వర్తకుడానాటిరాత్రి యింటికి రాగానే భార్య"దుకాణముమూసివేసితిరా?" అని అడిగినది. అవును;విశేషమేమి? అనిఆతడనెను. "ఇప్పుడేవెళ్లి మనదుకాణ మునగలవానిలో శ్రేష్టమైన రెండుచీరలు తీసుకొని రండ"ని భార్యచెప్పగా "ఏమియీతొందర! ఉన్నవానిలో నెల్లమేలైన వానిని రేపు ఉదయాననే యిచ్చెదను"అని వర్తకుడుచెప్పెను. "అటులకాదు,యిప్పుడేయియ్యవలెను;లేదానాకక్కఅనేలేదు"

అని భార్యపలికినది. పాపమా వర్తకుడు అప్పుడుచేయగల దేమియున్నది? గురువుగారినా? ఏదోమాయమాటలతో పం పివేయుటకు? ఈమె వాని శయ్యాగృహాపు గురువయ్యె! ఈమె ఆజ్ఞలు అప్పుడప్పుడే చెల్లితీరవలయును. లేదా ఇంటి లోనిపోరు ఇంతంతయని వర్ణింప వీలుండదు. తుదకా వర్త కుడు విధిలేక, అర్ధరాత్రివేళపోయి కొట్టుతీసి భార్యకోరినటుల చీరలను తెచ్చినాడు మరునాటి ఉదయమున ఆగృహిణి రెండు చీరెలను గురువు గారింటికి పంపి "ఇకమీాదట మీా కేమైన కావలయునేని నన్నడుగుడు; మీాకు దొఱకును" అనికబురుచేసినది. కావున వరములు కోరువారు సులభ ముగా దాక్షిణ్యముచూపని జగజ్జనకుని అర్చించుటకన్న దయామయి జగజ్జననిని పూజించుట మెన్న!

952. బాగుగచదువుకొనిన బ్రాహ్మణుడొకడు విజ్ఞాన వంతుడగు రాజునొద్దకువెళ్లి "రాజా! నేను శాస్త్రములను చక్కగచదివినపండితుడను. నేనునీకు భాగవతమును బోధింప నెంచివచ్చితిని" అనెను. ఆయిద్దరిలో బుద్ధిమంతుడైనరాజు ఎవడేని నిజముగా భాగవతమునే చక్కగా చదివియున్న యెడల అట్టివాడు తన ఆత్మను తెలియగోరు విచారణయందు నిమగ్నుడై యుండును గాని రాజస్థానమున గౌరవమును ధనమును సంపాదించ నెంచియుండడని బాగుగ నెఱుంగును. కావున రాజాయనతో "బ్రాహ్మణవర్యా ! నీవాగ్రంథమును చక్కగ తెలిసికొని యుండలేదని నేను గ్రహించితిని. నేను నిన్నునాగురువుగాచేసికొనుటకు వాగ్దానము చేయుచున్నాను;

కాని నీవుపోయి ముందాగ్రంథమును నేర్చిరమ్ము" అనెను. అంత నాబ్రాహ్మణుడు మరలి తన త్రోవనుబట్టి "నేను భాగవతమును యెన్నిసంవత్సరములనుండియో మరల మరల పఠనము చేసియుంటినే! అట్టి నన్నీరాజు భాగవతమును బాగుగ గ్రహించని వానిక్రింద గట్టినాడు! ఎంతటి మూర్ఖుడో!" అని తలంచసాగెను. అయినను అతడు భాగవతమును మరొకసారిచదివి తిరిగి రాజునొద్దకు వెళ్లెను. రాజు మరల ఆమాటనే చెప్పి పంపివేసినాడు. బ్రాహ్మణుడుమిగుల విసుగుజెందినాడు; కాని, రాజుఅటులవర్తించుటకుకారణముండియుండుననుఊహ వానికి తట్టినది. ఆయనయింటికిపోయి ఒక గదిలోజేరితీవ్రబుద్ధితో భాగవతమును పఠించనారంభించెను. రానురాను అందలి రహస్యార్థములు వానిబుద్ధికి తోచనారంభించెను. ధనము, గౌరవము, రాజులు, ఆస్థానములు,సంపదలు, ఖ్యాతి, మొదలుగాగల బుద్బుదప్రాయములగు విషయముల వెంటపర్విడుసంకల్పములేబొత్తుగవానిదృష్టినాకర్షించవయ్యెను. ఆదినముమొదలు ఆబ్రాహ్మణుడుభగవదారాధనముచేయుచు ఆత్మసాక్షాత్కారమునుబడయు నిష్ఠయందు నిలిచిపోయెను. కొన్నియేండ్లు గడచినయనంతరము రాజుబ్రాహ్మణునిగూర్చి విచారించి ఆయన యేమిచేయుచుండెనో చూచుటకై వాని యింటికి వెళ్లినాడు. వానిముఖముదివ్యతేజముతో ప్రకాశవంతమైయుండుటగాంచి రాజు వానిమోల్లసవినయముగ మోకరించి "నీవిప్పుడు భాగవతార్థమును నిజముగాగ్రహించితిరని నాకుతెల్లమైనది. నన్ను నీవు శిష్యునిగాస్వీకరించుటకుబడంబడితివేని సిద్ధముగనుంటిని" అని పలికెను.

953. మూర్ఖతయందు ఘంటాకర్ణునివంటి వాడవు కాకుము. శివుని పూజించుచు తదితర దేవతల నందఱను ద్వేషించిన మనుజుడొక డుండెడివాడు. వానికొకనాడు శివుడు ప్రత్యక్షమై "నీవితర దేవతలను ద్వేషించునంతకాలము నేను నీయెడ ప్రీతుడను కాను" అని చెప్పెను. కాని ఆతడు వినడయ్యెను. కొన్ని దినములైనపిమ్మట శివుడు వానికి మరల కాన్పించెను. కాని హరిహరరూపముదాల్చి వచ్చెను; అనగా సగముభాగము శివునిరూపు, తక్కిన భాగము విష్ణువుగా నుండెను. ఆనరుడు సగము సంతోషమును సగము వెగటును పొందెను. తానర్పించు నైవేద్యమును శివునిరూపుగల వైపు నుంచి, విష్ణురూపున్న వైపున నేమియు పెట్టడయ్యెను. తన యిష్టదైవతమగు శివునికి ధూపము వేసి, ఆసువాసనను అనుభవించిపోవునేమోయని విష్ణునిముక్కు గట్టిగ నదిమిపట్టినాడు. అంతట "నీమూర్ఖత చక్కబడరానిది. నేనిటుల ద్వైతరూపముదాల్చి, సకలదేవతలును ఒక్కపరబ్రహ్మయొక్క వివిధ కళాప్రదర్శనములేయని నీకు నచ్చచెప్పబూనితిని. సద్బుద్ధితో నీవు గుణపాఠమును నేర్చుకొనవైతివి. నీవైషమ్యబుద్ధికై నీవు దుఃఖములనుభవించవలసినదే. చిరకాలము నీవు దండనల పాలుకావలయును" అని శివుడుపలికెను. అంతట నామనుజుడు గ్రామాంతరమునకు బోయి దాగియుండెను. కాని గాఢతరవిష్ణుద్వేషమును హృదయమున రగుల్కొల్పుకొనెను. ఆయూరిపిల్లకాయలు అతడువినునటుల విష్ణునామముల నఱచి వానిని పీడించసాగిరి. అతడు రెండుచెవులకును రెండుగంటలను గట్టుకొని, పిల్లలు "విష్ణు విష్ణు" అనుతోడనే తన

కాధ్వని వినరాకుండ ఘంటలను మోగించుచుండెడివాడు. ఈ కారణముచేత వానికి ఘంటాకర్ణుడను పేరు ప్రసిద్ధమైనది.

954. ఏమియు ఉద్యోగములేని ఒకమనుష్యుడు ఏదేని పనిని సంపాదించుమను భార్యయొక్క పోరు పడలేకుండెను. ఒకనాడు వానికుమారుడు చాలజబ్బుచేసి, వైద్యులు ఆశలు లేవని చెప్పు స్థితిలో నుండగా ఉద్యోగము సంపాదించు నిమిత్త మామనుష్యుడు తిరుగసాగెను. ఇంతలో కొడుకు చచ్చిపోయినాడు; తండ్రి కొఱకై వెదకగా యెక్కడనుకాన రాలేదు. తుదకు సాయంకాలము పొద్దుక్రుంకిపోయిన పిమ్మట ఆతడింటికిరాగా, ప్రాణావసానకాలమున కొడుకును విడిచిపోయినాడని భార్య వానిని చివాట్లుపెట్ట మొదలిడెను. ఆయన చిరునగవుతో నిట్లనెను:— "వినడిండి వినండి. నే నొకసారి రాజునైనట్లును, ఏడుగురు కొడుకుల గనినట్లును, వారితో అష్టైశ్వర్యములను అనుభవించుచున్నట్లును కలను గంటిని. కాని మేల్కొనగానే వారెవరును కానరారైరి! అదొక స్వప్నము. నేను అనాటి ఏడుగురు కొడుకులకై ఏడ్వవలెనా? లేక యిప్పుడు చచ్చిన నీకొడుకై ఏడ్వవలెనా? చెప్పుము!" ఈ ప్రపంచానుభవమును స్వప్నముగా నెంచు నరుడు, సామాన్య నరులవలె సంసారబంధుత్వముల నమ్ముకొని, సుఖములనుగాని, దుఃఖములనుగాని పొందబోడు!

955. శ్రీకృష్ణుని ప్రియమిత్రుడైన అర్జునుని హృదయమున ఒకప్పుడు గర్వము ప్రవేశించినది. తన స్వామియు, మిత్రుడునైన శ్రీకృష్ణునియెడల భక్తివిశ్వాసములు చూపు

టలో తనతో సమానులులేరని అర్జునుడు భావించెను. సర్వజ్ఞుడగు శ్రీకృష్ణభగవానుడు వాని హృద్గతభావమును గ యొకనాడు విలాసముగా తిరుగుటకై వానిని తోడ్కొని పోయెను. వారు కడుదూరముపోకమునుపే యొక బ్రాహ్మణుడు ఎండిపోయిన గడ్డిని నములుచు కాన్పించెను. వానిమొలలో ఒక ఖడ్గము వ్రేలాడుచున్నది. వానిని చూడగనే, ఏజీవికిని హింసచేయనొల్లని “అహింసా పరమోధర్మః” యను నీమముంబూనిన పవిత్ర విష్ణుభక్తవరుడై యుండునని అర్జునుడు గ్రహించెను. గడ్డిలోను ప్రాణముండుటం జేసి పచ్చిగానుండు గడ్డినైనను అతడు తిన సహించకుండెను; కావున ఎండి ప్రాణశూన్యముగనున్న గడ్డిని మాత్రమే ఆతడు తినుచున్నాడు. అయినను ఖడ్గధారియైయున్నాడు. ఈ వైపరీత్యముంగూర్చి వింతజెందిన అర్జునుడు శ్రీకృష్ణస్వామితో “ఇదేమివింత! తుదకు గడ్డిపోచకైనను హానిచేయనొల్లని సాధుపురుషుడు, ద్వేషమూలమును మారణోపకరణమును అగు ఖడ్గమును ధరించియున్నాడు!” అనెను. “ఆతనినినీవేప్రశ్నించి తెలిసికొనుము” అని భగవానుడు పలికెను. అర్జునుడంతటబ్రాహ్మణుని సమీపించి “స్వామీ! నీవేజీవినిహింసించబోవు!ఎండుగడ్డినితిందువు. అట్టి నీవీకఱకుకత్తిని పూనియుంటివేల?”అని అడిగినాడు. నాకు కంటబడిరేని నలుగురినిశిక్షించనెంచి దీనినిపూనియున్నాను” అని బ్రాహ్మణుడు తెలిపెను.

అర్జునుడు —“వారెవరెవరు?”

బ్రాహ్మణుడు —“మొదటివాడా నీచుడు నారదుడు”

అర్జు — "ఏల? ఆయన యేమిచేసెను?"

బ్రాహ్మ — "ఏమిచేసెనా? వాని దుండగముచూడు; తన కీర్తనలు, తన సంగీతముతో నాస్వామికి నిద్రలేకుండ చేయుచుండును. స్వామిసుఖము వాని కిసుమంతయు పట్టదు. వాడుసదా ప్రార్థనలుచేయుచు స్తోత్రముల పాడుచు, రేయింబవళ్లు ఈకాలము ఆకాలము అనక, స్వామికి శాంతిదోపనీడు."

అర్జు — "రెండవయతడెవడు?"

బ్రాహ్మ — "ఆపెంకియిల్లాలు ద్రౌపతి!"

అర్జు — "ఆమె నేరమేమి?"

బ్రాహ్మ — "దాని అవివేకముంగనుము; నాస్వామిసరిగా భోజనమునకై కూర్చుండువేళ, ఉచితానుచితము లరయక, బొబ్బలిడసాగినది. నాస్వామి తినబోవునన్నమునువిడిచి గబగబ కామ్యవనమునకు పర్విడి దుర్వాసుని శాపమునుండి పాండవుల రక్షింపబోయినాడు! ఇంకను దానిపొగరేమని చెప్పను. నాస్వామికి అందఱు తినగామిగిలిన ఎంగిలి అన్నము పెట్టినదట!"

అర్జు — "మూడవవారెవరు?"

బ్రాహ్మ — "అనిర్దయుడు ప్రహ్లాదుడు! వాని ఆగడము ఎంతనుకొన్నారు! జంకుగొంకు లేకుండ నాస్వామిని పిలిచి సలసలకాగుచున్న నూనెతొట్టెలో దింపినాడు. మదపుటేనుగుల పాదములక్రింద త్రొక్కించినాడు. ఇనుపస్తంభమును

పగులకొట్టుకొని వచ్చునటుచేసినాడు !”

అర్జు— “నాల్గవవారెవరు ?”

బ్రాహ్మ —“ఉన్నాడొక ఖలుడు, అర్జునుడు.”

అర్జు —“ఏమి? అతడేమిపాపముచేసినాడు?”

బ్రాహ్మ — “వాని అదరుపాటుకాల, నాస్వామిని తీసికొనిపోయి కురుక్షేత్రరణములో తనకై బండితోలు నీచపువనియందు నియోగించినాడు.”

అర్జునుడు ఆబ్రాహ్మణుని భక్తిఎంతగాఢమైనదో తెలిసి నివ్వెఱపోయినాడు. ఆక్షణమునుండి వానిగర్వము అదృశ్యమైనది; తానే స్వామిభక్తులలో మేటిననుకొనుట మాని నాడు.

956. వైరాగ్యమును నేర్చుటయెట్లు?—ఒకానొకపురుషునితో భార్య “నాథా! నాకు నాఅన్నను చూడగా చాల దిగులు కలుగుచున్నది. వారముదినములనుండి సన్యాసమును దీసికొనవలయునని చూచుచున్నాడు; అందుకై ప్రయత్నములను చేయుచున్నాడు. క్రమక్రమముగా తన కోరికలను అవసరాలను తగ్గించి వేయుచున్నాడు !” అనెను. భర్తయిట్లనెను:— “ప్రేయసీ ! నీఅన్ననుగూర్చి నీకు దిగులే అవసరము లేదు. అతడెన్నడును సన్యాసి కాబోడు. ఆరీతిగా నెవడును సన్యాసి కాజాలడు.” ఈపలుకువిని “ఇంక సన్యాసిఅగు విధమేది ?”అని భార్య అడిగినది. “అది యీవిధానజరుగవలయును” అనిచెప్పుచు ఆమెభర్త తన వస్త్రములను తటాలున చింపివేసి, ఒక్కటేపేలికనుదీసి గోచిగా ధరించినాడు.

అంతటినుండి ఆమెయు, ఆమెనుబోలు స్త్రీజనమును తనకు తల్లులని చాటినాడు. వెంటనే గృహమునువిడిచి పర్విడిపోయి తిరిగి కాన్పించడయ్యెను.

957. ఒకడు తన యిరువురు కుమారులను దీసికొని పొలములోగుండ పోవుచుండెను. ఒక బాలుని చంక నెత్తికొనినాడు; రెండవవాడు తండ్రిచేతిని పట్టుకొని నడచుచున్నాడు.

గరుడ పక్షి యొకటి వారికి కానవచ్చినది. తండ్రి చేయిబట్టుకొని నడుచు బాలుడు తనపట్టువిడిచి చేతులుచఱచుచు ఆనందముతో నాన్నా! నాన్నా! అదిగో గరుత్మంతుడు వచ్చినాడు! అని కేక లిడసాగెను. ఇంతలో తడబడి పడిపోయెను; దెబ్బలు తగిలినవి. తండ్రియొడిలోని బాలుడును ఆనందముతో చప్పట్లు కొట్టినాడు; కాని పడలేదు. తండ్రి వానిని పట్టుకొనియే యున్నాడుగా! మొదటి బాలుడు అధ్యాత్మసాధనలందు స్వయంసాహాయ్యమును నమ్ముకొనినవాని వంటివాడు; రెండవ యతడు దేవునికి ఆత్మార్పణము చేసికొనిన భక్తునిబోలువాడు.

958. ఒకడు నూయిత్రవ్వ నారభించినాడు. అయిదారు బారలలోతు త్రవ్వినీరుగానక ఆ తావునువిడిచివేసి వేఱొక తావు నిర్ణయించినాడు. అక్కడ యింకను లోతుగ త్రవ్వినాడు; నీళ్ళుపడలేదు. కావున మఱొకచోటున యింకను లోతుగ త్రవ్వించినాడుగాని ఫలములేకపోయినది. తుదకు వేసరి ఆ పనినేవిడిచివేసినాడు. ఈమూడునూతులలోతును కలిపిననూరు

వారలకు కొంచెము తక్కువగా నుండెను. వేర్వేఱు స్థలములకై పోక పట్టుదలతోడను విశ్వాసముతోడను తనకష్టములో సగపాలు మొదట త్రవ్విన నూతినే యింకను లోతు చేయుటలో వినియోగించిన యెడల దివ్యమైన జలము వానికి లభించియుండును. తడవ తడవకు మతములను మార్చుకొనుటయు యిట్టిదే! ఒక్క సాధననేనమ్ముకొని, దానియోగ్యతనుగూర్చి సంశయమును పూనక, భక్తి విశ్వాసములతో సాగించిన యెడల తప్పక జయముచేకూరును.

959. ఒక భార్యయు భర్తయు కూడ సంసారత్యాగము చేసి, తీర్థయాత్రలసేవించ మొదలిడిరి. వారు దాటిపోవుచుండగా, భార్యకన్న కొంచెము ముందు నడచుచున్నభర్తకు త్రోవలో రవ్వయొకటి కంటబడినది. దానిని భార్యచూచిన యెడల ఒకవేళ లోభముచే మోహితయై వైరాగ్యఫలమును చెడగొట్టుకొనునేమో యను భయము వానికి తోచినది. వెంటనే ఆరవ్వను నేలలోపూడ్చిపెట్టి, ఆమెకు కాన్పించకుండ చేయవలయుననుతలంపుతో నేలను గోకనారంభించెను. ఇట్లతడు నేలనుగీచుచుండగా భార్యసమీపించినది. అతడు చేయునదేమనిప్రశ్నించినది. సరియైన జవాబునీయక ఏమోమో చెప్పి తప్పించుకొనజూచెను. ఇంతలో రవ్వ ఆమెకు కాన్పించినది, భర్తయుద్దేశ్యము ఆమెకు పొడగట్టినది. ఆమె యిట్లు మందలించెను:—"మీరెందుకు సంసారవిసర్జనముచేసి వైరాగ్యము పూనితిరి? ఆ రవ్వకును మట్టిబెడ్డకును భేదమేల మీకు స్ఫురించవలెను?"

960. నలుగురు గ్రుడ్డివాండ్రు ఏనుగును చూడబోయిరి. ఒకడు ఏనుగు కాలును తడవిచూచి అది స్తంభమువలె నుండుననుకొనెను. రెండవవాడు దానితొండమును తాకిచూచి అది కొండచిలువవలె నుండెననితలచెను. మూడవయతడు దానిపొట్టను స్పర్శించి పెద్దపీపావలెనుండునని యూహించెను. నాలుగవవాడుదానిచెవులనునివిరిచూచి పెద్దచేటనుపోలియుండు నని యెంచెను. తుదకు ఏనుగుస్వరూపమును గురించి తమలో తాము వివాదపడసాగిరి. దారిపోవు నాతడొకడు "మీరు వివాదపడు విషయమేమిటి?" అని అడిగెను. వారు తమ వృత్తాంతమును తెలిపి మధ్యవర్తిగానుండి న్యాయము చెప్ప మనిరి. ఆమనుష్యుడిట్లనెను:— "మీలో నెవరును ఏనుగును చూచియుండలేదు. ఏనుగు స్తంభమువలె నుండదు; దాని కాళ్లు స్తంభమును పోలియుండును. ఏనుగు చేటనుపోలి యుండదు; దానిచెవులు చేటలవలె నుండును. దానితొండము పెద్దచిలువవలె నుండును; దానిపొట్ట బుట్టనడువున నుండును. ఏనుగుఅనగా దానికాళ్లు పొట్ట చెవులు తొండముచేరినఆకార మగును." ఇదేవిధముగా భగవంతుని ఒక్క కళనుమాత్రము ప్రత్యక్షముచేసికొనినవారు తమలో తాము వివాదపడు చుందురు.

961. పల్లెవనితలు కొందఱు తమగ్రామమునకు దూర ముగనున్న సంతకుపోయి, సాయంతనము మరలి పోవు చుండగా గాలివాన వచ్చినది; చీకట్లుక్రమ్మినవి. నడకసాగక దాపుననున్న ఒక పూలవర్తకునియింట తలదాచుకొనవలసిన

వారైరి. ఆవర్తకుడు దయదలచి వారిని ఒకగదిలో పండు కొననిచ్చెను. ఆగదియందు మరునాడు అమ్ముకొనునిమిత్తం చేర్చిపెట్టిన సువాసనగల పూలగంపలుండెను. ఆపూలవలన వచ్చు కమ్మనివాసనలు గాలినిండగా, ఆపల్లెవనితలు భరించ లేకుండిరి. వారికి కునుకుపట్టదయ్యెను. అప్పుడు వారిలో నొకతె "ప్రతివారును తమచేపలబుట్టలను ముక్కులకు దాపుగా పెట్టుకొనుడు. ఇక ఈపూలకంపు మనలను బాధించదు. మనము చక్కగనిదురించగలము" అని యుపాయము చెప్పెను. వారందఱును ఆమె యుపాయమునకు మెచ్చి ఆమె చెప్పినటుల చేసిరి. క్షణములో వారికి నిదురపట్టినది; ఎల్లరును గుఱ్ఱువెట్ట సాగిరి. అభ్యాసముయొక్క బలమును మహిమయు అటులుండును. ఐహికవ్యాపారతత్పరులు విషయచింతలకు భోగవాంఛలకును మరగినవారై భక్తివైరాగ్యవాతావరణమును సహించలేరు; ఉబ్బుగుడుచుకొనితబ్బిబ్బులగుదురు.

962. ఒక యోగి త్రోవప్రక్కను సమాధియవస్థలో నిమగ్నమైపడియుండెను. ఒక దొంగవాడాత్రోవను పోవుచు వానిని చూచి "వీడు దొంగవాడైయుండును. రాత్రి కొన్నియిండ్లుదోచి అలసటతో యిట్లుపడి నిదురబోవుచున్నాడు. పోలీసువారువచ్చి త్వరలోనె వీనిని పట్టుకొనగలరు. నేను పారిపోవుటమంచిది" అని తనలో తాననుకొనెను. ఇట్లు భావనచేసి వెడలిపోయెను. ఇంతలో ఒక త్రాగుబోతువచ్చి యిట్లు పలుకసాగెను. "ఓహో! వీడు ముంత ఎక్కువేవేసి

నాడు. ఒడలు తెలియక మురికి కాలువలో పడియున్నాడు! నేనే నయము. ఓరే! నీకంటె నేనే కైపు ఆపుకొన్నానే! పడి పోకుండ తూలుతూనైన పోగల్గుచున్నాను." తుట్టతుదకొక సాధువువచ్చి ఆమహానీయుడు సమాధిదశనుండెనని గ్రహించి నాడు. దగ్గఱచేరి కూర్చుండి వానిపాదములను ఒత్తసాగినాడు.

963. ఒకానొక గ్రామములో మఠమొకటి కలదు. అందలి సన్న్యాసులు ప్రతిదినము భిక్షాపాత్రలను చేతబూని యూరిలోనికి పోయివచ్చెడివారు. ఒకదినమున ఒకసన్న్యాసి యిట్లు భిక్షాటనముచేయబోయి, పేదవానినొకనిని కఠినముగ కొట్టుచున్న జమీందారుని చూచెను. దయార్ద్రహృదయు డగు ఆసన్న్యాసి వానిని కొట్టవలదని జమీందారుని బ్రతి మాలెను. మహాక్రోధముచే కన్నుగానకున్న జమీందా రుడు తన కోపానలమును సన్న్యాసిపైకి త్రిప్పినాడు. పాపము ఆయనను స్మృహతప్పిపడునంతగా పెడపెడ బాదినాడు. ఇదంతయు కనిపట్టి యొకమనుజుడు చచ్చుఱ పర్విడిపోయి మఠములోనివారికి చెప్పెను. తక్కిన సన్న్యాసులు ఈసన్న్యాసి పడియున్నతావునకు పర్విడివచ్చిరి. వారాయనను మఠమునకు మోసికొనివచ్చి యొక గదిలో పరుండబెట్టిరి. చాలసేపటి వఱకును ఆయనకు స్మృతి తెలియలేదు. చాల విచారముతో దిగులుపడి కూర్చుండిన సోదరులు విసరుచు చల్లనినీట ముఖ మును కడుగుచు ఉపచారముల సాగించిరి. కొంచెము పాలు నోటిలో పోసిరి. వారిటుల ఉపచారములుచేయగా కొంత సేపటికి ఆయన తేరుకొనినాడు. ఆయన కండ్లుతెఱచి చుట్టు నున్నవారిని చూడగా, ఆయన తమను గుర్తించగలడో లేడో

తెలిసికొను నాతురతతో, వారిలోనొకడు "మహారాజా! మీకు పాలు త్రాగనిచ్చుచున్నవారెవరో గుర్తించితిరా?" అని బిగ్గరగ అడిగెను. అందుకా సాధుపుంగవుడు హీనస్వర ముతో "సోదరా! నన్ను కొట్టినయతడే నాకు పాలుపోయు చున్నాడు!" అనెను. బ్రహ్మైక్యజ్ఞానమును పొంది శుభా శుభములను ధర్మాధర్మములను దాటిపోయినగాని యిట్టి అద్వైత భావము అలవడజాలదు.

964. కట్టెలమ్మువాడొకడు అడవికిపోయి కట్టెలు కొట్టి తెచ్చి ఊరంతయు తిరిగి అమ్మకొని యెట్టెటో పేదకాపు రము చేయుచు బాధలు పడుచుండెను. ఒకనాడు ఆ అడవి గుండ పోవుచున్న సన్యాసి అతడు చాల కష్టపడి కట్టెలను నఱుకుచుంట చూచి, అడవి లోతట్టునకు పొమ్మనియు, అటుల చేసినయెడల లాభము కలుగుననియు వానికి చెప్పెను. ఆకట్టె లమ్మవాడు సన్యాసి చెప్పినట్లు, లోనికిచొఱబడి పోసాగెను. వానికొక శ్రీగంధపుమాను కాన్పించినది. అతడు మోయ గల్గినన్ని శ్రీగంధపు చక్కలను కొట్టుకొనివచ్చి, అమ్మకొని చాల లాభమును గడించగల్గెను. అతడిట్లు తలపోయసాగెను:- "ఆసాధుసత్తముడు శ్రీగంధపుచెట్టును గురించి మాట్లాడి యుండలేదు; అడవి లోతట్టునకు పొమ్మనిమాత్రమే చెప్పి యున్నాడు." మరునాడు శ్రీగంధపుచెట్లున్న తావునుదాటి ఇంకను లోపలికి పోసాగెను. తుదకొక రాగి గనిని కాంచినాడు. తాను మోయగలంత రాగిని కొనిపోయి బజారులోనమ్మి చాల ధనమును సంపాదించెను. ఆమరునాడు రాగి గని దాపు

నను ఆగక, సన్యాసి చెప్పినటుల ఇంకను లోతట్టునకు పోయి వెండి గనిని కనుగొనెను. తేగలిగినంత వెండిని తెచ్చి అమ్ముకొని యింకను సొమ్ము సంపాదించినాడు. ఇట్లే దినదినమును అడవిలోపలికి చొచ్చుకొనిపోవుచు బంగారపు గనులను, వజ్రపుగనులను, కనుగొనుచు మహాశ్రీమంతు డాయెను. బ్రహ్మజ్ఞానమును సంపాదించకోరు నతడీ తీరుననే చేయవలయును. ఏకొలదిపాటి సిద్ధులనో మహిమలనో సంపాదించగనే ఆగిపోక సాధనను సాగించినయెడల పరమాత్మ జ్ఞానమహైశ్వర్యమును పడయగల్గును.

965. మంగలియొకడు భూతముఆవేశించిన చెట్టుక్రిందుగా పోవుచు "బంగారుతో నిండిన ఏడు కడవలు నీకు కావలయునా ?" అను ధ్వనినివినెను. ఆమంగలి యిటునటునుచూచి యెవరిని కాంచలేదు. కాని, ఏడు బంగారపు కడవలు కావలెనా అనుశబ్దము వానిలోలోభమునుపుట్టించగా, ఆతడు బిగ్గఱగా "ఔవును. ఆఏడుకుండలను నేనుతీసికొనెదను" అని అఱచినాడు. "పొమ్ము ! ఇంటికిపొమ్ము ! నేనాకుండలను నీయింటికిచేర్చినాను" అను ధ్వని వినవచ్చినది ! ఈ వింతపలుకులు సత్యములా అని తెలిసికొను ఆతురపాటుతో రివ్వురివ్వున యింటికి పర్విడినాడు. ఇంటిలో అడుగిడగానే ఎదుట బంగారముతో నిండిన ఏడుకుండలు కండ్ల బడినవి ! ఆతడు వానిని పరీక్షించిచూడగా ఒక్కదానిలోమాత్రము సగము వఱకు బంగారమున్నది; తక్కినవానిలో నిండుగా బంగారమున్నది. అంగలిమనస్సున ఇప్పుడొక తీవ్రసంకల్పముపుట్టినది.

ఆఏడవకుండను బంగారుతో నింపవలెను; అప్పుడు వాని ఆనందము సంపూర్ణము కాగలదు అని వానికి తోచినది. ఆతడు తనయొద్దనున్న బంగారు నగలను వెండినగలను అన్నిటిని అమ్మి వరహాలుగమార్చి ఆకడవలో వేసినాడు. కాని ఆవిచిత్రపుకడవ ఎప్పటివలెనే పూర్తికాకయేయుండెను. అందువలన మంగలికి మిగుల ఆరాటముకలిగి, తానును తన కుటుంబమును తిండికిలేక మాడుచును, సంపాదించిన ఆర్జన నంతటిని బంగారుగ మార్చి, దానిలో పడవేయసాగెను. కాని ఆకుండ ఎప్పటియట్లేయుండెను. ఒకనాడు తనసంపాదన కుటుంబపోషణకు చాలకున్నదని చెప్పి తనజీతమును పెంపు చేయుడని రాజును అతడు వేడుకొనినాడు. ఈమంగలి మీద రాజునకు అభిమానముండుటచేత వాని జీతమును తక్షణమే రెట్టింపుగావించ యుత్తర్వులచేసినాడు. ఆమంగలి తన రెట్టింపు జీతమును పైసంపాదన ద్రవ్యమును అంతయు ఆకుండలో వేయుచుండెను. కాని ఆకడవనిండు సూచనలేవియు కానరాలేదు. తుదకామంగలి తిరిపెమెత్తసాగి, తన ఉద్యోగ ముచేవచ్చు జీతమును, ఇతరసంపాదనమును, తిరిపెపుడబ్బును, సర్వమును ఆవింతకడవలోనె వేయసాగెను. నెలలు గడచు చున్నవి. ఆలోభియొక్క దుఃఖము పెంపొందుచుండెనేగాని తగ్గుటలేదు. రాజు వాని దీనదశనుకనిపట్టి ఒకనాడు "ఓరీ! నీజీతము సగముగానున్న దినములలోనే నీవు సంతోషము తోడను, ఆనందముతోడను, వికాసముతోడను చూపట్టెడి వాడవు. నీ జీతమును రెట్టింపుచేసినపిమ్మట నీవు శోకాక్రాం తుడవై దిగులు నిరాశ పొంది చిక్కినట్లున్నావు. నీకేమి

వాటిల్లినది? నీ వాఏడుకుండలను తెచ్చుకొంటివాఏమి?" అని అడిగెను. ఈ ప్రశ్నవినగానె మంగలి ఉలికిపడి "ప్రభూ! ఎవరాసంగతిని ఏలినవారికి వినిపించినారు?" అనెను.

రాజిట్లుపలికెను:— "నీకు తెలియదా? ఎవరికా ఏడుకడవలను యక్షుడు దత్తముచేయునో వారియందీలక్షణములే కానవచ్చును. ఆయక్షుడు నాకును వానినితీసుకొమ్మనిబోధించినాడు; కాని ఆధనము వ్యయధనమా, దాపుడుధనమా, అనగా ఆసొమ్ము వాడుకొనుటకు వీలగునదా లేక దాచి పేర్చియుంచవలసినదా అని అడిగితిని. నేనీప్రశ్ననుఅడుగగనే యక్షుడు మారుపలుకక పారిపోయినాడు. ఆధనము ఎవరును వాడుకొనదగినదికాదని నీకు తెలియదా? ఇంతేకాక దానిని తెచ్చుకొనువారికి ధనము కూడబెట్టుతలంపేగాని వినియోగముచేయుబుద్ధి యుండదు. తక్షణమేపోయి ఆధనమును తిరిగి యిచ్చివేయుము." రాజిట్లుబోధించగా మంగలి బుద్ధితెచ్చుకొని ఆచెట్టుకడకుపోయి "నీబంగారును నీవుతీసికొనిపొమ్ము" అనెను. "సరే" అని యక్షుడు ప్రతిపలికినాడు. మంగలి యింటికిపోయిచూడగా, ఆకడవలు తనుయిల్లుచేరిన తీరుననే అతివిచిత్రముగా అదృశ్యమైపోయినవి. మఱియు ఆతడు ఎన్నెన్నియోపాట్లుపడి తన జీవితకాలమున సంపాదించిన ధనమంతయుకూడ ఆకుండలతో అదృశ్యమైపోయినది! స్వర్గరాజ్యమున కొందఱి గతి యిట్లుండును. యదార్థమగు వ్యయము ఏదియో యదార్థమగు ఆదాయము ఏదియో, ఎఱుంగనివారు తమ సర్వస్వమును పోగొట్టుకొందురు.

966. ఒకశిష్యుడు శ్రీపరమహంసులవారిని కామమును జయించుటెట్లని ప్రశ్నించెను. ఏలన అతడు యెంతగాధ్యానమున కాలముగడపుచున్నను దుస్సంకల్పములు అప్పుడప్పుడు వానిమనస్సున పొడగట్టుచునేయుండెను. శ్రీపరమహంసుల వారిటుల బోధించిరి:— ఒకనియొద్ద పెంపుడుకుక్కయుండేది. వాడు దానినిగారాబముగచూచి, తనవెంటదీసికొనిపోవుచు, దానితో ఆటలాడుచు ముద్దాడుచు నుండేవాడు. ఒకజ్ఞాని వానిచేష్టలనుచూచి, ఆకుక్కకు అంతచనువీయదగదని మందలించినాడు. అది మూర్ఖజంతువు; ఒకనాడు కఱవను కూడ తటస్థించవచ్చును. ఆమనుజుడు సాధువచనముల మనస్సునబెట్టుకొని, కుక్కను ఒడిలోనుండి త్రోసివేడినాడు; ఇక నెన్నడును దానిని దఱిరానీయ దగదనియు, ముద్దాడదగదనియు నిశ్చయముచేసికొనినాడు. కాని ఆకుక్క యజమానునిభావమును గ్రహించజాలదు కావున ఎప్పటియట్లనే ఆదరింపబడి ముద్దిడుకొనబడుటకై తఱచుగా వానికడకు పర్విడి వచ్చుచుండెడిది. అనేకపర్యాయములు అతడు దానిని వదలించి కొట్టగా కొట్టగాగాని అది వానిని బాధించుట మాన లేదు. నీస్థితియు అటులనున్నది. నీవింతకాలమును నీహృదయమునబెట్టుకొని లాలనచేసినకుక్క, దానిని నీవు విడువ నిశ్చయించుకొనినను అదినిన్ను సులభముగా విడువదు. అయినను గొప్ప భంగపాటులేదు. ఆకుక్క ముద్దాడుమని దాపునకు వచ్చినప్పుడు, దానిని ఆదరింపకుము; అది చేరవచ్చునప్పుడెల్ల బాగుగమర్దించి వెడలనంపుము. కొంతకాలమునకు, అదినిన్ను బాధించుటమాని దూరముగ తొలగును.

967. ఒకగొల్ల, ఏటి కావలియొడ్డున నుండు బ్రాహ్మణు నకు పాలు తీసికొనిపోయియిచ్చుచుండేది. పడవ సరిగానడువని కారణమున ప్రతిదినమును సకాలమున పాలందీయలేకుండెను. ఒకనాడాబ్రాహ్మణుడు చివాట్లుపెట్టగా "అయ్యో, నేనేమి చేయుదును? ఇంటికడనుండి పెందలకడనే బయలుదేఱి వచ్చి తిని. ఏటియొడ్డున పడవవానికొఱకును, పడవదాటువారందఱు చేఱుకొఱకును కనుపెట్టుకొని కూర్చుండవలసివచ్చినది" అని సమాధానము చెప్పినది. అంతట నాబ్రాహ్మణుడు "భగవన్నామము నుచ్చరించిన జన్మసాగరమునే దాటవచ్చునే నీవీ చిన్ననదినిదాటలేవా?" అనెను. నిష్కపటహృదయయగు గొల్లది ఏరుదాటునుపాయము సులభముగా దొఱికిదని ఆనందమునుపొందినది. మరునాటినుండి ప్రతిదినమును అరుణోదయ సమయముననే పాలందిచుచుండెను. ఒకనాడు బ్రాహ్మణుడు ఆగొల్లదానితో "ఏమిది? నీవింత పెందలకడ వచ్చుచున్నావే?" అనెను. "అయ్యా! మీరుచెప్పినటుల స్వామిపేరు తలంచుకొంటూ ఏరుదాటివచ్చుచున్నాను. పడవతో పని లేదుగదా!" అని గొల్లది చెప్పినది. బ్రాహ్మణుడు ఆపలుకులు నమ్మలేకపోయెను. "నీవు ఏరెట్లు దాటినావో చూపెదవా?" అని అడిగినాడు. ఆస్త్రీ బ్రాహ్మణుని తనతోతీసుకొనిపోయి నీటిమీద నడిచిపోసాగెను. వెనుకకుతిరిగిచూడగా బ్రాహ్మణుని దురవస్థ తెలిసెను. "అదేమిటండీ? నోటితో భగవన్నామమును పఠించుచు చేతితో బట్టపైకెత్తిపట్టుకొందురేమి? తడియుననియా? మీరు పూర్తిగా దేవునిపైనాధారపడియుండరేమి?" అని గొల్లది ప్రశ్నించెను. స్త్రీగాని పురుడుగానిసలుప

గల్లు అలౌకికచర్యలరహస్యము వారు పూర్ణముగను సుస్థిర ముగను భగవంతునిపై విశ్వాసముంచుటలోనున్నది.

968. ఒకచోటున పామువసించుచుండెను. ఆవైపుగా పోవుటకు ఎవరును సాహసించెడివారుకారు. ఏమన ఎవరేని అచ్చోటికిపోయిరా అది తక్షణమే కఱచి చంపెడిది. ఒక నాడు మహాత్ముడొకడు ఆతోవనుపోగా పాము వానిని తఱుముకొనిపోయి కరువజూచెను. కాని అదివానిని సమీపించగనే తన భీకరస్వభావమును గోల్పోయి ఆయనయోగమహిమకు వశమైపోయినది. అప్పుడు దానినిచూచి యోగి "మిత్రమా! నీవు నన్ను కఱవనెంతువా? అనెను." పాము సిగ్గుపడి మిన్నకుండెను. తుదకాయన "ఇటువినుము, సోదరా! ఇకమీదట నీవెవరిని హింసింపకుము" అనిబోధించెను. పామును శిరము వంచి అందుకొడంబడెను. యోగి వెడలినాడు; పాము తన కలుగున ప్రవేశించినది. అప్పటినుండి అది నిరపాయకర జంతువై, ఎవరిని బాధింపనెంచక పావనజీవనమును గడపుచుండెను. కొలది దినములకే చుట్టుపట్టుల వారెల్లరును ఆపామువిషము వమ్మయ్యెననియు, చెంతకుపోయిన అపాయములేదనియు చెప్పుకొనుచు దానిని పలువిధముల పీడించసాగిరి. కొందఱు రాళ్లు రువ్విరి; కొందఱు క్రూరత తోకబట్టియీడ్చిరి; ఈవిధముగా దానిబాధలు వర్ణించనలవి కాకుండెను. అదృష్టవశమున యోగితిరిగి ఆమార్గముననేవచ్చి గాయములచే కృశించియున్న పాముదుర్దశనుగాంచెను. చాల జాలిచెంది హేతువేమని యడిగెను! అందుకాపాము

స్వామీ ! మీబోధననుసరించి నేనెవరిని హింసించకుండుటే కారణము. కటా ! వారెంతయు క్రూరులైన ర్తించుచున్న వారలు" అనెను. యోగినవ్వి యిట్లుపలికెను:— "మిత్రమా! నేను ఎవరిని కఱవవద్దని చెప్పితినిగాని, ఎవరిని భయపెట్ట వలదంటినా ? నీవేజంతువును కఱవకున్నను, బుస్సుకొట్టి ఎవరును నీదఱికిరాకుండ నుంచగల్గుదువే !"

అటులనే మీరు సంసారులై జీవించునెడల బెదరించు వారును, గౌరవపాత్రులునునై యుండవలయును. ఎవరికిని హింస కలిగింపకుడు; మఱియు ఎవరివలనను హింసలను పొంద కుడు.

969. "సర్వము బ్రహ్మమేన" ని గురువు బోధించెను. శిష్యుడు దానిని అక్షరశః అర్థము చేసికొని, దాని అంతరార్థ మును తెలియుడయ్యెను. ఒకనాడు రాజవీధిని పోవుచుండగా వానికి ఏనుగొకటి ఎదురయ్యెను. పైనున్న మావటివాడు "తొలగుడు; తొలగిపొండు" అని అఱచుచుండెను. బ్రహ్మ చారి "నేనేల తొలగిపోవలెను? నేను బ్రహ్మమును; ఆఏనుగును బ్రహ్మమే. బ్రహ్మమునకు బ్రహ్మమువలననే అపాయమేమి రాగలదు ? అని తర్కించుకొనసాగెను; అటుల తర్కించి దారి తొలగడయ్యె. తుదకు ఏనుగు వానిని తొండముతో పట్టుకొనిప్రక్కకువిసరివేసినది. బ్రహ్మచారికిగాయములుతగిలి నవి. కొంతవడికి ఎట్టెటోగురువునుసమీపించి తనపాటునంతను వివరించి చెప్పినాడు. గురువామీదట "మంచిదే ! నీవు బ్రహ్మవు; ఆఏనుగును బ్రహ్మము! కాని మావటివానిసూక్

మునమున్న బ్రహ్మము పైనుండి నీకు హెచ్చరిక చేసెనుగదా? ఆబ్రహ్మముమాటనీవేల చెవినిబెట్టవైతివి?" అనిమందలించెను.

970. ఒకసారి నారదుడు తనకుమించిన భక్తుడులేడను గర్వమును పొందెను. వానిభావమునుగ్రహించి శ్రీహరి యిట్లులనెను. "నారదా! అల్లదిగో నీవాగ్రామమునకు పొమ్ము; ఆచ్చట గొప్పభక్తుడొకడుకలడు. వానిపరిచయము చేసికొనుము. అతడు నాభక్తుడు."

నారదుడాయూరికిపోయి ఒక వ్యవసాయకుని కనుగొనెను. అతడు ఉదయమునలేచి ఒక్కసారి హరీ! అనుచు నాగలినితీసికొని పొలమునకుబోయి దినమంతయు నేలదున్నుచుండును. రాత్రివేళమరల ఒక్కసారి హరీ! అని పరుండును. నారదుడిట్లు తలంచెను; "ఈమోటుమానిసి భగవద్భక్తుడెట్లు కాగలడు? వీడు దినమంతయు తీరికలేక పనులుచేయుచుండును. భక్తుని చిహ్నలెవ్వియు వీనియందు కానరావు."

అంత నారదుడు తిరిగి శ్రీహరిని సమీపించి తాను చూచివచ్చిన విషయమును తెలిపెను. ఆపలుకు లాలకించి శ్రీహరి "నారదా! ఈ నూనెగిన్నెను తీసికొని పట్టణమును చుట్టిరమ్ము. ఒక్కచుక్కయైనను గిన్నెనుండి పడరాదు సుమీ!" అనిచెప్పెను. నారదుడటులచేసి తిరిగివచ్చినప్పుడు "నారదా! ఈపట్టణముచుట్టు నీవు నడచునప్పుడు త్రోవలో నీవు నన్ను యెన్నిమారులు తలంచుకొంటివి?" అని అడిగెను. "స్వామీ! ఒక్కసారియు అటులచేయ లేదు. అంచులదాక నిండియున్న ఈగిన్నెను కనిపెట్టి చూచు

చున్న నాకు అన్యసంకల్ప మెటుల రాగలదు ?" అని నారదునకు పలికెను. అంతట శ్రీహరి యిటుల మందలించెను:—"ఈ ఒక్కగిన్నె నిన్ను నన్ను పూర్తిగ మఱచునటులచేసి, నీమనస్సును అన్యథా లాగివేసినది ! ఆసేద్యగాని స్థితిచూడుము ! అంతులేని సంసారభారమును మోయుచును గూడ ప్రతి దినము రెండుతడవలు నన్ను సంస్మరించును గదా !"

971. ఒక బ్రాహ్మణుడు తన శిష్యుడున్న ఒకానొక గ్రామమునకు పోవుచుండెను. వానివెంట సేవకులెవరును లేరు. త్రోవలో నొకమాదిగవాడు కాన్పించగా ఆయన వానితో నిట్లనెను. "ఓయీ ! నీవు నా సేవకుడవుగానుండి నాతోడ వచ్చెదవా ? నీకు చక్కనితిండి దొఱకును; నిన్ను బాగుగ పోషించెదను. రమ్ము!"

ఆ మాదిగవాడిట్లనెను:— "పూజ్యుడవగు దేవా ! నేను నీచజాతివాడను; నీ సేవకుడనని యెట్లు చెప్పకొనగలను.

ఆ బ్రాహ్మణుడు అందుమీద, "నీకు సంశయమేల ? నీవెవ్వడవో యెవరికిని తెలుపకుము; ఎవ్వరితోడను మాటాడవద్దు; ఎవరి పరిచయమును చేసికొనకుము" అనగా ఆతడు ఒడంబడినాడు. సాయంసమయమున ఆబ్రాహ్మణుని శిష్యునింటిలో ధ్యాననిష్ఠయందుండగా, వేఱొకబ్రాహ్మణుడు వచ్చి ఈబ్రాహ్మణుని సేవకునితో "ఓరీ! నీవు లోనికిపోయి నా చెప్పులను తెచ్చిపెట్టుము" అనెను. ఈసేవకుడు తన యజ

మానుని యుపాయము ననుసరించి మూరాడక యుండెను. ఆబ్రాహ్మణుడు మఱొకసారి పలుకరించినాడు. అప్పుడును వాడూరకుండెను. ఆబ్రాహ్మణుడు చాలాసార్లు వానిని పలుకరించసాగెను; కాని వాడుమాట్లాడడయ్యెను. తుదకా బ్రాహ్మణుడు విసిగి ఆగ్రహముచెంది "ఓరీ! నీవు బ్రాహ్మణుని ఆజ్ఞను తిరస్కరించుటకు సాహసించితివే! నీపేరెయ్యది! నీవు నిజముగా మాదిగవైయుందువు!" అనెను.

ఈ మాదిగవాడాపలుకులను విని గజగజ లాడుచు తన యజమానునితో దీనముగా నిట్లనెను. "మహాప్రభూ! నాగుట్టు తెలిసిపోయినది. నేనింక నిక్కడ నుండజాలను. నన్ను చచ్చిపోనిండు." ఇట్లు మనవిచేసి తక్షణమే కాళ్ళకు బుద్ధిచెప్పినాడు. ఇదేతీరున మాయ తనగుట్టు బయటపడిన తోడ్తోడనే పరుగిడిపోవును.

972. "అది త్వరలో జరుగును" "జరుగబోవుచున్నది", "ప్రారంభముచేయుచున్నాను" —

ఈరీతిగా పలుకుచు జాగుచేయుటవలన వైరాగ్యము మందగించును. ఎవ్వని హృదయమున వైరాగ్యాగ్ని ప్రజ్వరిలుచుండునో, ఆతడు బిడ్డకొఱకై పరితపించు తల్లినిబోలి, భగవంతునిగూర్చి తల్లడిల్లును. ఆతడు భగవంతుని వినా ఏమియు కోరడు. ప్రపంచము అంచుగోడలేని నూతివలె వానికి గోచరించును. ఎప్పుడు దానిలోపడిపోదునో అని యతడు బహుజాగరూకుడై మెలగును; ఇతరులవలె "ముందు నా సంసార విషయముల నన్నిటిని చక్కచేసికొననిండు;

తరువాత బ్రహ్మనిష్ఠనుపొందెదను" అని పలుకబోడు. అతడు
తీవ్రమగు మనోనిశ్చయము గలిగి యుండును.

ఒకానొక దేశములో అనావృష్టిబాధ సంభవించినది. వ్యవసాయకులందఱును కాలువలుత్రవ్వి పొలములకు నీరు పెట్టుటకై తీవ్రప్రయత్నములచేయుచుండిరి. వారిలోనొకడు గట్టిపట్టుదలగలవాడు, ఏటితో తనకాలువను కలుపువరకు ఆగకుండ త్రవ్వుటకునిశ్చయించెను. వానికి స్నానము వేళయైనది. వానిభార్య కొమార్తెచేతికిచ్చి నూనెను పంపినది. కూతురు వచ్చి"నాయనా! మిట్టమధ్యాహ్నమైనది. ఇదిగోచమురు, స్నానముచేయరమ్ము"అనెను. "ఉండుము; నాకింకనుపనితీరలేదు" అని తండ్రిచెప్పినాడు. మూడవజామును దాటినది; ఇంకను అతడు స్నానముచేయరాడు; తిండిమాటతలపెట్టడు! తుదకు వానిభార్య వచ్చి "నీవింకను స్నానము చేయవైతివేమి? అన్నము చల్లారిపోయినది. కూర రుచితప్పిపోవును. నీకెప్పుడును అతిఛాందసమే! ఇకనైననురమ్ము! తక్కినపని రేపో లేకున్న భోజనమైనపిమ్మటనో చేసికొనవచ్చును" అనిచెప్పసాగినది. ఆసేద్యగాడు మహారౌద్రరూపుడై, శాపనార్థములు పెట్టుచు, చేతనున్న పలుగుతో చావమోదువానివలె పెండ్లామును తఱుముచు ఇట్లనెను:— "ఓసీ! బుద్ధిహీనురాలా! చేనుఎండిపోవుచున్నది. కండ్లకనబడుటలేదా? నేను ఈదినమున చేనుకునీళ్లుపెట్టవలెను;ఆపిమ్మటనే ఏసంగతైనను!"వాని ఆగ్రహమునుగాంచి ఆస్త్రీ పర్విడిపోయినది. భగీరథ ప్రయత్నముచేసి, ఎట్టకేలకు, అర్ధరాత్రివేళ, అతడు తనపంతమును

నెగ్గించుకొనగల్గినాడు. ఏటినీరుజలజలసందడిచేయుచు తనపొలములోనికి ప్రవహించుటచూడ వానిఆనందమునకు మేరలేకుండెను. అనంతరముఅతడుఇంటికిపోయిస్నానముచేయుటకై చమురుతెమ్మనెను. స్నానమును, భోజనమును ముగించిన పిమ్మట సుఖముగా గుఱ్ఱుపెట్టి నిదురించినాడు. ఇటువంటి స్థిరసంకల్పము తీవ్రవైరాగ్యమునకు నిదర్శనము.

ఇంకొక వ్యవసాయకుడును అదేపనిలోనుండెను. వాని భార్యవచ్చి యింటికి రమ్మనగనే, పార భుజమునబెట్టుకొని మారాడక వెడలిపోయినాడు. ఆతడు సకాలమున పొలమునకు నీరుపెట్టుకొనలేకపోయినాడు. ఇతని వర్తనము సోమరితనమునకును, మందవైరాగ్యమునకును నిదర్శనము. తీవ్రయత్నము లేక పొలమునకు నీరుపెట్టజాలని విధమున తీవ్రసంకల్పము నిష్ఠ లేనిది బ్రహ్మసాక్షాత్కారమును బడయుటయు సాధ్యముకాదు.

973. ఒకప్పుడు సాధువొకడు తన శిష్యునికి ఆత్మజ్ఞానము నేర్పు నుద్దేశ్యముతో ఒకతోటలోనుంచి వెడలిపోయెను. కొన్నిదినములకు గురువువచ్చి వానికేమైన కొఱతయుండెనా? యని విచారించెను. శిష్యుడు ఔననగా, వానికి తోడుగనుండుటకై “శ్యామ” అను ఒకసుందరిని పంపి, మత్స్యమాంసములను స్వేచ్ఛగా తినుచుండుమని చెప్పెను. చాల కాలమునకు పిమ్మట గురువు తిరిగివచ్చి వెనుకటిరీతినే విచారణచేసెను. ఈసారి శిష్యుడు “లేదు, నాకేమియు కొఱతలు లేవు” అనెను. అంతట గురువు వారిరువురను పిలిచి

శ్యామ చేతులనుచూపి "ఇవియేమిటో చెప్పగలవా ?" అని శిష్యుని అడిగెను.

శిష్యుడు—"ఏల అట్లడిగెదరు? అవి శ్యామ చేతులు!"

గురువు—"ఇదేమిటి ?"

శిష్యుడు—"శ్యామముక్కు!"

గురువు—"ఇవేమిటి?"

శిష్యుడు—"శ్యామకండ్లు!"

ఇట్లే గురువుప్రశ్నించుచు నుండెను.

ఇంతలో "నేను ప్రతిదానినిగూర్చియు శ్యామకు చెందినదిగా చెప్పుచున్నాడనే! ఇక శ్యామఎవరు ?" అనుశంక శిష్యునిమనస్సునకు తట్టినది. అంతట రిచ్చపాటుచెంది "ఈ కండ్లు చెవులు మున్నగునవి యెవరివో ఆ ఈశ్యామయెవరు?" అని శిష్యుడు గురువును అడిగినాడు. గురువు "ఈశ్యామ యెవరో నీవు తెలియగోరుదువేని నాతోడరమ్ము. నీకు బోధ చేసెదను" అని చెప్పి తీసికొనిపోయి ఆ రహస్యము నుపదేశించెను.

974. మండోదరి తనభర్తయగు రావణునితో "నీకు సీత కావలసియున్నచో, నీకుగల మాయాశక్తులవలన సీతా పతియగు రాముని రూపమునుదాల్చి ఆమెనుభ్రమపెట్టవచ్చునే?" అనెను.

"ఛీ ఛీ! మూఢురాలా! నేను రాముని పవిత్రరూపమును దాల్చినయెడల నాకింక యింద్రియభోగవాంఛలు మనసుననిలుచునా ?ఆరూపుస్ఫురణకు రాగానే నాహృదయము

అనిర్వాచ్యమగు ఆనందముతో తాండవించునుగదా! అప్పుడు స్వర్గమహదైశ్వర్యములును క్షుద్రములై తోచును." అని రావణుడు ప్రత్యుత్తరమిచ్చినాడు.

975. ఒక మాలవాడు మాంసముతోనిండిన తట్టలను యిరువైపులను కావడిలో పెట్టుకొని మోయుచు, శ్రీశంకరాచార్యులవారికెదురుపడెను. ఆయన అప్పుడే గంగాస్నానముచేసి మరలిపోవుచుండెను. ఆయన పవిత్రశరీరమునకు మాంసపుకావడి తాకుట తటస్థించినది. "ఛీ ఛీ! నీవు నన్ను తాకితివే!" అని శ్రీశంకరాచార్యులువారు క్రోధితులై పలికిరి. ఆమాలవాడిటుల ప్రతిపలికెను:— "అయ్యా! నేను నిన్ను తాకలేదు; నీవునన్ను తాకలేదు. నీవుయదార్థమున శరీరమా, లేక మనస్సా, లేక బుద్ధియాతర్కించిచెప్పుము. నీవుఎవ్వరవో యదార్థము వచింపుము. ఈవిశ్వముగాకూడిన త్రిగుణములలో దేనికిని, సత్వమునకుగాని, రజస్సునకుగాని, తమస్సునకుగాని, యదార్థముగ నీఆత్మ అంటియుండజాలదని నీకు తెలియునుగదా!"

అంతట శ్రీశంకరాచార్యులు లజ్జావహితుడై సత్యప్రబోధమును గాంచినాడు.

976. ఒక తండ్రికి ఇద్దరు కొడుకులుండిరి. సరియైన వయస్సురాగనే వారిని బ్రహ్మచర్యాశ్రమమును స్వీకరింపజేసి, వేదాధ్యయనము కొఱకై ఒక గురువునొద్ద ప్రవేశపెట్టినాడు.

వారు చదువులముగించి చాలకాలమునకు ఇంటికి మరలివచ్చిరి. వారు వేదాంతమును చదివియుండిరాయని తండ్రి విచారణ చేయబూనినాడు. వారౌనని చెప్పగా, "మంచిది! బ్రహ్మమన నెట్టిదో నాకు చెప్పుడు" అనెను.

పెద్దకుమారుడు వేదములనుండియు, శాస్త్రముల నుండియు, ప్రమాణములనుఎన్నిటినోజూపుచు ఇటుల జవాబు చెప్పినాడు:— "ఓజనకా! బ్రహ్మమును నోటిమాటలతో వర్ణించుటకు వీలుపడదు; అది మనస్సునకు గోచరముకాదు." ఇటుల తెలిపియు బ్రహ్మము ఇట్టిదిఅట్టిది అని వర్ణింపబూని, నాకింతయు తెలియునని వక్కాణించినాడు. తాను చెప్పుదానిని బలపఱచుటకై శృతివాక్యములను ఏకరువుపెట్టసాగెను.

కొంతవడికి తండ్రి వానితో "సరే! నీకు బ్రహ్మమును నిజముగా తెలిసినట్లే! నీపనిమీాద నీవుపొమ్ము" అని వానిని పంపివేసెను. పిమ్మట చిన్నకొమరునిగూర్చి తన ప్రశ్నను తిరిగి వేసెను. ఆకుర్రవాడు మౌనముదాల్చినాడు. వానినోట ఒక్కపలుకైనను వెలువడదయ్యె. మాటాడుటకై ప్రయత్నము నేనిఅతడు చేయలేదు.

తండ్రి యిటులపలికినాడు:— "మంచిది; బిడ్డా! నీవు చేసినదే సరి! అవ్యయునిగురించి ఏమియు చెప్పగలదిలేదు. దానినిగురించి చెప్పుటకు నోరు తెఱవగనే అనంతము సాంతముగను, సంగరహితుని సంగసహితునిగను, అపరిమేయుని పరిమేయునిగను వర్ణింపబూనినట్లౌను. మహాపరిగల్పముతో

నూరు శ్లోకములను ఏకరువు పెట్టుటకంటే మౌనముతాల్చుట ఈవిషయమున మహోపన్యాసము నిచ్చినట్లగును!”

977. అగ్బరు రాజ్యము చేయుచుండినకాలమున ఢిల్లీ సమీపమున నొక అడవిలో ఫకీరొకడు ఒక గుడిసెలో వసించుచుండెను. అనేకులుప్రజలు వానిని దర్శించి వచ్చుచుండిరి. కాని వారికెవరికిని తన ఔదార్యమునుచూపుటకు వానికడ నేమియులేకుండెను. వానికి ధనము కావలసివచ్చినది. అగ్బరు ఫకీరులయెడ భక్తిగలవాడను ప్రఖ్యాతియుండెగాన, ఈఫకీరు ధనసాహాయ్యముకొఱకై పాదుషాకడకు పోయెను. అగ్బరు ఆసమయమున దైవప్రార్థన సలుపుచుంట తెలిసి ఫకీరు ప్రక్కనకూర్చుండి వేచియుండెను. అగ్బరుషా తన ప్రార్థనలలో “ఓదేవా! నాకు ఇంకను సంపదనిమ్ము! ఎక్కువ బలమునను గ్రహింపుము! నారాజ్యమును విస్తరింపజేయుము!” అని వేడుకోలుసాగించినాడు. తక్షణమే ఫకీరు లేచి గదివిడిచి పోనుండెను. ఇంతలో చక్రవర్తియగు అక్బరు కూర్చుండియుండుడని సైగచేసినాడు.

ప్రార్థనానంతరము పాదుషా ఫకీరుతో „మీరు నన్ను చూడవచ్చితిరే! నాతోఏమియు చెప్పకుండనే వెడలిపోవనెంచితిరేమి?” అనెను. అంతట ఫకీరు „నేను శ్రీవారిని చూడవచ్చినపనియా—ఎందుకులెండి మిమ్ము్మను బాధించను” అనెను. వానికేమికావలయునో తెలుపుమని అక్బరు ఒత్తిడి చేసి అడుగసాగెను. తుదకు ఫకీరు „అయ్యా! నాకడకు అనేకులు బోధకొఱకై వత్తురు. ధనములేమిచేత నేను వారిని

ఆదరింపజాలకున్నాను. కావున చక్రవర్తులగు మీసాహాయ్యము కోరుట మంచిది అనుకొంటిని" అని తెలిపెను. అటులైనచో తన యుద్దేశమును తెలుపకయే వెడలిపోవచూచుటకు కారణమేమని అక్బరు అడిగినాడు. ఫకీరిటుల జవాబు చెప్పినాడు:—„మీరలే అల్లానుగురించి ఎక్కువసంపదకోఅకును, అధికారము కొఅకును, రాజ్యముకొఅకును అడిగికొను యాచకులుగానుండుట గ్రహించితిని అంతట నాకిటులతోచినది:— „తానే యాచకుడుగానున్నపురుషుని నేను యాచింపనేల? యాచనచేయక నాకు గడవనేగడవనిచో ఆ అల్లానే యాచించుట మంచిది!"

978 ఒకప్పుడు ఒకనికొడుకు చావునకు సిద్ధముగనుండెను. ఎవరును వానిరోగము మాన్పలేకుండిరి. ఎట్టకేలకొకసాధువు వచ్చి "ఒక్కఉపాయమున్నది. త్రాచుపాము విషము తెచ్చి స్వాతినక్షత్రమునుండిపడిన వర్షబిందువులు కొద్దిగవేసి, మానవుని పుఱ్ఱెలోకలిపి యిచ్చినయెడల నీకుమారుడు బ్రతుకునని" తెలిపెను. వానితండ్రి ఆలోచించి, మరునాడే స్వాతినక్షత్రము ఆకాశమున ఉచ్చస్థానమున నుండునని తెలిసి "ఓదేవా! ఈపరిస్థితులన్నియు కలసివచ్చునట్లనుగ్రహింపుము. నా పుత్రునిప్రాణము రక్షింపుము" అని ప్రార్థించినాడు. ఎక్కువ ఆతురపాటుతో పరితపించుహృదయముతో, నాటిసాయింతనమే బయలుదేఱి స్మశానములన్నియు తిరిగి నరకపాలము కొఅకై వెదుకసాగెను. తుట్టతుదకు ఒక చెట్టుక్రింద పుఱ్ఱెయొకటి పడియుంట కానవచ్చెను. ఆయన దైవ

ప్రార్థనము చేయుచు కనుపెట్టుకొనియుండెను. ఆకస్మికముగా జల్లువచ్చి కొన్ని చినుకులు పైకి తెఱచియున్న పుత్తిలో పడినవి. ఆయన సంతసించి "ఇదిగో! స్వాతి వర్షజలము నరుని పుత్తిలోనె లభించినది!" అనుకొని, "భగవంతుడా! తక్కినవి కూడ సమకూర్చుము" అని భక్తిపూర్వకముగ ప్రార్థించుచుండెను. కొలదిసేపటికే ఆపుత్తె సమీపమునందే ఒకకప్ప కాన్పించగా మరల ప్రార్థనలసాగించినాడు. ఒక త్రాచు సమీపముననున్న గడ్డిలోనుండి బుస్సుమనుచు లేచి కప్పను పట్టుకొనబోయినది. వెంటనే కప్పపుత్తెమీదుగా దుమికినది. ఆత్రాచుపామువిషము పుత్తిలో పడినది. అపరిమితమగు కృతజ్ఞత మనస్సున వెల్లివిరియ ఆతండిట్లు "ఓదేవదేవా! నీకృపవలన దుర్లభవిషయములన్నియు సాధ్యములైనవి! ఇక నాపుత్రుని జీవములు సురక్షితములు కాగలవు. నేనెఱుగుదును" అనెను. కాబట్టి నేను తెలుపునదేమన, నీయందు నిజమగు గాఢవిశ్వాసమున్నయెడల ఈశ్వరానుగ్రహమువలన సమస్తమును సమకూరగలవు.

979. ఒకానొక దేవతార్చన బ్రాహ్మణుడు ఒకరింట దేవపూజలు చేయుచుండేవాడు. ఆపనిని తన చిన్నకుమారునకు ఒప్పగించి యొకసారి ఆయన గ్రామాంతరముపోయెను. నిత్యనైవేద్యమును దేవునిముందు బెట్టి ఆదేవత దానిని ఆరగించుట కనిపెట్టుమని చెప్పిపోయెను. తండ్రియాజ్ఞచొప్పున పిల్లవాడు నైవేద్యమును విగ్రహముముందుపెట్టి మౌనముతో వేచియుండెను. కాని ఆవిగ్రహము తినను తినదు; మాటా

కను మాటాడదయ్యె. పిల్లవాడుచాలసేపుఅటులనే వేచియుం డెను. ఆదేవత పీఠముదిగివచ్చి నైవేద్యముపెట్టిన పళ్లెరము చెంతకూర్చుండి, దానిని తినునని ఆపిల్లవాని దృఢవిశ్వాసము! అంతనాతడు "ఓదేవా! రమ్ము, ఆరగింపుము! చాల ఆలస్య మగుచున్నది; నేనింక వేచియుండజాలను" అని ప్రార్థించ మొదలిడెను. కాని భగవంతుడు పలుకలేదు. ఆబాలుడప్పుడు "భగవంతుడా! నీవీనైవేద్యమును ఆరగింపగా కనిపెట్టియుండు మని నాతండ్రి ఆజ్ఞాపించియున్నాడు. నీవేలరావు? నీవు నా తండ్రికడకువచ్చి ఆయన అర్పించుదానిని ఆరగింతువుగదా! నీవువచ్చి నేను అర్పించుదానిని గ్రహింపకుండుటకు కారణ మేమి? నానేరమేమి?" అనుచు ఏడ్వసాగెను. ఆవిధ ముగా చాలసేపు వెక్కి వెక్కి ఏడ్చినాడు. అంతట దేవ తాపీఠమునంక కనువిచ్చిచూడగా, భగవంతుడు నరరూప మునవచ్చి నివేదిత పదార్థములను తినుచుంట కానవయ్యెను. అటులదేవతార్చననుముగించి బాలుడు వెలుపలికిరాగా, ఆ యింటివారు దేవతార్చన ముగిసినయెడల ప్రసాదమును తీసికొనిరమ్మనిరి. "అవును. దేవతార్చన ముగిసినది! భగ వంతుడు అంతయు తినివేసినాడు!" అనిబాలుడు పలికెను. అందఱును నివ్వెరపోయి "ఏమనుచుంటివి!" అనిరి. సంపూ ర్ణనిష్కాపట్యము మోమున తాండవించగా బాలుడు "ఏమున్నది? భగవంతుడు నేను అర్పించినదాని నంతటిని ఆరగించినాడు" అనెను. అప్పుడువారు దేవతార్చనమంది రముప్రవేశించి వట్టివైయున్న పళ్లెరములగాంచి అద్భుతపడిరి!

సత్యమగు భక్తియొక్కయు, నిష్ఠయొక్కయు మహాత్మ్య మటువంటిదిగ నుండును !

980. ఒకమనుష్యుడు అడవులగుండ ప్రయాణముచేయు చుండెను. త్రోవలో ముగ్గురుదొంగలు వానిని ముట్టడించిరి. వానికడ కాన్పించినదానినెల్ల వారు దోచుకొని పోయిరి. అంతట నొకదొంగ "ఈమనిషిని జీవముతో విడిచిన లాభమే మున్నది?" అనుచు కత్తిదూసి వానిని చంపబోయెను. ఇంతలో మఱొకడు వానిని ఆపి, "వీనిని చంపినందువలన లాభమేమున్నది? చేతులు కాళ్లు కట్టివేసి ఒకప్రక్కను పడ వేసి పోవుదము" అనెను. అంతట వారాతనిని కాళ్లుసేతులు బంధించి, త్రోవప్రక్కగా పడవేసిపోయిరి. వారు వెడలి పోయినకొంతసేపటికి మూడవదొంగ తిరిగివచ్చి "అయ్యో ! నీకుబాధకలిగినదా? నీబంధనములు విప్పి నిన్ను విడుదల చేతును" అని కట్లువిప్పివేసెను. మఱియు «నాతోడరమ్ము; నీకు త్రోవచూపిపోదును" అనెను. వారటుల చాలదూరము కలిసిపోగా మార్గముకాన్పించినది. అప్పుడాదొంగ "అదిగో! నీయిల్లు! ఈత్రోవనుపొమ్ము; నీయిల్లుచేరుదువు" అనెను. అంతట ఆమనుష్యుడు «అయ్యా! నీవు నాకు చాల ఉప కారముచేసినావు. నేను సదాకృతజ్ఞుడనై యుందును. నీవు నాతోకూడ మాయింటికిరావా!" అనెను. దొంగవాడా తనితో «వల్లపడదు. నేను అక్కడికి రాజాలను. పోలీసు వారు నన్ను పట్టుకొనగలరు అని పలికెను. ఈసంసారమే అడివి. ప్రకృతి గుణములగు సత్వరజస్తమో గుణములే ముప్పు

దుదొంగలు. జీవుడే బాటసారి. ఆత్మజ్ఞానమే వానిసొత్తు. తమోగుణము జీవుని నాశనముచేయజూచును; రజోగుణము సంసారబంధనమున చిక్కించును. సత్వగుణము వానిని రజస్తమస్సులబారినుండి రక్షించును. సత్వగుణముయొక్క శరణుజొచ్చి జీవుడు తమోగుణబంధములగు కామక్రోధాదుల నుండి విడివడును. సత్వగుణము జీవుని సంసారబంధనముల న్నిటినుండియు విడిపించును. కాని సత్వగుణముసయితము దొంగయే. అయినను అది జీవునికి పరమాత్మనుజేరు మార్గ మునజూపి "అదిగో నీయిల్లు!" అని మాత్రము తెలుపును. అంతట అదియు అదృశ్యమగును. ఈసత్వగుణముసయితము పరమాత్మ సమీపమునకు పోజాలదు.

981. భగవత్సాక్షాత్కారమును పొందవలయునని యిద్దరు యోగులు సాధనలుచేయుచుండిరి. నారదుడు వారి పర్ణశాలమీదుగ పోవుచుండుట తటస్థించెను. వారిలో నొకడు నారదునితో నీవు స్వర్గమునుండి వచ్చుచుంటివా అనెను. నారదుడు ఔననగా, ఆయన స్వర్గాధినాథుడు ఏమిచేయుచుండగా చూచితివని అడిగెను. నారదుడు అంతట "లొట్టిపిట్టలను ఏనుగులను భగవంతుడు సూదిబెజ్జముగుండ దూర్చుచుండ చూచితిని!" అనెను. "దానిలో ఆశ్చ ర్యపడదగిన అంశములేదు. భగవంతునికి అసాధ్యకార్య మేముండును?" అని ఆయోగిపలుకగా, రెండవయోగి "వెఱ్ఱి మాట! అది అసంభవము! దీనివలననీవు భగవత్సాన్నిధ్యము నకు పోనేలేదని రుజువగుచున్నది" అనెను.

మొదటి యోగిభక్తుడు; పసివానినిబోలు విశ్వాసముకల వాడు. భగవంతునికి అసాధ్యమనునదిలేదు. ఆయన మహిమను ఎవడుపూర్ణముగ గ్రహించినాడు? భగవంతునిగూర్చి ఏమైనను పలుకవచ్చును!

982. ఒకానొక పల్లెలో సాలెయతడొకడుండెను. ఆతడు పరమార్థ చింతకలవాడు. ప్రతివారును అతనిని విశ్వసించి ప్రేమించెడివారు. ఆసాలె తాను నేసిన వస్త్రములను అమ్ముటకై బజారునకు పోయేవాడు. ఎవరేని వెలమడిగినయెడల "రామేచ్ఛవలన నూలుకరీదు ఒక్కరూపాయి. రామేచ్ఛవలన కూలి పావలా రామేచ్ఛవలన లాభము బేడ. రామేచ్ఛవలన ఈగుడ్డకరీదిప్పుడు రూపాయి ఆరణాలు" అనే వాడు. ఆతడెంత వెలచెప్పినను ప్రజలు ఆవెలనిచ్చి కొనుచు అతనియెడ కడువిశ్వాసముతోనుండిరి. ఆతడును గొప్పభక్తుడు. రాత్రులందు భోజనానంతరము ధ్యానముమీదకూర్చుండి భగవన్నామస్మరణ చేయుచుండును.

ఒకదినమున రాత్రిచాల ప్రొద్దుపోయినది; వానికి నిద్రపట్టలేదు. చావడిలో ద్వారముకడ కూర్చుండి పొగ త్రాగుచుండెను. ఒకజట్టుదొంగలు ఆత్రోవను పోవుచుండిరి. వారికొక మోతగాడు కావలసియుండెను. వారీసాలెవానిని చూచి తమతో లాగికొనిపోయిరి. వారొకయింటిలో చొరబడి చాల సొత్తును ముచ్చిలిరి. దానిలోకొంత ఈసాలెవాని నెత్తినబెట్టి మోయుమనిరి. ఇంతలో కావలివాడావైపునకు రాగా దొంగలు పారిపోయిరి. నెత్తిని దొంగసొత్తు మోయు

చున్న సాలె పట్టుపడెను. ఆరాత్రి అతడు చెఱసాలలో గడుపవలసివచ్చినది. మరునాటిఉదయము న్యాయాధికారి ఎదుట విచారణకై అతడు తీసికొని రాబడెను. గ్రామస్థులందఱు ఆవార్తవిని సాలెవానిని చూడవచ్చిరి. వారందఱును ఒక్కమాటగా "ప్రభూ! ఈమనుష్యుడు దొంగపని చేసియుండడు." అని యేకగ్రీవముగా చెప్పిరి. న్యాయాధిపతి జరిగినదేమొ చెప్పుమని సాలెవానిని అడిగెను. అంతట సాలె యిట్లుమనవిచేయసాగెను:— "ప్రభూ! రాముని యిచ్ఛవలన నేను చావడిలో కూర్చున్నాను; రామేచ్ఛవలన రాత్రి చాలపొద్దుపోయినది; రామేచ్ఛవలన నేను భగవధ్యానము చేయుచుంటిని; రామేచ్ఛవలన హరినామస్మరణచేసితిని; రామేచ్ఛవలన దొంగలావైపుగ వచ్చిరి; రామేచ్ఛవలన వారునన్ను తమతో ఈడ్చుకొనిపోయిరి; రామేచ్ఛవలన వారు ఒకయింటిలో కన్నము వేసి దూరిరి; రామేచ్ఛవలన వారుదొంగిలినసొత్తును కొంత నానెత్తినబెట్టిరి. రామేచ్ఛవలన నేను పట్టుబడితిని. రామేచ్ఛవలన నన్ను చెఱలో నుంచిరి; రామేచ్ఛవలన మీయెదుట నేను విచారణకు నిలుపబడితిని." న్యాయాధిపతి వాని నిష్కాపట్యమును పారమార్థికతనుచూచి నిర్దోషియని విడిచివేసెను ఆతడు బయటికి వచ్చి "రామేచ్ఛవలన నిర్దోషినైతిని" అనెను. నీవు సంసారివిగా నుండుము; లేదా సన్న్యాసివిగా నుండుము. అంతయు రామేచ్ఛవలననే జరుగును. బాధ్యతనంతను భగవంతునిపై నిడి కర్తవ్యకార్యములను నీవుచేయుము.

983. తీవ్రకాంక్ష భగవత్సాక్షాత్కారమునకు త్రోవ. పసివాండ్రకుండునట్టి నిష్కాపట్యముండవలయును; తల్లిని చూచుటకై వారికి కలుగునంతటి తీవ్రకాంక్ష యుండవలయును.

జటిలుడను పిల్లవాడుకలఁడు. అతడు బడికిపోవునప్పుడు అడవిగుండ ఒంటరిగా పోవవలసియుండెను. అతడు తఱుచుగా భయపడుచుండెడివాడు. ఈమాట అతడు తల్లితో చెప్పగా తల్లి "బిడ్డా! భయపడనేల? నీకు భీతికలిగినప్పుడెల్ల కృష్ణుని పిలువుము" అని చెప్పెను. "కృష్ణుడెవరమ్మా?" అని బాలుడు అడిగినాడు "కృష్ణుడు. నీఅన్న" అని తల్లిచెప్పినది. ఆపిమ్మట జటిలునకు అడవిలో భయముతోచినప్పుడెల్ల "అన్నా! కృష్ణా!" అని అరచెడివాడు. ఎవరును రాకపోవుటచేత ఇంకనుబిగ్గఱగా "అన్నా! ఓకృష్ణా! ఎక్కడనున్నావు? నాకు భయముకలుగుచున్నది. రారమ్మా! నన్ను రక్షింపుము." అని మొఱలిడేవాడు. పరమవిశ్వాసియగు ఈ బాలుని మొఱవిని కృష్ణుడు రాకయుండగలడా? కృష్ణుడొక చిన్న బాలునిరూపు తాల్చివచ్చి "సోదరా!వచ్చితిని. నీకు భయమెందుకు, నాతోడరమ్మా! నేను నిన్ను బడికితీసికొని పోయెదను" అనెడువాడు. ఆబాలుని బడికడ విడిచి "నీవు పిలిచినప్పుడెల్ల నేనువచ్చెదను. భయ పడకుము."అని కృష్ణుడు చెప్పెడివాడు.

సత్యమగు భక్తివిశ్వాసముల మహిమయట్టిది!

984. ఆత్మజ్ఞానము పొందుటకు పారమార్థిక సాధనలు

ముఖ్యావసరము; కాని పూర్ణ విశ్వాసమున్న యెడల స్వల్ప ప్రసాధనయే చాలును.

వ్యాసులవారు నదిని దాటబోవుచుండిరి. అప్పుడే గోపికలును వచ్చిరి. వారును ఏఱుదాటగోరియున్నారు; కాని రేవున పడవలేదు. చేయదగునదేమని వారు వ్యాసులవారి నడిగిరి. అందుకాయన "దిగులుపడకండి నేను మిమ్మును ఏఱుదాటించెదను. కాని నాకు ఆకలి వేయుచున్నది. తినుటకు ఏమైన పెట్టెదరా?" అనెను. గోపికలకడ పాలు వెన్న మీగడ యుండగా వానికి పెట్టిరి. ఆయన భుజించినాడు. అంతట గోపికలు "నదిని దాటించుటే మైనది ?" అని వేగిరించిరి. వ్యాసులవారు నీటియొడ్డున నిలువబడి "ఓయమునా! ఈదినమున నేనేమియు తినియుండని యెడల, ఆ మహాత్మ్యవలన నీరుపాయలై మేము పొడినేలమీదుగ దాటిపోవునటుల త్రోవనిత్తువుగాక !" అని పలికెను. ఆయన నోటనుండి యీపలుకు రాగానే నీరు రెండుపాయలై నడుమగా పొడినేల కాన్పించెను. గోపికలు అద్భుతపడిరి. "ఇప్పుడే మనము పెట్టినవన్నియు తిని, నేనేమియు నేడుతినని యెడల, అని యీయన పలుకు టేమివింత !" అని తలంచుచుండిరి. వ్యాసులవారు తానుగాదేనిని తినలేదనియు, తనలోని స్వామియే నిజముగా ఆరగించియున్నాడనియు స్థిరభావమును కలిగియున్నందుకు అది నిదర్శనమని ఆగోపికలు గ్రహించరైరి.

985. ప్రతాపచంద్రముజుందారుగారితో శ్రీ పరమహంసులవారిట్లనిరి:— "మీరువిద్యావంతులు, బుద్ధిశాలురు;

జిజ్ఞాసాపరులు. కేశవచంద్రసేనులును మీరును గౌరాంగ నిత్యానందులబోలు సోదరులు. మీరు ప్రపంచమును చాలి నంత చూచినారు — కావలసినన్ని ఉపన్యాసాలు, వివాద ములు, శాఖాసమాజాలు ఎన్నో చూచినారు. మీకింకను వానియెడ లక్ష్యమున్నదా? అటునిటు చెదఱు మీమానసము లను ఏకాగ్రముచేసి భగవంతుని వైపునకు మరలించు సమ యము దాటిపోవుచున్నది. పరమాత్మసాగరమున నిమగ్నులు కండు."

ముజుందారుగారు:—"అవును, స్వామీ! నేను అటుల చేయవలసినదే. ఆ విషయములో సందేహములేదు. కాని ఇదంతయు నేను చేయుట కేశవుని పేరు ప్రఖ్యాతులను నిలువ బెట్టుటకే!"

పరమహంసులవారు:— (నవ్వుచు) "నేనొక కథ చెప్పెద వినుడు. ఒకడు కొండనెత్తిని గుడిసెవేసినాడు. చాల కష్టపడినాడు; డబ్బును హెచ్చుగ కర్చుచేసినాడు. కొద్ది దిన ములకే గాలివానవచ్చి ఆకొంపను ఉఱ్ఱూతలూగింపసాగినది. దాని నెటులైన సంరక్షించనెంచి "ఓదేవా! ఈగుడిసెను నాశముచేయకుము!" అని వాయుదేవుని ప్రార్థించినాడు. అతడు పెక్కుసారులు ప్రార్థించినను గుడిసె ఊగులాడుచునే యున్నది. అప్పుడు అతడు వేఱొక ఉపాయమును ఆలోచిం చినాడు. హనుమంతుడు వాయుదేవుని కుమారుడని పురాణ ములు చెప్పుమాట వానికి జ్ఞప్తికివచ్చినది. వెంటనే "ఓదేవా! ఈగుడిసెను కాపాడుము. ఇదినీతనయుడగు హనుమంతునిది!"

అని కేకలు వేసినాడు. అయినను వాయుదేవుడు వినిపించు కొనలేదు. అంతట "ఓ దేవా! ఈగుడిసె హనుమంతునిస్వామి యగు శ్రీరామచంద్రునిది" అని అఱచినాడు. అప్పుడును వాయువు లక్ష్యముచేయలేదు. పిమ్మట ఆగుడిసె తలక్రిందై పోవుచుంట కనిపెట్టి తన ప్రాణరక్షణార్థమై బయటికివచ్చి వేసి, అతడు "ఈ ముష్టిగుడిసె ధ్వంసమైపోనీ! నాకేమి?" అనినాడు.

మీరిప్పుడు కేశవునిపేరు నిలుపుటకు ఆతురపడుచున్నారు; అయినను, భగవదేచ్ఛయుండుటంజేసి ఆ పవిత్రోద్యమము కేశవునిపేర బయలువెడలినదనియు, ఆ యుద్యమము అంతరించునేని అదియు భగవత్సంకల్పము చేతనే జరుగుననియు జ్ఞప్తినుంచుకొనుడు; శాంతిపడుడు. కాబట్టిమీరు అమృతసాగరమున నిమగ్నులగుటకు ఆయత్తపడుడు."

986. అడవులలో తిరుగుచుండగా శ్రీరామచంద్రుడు తన విల్లంబులను నేలలోగుచ్చి, పంపాసరస్సులోనికి నీరు త్రాగ దిగినాడు. వానివిల్లు గ్రుచ్చుకొనుటచేత ఒడలంతయు నెత్తుటితోనున్న కప్పయొకటి, ఆయన తిరిగివచ్చినప్పుడు కంట బడినది. ఆయన విచారపడి "నీవెందుచేత ఏదోరీతిగా అరవనైతివి? అప్పుడు నీవిక్కడనుంటివని గ్రహించి నీకీ దుఃఖపాటును కల్పించి యుండెడివాడను కానే!" అని కప్పతో ననెను. అందుకాకప్ప "ఓ రామా! నాకపాయము సంభవించినప్పుడు 'ఓరామా! రక్షింపుము' అనినిన్ను వేడుకొనుచుందును.

ఇప్పుడో నీవే నన్ను చంపుచుండగా ఇంక నెవరినిగురించి నేను మొఱలిడగలను ?" అని జవాబుచెప్పినది.

987. పతివ్రతయు భక్తాగ్రేసరియు నగు ఒకానొక స్త్రీ భర్తతో కాపురముచేయుచు, బిడ్డలను ప్రేమతో చూచుచును తనహృదయమును భగవంతునిపై స్థిరముగా నిలిపి యుంచెడిది. ఆమె భర్తమృతిచెందగా చేతులనున్న గాజులను పగులగొట్టివేసి వానికిమారుగా బంగారుకంకణములను ధరించినది. ప్రజలు ఆమె విపరీతచర్యను గురించి ఆశ్చర్యపడసాగిరి. అప్పుడామె యిటుల సమాధానముచెప్పినది:—"ఇంతవఱకును నాభర్తశరీరము గాజులవలె అల్పబలముగలదై పెళుసుగ నుండెను. ఆ అశాశ్వతతనువు పోయినది. ఆయన యిప్పుడు నిర్వికారుడై సర్వవిధముల సుస్థిరుడై యున్నాడు. వానిశరీరము ఇప్పుడు ఓటికుండగాదు. కావున నేను ఓడోడుగానుండు గాజులను దీసివేసి స్థిరతరస్వభావముగల ఆభరణములను ధరించుచున్నాను."

988. ఒకపర్యాయము ఇద్దరుసాధువులు దక్షిణేశ్వరమునకు వచ్చిరి. వారు తండ్రికొమారులు. కొమారుడు జ్ఞానసిద్ధిని బడసినాడు; తండ్రికింకను సిద్ధి యలవడలేదు. ఇరువురును శ్రీరామకృష్ణపరమహంసులవారుండు గదిలోకూర్చుండి శ్రీవారితో ప్రసంగించుచుండిరి. ఇంతలో ఒకఎలుకకన్నములోనుండి త్రాచుపామువచ్చి కొమారుని కఱచినది. అదిచూచి తండ్రి భీతిలిపోయి చుట్టునున్నవారినందఱిని పిలువసాగెను. కాని కుమారుడు కదలక కూర్చుండియుండెను; ఇది వానితండ్రికిం

కను అబ్బురము గొలిపెను. అట్లెందుకు నిశ్చలముగ కూర్చుంటి వని ఆయన కొమారుని ప్రశ్నింపగా, ఆ కుమారుడు నవ్వి యిట్లనెను: "పాముఏది? ఎవరిని కఱచినది?" ఆతడు అద్వైతసిద్ధిని పడసినవాడు. కావున పామని నరుడని భేదభావమును దఱిరానీయడయ్యెను.

989. ఒకసారి చాకలియొకడు ఒక భక్తుని పట్టుకొని కొట్టుచుండ, ఆభక్తుడు "నారాయణ నారాయణ" అని మాత్రము పలుకసాగెను. స్వామి నారాయణుడు వైకుంఠపురములో లక్ష్మీదేవిసమీపమున కూర్చుండియుండెను. భగవానునికి పీనిమొఱవినరాగానే తటాలునలేచి వానిని రక్షించు నిమిత్తము ఆచోటునకు పోనెంచెను. కాని రెండుఅడుగులు పోయి మరలివచ్చి కూర్చుండెను. దీనిని కనిపెట్టిన లక్ష్మీదేవి భగవంతుడు అటుల వెంటనే వచ్చివేయుటకు కారణమే మని అడిగినది. స్వామినారాయణుడిటుల చెప్పినాడు: "నేను ఆ తావునకుపోవలసినఅగత్యము కానరాలేదు ఆభక్తుడుకూడ చాకలివాడై పోయినాడు. ఆతడు తన సంరక్షకుడు తానయై నిలచినాడు; ఏలన తనను కొట్టుచున్న వానిని తిరిగి కొట్టసాగినాడు కావున నేను అక్కడికి పోవలసిన ఆవశ్యకత యేమున్నది?" చూచితిరా, భగవంతుడుతనకుపూర్తిముగ స్వార్పణ చేసికొనినవానినితప్ప రక్షించడూనడు.

990. అర్చకకులమునకు సంబంధించిన యొక కథను శ్రీ పరమహంసులవారు చెప్పుచుండెడివారు. శ్రీగౌరాంగదేవుడు (శ్రీచైతన్యులు) భావసమాధిలోనుండి మైమఱచి సముద్రమున

పడిపోయినప్పుడు పల్లెవాండ్రు వలలో వెలికితీయబడుట తటస్థించినది. అప్పుడు వారాయనను స్పృశించుటవలన వారికొక విధమగు మైకముకలిగినది. వారంతట తమపనిపాటలను విడిచివేసి హరినామస్మరణముచేయుచు పిచ్చెత్తినవడువున ఆటలాడసాగిరి. వారి బంధుమిత్రాదులు వారికి చికిత్సచేయు విధమును తెలియక శ్రీ గౌరాంగదేవునికడకు వచ్చి దుఃఖించిరి శ్రీ చైతన్యులవారప్పుడు మీరుపోయి యేఅర్చకుని యింటనైన కొంచెము అన్నము తెచ్చి వారినోటిలో పెట్టుడు. వారి మైకముతగ్గిపోవును పొండు" అనిరి. పల్లెవాండ్ర బంధుగులు అటులచేయగా వారిదివ్యానందపారవశ్యము తగ్గిపోయినది.

991. మాయ యిట్టిదని తెలియరానిది. ఒకనాడు నారదుడు శ్రీహరిని సమీపించి "స్వామీ! అసాధ్యములను సాధ్యములుగనొనర్చు నీమాయను నాకు చూపుము" అని వేడుకొనెను. శ్రీహరి వల్లెయని తలయూచినారు. కొన్నాళ్లైన పిమ్మట నారదుని వెంటదీసికొని ప్రయాణమైపోవుచు దారిలో శ్రీహరి దప్పిగొనిరి. చాలడస్సికూర్చుండి "నారదా! నాకు దప్పి హెచ్చుగనున్నది. ఎచ్చటికైనపోయి కొంచెము నీరు తెమ్ము" అని చెప్పిరి. వెంటనే నారదుడు నీటికై వెదకుచు పరుగిడిపోయినాడు.

దాపున ఎక్కడను నీరు చిక్కలేదు. చాలాదూరము పోగా ఏరొకటి యున్నటుల ఎదుటకాన్పించినది. నారదుడా ఏటియొద్దకుపోగా వానికొక సుందరాంగి నీటిదాపున కూర్చుండి కానవచ్చినది. నారదుడు మోహావిష్టుడైనాడు.

దాపునకుపోగా ఆమె ముద్దులొలుకు పలుకులతో నారదుని పలుకరించినది. వెంటనే ఒకరినొకరు ప్రేమించిరి. అచ్చో టున నారదుడామెతో కాపురముచేయుచు నిలచిపోయెను. కాలక్రమమున వారికి సంతానము కలిగినది. ఇట్లు నారదుడు ఆలుబిడ్డలతో మహానందముగ కాలముగడుపుచుండగా ఆదే శములో మహామారిజాడ్యము ప్రవేశించినది. అనేకులు ఆరోగముచే మృతినొందుచుండిరి. ఆచోటు విడిచిపోవుటకు నారదుడు తలపెట్టి భార్యతో చెప్పినాడు. ఆమెయునరేయనగా వారుబిడ్డలను చేతులుపట్టుకొని నడిపించుచు ఇల్లువిడిచి పయ నమాయిరి. వారొకవంతెనమీదుగా బోవుచుండ హఠా త్తుగా వరదవచ్చి నీరుపైకుబికినది. ఒక్కొక్కరేపిల్లలు ప్రవా హవేగమున కొట్టికొనిపోయిరి. తుదకు భార్యయు నీటమునిగి పోయినది. దుఃఖావేశమునమునిగి నారదుడు ఒడ్డునఏడ్చుచు కూర్చుండెను. ఆసమయమున శ్రీహరి సమీపించి "ఓనా రదా! మంచినీరేది? నీవిటులఏడ్చుచున్నావెందులకు?" అనిరి. స్వామిదర్శనముకాగానే నారదుడు దద్దరిలిలేచెను. అంతట వానికి సర్వమును తెల్లమైనది. "ప్రభో! నీకు నమస్కార సహస్రమర్పించెద నీవిచిత్రమాయకు కోటినమస్కారములు అర్పించువాడ" నని నారదుడు పలికెను.

992. గోపాలునిగూర్చి యొకప్పుడు వర్తమానమేమియు తెలియనందున యశోదాదేవి రాధకడకువచ్చి, ఆమె కేమైన గోపాలుని వర్తమానము తెలియునా యని అడిగినది. ఆసమ యమున రాధ మూర్ఛిల్లియున్నది; యశోదవచనములామె వినలేదు. కొంతసేపటికి మూర్ఛదేరిచూడగా నందరాణి

ఎదుట కూర్చుండియుంటగాంచి వందనమాచరించినది. ఇప్పుడు యశోదాదేవివచ్చిన కారణమేమని రాధ ప్రశ్నింపగా ఆమె తానువచ్చిన విషయము తెలిపినది. రాధఆమెతో "తల్లీ! నీకండ్లనుమూసి, శ్రీ గోపాలునిరూపును తలంచి ధ్యానముచేయుము. నీవాయనను చూడగలవు" అని చెప్పినది. యశోదాదేవి కండ్లుమూయుటతోడనే భావస్వరూపిణి యగు రాధ తన ఆత్మశక్తిచేత యశోదకు సమాధిదశను ప్రాప్తింపజేయగా ఆమె తన గోపాలుని చూడగల్గెను. అప్పుడు యశోదాదేవి "తల్లీ! నేను కండ్లుమూసినప్పుడెల్లను నాముద్దులగోపాలుని చూడగల్గునటుల వరమిమ్ము" అని రాధను వేడుకొనినది.

993 పూర్వకాలమున జయపురమందలి శ్రీగోవిందాలయపు అర్చకులు పెండ్లిండ్లుచేసికొనెడివారుకారు. అప్పుడు వారు ఆత్మతేజోవిరాజితులై యుండెడివారు. ఒకసారి రాజు తనకడకురమ్మని వారికికబురుచేయగా "రాజునే యిక్కడికి రమ్మనుడు" అని జవాబుచెప్పిరి. తరువాత వారు పెండ్లిండ్లు చేసికొనసాగిరి. అప్పుడిక రాజుకు వారిని పిలువనంపించవలసిన అగత్యమేలేకుండ పోయినది. వారు తమంతట తామే పోయి "మహారాజా! ప్రభో! మిమ్ము దీవింపవచ్చితిమి. మీ కొఱకై దేవాలయమునుండి ప్రసాదమును తెచ్చితిమి. పుచ్చుకొనుడు" అనుచు వేడవలసివచ్చెను. వారటులచేయక తప్పినదికాదు. పాపము వారేమిచేయగలరు? ఒకనాడు ఇల్లు కట్టుకొను నవసరము మరొకనాడు పిల్లలకు అన్నప్రాశనము చేయువేడుక, ఇంకొకనాడు కొమార్తెల పెండ్లిండ్లు ఇట్లెన్నె

న్నియో అవసరములువచ్చి, నిరంతరముడబ్బునకై యాచిం
చుచు నుండవలసినవారైపోయిరి!

994. ఒకనాడొక పల్లెవాడు రాత్రివేళ ఒక పెద్దమనుష్యుని తోటలో ప్రవేశించి కోనేటిలో చేపలుపట్టసాగెను. యజమానునికి ఆసంగతి తెలిసి తోటచుట్టును తన సేవకుల నునిచి, కాగడాలు పట్టించుకొని దొంగనుపట్టుకొనుటకై తోటలోనికి వచ్చెను. ఇంతలో నాపల్లెవాడు తప్పించుకొనిపోవు తెరవు గానక ఒడలెల్ల బూడిదపూసుకొని, సాధురూపమున ఒక చెట్టుక్రింద కూర్చుండెను. ధ్యానమున మునిగినవానివలె నటించెను. మరుచటి ఉదయాన ఆతోటలోనికొక మహాత్ముడు వచ్చియున్నాడని ఊరెల్ల చెప్పుకొనసాగిరి. కాబట్టి వందలు కొలదిప్రజలు పండ్లు పూవులు కొల్లగదెచ్చి సాష్టాంగపడి సాధుపూజల సాగించిరి. వానియెదుట వెండి బంగారునాణెములు కుప్పలుకుప్పలుగాపడినవి. అప్పుడాపల్లెవాడు "ఆహా! ఏమిచిత్రము! నిజముగా నేను సాధువునుకాను. అయినను వీరలు నన్నింతగా పూజించుచున్నారు. నేను నిజముగా సాధువునే అయిపోయినయెడల నాకు భగవంతుడే జిక్కగలడు!" అని తలపోసెను. ఈరీతిగా బూటకపు నటన ఆపల్లెవానిమనస్సున జ్ఞాన ప్రబోధము కలిగించినది!

995. ఒకానొక సాధువునకు గొప్ప మహిమలు అలవడినవి. వానిగురించి అతడు మహాగర్వియైనాడు. అయినను ఆసాధువు చాలమంచివాడు; తపశ్శాలియు నై యుండెను. వానికి బుద్ధిగఱపనెంచి భగవంతుడు సన్యాసి వేషము దాల్చి వానిచెంతకువచ్చి "అయ్యా! మీకు మహామహిమ

లను సంపాదించితిరని విన్నాను" అనెను. సాధువు వానిని సగౌరవముగ స్వాగతమిచ్చి కూర్చుండజేసెను. అప్పుడే ఒక ఏనుగు ఆ పైవుగా పోవుచున్నది. "అదిగో! ఏనుగు వచ్చుచున్నది. మీరు ఇచ్ఛామాత్రమున దానిని చంపగలరా? అని సన్యాసి సాధువునడిగెను. "ఆహా! చేయవచ్చును" అని సాధువు పలికెను. ఇట్లనుచు చేతిలో కొంత మట్టినిదీసి మంత్రించి ఏనుగుశరీరముపై ని చల్లినాడు. ఆ యేనుగు గిలగిల తన్నుకొనుచు పడిచచ్చినది. దానిని చూచి సన్యాసి ఓహెూ! మీశక్తి అత్యద్భుతమైనది! ఎంతసులభముగా ఏనుగును చంపితిరి!" అని పొగడెను. సాధువు సంతృప్తుడై మందహాసముచేసినాడు. సన్యాసి మరల "ఈఏనుగును తిరిగి బ్రతికింపగలరా?" అనెను. "ఆహా! 'అదియు చేయనగును" అనుచుకొంతమట్టిని మంత్రించి ఏనుగు కళేబరముమీదచల్లగా అది బ్రతికి లేచినది. అంతట సన్యాసి యిట్లుపలికెను:— "బహు విచిత్రమహిమ! కాని నేను మిమ్మొక్క ప్రశ్నవడుగ దలచినాను. ఇప్పుడే మీరొకఏనుగును చంపి, తిరిగి బ్రతికించగల్గితిరి. కాని దానివలన మీ కేమిలాభము వచ్చినది? మీరేమైన అభివృద్ధి గాంచితిరా? అందువలన భగవంతుని పొందగల్గితిరా?

ఇట్లనుచు సన్యాసి అదృశ్యమయ్యెను!

996. ఒకశిష్యుడు గురువుతో తనభార్య తనను మిక్కిలిగ ప్రేమించినదిగాన, సన్యసించజాలనని చెప్పెను. ఆతడు హఠయోగాభ్యాసము సాగించినాడు. గురువు కొంతరహస్యమును వానికి బోధించినాడు. అకస్మికముగా ఒకదినమున

శిష్యుని యింటిలో గందరగోళము, ఏడుపులు పెడబొబ్బలు వినవచ్చెను? ఇరుగు పొరుగువారెల్ల వచ్చి ఆశిష్యుడు ఒక గదిలో కదలక మెదలక విచిత్రరీతిని కూర్చుండియుండ గాంచిరి. అందఱును ప్రాణముపోయెనని తలంచిరి. ఆతని భార్య "అయ్యో! నాథా, నీవెక్కడికిపోతివి ? నన్నెందుకు విడనాడిపోతివి ? ఇట్టి ఆపదవచ్చునని ఎన్నడును కలలోనైన తెలియనైతిని ! " అని విలపింపసాగెను. ఇంతలో బంధువులు వచ్చి పాడెనుగట్టి శవమును దహనమునకై తీసికొనిపోవ సిద్ధపడిరి. అప్పుడు కొంత అలజడి జరిగినది. ఆకళేబరము వంకరలుతిరిగియుండెగాన ద్వారములోనుండి రాదయ్యె. అది చూచి పొరుగు పెద్దమనుష్యుడొకడు గడ్డపలుగును దెచ్చి ద్వారబంధమును త్రవ్వివేయ సమకట్టెను. అంతవఱకును పొక్కిపొక్కి యేడ్చుచున్న భార్య పలుగుచప్పుడు వినబడగానె అక్కడికి పరుగిడిపోయి ఏడ్చుచు వారేమిచేయు నుండిరని అడిగెను. అచ్చటివారిలో నొకడు ఆమెభర్తను ద్వారములోగుండ తీసుకొనిపో వీలులేనందున ద్వారమును ఊడగొట్టుచుంటిమని చెప్పెను. ఆభార్య యిట్లనెను:—
"వద్దు, వద్దు. అలాచేయవద్దు. నేను వితంతువునైతిని; దిక్కులేనిదానను. దిక్కులేనిబిడ్డలను పోషించుకొనవలసినదాననైతిని. మీరు ద్వారమును పడగొట్టివేసినచో తిరిగి బాగుచేయుటపడదు. నాభర్తకు వాటిలినది ఏమొవాటిలినది—వాని కాలుచేతులను నఱికి బయటికితీసికొనిపొండు." తాను సేవించినమూలిక ప్రభావము తగ్గిపోవుటచేత అప్పుడే స్మృతితెలిసిన హఠయోగి, భార్యపలుకులువిని "ఏమేమే ! నాకాలు

సేతులు నలుగుడనుచుంటివా ?" అని లేచి బొబ్బలు పెట్టెను. తత్క్షణమే యిల్లువిడిచి గురుపుత్రునితోగూడి వెడలిపోయెను.

997. ఒకపేద ఉద్యోగముదొరకక బాధలుపడుచుండెను. అనేకపర్యాయములు రాజుకడకుపోయి పడిగాపులుపడి యుండి ఏదేని సేవలోనుంచుకొనుడని వేడుకొనెను. ఆరాజు నిరంతరము ఈదినముకాదు రేపురమ్మనుచునేకాలముగడపు చుండెను. చాలదినములు జరిగిపోయినవి. ఒకదినమున అతడు తన బాధలగురించి యొకస్నేహితునితో చెప్పుకొనెను. ఆస్నేహితుడు వెంటనే "నీవెంత తెలివిలేనివాడవు! ఆరాజు కడకు పోయిపోయి నీకాళ్ళఱిగిపోయియుండును. గంగా బాయికడకు పోయి దానికాళ్లమీద పడుము. నీకు రేపే ఉద్యోగముదొరకును" అని ఉపాయము చెప్పెను. గంగా బాయి రాజుయొక్క ఉంపుడుకత్తె. పాపమాపేదవాడు గంగా బాయికడకేగి, "తల్లీ! నేనుకడుదుర్దశ ననుభవించుచున్నాను. నీవుతప్ప నన్ను రక్షించువారులేరు. నేను బ్రాహ్మణుడను; నాకితరమగు ఆధారములేదు. జననీ! చాలకాలమునుండి ఉద్యోగము చిక్కక దుఃఖించుచున్నాను. ఆలుబిడ్డలు అన్నమో రామచంద్రాయని అడలుచున్నారు. నీవొక్కమాట చెప్పితివా నాకుద్యోగము లభించగలదు" అని బ్రతిమాలు కొనెను. గంగాబాయి "సరేగాని, ఎవరితో చెప్పిన నీకు ఉద్యోగము రాగలదు?" అని అడిగినది. ఆబ్రాహ్మణుని దైన్యముచూచి ఆమె 'అయ్యో పాపము! ఈబ్రాహ్మణుడు కడు దరిద్రుడుగ నున్నాడు!" అనియు అనుకొనెను. ఆబ్రా హ్మణుడు వెంటనే "నీవురాజుగారితో ఒక్కమాటమాత్రము

అంటివా నాకుద్యోగము రాగలదు" అనెను. గంగా బాయి ఆరాత్రియే రాజుగారితో చెప్పెదనని వాగ్దానము చేసినది. చూచితిరా! మరునాటి వేకువజాముననే బ్రాహ్మణుని యింటికి రాజభటుడువచ్చి ఆనాటినుండియే ఉద్యోగమందిరమునకురమ్మని రాజుగారియుత్తర్వును తెలిపిపోయినాడు! రాజు మంత్రితో "చూడుము! ఈబ్రాహ్మణుడు చాల బుద్ధికుశలుడు. వీనిసేవ మనకు లాభకరముగ నుండును గాన ఉద్యోగము నిచ్చితిని. పరివేశపెట్టుకొనుడు" అని బ్రాహ్మణుని మంత్రిపరిచయముచేసినాడు. స్త్రీ మోహము నకు పురుషునిపైనట్టి శక్తికలదు. జగమంతయు కామినీకాంచనాధీనమైయున్నది!

998. ఒక బాలసన్యాసి భిక్షకై ఒక గృహస్థునియింటికి పోయినాడు. అతను చాలచిన్నతనమునందే సన్యసించుటచేత వానికి లోకజ్ఞానము కొఱవడియుండెను. ఒకయువతి భిక్ష పెట్టరాగా, ఆమె స్తనయుగ్మమునుచూచి, నీకేమైన రొమ్మున వ్రణములు లేచినవాయని ప్రశ్నించినాడు. ఆమాటలు ఆయువతి తల్లివిని "లేదులేదు, బిడ్డా! ఆమెకవి వ్రణములుకావు త్వరలోనే భగవంతుడు ఆమెకు ఒక బిడ్డను దయచేయనున్నాడు. ఆబిడ్డకు పాలిచ్చునిమిత్తము ముందుగనే ఆమెకు రెండు స్తనములను అనుగ్రహించినాడు. బిడ్డపుట్టినప్పుడు ఆ స్తనములనుండి పాలు త్రాగ గలడు." అని చెప్పినది. ఈపలుకులాలకించగనే ఆబాలసన్యాసి "ఇక నేనుతిండికై యింటింట తిరుగను. నన్ను సృజించినవాడే నాకు తిండినొసగగలడు!" అనిపలికెను.

999. ఆత్మవిచారము చేయుచుపోగా, మనసుపూర్ణశాంతిని పొందినప్పుడు బ్రహ్మసాక్షాత్కారమగును.

ఒకడు రాజును చూడ నెంచెను. సప్తద్వారములకు లోపల అంతఃపురమున రాజుండెను. ఆమనుష్యుడు మొదటి ద్వారముకడకువచ్చి, అక్కడ డంబముగా దుస్తులు ధరించి చుట్టును భటులతో కూడియున్న యొకనిని చూచెను. రాజు దర్శనార్థముపోయినవాడు తన స్నేహితునితో "ఈతడేనా రాజు ?" అనగా స్నేహితుడునవ్వి కాదనెను, తరువాత నతడు రెండవ, మూడవ, నాలుగవ ద్వారములదాటి పోవుచు అందందు హెచ్చుహెచ్చుగా డంబపు వేషములతో నుండు వారిని కాంచెను. ఆతడు లోనికేగినకొలదిని ఆడంబరము హెచ్చిపోవుచున్నది. ప్రతిద్వారముచెంతను అతడు రాజు కన బడెననితలచి తన స్నేహితుని ప్రశ్నించుచు వచ్చెను. కాని యతడు ఏడవద్వారము దాటి రాజును ముఖాముఖిని చూచినప్పుడిక రాజెవరని స్నేహితుని అడుగనక్కరయేలేకపోయినది. అనంతైశ్వర్యముతో దేదీప్యమానముగ తేజరిలుచున్న రాజునుకాంచగనే తాను జననాథునియెదుట నిలువబడి యున్నటుల వానికి సహజముగనే తెలిసినది.

1000. పెద్దపులియొకటి గొఱ్ఱెలమందపై బడినది. అది సూడిపులిగాన ఎగురుటతోడనే యీనిచచ్చిపడినది.పులికూన మాత్రము ఎటో బ్రతికి గొఱ్ఱెలలో కలిసి పెరిగినది. గొఱ్ఱెలు పొలములో మేతమేయుచుండ అదియు మేతమేయ నేర్చు

కొనినది. అవి అఱచినటులనే పులిపిల్లయు అఱచెడిది. కొంతకాలమునకు అదియుపెరిగి పెద్దపులియైనది. ఒకనాడు పెద్దపులి యింకొకటి యీగొఱ్ఱెలమందపై బడినది. ఈమందలో గొఱ్ఱెవలెవర్తించు ఈపులినిచూచి అత్యాశ్చర్యము పొందినది. దీనిని తఱిమి మెడపట్టి యీడ్చినది. ఇది గొఱ్ఱెవలె దీనముగా అఱవసాగినది. అంతట క్రొత్తపులి దీనిని చెఱువుకడకు లాగికొనిపోయి నీటిలో తమ ఇరువురి బింబములను చూపినది. "చూడుము; చూడుము; నీ రూపు, నారూపును, పోలియున్నది. నీవును నావలె పెద్దపులివే! ఇదిగో ఈమాంసమును తినుము" అనిచెప్పి బలవంతముగా మాంసమును తినిపించ చూచినది. మొదటమొదట గొఱ్ఱెలలో పెరిగిన పులి మాంసమును తిననొల్లలేదు. మఱియు తాను పులిగాక గొఱ్ఱెననియే చెప్పసాగినది. రెండవదాని బలవంతముచేత కొంచెము నెత్తురు రుచిచూడగా దానిలో అణగిపడియున్న వ్యాఘ్రసంస్కారములు మొలకలెత్తినవి. మాంసమునందు ప్రీతిని గల్పించినవి. అప్పుడా క్రొత్తపులి "ఇప్పుడుగదా నీవునావలెనే వ్యాఘ్రవంశవుదానవని గ్రహించితివి! కావున ఇక అరణ్యములకు పోదమురమ్ము!" అని తీసికొనిపోయినది.

ఈరీతిగా ఒకనికి గురుకటాక్షములభించెనా భయము తొలగును; గురువు కండ్లుతెఱచి సత్యస్వరూపమును తెలుపును.

1001. ఒక శ్రీమంతుని సేవకుడు యజమానియింటికివచ్చి వినయవిధేయతలతో ఒకమూల నొదిగి నిలువబడెను. వాని చేతిలో గుడ్డతో కప్పినదేమొయుండెను. యజమాని "ఓరీ! ఆ నీచేతిలోనిది ఏమి?" అని ప్రశ్నించెను. అంత నాసేవకుడు తన గుడ్డలోనున్న ఒక వెలగపండునుదీసి, కడునమ్రతతో యజమానునిముందుబెట్టి, దానిని యజమానుడు రుచిచూచు నెడల తాను కృతార్థుడనగుదునని ఉవ్విళ్లూరుచుండెను. యజమానుడు సేవకుని వినయవర్తనమునకు మెచ్చి, ఆతడు తెచ్చిన స్వల్పపుకానుకనైనను ఆదరమొప్పగ్రహించి "ఆహా! ఈఫలము ఎంతసువాసన గొట్టుచున్నది! ఎక్కడినుండి దీనిని సంపాదించితివి?" అనుచు ఎంతయో ఆనందించెను.

ఈతీరుననే భగవంతుడు భక్తుల హృదయములను పాటించును. వాని ఐశ్వర్యము అనంతమై వెలయునదైనను భక్తిశ్రద్ధలకు భగవంతుడు వశుడగుచుండును.

1002. ఒకడు రోగముతోనున్న తన చిన్నబిడ్డను చేతుల నెత్తుకొని ఒకసాధువుకడకు ఔషధముకొఱకై వెళ్లెను ఆసాధువు మరునాడు రమ్మనెను. మరునాడు రాగా "నీబిడ్డకు తీపిపదార్థములు పెట్టకుము. వానిరోగముకుదురును." అని చెప్పెను. అంత నామనుష్యుడు "అయ్యా! ఈమాటను నిన్న సాయంతనమే చెప్పి యుండవచ్చునే!" అనెను. "అవును, కాని నిన్న నాయెదుటనే పంచదార కనబడుచున్నది. దానిని చూచినచో నీబిడ్డడు ఈసాధువుకపట వేషదారి. ఆయన నన్ను

పంచదార తినవద్దనునుగదా! తానుతినుచున్నాడే!” అనుకొని యుండును. అనిసమాధానము చెప్పెను.

1003. జీవుని స్వాతంత్ర్యమునకును ఈశ్వరుని కృపకును సమన్వయము కుదరక ఇరువురు శిష్యులు తమ సమస్యను పరిష్కరింపుడని శ్రీరామకృష్ణపరమహంసులవారి కడకు పోయిరి. శ్రీవారు “స్వాతంత్ర్యము, స్వాతంత్ర్యము అని మీాప్రసంగమేమిటి? సర్వమును ఈశ్వరేచ్ఛపై నాధారపడి యుండును. మనఇచ్ఛ ఈశ్వరేచ్ఛతో ఆవు గుంజకు కట్టబడి నటుల బంధింపబడియున్నది. మనకు కొంత స్వతంత్రత యున్నమాట నిజమే; అది ఒక నిర్ణీతవలయములోపలనే! కావున నరుడు స్వతంత్రుడ ననుకొనుచుండును. కాని వాని యిచ్ఛ ఈశ్వరేచ్ఛకు లోబడియుండునదే యని గ్రహించుడు!” అనిరి.

“అటులగు నెడల జపతపముల సాధనలు అవసరముండవా? ఏలయన, అంతయు ఈశ్వరేచ్ఛయే! అని పాతివాడును అనవచ్చును. ఏదిజరిగినను వానియిచ్ఛవలన జరిగినదే అనవచ్చును” అని శంకించిరి.

పరమహంసులవారిట్లనిరి:— “ఓహో! ఎంతపనికామాట? ఊరక నీవు నోటిమాటతోఅనిన చాలునా? నీవు రక్కసకంపమీాద చేయివేసి మాటలతో ఏమియులేదు, లేదనిన ముండ్లు గ్రుచ్చుకొనక విడుచునా? పారమార్థిక సాధనలచేయుట నరుని స్వాధీనములోనె పూర్తిగ యున్న

యెడల సర్వజనులును అటుల చేసియుండెడివారలే! అయి
నను ప్రతివారును చేయలేరు! ఎట్లు? మీకాయనయిచ్చు
బలమునంతను సద్వినియోగము చేయునెడలనే మీకాయన
హెచ్చుగ నిచ్చుచుండును. అందుకై స్వయంకృషి అత్యవ
సరము. కాబట్టి ఈశ్వరకృపకు పాత్రులగుటకును మనము
చాల పరిశ్రమచేయవలసియున్నది. అట్టిపరిశ్రమయున్నప్పుడు
ఈశ్వరకరుణవలన అనేకజన్మలకష్టము ఒక్కజన్మలో తీరగ
లదు, కొంతైన స్వయంకృషి ఉండియే తీరవలయును. ఒక
కథ చెప్పెద వినుడు:—

"గోలోకాధిపతియగు విష్ణువు నారదుని ఒకసారి నర
కమున పడిపోదువుగాక అని శపించెను. అందుకై నార
దుడు మదిలో చాల తహతహపడెను, అంతట కీర్తనల
పాడుచు స్తోత్రములచేయుచు నరకము ఎచ్చటనుండునో,
తానచ్చటికి ఎటులపోవుటో తెలుపుమని భగవంతుని వేడు
కొనసాగెను. అప్పుడు విష్ణువు నేలమీాద విశ్వముయొక్క
పటమును గీసి స్వర్గనరకములను దానిలో సూచించినాడు.
అంతట నారదుడు నరకము అని చూపబడిన తావునుచూపి
"ఇదేనా ఇదేనా నరకము?" అని అడిగెను. అట్లు ప్రశ్నిం
చుచు ఆతావున పడిదొర్లి "స్వామీ! నేను నరకబాధలు
పడి నాశిక్షను అనుభవించివేసితిని" అనెను. "అదెట్లు?" అని
విష్ణువుఅడుగగా నారదుడు "ఏమిస్వామీ! స్వర్గనరకములు
నీవు సృష్టించినవి కావా? నీవే యీపటమును రచించితివి.
అందు నరకమును చూపించితివి. అది నిజముగా నరకమే

ఐనది. అందు నేనుపడి దొర్లినప్పుడు నా బాధలును మిక్కుట ములైనవి. కాబట్టి నాశిక్షను నరకమున అనుభవించితినని చెప్పితిని" అని సమాధానము చెప్పినాడు. నారదుడు యీపలుకులను హృదయపూర్వకముగా నమ్మి చెప్పినాడు. కావున విష్ణువును వాని సమాధానమును అంగీకరించినాడు !"

స మా ప్త ము.

Printed at the Rama Krishna Printing Works, Tenali.

# తప్పొప్పుల పట్టిక

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 5 | 16 | కప్పివేయు లౌకికా జ్ఞానముతో | కప్పివేయుఅజ్ఞానము ను లౌకికాజ్ఞానముతో |
| 10 | 11 | ఇంద్రియలాలనను | ఇంద్రియలాలసను |
| 13 | 11 | మలనములై | మలినములై |
| 16 | 14 | భగవంతుడుసాకార | భగవంతుడునిరాకార సాకార |
| 18 | 19 | వేదములను | వేదములును |
| 23 | 4 | యని అనుభయము | అనుభయము |
| 44 | 18 | విచిత్రమిక్రకాంతి | విచిత్రమిశ్రకాంతి |
| 53 | 21 | గడచిపోయునటుల | గడచిపోయినటుల |
| 54 | 17 | భావ | భావన |
| ,, | 18 | కాన | క్రమ |
| ,, | 19 | దిల | దిన |
| 56 | 9 | సాక్షాత్కాఇము | సాక్షాత్కారము |
| 61 | 10 | అని | అది |
| 67 | 13 | తమతో | తమలో |
| 69 | 14 | ఆశుద్ధ | అశుద్ధ |
| 78 | 20 | కార్చుటచూచి ఎందుచేత | కార్చుటఎందుచేత |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 19 | మనస్సృన | మనస్సున |
| 80 | 6 | చూచుటకుతనలో | చూచుటకు మనలో |
| 83 | 8 | మామిడిటింస్లు | మామిడి పండ్లు |
| 90 | 18 | చిక్కు | చిక్కు |
| 91 | 9 | అను | అని |
| 93 | 17 | పాపుల | పాపులు |
| 96 | 6 | యురదు | యురుదు |
| 98 | 2 | పొజ్టలు | పొట్టలు |
| 105 | 4 | జీపునికి | జీవునికి |
| ,, | 10 | లేకపోపుట | లేకపోవుట |
| 106 | 7 | జామిా | జమిా |
| 108 | 1 | వేదవాచ్చుడగు | వేదవాచ్యుడగు |
| 109 | 2 | పిలగురితిని | పిలగురీతిని |
| 113 | 15, 17 | మట్టిగుడిశె | మట్టగుడిసె |
| 115 | 16 | ఒక | ఒకడు |
| 120 | 19 | సూన్యుడవు! | శూన్యుడవు. |
| 127 | 10 | కూడుదు | కూడును |
| ,, | 11 | శివ | శవ |
| ,, | 17 | "చ్చివాడై | "పిచ్చివాడై |
| ,, | 18 | పిపుత్రా! | పుత్రా! |
| 131 | 11 | సిద్ధీ... | సిద్ధివాని |
| 136 | 17 | జాగరూకత | జాగరూకుత |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 142 | 23 | ...లజూపుచునే | తలజూపుచునే |
| 143 | 7 | కఅవచ్చును | కఅవవచ్చును |
| 144 | 3 | శక్తులగ | శక్తులనుగ |
| 146 | 14 | ఆకర్తను | అకర్తను |
| 147 | 8 | నేనుతొలగించి | నేనుఅనుభావమును తొలగించి |
| ,, | 21 | అనుదది | అనునది |
| 148 | 8 | మనబడుచు | మనబడును |
| 152 | 7 | జ్ఞానముగూర్చిన | జ్ఞానముంగూర్చిన |
| 154 | 7 | మెట్లమీాద | మెట్టమీాద |
| 162 | 15 | పరిక్షుతు | పరిక్షుత్తు |
| 168 | 13 | మనుకల్పించిస | మునుకల్పించిన |
| 188 | 8 | అనేజన్మాంతరము | అనేకజన్మాంతరము |
| 198 | 4 | కొంరలు | కొందలు |
| 219 | 3 | ఒక్కతరువే | ఒక్కతీరువే |
| 221 | 6 | ప్రదేశములందును | ప్రదేశములును |
| 222 | 10 | నిండాకు | నిండారు |
| 228 | 2 | పాపముల | పాదముల |
| ,, | 15 | ఈసంసారము | ఈసంసారమను |
| 236 | 1 | పవిత్రభూతము | పవిత్రీభూతము |
| 239 | 9 | వేయుటవల్ల | వేయువల |
| 247 | 20 | అనుభవము | అనుభవములు |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 251 | 3 | స్మరణ | స్మరణచే |
| ,, | 22 | కాలము | కాలమున |
| 252 | 4 | యవ్యా | యక్వా |
| 257 | 8 | మఱుగు | ముఱుగు |
| 263 | 22 | సమర్థ్రసేమ | సమర్థ్రప్రేమ |
| 264 | 13 | ప్రాగమనిరి | ప్రాగుమనిరి |
| ,, | 16 | తమను | తేము |
| ,, | 23 | ఓకడే | ఒక్కడే |
| 265 | 15 | ఒక్కసర్వము | ఒక్కస్వరము |
| 266 | 23 | అట్టిధ్వరాదు | అట్టిధ్వనిరాదు |
| 267 | 8 | తీయగా | తీయగానె |
| 269 | 15 | నీవాఅదివ్యజనని | నీవాదివ్యజనని |
| ,, | 15 | మృత | అమృత |
| 273 | 10 | అంకాలము | అంతకాలము |
| ,, | 10 | నిర్మలమెన | నిర్మలమైన |
| 278 | 3 | అటువంటిపాపము | అటువంటివారిః |
| ,, | 3 | జగముసఅత్యమె | జగముఅసత్యమె |
| 284 | 3 | నాధకుని | సాధకుని |
| 289 | 10 | కొనిన | కొనని |
| ,, | 12 | తరగతుల | తరగతులు |
| 291 | 16 | సుషిప్తి | సుషుప్తి |
| 292 | 6 | మూన్పుడు | మాన్పుడు |

| పుట. | పంక్తి. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 293 | 2 | పలుకువిని | పలుకునివి |
| 294 | 3 | నరుడు | నరుడు |
| 295 | 3 | గుహ్య | గుద... |
| ,, | 18 | జ్ఞప్తికొంత | జ్ఞప్తిలోకొంత |
| 296 | 11 | సాన్నిధ్యము | త్సాన్నిధ్యము |
| ,, | 23 | భగవదను | భగవదనుగ్రహము |
| 308 | 7 | బక్క | బక్క |
| 316 | 14 | మార్గమున | మార్గమును |
| 326 | 7 | కార్తికేయుడు | కార్తికేయుడు |
| 328 | 17 | నేని | నేను |
| 330 | 11 | ఎతబుద్ధి | ఎంతబుద్ధి |
| 331 | 5 | సులభరార్యము | సులభకార్యము |
| 332 | 8 | రుచ్చమైన | రుచ్యమైన |
| 337 | 4 | ఇంద్రునిగాని | ఇంద్రునిదిగాని |
| 339 | 1 | తాత్పరత | తత్పరత |
| 344 | 21 | గ్రహించితిరని | గ్రహించితివని |
| 346 | 12 | వినడిండి | వినండి |
| 347 | 13 | వైపరిత్యము | వైపరీత్యము |
| 350 | 18 | త్రివ్వి | త్రవ్వి |
| 351 | 4 | వినిమోగించిన | వినియోగించిన |
| 366 | 7 | వాకిని | వానికి |